శ్రీరస్తు శుభమస్తు అవిఘ్నమస్తు

# "కృష్ణం వందే జగద్గురుమ్"

## (శ్రీమన్నారాయణీయమ్)

## (దశమస్కందము)

సంస్కృతమూలమ్ :

**శ్రీనారాయణ భట్టతిరి**



(సంస్కృత శ్లోకములకు,
తెలుగు పద్యములు-తాత్పర్యములు)

రచన :

**అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు**
M.Tech.



**కృష్ణం వందే జగద్గురుమ్**
**శ్రీమన్నారాయణీయమ్**
దశమ స్కంద దశకములు

మొదటి ప్రచురణ
జూన్ 2009

తెలుగు పద్య తాత్పర్యములు
రచన
అమరవాది సుబ్రహ్మణ్య దీక్షితులు
M.Tech.

వెల : అమూల్యం

ప్రతులకు :
ఫ్లాట్ నెం. 5, ప్లాట్ నెం.61, సిద్ధార్థ నగర్,
హైదరాబాద్ - 38. ఫోన్ : 040-23814379

డి.టి.పి. & ప్రింటింగ్ :
కె. మురళీ కృష్ణ
సెల్ : 9848515109



## విషయసూచిక

# ముందుమాట

ఒకనాడు దారిగుండా ఒక మనిషి నడిచి పోతున్నాడు. చూసుకోకుండా పేడ త్రొక్కాడు. వాడి చెప్పు పాడయింది. సమయానికి వాడికేమీ కనిపించలేదు. ఆ సందు చివర ఒక శివలింగం ఉంది. గుడిలో పూజలు ఏనాడో ఆగిపోయాయి కాబోలు శివలింగం పూజ పునస్కారాలు లేక పడి ఉన్నది. ఆ మనిషి నిస్సంకోచంగా చెప్పుని లింగానికి తుడిచి చెప్పుని శుభ్రం చేసుకుని తనదారిన చక్కగా పోయాడు.

అదేదారిలో ఒక భక్తుడు పోతూ అది చూసి కన్నీళ్ళు పెట్టుకొని బిందె నీళ్ళతో చక్కగా కడిగి తుడిచి నమస్కరించి స్వామీ! నా తప్పుంటే క్షమించు అని నమస్కరించి వెళ్ళిపోయాడు.

భూమిమీద విహరిస్తున్న పార్వతీ పరమేశ్వరులు దీనిని చూశారట. ఆ దేవి, స్వామినిట్లా అడిగింది. "ప్రభూ!



మొదటివాడెందుకు అలా చేశాడు. రెండోవాడు ఎందుకు అలా ప్రవర్తించాడు. వీరిద్దర్ని నీవెలా గ్రహిస్తావు?"

దానికి పశుపతి ఇలా అన్నాడట. **"దేవీ! బుద్ధిః కర్మానుసారిణీ** వారి కర్మల ఫలితంగానే, వారికి బుద్ధులు కలుగుతాయి. మొదటివాడు సుఖ దుఃఖాల వలయంలో దుఃఖాలు ఎక్కువ సుఖాలు తక్కువ పొందుతూ నానాటికి దిగజారి అధమ జన్మలకు వెళ్తాడు. రెండవవాడు కూడా సుఖదుఃఖాలలో తేలియాడినా ఎక్కువ సుఖాలు, మనశ్శాంతి పొందుతూ, ఉత్తమ జన్మలు పొందుతూ, ఒకనాటికి నన్ను చేరుకుంటాడు. మొదటివాడు ఎన్నటికీ చేరడు"

భగవంతుని కృప లేక, ఆయనపై ధ్యాసే పోదు. ఒక్కసారి ఆయన దయకలిగితే తప్పక మంచి జరుగుతుంది. ఆ మంచి కొందరికి ఐశ్వర్యం వలెను, కొందరికి కీర్తివలెను, కొందరికి అధికారం వలెను, కొందరికి భోగం వలెను, నిజమైన అదృష్టవంతులకు

ఆనందం వలెను వస్తుంది. అందుకనే నరమేధం చేస్తున్న రాక్షసులకు కూడా కీర్తి ప్రతిష్టలు భోగభాగ్యాలు కలుగుతుంటాయి. ఎండలో నిలుచుని చంకలో పసిపాపని పెట్టుకుని దారిలో అడుక్కునే వాళ్ళను గమనించండి. ఆ పసిగుడ్డు చేసిన పాపం ఏముంది? ఆ పక్కనే పెద్ద పడవలాంటి 'కారు' లో పోతున్న ఇంకొక పాప చేసిన పుణ్యం ఏమిటి? ఏమి లేదు అనే సమాధానం ఎంత అసమంజసంగా ఉన్నది?

నిజానికి ఇప్పుడు ఆ పసిపిల్లలు చేసిన మంచీ లేదు, చెడూ లేదు కదా! దీనినే కర్మ సిద్ధాంతం సునాయాసంగా వివరిస్తుంది. "ఎవరు చేసిన కర్మ వారనుభవించక ఏనాటికైనా తప్పదు" మరి మధ్యలో ఈ దైవం, పరమాత్మ ఎందుకు అనే ప్రశ్న వస్తుంది. మన కర్మలను బట్టి ఫలప్రదాత ఎవరో ఆయనే పరమాత్మ. ఆయనను ఏ పేరుతో పిలిచినా, ఏ రూపంతో కొలిచినా, ఏ విధంగా తలచినా ఒకటే. ఆయనేం చేస్తాడు? నీవనుభవిస్తున్న కర్మవల్ల నీకు దుఃఖం (బాధకాదండీ) కలుగకుండా చేస్తాడు. ఆ కర్మ అనుభవించే ధైర్యాన్నిస్తాడు. కర్మఫలం యొక్క తీవ్రత తగ్గిస్తాడు. ఇది నేను స్వానుభవంతో చెబుతున్న మాట. అయితే శ్రీనారాయణ భట్టతిరి వంటి మహాభక్తునికి ఆయనకున్న వ్యాధిని ఈ నారాయణీయం రచించాక పూర్తిగా నారాయణుడే నయము చేశాడని చరిత్ర చెబుతున్నది. ఆశ్రిత రక్షకుడు ఆ శ్రీమన్నారాయణుడని ఇంకా వేరే నిరూపించాలా?

ఈ శరీరం ఉన్నంతవరకు ఆత్మకు 'నా' అనే భావం పోదు. నా రోగం తొలగిపోవాలి, నాకు ఆనందం కలగాలి అనుకోవడం జీవి లక్షణం. నాకున్న పక్షవాతం తొలగించడం మానవులకు అసాధ్యమని తెలిపోయింది. దీన్ని ఆ శ్రీమన్నారాయణుడే నాడు భట్టతిరికి తొలగించినట్లు, నన్నూ రక్షిస్తాడు. ఇది తథ్యం.

నారాయణ భట్టతిరి భాగవతాన్ని సంక్షిప్త రూపంలో సంస్కృతంలో రచించారు. వ్యాధి నుండి విముక్తులయ్యారు. నేను ఆ శ్రీమన్నారాయణుని అనుగ్రహం చేత ఈ సంస్కృత కావ్యాన్ని తెలుగులోకి అనువదిస్తున్నాను. శ్రీహరి నాకు ప్రసాదించిన దివ్యశక్తితో తెలుగు పద్యరూపంలో వ్రాస్తున్నాను. పద్యానికి తాత్పర్యం వ్రాసేటప్పుడు మూల్యాన్ని అనుసరించి సాధ్యమైనంత 'భావ సామ్యం' ఉండేటట్లు మార్పుచేసి, భట్టతిరి శ్లోకానికి తెలుగువారి మనస్సుల్లో 'కష్టమైనా ఒకసారి చదవాలి' అనే స్పందన కలుగుటకు ప్రయత్నించాను.

నేను ఎంతవరకు కృతకృత్యుడనయ్యానో విజ్ఞులైన పాఠక భక్తవరులే నిర్ణయించాలి. ఇక ఈ నారాయణీయం పూర్వపరాలు ఒకసారి చూద్దాం.

శ్రీమద్ భాగవతం అంటే వ్యాసభాగవతమే. దాన్నే బమ్మెర పోతన ఆంధ్రమున అనువదించారు. పరీక్షిన్మహారాజుకు శుకమహర్షి కథగా చెబుతున్నట్లు సాగిపోతుంది.

భట్టతిరి భాగవతం 'స్తుతికావ్యం'. శ్రీమన్నారాయణునికే స్తుతి పూర్వకంగా భాగవత కథ సంక్షిప్తంగా చెబుతున్నట్లుంటుంది. ఇది అనుభూతి కావ్యమని మహానుభావులు చెబుతారు. ఇది ఒక అద్భుత శిల్పం, అనన్యా సాధ్యం, అపూర్వం. ఆ కల్పనా వైచిత్రిని ఈ శ్యమంతకోపాఖ్యాన ఘట్టంలో చూడండి. శ్యమంతక మణికోసం శ్రీకృష్ణుడు జాంబవంతునితో ముష్టియుద్ధం చేస్తున్నాడు. ఆ సంఘటనలో భట్టతిరి శ్లోకానికి తాత్పర్యం చూడండి.

**దేవా! పరమ భక్తుడు, మిక్కిలి వృద్ధుడు అయిన జాంబవంతుడు కృష్ణుని రూపమున నిన్ను శ్రీహరిగా గుర్తింపలేక పోయెను. "శ్రీరామభక్తుడనైన నన్ను ఎవ్వడెదుర్కొనగలడు" అని తలపోయుచు అతడు నీతో ముష్టి యుద్ధమునకు తలపడెను. జాంబవంతుడు నీపై ముష్టి ప్రహారములు చేయుచున్నపుడు "ప్రభూ! శ్రీరామచంద్రా! నీకు జయము. శ్రీహరీ నీకు జయమగు గాక!అనుచు నిన్నే కీర్తించెను. అతడు చేయునది ముష్టి ప్రహారములే అయినను అతడు పరోక్షముగా నిన్ను అర్చించుటయే అయినది.**

ఇంతకంటే భట్టతిరి కవితా సౌందర్యం వివరించాలా?

సృష్టాదిలో బ్రహ్మదేవుని అర్చన కోసం అర్చామూర్తిగా శంఖ, చక్ర, గదా పద్మములతో చతుర్భుజునిగ ఆదినారాయణుడు అవతరించాడు. బ్రహ్మ దానిని 'సుతపునకు' ఇచ్చాడు. సుతపుని భార్య 'పృశ్ని'. సుతపుడు ప్రజాపతి. ఆయన రెండవ జన్మలో కశ్యప మహర్షిగా అవతరించాడు. ఆయన భార్య అదితి. మరల వారికి నారాయణుడు వామనమూర్తిగా అవతరించి బలిని నిరోధించాడు. మరల ఆ దంపతులే వసుదేవుడు, దేవకిగా మూడవ జన్మ ఎత్తారు. వారికి మరల శ్రీమన్నారాయణుడు శ్రీకృష్ణునిగా జన్మించాడు. ఆ శ్రీకృష్ణుడు గోకులంలో నంద యశోదలవద్ద పెరిగి అనేకమైన శ్రీకృష్ణలీలలు చూపించి అష్టభార్యలను పెండ్లాడి దుష్టశిక్షణ శిష్టరక్షణ చేసి మహా భారత యుద్ధాన్ని నిర్వహించాడు.

వాసుదేవుని అవతారాంతమున ఆ శ్రీమన్నారాయణుని అర్చావిగ్రహం శిలారూపమున



సముద్ర జలాల ద్వారా దేవ గురువు (బృహస్పతి) కి లభించింది. నారాయణుని ఆజ్ఞ ప్రకారం ఆ 'గురువు' వాయుదేవునితో కలిసి వెళ్ళి శంకరుని సమక్షంలో అంబాపురం అనే పశ్చిమ సముద్ర సమీప గ్రామంలో ప్రతిష్టించాడు. గురువు వాయువు కలిసి ఆ స్వామిని ప్రతిష్టించుట వలన ఆ నారాయణుడు గురువాయూరు అప్పగా ప్రసిద్ధి చెందాడు.

ఈ క్షేత్రము నిజముగా భూలోక వైకుంఠమే. కలియుగ ప్రారంభమున నిర్మించబడి ఈ దేవాలయం వాతావరణంలోని పెను మార్పులకు లోనై కొంత శిధిలమైనది.

ఒక పాండ్య రాజుకు జ్యోతిష్కులు పది మాసములలో పాము కాటు వలన మరణింతువని చెప్పిరి. చనిపోయే ముందు పవిత్ర తీర్థక్షేత్రములను సందర్శించ వలెనను తన కోర్కెను రాజు తీర్చుకొనుచు చివరకు గురువాయూరు చేరెను. స్వామిని సేవించుచు కాలము గడిపెను. పది మాసముల తరువాత తన రాజధాని చేరిన రాజు



జ్యోతిష్కులను రావించి అబద్ధము చెప్పినందుకు మరణ దండన విధింతుననెను. దానికి ప్రధాన జ్యోతిష్కుడు ఇట్లనెను. "రాజా! మీరు పాము కాటుకు గురైన మాట వాస్తవము. కాని ఆ సమయమున మీరు గురువాయూరప్పను సేవించుచుండుట వలన ఆ సేవను శ్రీమన్నారాయణునితో పాటు స్వామిపానుపైన ఆదిశేషుడు కూడ సేవింపబడినందువల్ల పాముకాటుకు గురైనప్పటికి తమపై విషము ప్రభావము చూపలే"దనిరి. దానికి నిదర్శనముగా రాజు పాదముపై పాము కాటు గుర్తులు స్పష్టముగా కనపడినవి. ఆనందభరితుడైన రాజు కృతజ్ఞతతో గురువాయూరు మందిరమును పునరుద్ధరించెనని పెద్దలు చెప్పెదరు. నేటికినీ వ్యాధులకు గురైన వారు స్వామిని దర్శించి సేవించుట వలన సంపూర్ణారోగ్యముతో వర్ధిల్లుచుండిరి. గురువాయూరును దర్శించుటకు శక్తిలేనివారు ఈ నారాయణీయము పారాయణ చేసినను ఇదే సత్ఫలితము దక్కునని నారాయణ భట్టతిరి పలికిరి.



శ్రీ నారాయణ భట్టతిరి కేరళలోని నంబూద్రి బ్రాహ్మణుడు. సకల వేదవేదాంగ పారంగతుడు. వ్యాకరణమున నిష్ణాతుడు. సంస్కృతమున ఆయన అనేక గ్రంధములను రచించెను. ఆయన రచించిన భారత రామాయణాది గ్రంధములలో శ్రీమన్నారాయణీయము అత్యంత జనాదరణ పొందినది. ఈ గ్రంధము ఆయనకు అనన్య సామాన్యమైన కీర్తిని సంపాదించి పెట్టినది.

నారాయణ భట్టతిరి తీవ్రమైన వాతరోగముతో బాధపడుచుండెను. వైద్యులెవ్వరికి ఆ రోగము అంతు చిక్కలేదు. ఎన్ని ఔషధులు సేవించినను ఫలితము చేకూరలేదు. అప్పుడు భట్టతిరులవారు శిష్యు సమేతుడై గురువాయూరు చేరెను. అచట తన ఆరాధ్య దైవమైన శ్రీమన్నారాయణుని సేవించెను. ఆ స్వామిని స్తుతించుచు భాగవత గాధ రూపమున వేయికి పైగా శ్లోకములను చెప్పెను. దశకములుగా చెప్పిన ఈ శ్లోకములలో భక్తి పారవశ్యము తొణికిసలాడుచుండును. జ్ఞాన వైరాగ్యములు

పెల్లుబికినట్లుండును. శ్లోకములన్నియు నారాయణునికే స్తుతి పూర్వకముగా భాగవత గాథ చెప్పినట్లుండును. ఇదివరలో ఎవ్వరు ఇట్టి ప్రయత్నము చేసియుండలేదు. ఈ రచన స్వామి అనుగ్రహమునకు పాత్రమైనందువల్ల ఆయనకు సంపూర్ణముగా స్వస్థత చేకూరెనని ప్రతీతి.

అధివ్యాధులకు కారణము బుద్ధి ప్రాణాలు వ్యవస్థల్లో ఏర్పడిన అసమత్వమే కారణమని వాటిని సరిచేస్తే ఏ వ్యాధి అయినా చక్కబడుతుందని వైద్యశాస్త్రం నమ్ముతుంది. వాటికి అధినాయకులు గురువు మరియు వాయువు. వీరిద్దరి ప్రతిష్టాన దేవత గురువాయూరప్ప. కనుక గురువాయూరప్పగా అవతరించిన శ్రీమన్నారాయణుని నమ్మి కొలిచిన వారికి ఆ స్వామి ఏవ్యాధినైన నిర్మూలిస్తాడని ఒక ప్రగాఢ విశ్వాసం. నారాయణ భట్టతిరి ససాక్ష్యంగా నిరూపించిన సత్యం అది.



క్రీ.శ. 2006 లో నా మిత్రులు పి. వేంకటస్వామి గారు ఒకరోజు నాతో నారాయణీయం తెలుగు పద్యరూపంలో అనువదించమని సలహా ఇచ్చారు. మా తండ్రి గారి వయస్సున్న ఆయనకు నేను అభిమాన మిత్రుడిని. ఆయన నాకు అభిమాన పాఠకుడు, గైడ్, క్రిటిక్ మరియు గురువు.

నేను క్రీ.శ. 2000 లో చేసిన 'శ్రీమత్ భగవద్గీత' తెలుగు పద్య అనువాదం ఆదిగా నేడు 2009 లోని 'భాగవత గాధలు' వరకు ఆయన నాకు చేసిన, చేస్తున్న సహాయం, ఇచ్చిన ప్రోత్సాహం మరువలేనివి. మార్గదర్శకులైన నా మంచి మిత్రులలో ఆయన ఒకరని నేను సగర్వంగా చెప్పుకుంటాను.

ఆయన మూడేళ్ళ క్రిందట 'నారాయణీయం' పద్యీకరించమని సలహా ఇచ్చారు. రోజుకి నాలుగు పేజీలకంటే వ్రాయలేని "పుత్రచేతి వ్రాయసగానికి" కుంటివాడు నడచి కాశీయాత్ర చేసినంత కష్టం ఆపని.



నాకంత శక్తిలేదన్నాను. మూడేళ్ళ తరువాత ఒకనాడు 'చేసేది, చేయించేది నారాయణుడే' అని పదే పదే చెప్పే నేను నావల్ల కాదని చెప్పటం ఎంత అవివేకం అనిపించింది. ఇది వరకు యెన్నిసార్లు **'అంతయు నీవే హరి పుండరీకాక్ష...'** అన్నాను. నేను అన్నదాని మీద నాకు నిజమైన నమ్మకం లేదా? ఉంటే అనుమానం ఎందుకు? ఉంచినా, ముంచినా శ్రీమన్నారాయణుడే అని నిజంగా నేను నమ్మటం లేదా? అంతే....

ఇక ఆలోచన మానేసి 'శ్రీ' అని వ్రాసేశాను. ఈ 'శ్రీమన్నారాయణీయ'మ్ యాత్ర ఎంతవరకు సాగుతుందో ఆ నారాయణుడిదే భారం. నేనుకూడా శ్రీగురువాయూరప్పకే దీనిని సమర్పిస్తాను. పూర్వి పద్య కావ్యంగానే కాక మకుటంలో ప్రతివద్యంలో గురువాయూరు స్వామి దర్శనమిస్తాడు. పద్యరూపం కోసం చిన్న చిన్న మార్పులు మాతృక అనుసరణలో చేసినప్పుడు



తాత్పర్యంలో ఆ మార్పు సరిచేశాను. అయినా ఏదైనా అనుసరణ లోపాలుంటే... ఆ శ్రీమన్నారాయణుని దయ అంతవరకే నని సరిపెట్టుకుంటాను.

నా ఇతర రచనలు చదవాలంటే **Please visit my website www.geetadeeksha.com**

# ప్రార్థన

సీ॥ శ్రీకారమును జుట్టి శ్రీగణేశుని మ్రొక్కి
నారాయణీయంబు పరమభక్తి
చేరిపద్యంబులో జెప్పదలంచితి
చేయూత నిచ్చేది శ్రీరమణుడె
పూర్వజన్మంబుల పుణ్యంబు చేతనా
నాల్కపై వాగ్దేవి నాట్యమాడె
భాగవతమునుండి పదియ వస్కందంబు
చెప్పదలంచితి శ్రీపతికిని

తే॥ భక్తుడైన నారయణ భట్ట తిరులు
సంస్కృతింప భాగవతపు సారమెల్ల
తెలుగు పద్యంబులో నేను తెలుపుచుంటి
వినుము 'శ్రీగురువాయురు' విష్ణుదేవ!



చం॥ చెనకొని పద్యకావ్యముగ జెప్పెద
భాగవతంపు సారమున్
కనుము రవంత, ధైర్యమును కాదనకుండగ
నిమ్ము నాకు, నే
గొనకొని నాదు జన్మకిక గూర్చెద మోక్షము
సత్ఫలంబుగా
విను గురువాయు పట్టణపు విష్ణునిగాథను
హే జగద్విభో!

మ॥ ముని నారాయణ భట్టగారు ప్రజకున్ ముక్తీయ
గీర్వాణిలో
ఘనమౌ భాగవతమ్ము జెప్పిరట నీ కావ్యంబు
క్లుప్తంబుగా
తెనుగున్ జేసెద జూపుమా కరుణ హేదేవా!
రమావల్లభా!
వినమా శ్రీగురువాయు పట్టణములో విశ్వేశ!
నీ గాథలన్



ఉ॥ చేగొని నీకృపారసము చెప్పెద భాగవతంబు
నో ప్రభూ!
ఆగను, జీవితాశయము అయ్యెను నాకిది
ముక్తినిమ్ము, నే
భాగవతమ్ము వ్రాసెదను వ్యాధికి లొంగను
నిశ్చయంబుగా
హే గురువాయు పట్టణపు ఈప్సితదాయక!
హే జగద్విభో!

కం॥ హరిగాథ భట్టతిరి ముని
ఎరిగించిరి సంస్కృతమున ఇదె పద్యముగా
సురపాల! తెలుగు జేసితి
గురుఅనిలపురీశ! నిన్ను కోరి భజింతున్



తే॥ వలదు భోగ భాగ్యమ్ములు బంధనములు
వలదు మేడలు మిద్దెలు బహు సుఖములు
వలదు కక్షలు కపటమ్ము పాతకములు
వలదు కీర్తి ప్రతిష్ఠలు పదవులైన
వలదు అన్యమేదియు నాకు వాసుదేవ!
కలుగజేయుము నీ చెంత నెలవు సుంత
తెలుగు పద్యంబులో నేను తెలుపుచుంటి
వినుము శ్రీ గురువాయూరు విష్ణుగాథ.



## అంకితము

ఉ॥ చేగొని నీకృపా ధనము శ్రీహరిగాథలు
తొల్లి వ్రాసితిన్
నా గతజన్మ భాగ్యమది నాకు లభించిన
'ముల్లె', పాలపై
మీగడ వంటి భట్టతిరి మేలు కృతిన్
తెనుగించుచుంటిగా
చేగొనుమయ్య అంకితము
శ్రీగురువాయుపురాధినాయకా!



తా॥ గురువాయూరప్పా! నీకృప అనెడి ధనము లభించుటచేత ఇదివరకు నేను శ్రీహరిగాథలనెన్నో వ్రాశాను. అది నా పూర్వజన్మ భాగ్యమని, నాకు లభించిన 'ముల్లె' అని భావిస్తాను. నారాయణ భట్టతిరి మేలైన కృతి శ్రీమన్నారాయణీయమ్, పాలమీగడవంటిది. దానిని తెలుగు పద్యకావ్యంగా తాత్పర్య సహితమై అనువదిస్తున్నాను. ఓ ప్రభూ! దీనిని నీకు అంకితం చేస్తున్నాను. స్వీకరింపుము తండ్రీ!



## 1. శ్రీకృష్ణావతార ప్రసంగము

1/1

**సీ॥ శౌరి! దేవాసుర సంగ్రామమందున**
**తొల్లి దైత్యుల నీవు తురిమినావు**
**నీచేత సమసియు నిజ పాప శేషాన**
**పరమ పదము వారు బడయరైరి**
**జన్మించి పుడమిపై సలుప దుష్కార్యముల్**
**భూభారమధికమై పోవసాగె,**
**బ్రహ్మతో భూదేవి వగచి తానొక నాడు**
**సుర సమక్షంబున మొరను వెట్టె.**

**తే॥ భక్తుడైన నారాయణ భట్టుతిరులు**
**సంస్కృతించె భాగవతపు సారమెల్ల**
**తెలుగు పద్యంబులో నేను తెలుపుచుంటి**
**వినుము శ్రీ గురువాయూరు విష్ణుదేవ!**



తా॥ ఓ శ్రీమన్నారాయణుడా! దేవాసురుల యుద్ధములలో పూర్వం నీవు అసురులను తుదముట్టించినావు. అట్లు మరణించిన దైత్యులకు పాప ఫలము ఇంకా మిగిలి యుండుట చేత మోక్షం పొందలేక పోయారు. వారందరు తిరిగి భూమిపై జన్మించి మానవులుగానే దుష్కర్మములు చేయనారంభించారు. దానివల్ల భూభారం పెరిగిపోయింది. భూదేవి రోదిస్తూ బ్రహ్మదేవునితో తన బాధను మొరపెట్టుకుంది. దేవతల సమక్షంలో ఆమె విలపిస్తుండగా బ్రహ్మ ఆలకించాడు. మహాభక్తుడైన నారాయణ భట్ట తిరి సంస్కృత భాషలో భాగవతం సంగ్రహంగా చెప్పారు. నేను దానినే తెలుగు పద్యంగా చెబుతున్నాను. గురువాయురప్పా! ఈ విష్ణు గాథను వినుము తండ్రీ!

1/2

సీ॥ "దుర్జన భారంబుతో విరించీ! నాకు
సైపగనింక అసాధ్యమయ్యె
దీనురాలను నన్ను కనికరింపుము ప్రభూ!
సురుల నడుగుమయ్య ఎరుగనీవు"
ఈరీతి దుఃఖించు ధరణీ సతిని గాంచి
కలిగి కారుణ్యంబు నలువ అపుడు
హృదయాన ధ్యానించి ఇట్లనె నిను గొల్చి
ఆ బ్రహ్మదేవుండు అవని సతికి

తే॥ భక్తులైన నారాయణ భట్టతిరులు
సంస్కృతించె భాగవతపు సారమెల్ల
తెలుగు పద్యంబులో నేను తెలుపుచుంటి
వినుము శ్రీగురువాయూరు విష్ణుదేవ!



తా॥ "ఓ బ్రహ్మదేవా! నాకు ఇకపై ఈ దుర్మార్గుల భారం వహించడం అసాధ్యంగా వున్నది. దీనురాలనైన నాపై దయజూపుము. ప్రభూ! కావాలంటే నీవె ఈ దేవతల నడిగి తెలిసికొనుము"
ఈ విధంగా దుఃఖిస్తున్న భూదేవిని చూచి దయకలిగిన బ్రహ్మ మనస్సులో శ్రీమన్నారాయణుడవైన నిన్ను ధ్యానించి భూదేవితో వివరించి చెప్పాడు. భక్తుడైన నారాయణ భట్టతిరి సంస్కృత భాషలో భాగవతం సంగ్రహంగా చెప్పారు. నేను దానినే తెలుగు భాషలో పద్యంగా చెబుతున్నాను.
ఓ గురువాయురప్పా! ఈ విష్ణుగాధను వినుము తండ్రీ!



1/3

సీ॥ నలువ సురులతోటి నయముగా నుడివెను
"వసుధ చెప్పినయట్టి పలుకు నిజము
ఈమె దుఃఖంబును ఇందిరానాథుడే
తీర్చగలుగువాడు తెలియరయ్య!
హరు గూడి మనమంత హరిజేరి ఈ సతి
కడగండ్లు జెప్పేము కరములోడ్చి
క్షీరసాగరమున శ్రీనాథుడొక్కడే
మార్గంబు జూపు నా మాట నిజము"

తే॥ బ్రహ్మ చెప్పిన తీరున పయనమైరి
నీ నివాసమౌ వైకుంఠమునకు వారు,
భాగవత సారమంతయు పద్యమందు
వినము శ్రీ గురువాయూరు విష్ణుదేవ!



తా॥ బ్రహ్మదేవుడు ఆ దేవతలతో ఈ విధముగా మంచిమాటలు చెప్పాడు. "ఓ దేవతలారా! ఈ భూదేవి చెప్పిన మాటలు నిజమే. ఈమె దుఃఖము తొలగించు శక్తిగలవాడు ఆ లక్ష్మీపతి యొక్కడే. శంకరునితో కలిసిమనమంతా పాలసముద్రమున శేషశాయియై పవళించియున్న ఆ శ్రీమన్నారాయణునకు నమస్కరించి ఈమె కష్టములను తెలిపెదము. ఆయనే ఏదో మార్గం చూపిస్తాడు. నా మాట నిజం" బ్రహ్మదేవుడు చెప్పినట్లే వారంతా వైకుంఠంలోని నీ నివాసమునకు బయలుదేరిరి.
ఓ గురువాయూరప్ప! భాగవత సారమంత విష్ణుగాధగా పద్యరూపంలో వినుము తండ్రీ!

1/4

సీ॥ సురులంత వసుధతో క్షీరసాగర తటిన్
జేరిరి కీర్తించ హరివనంచు
మలయానిలంబది మందంబుగా వీచ
ధ్యానించిరందరున్ హరి పదముల
కమలభవుండంత నీ మాటలను వినె
మనసులోనే తాను మననమట్లు
అందుచే నాతండు అమరులకంతట
వినిపింపసాగెను విన్నమాట

తే॥ భక్తుడైన నారాయణ భట్టతిరులు
సంస్కృతింప భాగవతపు సారమెల్ల
తెలుగు పద్యంబు చెప్పెద దీక్షితుడను
వినుము ఓ గురువాయూరు విష్ణుదేవ!



తా॥ అప్పుడు దేవతలంతా భూదేవితో పాటు పాలసముద్రపు ఒడ్డున చేరిరి. అచట వారు హరివి అని తలంచి నిన్ను కీర్తించ దలంచిరి. చల్లని గాలి వీచసాగింది. అందరూ శ్రీహరి పదకమలములు ధ్యానించసాగిరి. బ్రహ్మదేవుడు నీ మాటలను మనస్సుతోనే మననం చేసుకున్నట్లు ఆలకించినాడు. ఆయన దేవతల కందరికి ఆ మాటలను మరల వినిపించెను. భక్తుడైన నారాయణ భట్టతిరి సంస్కృతంలో భాగవతమును సంక్షిప్తంగా చెప్పారు. తెలుగు పద్యంలో నేను దీక్షగా చెబుతున్నాను. ఓ గురువాయూరప్ప! ఈ విష్ణుగాధను నీవాలకింపుము తండ్రీ!



1/5

సీ॥ సురులార! దుష్టులౌ ధరణీపతుల వల్ల
కన్నీరు భూకాంత కార్చుచుండె
వారినంతముజేతు వదలకుండగ నేను
ఉదయింతు భూమిపై యాదవునిగ
మీరంత ననుగూడి మీ అంశముల తోటి
పుట్టుక లొందుదు పుడమిపైన
దేవతా స్త్రీలంత అవనిపై ననుజేరి
గోపికా రమణులై కొలువ గలరు

తే॥ శాంతిజెందగ అందరు శమనమొంది
తెలిపె నలువ ఆరీతి నీ పలుకులన్ని
భాగవత సారమంతయు పద్యమందు
వినుము శ్రీగురువాయూరు విష్ణుదేవ!



తా॥ ఓ దేవతలారా! దుష్టులైన నృపాలుర దురాగతముల వల్ల భూదేవి కన్నీరు కార్చుచున్నది. నేను భూమిపై యాదవ కులమున జన్మించి ఆ దుర్మార్గులను వదలక అంతము జేసి భూభారమును తగ్గింతును. మీరంతా మీ అంశములతో అవనిపై అవతరించండి. మున్ను నను వరము కోరినట్లె దేవతా స్త్రీలందరూ గోపికలై జన్మించి నన్ను సేవించి తరించెదరు. ఆ విధముగా బ్రహ్మదేవుడు అందరికి శాంతి, శమనములు కలుగునట్లు నీ సందేశమును వినిపించెను. ఆ భాగవత సారమంతయూ దీక్షతో నేను తెలుగు పద్యంగా తెలుపుచున్నాను. గురువాయూరప్ప! ఆ విష్ణుగాధనాలకింపుము, తండ్రీ!

1/6

సీ॥ వీనులకింపుగా విని నీదు పలుకులు
సంతృప్తి జెందిరి సకల సురులు
నీదయామృత వృష్టినెనరు బొందిరి వారు
తమ తమ నెలవుల తరలినారు.
వసుదేవుడానాడు మధురలో పేరొందె
శూరసేనుని యొక్క సూనియతడు
దేవకునికి పుత్రి దేవకీ దేవితో
పరిణయం బతనికి జరుగుచుండె

తే॥ మధుర రాబోవు కాలాన వాసిగాంచు
నీదు సన్నిధానంబది నిగమవినుత!
పరమ పావనంబైనట్టి పట్టణమది
వినుము శ్రీ గురువాయూరు విష్ణుదేవ!



తా॥ చెవుల కింపగు నీ మాటలు విని, సమస్త దేవతలు తృప్తి జెందిరి. నీ దయామృతమున కురిసిన ప్రేమ పొందిన వారు తమ తమ స్వస్థలములకు బయలుదేరిరి.

ఆ సమయమున వసుదేవుడు మధురలో గొప్పవాడని పేరుపొందాడు. అతడు శూరసేనుని యొక్క పుత్రుడు. దేవకుడు అను గొప్ప రాజుయొక్క కుమార్తె యైన దేవకీ దేవితో అతనికి వివాహము జరుగుచుండెను. రాబోయే కాలంలో మధురానగరం నీ సన్నిధానమగుటచే జగద్విఖ్యాతమవ బోతున్నది. గొప్ప పుణ్యస్థలమవుతుంది. ఓ గురువాయూరప్ప! ఈ విష్ణు గాధనాలకింపుము, తండ్రీ.



1/7

సీ॥ దేవకీ వసుదేవులావిధి బెండ్లాడ
వారల గొని పోయె తేరునందు
ఆమె సోదరుడైన ఆ 'కంస' భూపతి
సంరంభమొప్పంగ స్వయము తానె
అప్పుడు వినిపించె ఆకాశవాణిగా
హెచ్చరికొక్కటి ఇవ్విధముగ
"దుష్ట! నీ సోదరి అష్టమ గర్భంబు
నిస్సందియంబుగా నిన్ను జంపు"

తే॥ ప్రాణభీతిని జెందెను పాతకుండు
కడకు చెల్లినే చంపంగ ఖడ్గమెత్తె
భాగవత సారమంతయు పద్యమందు
వినుము శ్రీ గురువాయూరు విష్ణుదేవ!



తా॥ ఆ విధముగ దేవకీ వసుదేవులు పెండ్లాడగా ఆమె సోదరుడైన కంసుడనెడివాడు దంపతుల రధమును స్వయంముగా ఆనందముగా తోలుకొని పోవుచుండెను. అప్పుడు ఆకాశవాణి హెచ్చరిక ఇట్లు వినిపించెను. "ఓ దుర్మార్గుడా! నీ చెల్లెలి యొక్క ఎనిమిదవ బిడ్డ నిన్ను తప్పక సంహరిస్తాడు" పాపాత్ముడైన ఆ కంసుడు ప్రాణభీతి నొంది చివరకు చెల్లెలినే చంపుటకు కత్తిదూసెను. ఓగురువాయూరప్ప! భాగవత సారమును పద్యరూపమున నాలకింపుము, తండ్రీ.

1/8

**సీ।। కంసుండు చెల్లిని ఖండించబోయెను**

**వసుదేవుడాతని బ్రతిమిలాడె**

**ఆమెను వీడని ఆతని పదమంటి**

**"సంతు కలిగిన ఆర్పింతు ననెను**

**వసుదేవు ప్రతినకు వాడు సంతుష్టుడై**

**ఇంటికి బోయెను ఇంతినొదలి**

**కతిపయ దినముల కనెను దేవకి సుతున్**

**కంసుని కర్పించె కన్నతండ్రి**

తే।। ప్రేమతో శిశున్ ముద్దాడి మేనమామ
"వీని జంపను అష్టము వీడ" ననెను
దుష్టులకు గూడ ఇత్తువే శిష్ట బుద్ధి!
వినుము శ్రీగురువాయూరు విష్ణుదేవ!



తా।। కంసుడు అశరీరవాణి విని తన సోదరి దేవకీ దేవిని తన ఖడ్గముతో సంహరించబోగా వసుదేవుడు వలదని బ్రతిమిలాడెను. ఆమెను వదలని, ఆ కంసుని పాదములు పట్టి వసుదేవుడు ప్రార్థించి, తనకు సంతానం కలిగిన వెంటనే ఆతని కర్పించెదనని వాగ్దానము చేసెను. దానితో వాడు తృప్తిజెంది దేవకీ దేవిని వదలివైచి తన నగరమునకు బోయెను. ఆ తరువాత కొన్నాళ్ళకు దేవకీదేవి ఒక మొగ బిడ్డను ప్రసవించెను. వసుదేవుడన్న మాట నిలబెట్టుకొని ఆ శిశువును కంసుని కర్పించెను. ఆ శ్రీమన్నారాయణుడు దుర్మార్గులకు కూడ అప్పుడప్పుడు మంచిబుద్ధి ఇస్తుంటాడు. ముద్దులొలుకు ఆ బాలుని, మేనమామ సంహరించక వానిని ముద్దాడి "వీనిని చంపను, ఎనిమిదవ వానిని వదలను" అని చెప్పెను. ఓ గురువాయూరప్ప! ఈ విష్ణుగాధ నాలకింపుము తండ్రీ!



1/9

**సీ।। నీదు సంకల్పంబు మదిని ప్రేరేపింప**

**నారదుండా కంసుజేరి పలికె,**

**"కంస! యాదవులంత కలిగిరి దైవాంశ**

**దానవాంశను మీరు ధర వెలసిరి**

**సురపక్షపాతి యా నారాయణుడు బూని**

**నీ చెల్లికే బుట్టు నిన్ను జంప**

**మాయావి శ్రీహరి మడియించ నందరిన్**

**దేవకీ గర్భాన అవతరించు"**

**తే।। కంసుడంతట కోపించి కరుణ వీడి**

**మేన అల్లుళ్ళ నార్గుర తాను జంపె,**

**బెదరగొట్టెను ఆతండు యాదవులను**

**వినుము శ్రీగురువాయూరు విష్ణుదేవ!**



తా।। నీ సంకల్పము తన మనస్సులో ప్రేరేపితంగా నారద మహర్షి కంసుని కలిసికొని ఈ విధముగా పలికెను. "ఓ కంసా! దేవతలు తమ అంశలను ప్రవేశపెట్టగా యాదవులు పుడమిలో జన్మించిరి. నీవూ నీ స్నేహితులు రాక్షసాంశములతో జన్మించిరి. ఆ శ్రీమన్నారాయణుడు దేవతల పక్షపాతి అగుట చేత నిన్ను సంహరించుటకు నీ చెల్లెలు దేవకీ దేవి గర్భమున జన్మించును. ఆ శ్రీహరి మాయావి అగుటచే నిన్ను సంహరించును" ఆ మాటలకు కంసుడాగ్రహించి వసుదేవుని బిడ్డలపై కనికరం విడిచి పెట్టి ఆరుగురిని అంతము జేసెను. యాదవుల నందరిని భయకంపితులను చేసెను. ఓ గురువాయూరప్ప! కమనీయమైన ఈ విష్ణుగాధను ఆలకింపుము, తండ్రీ!

1/10

సీ॥ **ఆదిశేషుడు చేరె ఆ దేవకీదేవి**
**సప్తమ గర్భమై స్వామి!నాడు**
**మాత రోహిణికది మార్చావు మహిమతో**
**రేపల్లెలో వాని లేమ కనెను**
**సచ్చిదానందపు సహజ రూపంబుగా**
**దేవకీ సతి బ్రోచినావు నీవు**
**దివిజవర్యులు ప్రస్తుతించిరెల్లరు ప్రభూ!**
**అష్టమగర్భమై అలరు నిన్ను**

తే॥ **వదలగొట్టుము నారోగ బాధలన్ని**
**నా కనన్యమౌ ఆసక్తి నొకటి ఇమ్ము**
**భట్టుతిరి కృతి జెప్పెద పద్యమందు**
**వినుము శ్రీ గురువాయూరు విష్ణుదేవ!**



తా॥ ఓ శ్రీహరీ! ఆ దేవకీ దేవి ఏడవ గర్భమునందు ఆదిశేషుడు ప్రవేశించెను. దానిని నీ ఇంకొక తల్లియైన రోహిణీ దేవికి నీ మహిమ వలన మార్పిడి చేశావు. ఆ బిడ్డను ఆమె రేపల్లెలో ప్రసవించింది. సచ్చిదానంద స్వరూపునిగ నీవు దేవకీ దేవికి నీ దర్శనభాగ్య మొసగి కరుణించావు. ఆమె అష్టమ గర్భమై వెలసిన నిన్ను దేవతలందరు స్తుతించినారు. ఓ గురువాయూరప్ప! నా వ్యాధి రుగ్మతను నివారింపుము. నాకు అనన్యమైన ఆసక్తి నొకటి (నీపై) కలుగజేయుము. శ్రీ నారాయణ భట్టుతిరి, సంస్కృతమున చెప్పిన దానిని నేను తెలుగు పద్యంలో చెబుతున్నాను. ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!



## 2. శ్రీకృష్ణుని గోకులము చేర్చుట

చం॥
**చెనకొని పుట్టినావు భువి శ్రీహరి! వర్షపు**
**కాలమందు ఆ**
**ఘనజలదంబు లాకసము గప్పెను నీలిమ**
**కాంతులీనుచున్**
**అనుపమ శ్యామసుందరుడ వైతివి దేహము**
**యుజ్జ్వలంబయెన్**
**వినుగురు వాయు పట్టణపు విష్ణుని గాధను**
**ఓ పరాత్పరా!**

తా॥ ఓ శ్రీహరీ! పరాత్పరా! ఆనంద రూపా! నీవు వర్షాకాలమున భూమిపై అవతరించితివి. అప్పుడు ఆకాశము మేఘావృతమై యున్నది. వాటి నీలవర్ణపు శోభను శ్యామసుందరుడవైన నీ శరీర కాంతులు విరజిమ్ముచుండెను. ఓ గురువాయూరప్ప! ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!



2/2

తే॥ **దేవ! షోడశ కళలతో దీప్తిజెందు**
**చందురుని బోలు నీవు ముజ్జగములందు**
**ఆర్తిబాపంగ పుట్టావు అర్ధరాత్రి**
**అపుడు మేఘావృతంబయ్యె నాకసంబు,**
**దిక్కులును చల్లబడినవి, దీనులైన**
**సజ్జనులు కోర్కె ఫలియించు సత్వరముగ**
**అనుచు తము పరమానందమందినారు**
**వినుము శ్రీగురుయూరు విష్ణుదేవ!**

తా॥ ఓ దేవా! దీనోద్ధరణకై నీవు ఆవిర్భవించిన ఆ నడిరేయిలో ముల్లోకములను కాపాడుటకు పదహారు కళలతో శోభించు చంద్రునివంటి నీవు పుట్టావు. అప్పుడు ఆకాశం మేఘావృతమై యున్నది. దిక్కులు చల్లబడినవి. దీనులైన సజ్జనులంతా ఇక తమ కోర్కెలు ఫలిస్తాయని పరమానందం చెందారు. ఓగురువాయూరప్ప! కమనీయమైన ఈ విష్ణుగాధను వినుము తండ్రీ!

2/3

సీ॥ అల ప్రసూతీ గృహమందున ఓ ప్రభూ
విలసిల్లితివి నీవు నీలమేఘ
ఛాయతో శిశువుగా, శంఖ చక్రము గదా
పద్మంబులను దాల్చి పరిఢవిల్లి
నీకలంకృతమయ్యె నిరుపమానంబైన
మణి కిరీటంబు, కంకణములున్ను
భుజకీర్తులును, రత్నభూషిత హారాలు
వెదజల్లె కొంగ్రొత్త వెలుగులన్ని

తే॥ సంస్కృతింప భాగవతపు సారమెల్ల
భక్తులైన నారాయణ భట్టు తిరులు
తెలుగు పద్యంబులో నేడు తెలుపుచుంటి
వినుము శ్రీ గురువాయూరు విష్ణుదేవ!



తా॥ ఓ ప్రభూ! అక్కడ ఆ ప్రసూతి గృహమున నీవు నీలమేఘవర్ణుడైన శిశువుగా, శంఖ, చక్ర, గదా, పద్మములు గల చతుర్భుజుడవై అవతరించావు. మణికిరీటము, కంకణములు, భుజకీర్తులు, రత్నాభరణములు నూతనమైన దివ్యకాంతలు వెదజల్లుచున్నవి. ఓగురువాయూరప్పా! భక్తుడైన శ్రీనారాయణ భట్టతిరి సంస్కృతములో రచించిన సంక్షిప్త భాగవతమును నేను తెలుగు పద్యములలో చెప్పుచున్నాను. ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!



2/4

ఉ॥ శ్రీ రమణీ నివాసమట శ్రీపతి వక్షము
వాసుదేవ! నీ
కూరిమియున్ ప్రభావమది కూడిన
శ్రీ కరుణా కటాక్షమై
క్రూరుడు కంసు దుష్టచెఱ గూడ వదల్చును
ఏమొ అన్నయా
తీరున నుండెనో శ్రియపతీ! గురువాయు
పురాధి నాయకా!

తా॥ వాసుదేవా! లక్ష్మీదేవి నీ వక్షస్థలమున సుఖముగా నివసించుచున్నది. నీ కరుణ ప్రభావములతో ఆమె దివ్య కటాక్ష వీక్షణము చక్కగా ప్రసరించి, దుష్టుడు, క్రూరుడు అయిన ఆ కంసుని యొక్క చెఱ (పీడ) ను తొలగించుచున్నదా అన్నట్లు ఒప్పుచున్నది. సంరక్షకుడవైన ఓ గురువాయూరప్పా! దేవరా (నీవు కరుణింపుము)



2/5

సీ॥ ఆనందరూపివైనట్టి రూపము గాంచ
ప్రభు! జితేంద్రియులకున్ వలను కాదు
నియమ నిష్టలుగల ఆ యతీంద్రులకును
నీవగమ్యుండవో నీరజాక్ష!
వసుదేవుడున్ దివ్య మంగళంబౌరూపు
నరసి ఆనందాబ్ధి మురిసిపోయె
నయనాల గురియ ఆనంద భాష్పంబులు
గాత్రంబు పులకించె గళము నిండె

తే॥ నీకృపారస వృష్టిలో నిన్ను మదిని
తలచి వసుదేవుడా నాడు తాన్ స్తుతించె
తెలుగు పద్యంబుగా దాని తెలుపుచుంటి
వినుము శ్రీ గురువాయూరు విష్ణుదేవ!

తా॥ ఓ ప్రభూ! ఆనంద స్వరూపుడవైన నీ రూపమును దర్శించుటకు జితేంద్రియులైన వారికే అసాధ్యము. నియమము నిష్ట కలిగిన మునీంద్రులకు కూడా నీవు అగమ్య గోచరుడవు. వసుదేవుడు నీ దివ్య మంగళ స్వరూపము జూచి సంతోష సాగరంలో మునిగిపోయాడు. నయనములు ఆనందాశ్రువులు రాల్చుచుండగా శరీరం పులకరించి గొంతు గద్గదమయింది. నీ కృపారసము వర్షించుచుండగా వసుదేవుడు నిన్ను ఆనాడు మనస్సులో తలచుకొని స్తుతించాడు. నేను తెలుగు పద్యరూపంలో తెలుపుతున్నాను. ఓ గురువాయూరప్ప! నీవు ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!



2/6

సీ॥ పరమాత్మ! నాపైన కరుణింపుమో దేవ!
నీ అనుగ్రహమిమ్ము, నీదు చూపు
తాపత్రయంబను దట్టమౌ తీగలన్
కొడవళ్ళతో బూని కోయుచుండు
పరిపూర్ణమౌ దయ ప్రసరింపు నాపైన
సర్వనియామకా! జగతి భర్త!
నాబాధ తొలగింపు నయము జేకూర్చుము
వసుదేవుడీ రీతి ప్రస్తుతించె

తే॥ భక్తుడైన నారాయణ భట్టతిరులు
సంస్కృతింప భాగవతపు సారమెల్ల
తెలుగు పద్యంబులో నేడు తెలుపుచుంటి
వినుము శ్రీ గురువాయూరు విష్ణుదేవ!



తా॥ వసుదేవుడా భగవంతుని జూచి ఇట్లు స్తుతించెను. "ఓ పరమాత్మా! దేవా! నన్నునుగ్రహింపుము. నీ కరుణా వీక్షణము తాపత్రయములను తీగలను వాడియైన కొడవళ్ళతో నరికివేయును. నాపైన నీ పరిపూర్ణ దయా దృష్టిని ప్రసరింపనిమ్ము. ఓ జగతి భర్త! సర్వనియామకా! నాబాధను నివారింపుము. నాకు నయమును జేకూర్చుము"
భక్తుడైన నారాయణ భట్ట తిరి సంస్కృతములో భాగవతమును సంక్షిప్తముగా జెప్పెను. నేను దానిని తెలుగు పద్యములో తెలుపుచున్నాను. ఓ గురువాయూరప్ప! ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!



2/7

చం॥ తను కడు సంతసించినది ధన్యగు దేవకి
మాతృమూర్తియై
కనులును భాష్పముల్ కురియ కమ్మగ పాడెను
నీదు కీర్తనల్
తన గత రెండు జన్మలను తల్లికి నీవెరిగించి
యంతటన్
వెనుకటి చిన్ని పాపవలె వింతగ మారితివయ్య
ఓ ప్రభూ!
విను గురువాయు పట్టణపు విష్ణుని గాథలు
హే జగద్విభో!

తా॥ ఓ ప్రభూ! నీ తల్లియైన దేవకీ దేవి సంతోష పరవశయై ఆనంద బాష్పములు కురియగా అనేక విధముల (నీ గుణములను) కీర్తించినది. అప్పుడు కరుణామయుడవైన నీవు ఆమెకు గత రెండు జన్మలను (మొదటి జన్మలో ఆమె పృశ్ని, రెండవ జన్మలో వామనుని తల్లియైన అదితి) ఆమెకు యెరింగించితివి. తరువాత ఆ దేవకీ దేవి కోరిన రీతిగా చిన్నారి పాపడివైన రూపమును ధరించితివి. ఓ గురువాయూరప్ప! క్రొత్త ప్రక్రియలో ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!



2/8

**చం॥ నను గొని నందగోపు సదనంబున జేర్చుము,**
**వాని కూతునిన్**
**అనుపమ లీల జేర్చుమిట" అంటివిగా**
**వసుదేవుతోటి, నిన్**
**కనుటకు కాదు యోగులకు, గట్టిగ జేతులమధ్య**
**నిల్పుచున్**
**గొనియెను హంసవంటి నవకోమల శైశవ రూపినిన్**
**ప్రభూ!**
**విను గురువాయు పట్టణపు విష్ణుని గాధలు**
**హే జగద్విభో!**



తా॥ ఓ ప్రభూ! అప్పుడు "నన్ను తీసికొని వెళ్ళి (రేపల్లెలో) నందగోపుని భవనంలో ఆయనకు ఇప్పుడే పుట్టిన కూతురి స్థానంలో వుంచి, యోగమాయయైన ఆమెను ఇక్కడ చేర్చుము" అని వసుదేవునికి ప్రేరేపించితివి. పరమయోగులు నిన్ను తమ హృదయంలో ధ్యానము సలుపుచు నిలుపుకొంటారు. వారు కూడా నిన్ను ఈ విధంగా చూడలేరు. రెండుపద్మముల మధ్యనున్న శైశవ హంస వలె ఆ వసుదేవుని హస్తకమలముల మధ్య ఇమిడిపోతివి. ఓ గురువాయూరప్ప! నూతనమైన ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!



2/9

**ఉ॥ అంతట నందగోప నిలయంబున అందరు**
**యోగమాయచే**
**సుంతయు సోయి లేక కదు సొక్కిన రీతిని**
**నిద్రనుండగా**
**ఎంత విచిత్రమో! విడెను ఎల్ల కవాటము లన్ని**
**బంధముల్**
**చింతల బాయుగా మధుర శ్రీగురువాయు**
**పురాధినాయకా!**

తా॥ అప్పుడు గోపకులాధీశుడైన నందగోపుని ఇంట జన్మించిన యోగమాయ ప్రేరణ వల్ల గోకులమంతా కొద్దిగా కూడ స్పృహ లేక నిద్రలో యుండగా ఎంతో విచిత్రంగా మధురానగరంలో గట్టిగా మూయబడిన కవాటములు తెరుచుకొన్నవి. సంకెళ్ళు విడిపోయినవి. ఆ నగరంలో ఇక దుఃఖం తొలగిపోతుంది. ఓగురువాయూరప్ప దేవా! ఇది నిజంగా జరుగుతుంది.

2/10

సీ॥ వసుదేవుడా నాడు స్వామి! నిన్ గొనిపోవు
వేళలో పొడజూపె వింతలన్ని
ఆదిశేషుడు నాడు ఆప వర్షపు జల్లు
వేయి పడగలెత్తి వెంటవచ్చె
నాగమణుల కాంతి నయముగ ఆ రేయి
త్రోలి పెంజీకట్లు త్రోవజూపె
శిరసుపై నినుగొని చేర్చె నందుని ఇంట
అయ్యె దన్యుండు ఆ యదువిభుండు

తే॥ అట్టి నీవు నా వ్యాధిని అంతమొంద
జేయుమో ప్రభూ! నీదయన్, చెప్పుచుంటి
తెలుగు పద్యంబులో నేను దీక్షబూని
వినుము శ్రీ గురువాయూరు విష్ణుదేవ!



తా॥ ఓ ప్రభూ! ఆనాడు వసుదేవుడు నిన్ను తీసికొని గోకులమునకు పోవుచుండగా ఆదిశేషుడు తన వేయి పడగల నెత్తి వర్షపు జల్లు నీపై పడకుండ ఆపుజేసెను. అట్లే పెంజీకట్లు కమ్మినపుడు దారి కనిపించకుండా పోగా ఆయన తలపై నున్న నాగమణుల కాంతిలో దారి చక్కగా కనబడెను. ఈ విధముగా నిన్ను శిరస్సుపైన నుంచికొని నందుని గృహమునకు వెళ్ళి నిన్ను అక్కడ చేర్చిన ఆ యదుకుల శ్రేష్ఠుడు ధన్యుడైనాడు. అటువంటి దేవదేవుడవైన ఓ గురువాయూరప్ప! నాపై దయయుంచి నా వ్యాధిని కడతేర్చుము. నేను దీక్ష వహించి తెలుగు పద్యరూపంలో విష్ణుగాధను చెప్పుచున్నాను. దాని నాలకింపుము తండ్రీ!



## 3. వసుదేవుడు యోగమాయను మధురకు జేర్చుట

సీ॥ యదుకుల విభుడైన ఆ వసుదేవుండు
నిను గొనిపోయెను తన శిరసున
నింగిని తాకు తరంగంబులెగయుచు
కాళింది నది నాడు కాననయ్యె
అంతటి జలరాశి అత్యంత శాంతయై
మాయగా నొకసారి మారిపోయె
లోతు మోకాటిదై లొంగిపారెను నది
ఎంత అద్భుతమయ్య ఇందిరేశ!

తే॥ భక్తుడైన నారాయణ భట్టతిరులు
సంస్కృతింప భాగవతపు సారమెల్ల
తెలుగు పద్యంబు జెప్పితి దీక్షబూని
వినుము శ్రీ గురువాయూరు విష్ణుదేవ!



తా॥ యాదవుల నాయకుడైన ఆ వసుదేవుడు నిన్ను తన తలపైన యుంచుకొని ముందుకు సాగెను. కాళిందీనది ఆకాశమునంటుచున్నట్లు ఎగిసిపడెను. నీటి తరంగములతో ప్రవహించుచు కనుపించెను. అనంతమైన ఆ జలరాశి కూడా ఇంద్రజాలమునకు లోనైనట్లుగా ఒక్కసారి మోకాటిలోతు కాలువగా ప్రవహించెను. ఓ ఇందిరా రమణ! ఎంత అద్భుతమయ్యా!
భక్తుడైన నారాయణ భట్టతిరులు సంస్కృత భాషలో సంక్షిప్తముగా జెప్పిన భాగవత గాధను నేను తెలుగు పద్యముగ దీక్షబూని చెప్పుచుంటిని. ఓగురువాయూరప్ప! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!

3/2

**సీ॥ వసుదేవుడానాడు పరమాత్మ! నినుగొని**
**నందగోపుని గృహమందు జేరె**
**గోకులంబంతయు లేక నొంటిని సోయి**
**నిదురించుచుండెను ఆదమరచి**
**బాలిక యొక్కతె విలపించుచుండెను**
**ఆ యశోదకు బుట్టినట్టి పాప**
**ద్వారములన్నియు తెరచియే యుండెనా**
**ఇంటిలో జేరెను ఎదురు లేక**

**తే॥ ఆ యశోద పాన్పున నిన్ను అమరజేసె**
**ఆమె మాయ బాలిక గొని అతడు వెడెలె**
**మధుర జేరుటకా యోగమాయ తోటి**
**వినుము శ్రీ గురువాయూరు విష్ణుదేవ!**



తా॥ పరమాత్ముడవైన ఓ శ్రీమన్నారాయణా! ఆ రాత్రివేళ వసుదేవుడు నీతో నందగోపుని గృహమున జేరెను. గోపాలురు, గోపికలు అందరు మేనులపై స్పృహలేక నిదురించుచుండిరి. ఆ యశోదా దేవి (నందుని భార్య) కి పుట్టిన బాలిక మాత్రమే మెల్లగా రోదించుచుండెను. ఆమెయే యోగమాయ. ద్వారములన్నియు తెరచియే యుండెను. ఆయన అడ్డుకొనువారు లేక నందుని ఇంటిలోనికి ప్రవేశించెను. నిన్ను ఆ యశోద పాన్పుపై పరుండజేసి, ఆమె ప్రసవించిన బాలికను ఆ శయ్యపై నుంచి తన చేతులలోనికి తీసికొని మధురానగరి దారిని బట్టెను.
ఓ గురువాయూరప్ప! ఈ విష్ణుగాథ నాలకింపుము తండ్రీ!



3/3

**తే॥ అంత నీ సోదరేడ్పును యాలకించి**
**భటులు నిద్రమేల్కొని పోయి పరుగులెత్తి**
**వేగముగ కంసునకు వార్త విన్నవించ**
**తనదు కేశపాశము ఊడి తత్తరంది**
**అమిత వేగాన జేరెను, అతని చెల్లి**
**సుత నసంతుష్టుడై తాను చూచెనంత**
**తెలుగు పద్యంబులో నేను తెలుపుచుంటి**
**వినుము శ్రీగురువాయూరు విష్ణుదేవ!**

తా॥ ఓ ప్రభూ! అంతట నీ సోదరియైన యోగమాయ ఏడ్పును విని వెంటనే రక్షక భటులు నిద్రమేల్కొని పరుగు పరుగున కంసుని వద్దకు బోయి ఈ విషయము నెరింగించిరి. అప్పుడు కంసుడు తత్తరపాటుతో తన వెంట్రుకలు చిందర వందర అయిపోగా మిక్కిలి వేగముగా కారాగారము జేరి తనచెల్లెలు ప్రసవించినది ఆడపిల్ల అని చూచి ఒక్కసారిగా అసంతృప్తుడయ్యెను. ఓగురువాయూరప్ప! ఈ విష్ణుని గాథనాలకింపుము తండ్రీ!



3/4

**చం॥**
**జలజము నొక్కదాని కరి చయ్యన లాగినయట్లు బాలికన్**
**బలిమిని తల్లినుండి గొని భ్రష్టుడు కంసుడు మానసంబునన్**
**తలచెను "నిక్కమీ శిశువు తానగు విష్ణుని మాయరూపమే"**
**శిలయొక దానిపై విసరి, శీఘ్రమె గొట్టెను, దేవ! నా మదిన్**
**నిలు గురువాయు పట్టణపు నీరజనాభ! మదీయ ప్రార్థనల్**

తా॥ ఓ దేవా! సరస్సునున్న ఒక పద్మమును ఏనుగు చటుక్కున లాగి వేసినట్లు చెల్లెలు దేవకీ దేవి చేతులలో నుండి ఆ బాలికను లాగికొని, దుర్మార్గుడైన ఆ కంసుడు ఇట్లాలోచించెను. ''నిశ్చయముగ ఈ శిశువు శ్రీ మహావిష్ణుని మాయయే రూపము దాల్చి ఉండవచ్చును. "వెంటనే ఒక బండరాతిపై నీ చెల్లెలైన ఆ యోగమాయను విసిరి కొట్టెను. ఓగురువాయూరప్ప! నా ప్రార్ధ నాలకింపుము. పద్మనాభుండ వైన శ్రీమన్నారాయణుని దివ్యగాథల నాలకింపుము.

3/5

చం॥

నిను శరణన్న భక్తులను నిక్కము మృత్యువు తాకదెన్నడున్
తను పసికూన జారినది దానవు బోలిన కంసుచేతులన్
ఎనిమిది హస్తముల్ కలుగు ఈశ్వరియైనది ఆయుధాలతో
కనుగొన ఆకసంబునకు గ్రక్కున జేరెను హూంకరించుచున్
విను గురువాయు పట్టణపు, విష్ణుని గాధను హే జగద్విభో!

తా॥ ఓదేవా! నిన్ను శరణని కొలిచిన నీ భక్తులు నిశ్చయంముగా మృత్యుపాశము నుంచి తప్పించుకొంటారు. (అందుచే) ఆ పసిపాప ఆ రాక్షసుడైన కంసుని చేతులనుండి తప్పించుకొని, ఉన్నట్లుండి ఆకాశమునకు జేరి ఎనిమిది చేతులున్న దేవీ రూపమున ఎనిమిది ఆయుధములతో విరాజిల్లి గర్జించినది. ఓ గురువాయూరప్ప! కొంగ్రొత్త విధానమున చెప్పిన ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!



3/6

సీ॥ "పరమ దుర్మార్గుడ! పాపి! కంసా! నన్ను
చావగొట్టిన, ఏమి సంభవించు?
నిన్ను జంపెడివాడు యున్నాడు ఒకచోట
ఎక్కడనున్నాడొ ఎరుగలేవు
నీ భవితంబేమొ నీవె యోచింపుము"
ఇవ్విధి నీచెల్లి హెచ్చరించె
దేవి అదృశ్యమై దేవతల్ నుతియించ
పెక్కు క్షేత్రంబులన్ వెలసెనామె

తే॥ భక్తుడైన నారాయణ భట్టతిరులు
సంస్కృతింప బాగవతపు సారమెల్ల
తెలుగు పద్యంబులో నేను తెలుపుచుంటి
వినుము శ్రీ గురువాయూరు విష్ణుదేవ!



తా॥ "పరమ దుర్మార్గుడవైన పాపీ! కంసా! నన్ను చావగొట్టిన నీకేమి (ప్రయోజనము) సంభవించును? నిన్ను సంహరించెడి వాడు పుట్టి ఎక్కడో ఒకచోట పెరుగుచున్నాడు. నీ భవిష్యత్తేమిటో నీవే ఆలోచించుకో" అని నీ చెల్లెలైన యోగమాయ కంసుని హెచ్చరించినది. ఆ తరువాత ఆ దేవి భూలోకంలో అనేక దివ్యక్షేత్రములలో దేవీ రూపమున వెలసినది.

మహాభక్తుడైన నారాయణ భట్టతిరులు, సంస్కృత భాషలో సంక్షిప్త భాగవతమును రచించిరి. నేను దానినే తెలుగు పద్యముగా చెప్పుచున్నాను. ఓగురువాయూరప్ప! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!



3/7

చం॥ తెలతెలవారుచుండగనె ధీరత వోయిన
కంసుడందరిన్
పిలిచెను, పూతనాదులకు ప్రేరణజేసెను
నిన్ను జంపగా
బలికెను వీడరాదనుచు పాపడి నొక్కని,
హే ముకుంద! నే
తెలిపెద నిర్దయుండొకడు తేకొని జేయని
పాపముండునా
ఇల? గురువాయు పట్టణపు ఈ హరిగాధను
ఆలకింపుమా.

తా॥ ఓ ప్రభూ! తెల్లవారిన తరువాత (ధైర్యం కోల్పోయిన) కంసుడు తన పరివారాన్నందరిని పిలిచాడు. పూతన మొదలైన (గర్విష్ఠులైన రాక్షసులకు) జరిగింది చెప్పి ప్రేరేపించి నిన్ను సంహరించమని పలికాడు. చంటి పిల్లలని సంహరించమని ఒక్కనికూడ వీడరాదని హెచ్చరించెను. (వారందరూ లోకమంతా వెదకుచు తిరుగ సాగిరి. స్వామీ! నేను తెలిపేదేమంటే దయారహితుడు చేయని అకృత్యము, పాపము, ఈ భువిలో ఉంటుందా? ఓగురువాయూరప్ప! ఈ విష్ణుగాధను నేను చెప్పగా ఆలకించుము తండ్రీ!



3/8

**తే॥ నందగోపుని ఇంట ఆనందమొలక**
**గుక్కపట్టేడ్చితివి నీవు ఒక్కసారి**
**గోపస్త్రీలంత మేల్కాంచి గోకులమున**
**కానుపయ్యె యశోదకు అని తెలిపిరి**
**కొడుకు పుట్టెనుగా నందగోపునింట**
**పొంగిపోయెను గోకుల ప్రాంగణములు**
**ఏమి వర్ణింతు? సాధ్యమా! హే ముకుంద!**
**వినుము శ్రీ గురువాయూరు విష్ణుదేవ!**

తా॥ ఓ ముకుందా! నందగోపుని ఇంట ఆనందమొలుకు రీతిని నీవు అతని భార్య యశోద ప్రక్కలో ఒక్కసారి గుక్కపట్టి ఏడ్చి (కాళ్ళు ఆడించావు). అప్పుడు గోపస్త్రీలు మేల్కొని చూచి యశోదకు కానుపయిందని గోకులమున నందగోపునికి కొడుకు పుట్టాడని ప్రకటించారు. గోకులమంతా సంతోషంతో పొంగిపోయింది. ఓగురువాయూరప్ప! ఈ విష్ణుగాధ నాలకింపుము తండ్రీ!



3/9

**సీ॥ ఆ యశోదా దేవి అతి సమీపము నుండి**
**నిను జూచినది స్వామి! తనివిదీర**
**నల్లకలువ మొగ్గ నందగోపుని బిడ్డ**
**అమృతంబు వంటి నీ అందమంత**
**చూపులతో నామె జుర్రుకొన్నది ప్రభూ!**
**స్తన్యంబు నిచ్చెను తాను మురిసి**
**పుత్రుని దేహంబు పుణుకుచు మితిలేని**
**ఆనందమొందెను ఆ యశోధ**

**తే॥ ఆమె భాగ్యమే భాగ్యము అంతకన్న**
**ఎవరి కబ్బును అదృష్టమీ జగతిని**
**తెలుగు పద్యంబు జెప్పెద దీక్షితుడను**
**వినుము శ్రీ గురువాయూరు విష్ణుదేవ!**



తా॥ ఓ ప్రభూ! ఆ యశోదా దేవి అప్పుడు నల్ల కలువమొగ్గవలె అతి మనోహరంగా నున్న నిన్ను అతి దగ్గరగా చూచి సంతోషముతో పరవశ యైనది. నందగోపుని బిడ్డవైన నీ సౌందర్యామృతం ఆమె కన్నులనెడి దోసిళ్ళతో జుర్రుకొన్నది. వెంటనే తను ఆనందంతో ఆ శిశువుకు స్తన్యమిచ్చినది. ఆమె అందమైన చిన్నారి పుత్రుని దేహాన్ని అంతులేని ఆనందంతో పుణికింది. నిజముగా ఆ యశోదాదేవి భాగ్యమే భాగ్యము. అటువంటి అదృష్టం ప్రపంచంలో ఎవ్వరికి దొరుకుతుంది? నేను దీక్ష వహించిన వాడనగుటచే ఈ విష్ణుగాధను తెలుగు పద్యం రూపంలో చెబుతున్నాను. ఓగురువాయూరప్ప! నువ్వు ఆలకింపుము తండ్రీ!

3/10

సీ॥ **ముల్లోకములకును ఎల్ల శుభములిచ్చి**
**పరమాత్మ! గావుము పాహి! పాహి!**
**ఆ నందగోపుడు ఆనందముప్పొంగ**
**బ్రాహ్మణులకు నిచ్చె బహుమతులను**
**మితిలేని దానాలు ఆతండు జేసెను**
**ఆశీస్సులందెను అవని సురుల**
**గోపాలురందరున్ గొనకొని శుభములౌ**
**కార్యంబులన్ పెక్కు గరపినారు**

తే॥ **కృష్ణ! గోపాల! నన్నింక కృపను జూపి**
**నాదు రోగంబు పోద్రోలు నయము గూర్పు**
**తెలుగు పద్యంబు జెప్పెద దీక్షబూని**
**వినుము శ్రీ గురువాయూరు విష్ణుదేవ!**



తా॥ ముల్లోకములకును మంగళములు ప్రసాదించెడి పరమాత్మా! ఆ సమయంలో పరమానంద భరితుడైన నందగోపుడు బ్రాహ్మణులకు ఎన్నియో దానధర్మములను అమితంగా చేశాడు. విప్రులకు తన సర్వస్వమిచ్చాడతడు. వారి ఆశీర్వాదములను పొందాడు. తక్కిన గోపాలురందరూ శుభప్రదమైన కార్యములెన్నో ఆచరించారు. కృష్ణా! గోపాలా నన్ను కరుణించు. నా యొక్క వ్యాధిని నిర్మూలింపుము. దీక్ష వహించి ఈ విష్ణుగాధను తెలుగు పద్య రూపంలో చెబుతున్నాను. ఓగురువాయూరప్ప! దీని నాలకింపుము తండ్రీ!



## 4. పూతన వధ

చం॥
**అనుపమ సద్గుణా భరణుడైన సుశీలుడు నందగోపుడున్**
**చనె మధురాపురంబునకు స్వామిగ కప్పముగట్ట కంసుకున్**
**తన ప్రియనేస్తమున్ కలిసి దారుణమౌ ఖలుదుష్ట యోచనల్**
**వినుమని దేవకీ పతియు విన్నపమట్లుగ జెప్పెనో ప్రభూ!**
**విను గురువాయు పట్టణపు విష్ణుని గాధను నందనందనా!**

తా॥ నందనందనుడైన ఓ ప్రభూ! సద్గుణములే ఆభరణములైన నందగోపుడు (ఒకనాడు) తన యజమానియైన కంసునికి (సంవత్సరిక) కప్పము కట్టుటకు మధురానగరమునకేతెంచెను. తన ప్రియమిత్రుడైన నందునితో దేవకీ దేవి భర్తయైన వసుదేవుడు కలిసికొని దుర్మార్గుడైన కంసుని దారుణమైన దురాలోచనలు వినవలసినదిగ విన్నవించెను. ఓ గురువాయూరప్ప! ఈ విష్ణుగాధను కొంగ్రొత్త విధమున ఆలకింపుము తండ్రీ!



4/2

ఉ॥
**"నంద! ముదంబు ముప్పిరిలె నాకు సుపుత్రుడు పుట్టినట్లు, ఆ**
**నందము మిత్రమా! కలిగె" నందునితో వసుదేవుడట్లనెన్,**
**ముందుగ నీవు నందునికి ముద్దుల బిడ్డను రీతి బల్కుచున్**
**నందుడు తండ్రి కాడనెడి నగ్నపు సత్యము గోప్యముంచె తాన్**

తా॥ "మిత్రమా! నందుడా! (నీకు పుత్రుడు పుట్టిన వార్తను విని) నాకు సుపుత్రుడు పుట్టినట్లు అమితానందం పెల్లుబికినది" అని వసుదేవుడు నందునితో ఆ విధముగా చెప్పెను. నీవు నందగోపునికే ముందు జన్మించినట్లు, వసుదేవుడు పలికెను. అతను నందగోపుడు నీ తండ్రికాడను నగ్నసత్యమును తాను గోప్యముగా నుంచెను. లక్ష్మీవల్లభుడవైన ఓగురువాయూరప్ప! దేవా! ఈ విష్ణుగాధ నాలకింపుము తండ్రీ!

4/3

**తే॥ "అక్కడక్కడ గోకులమందు నాకు**
**దుర్నిమిత్తంబు లెన్నియో తోచుచుండె**
**గోకులమునకు మరలుట నీకు మేలు"**
**తాను వసుదేవుని హితవు తలను దాల్చి**
**నీకు ఆపద శంకించి నిముషమైన**
**జాగు చేయక నందుడు స్వామి! మరలె,**
**తెలుగు పద్యంబులో నేను తెలుపు చుంటి**
**వినుము శ్రీ గురువాయూరు విష్ణుదేవ!**

తా॥ "ఓ మిత్రమా! నందగోపా! నీ గోకులమున అక్కడక్కడ నాకు అనేక దుర్నిమిత్తములు కానవచ్చుచున్నవి. కావున వెంటనే నీ గోకులమునకు మరలిపొమ్ము అదే నీకు మంచిది" అని వసుదేవుడు నందునికి హితవు చెప్పగా వాని మాటలు మన్నించి పసిబాలుడవైన నీకే ఆపద కలుగునో అను శంకతో వెంటనే గోకులమునకు నందుడు మరలిపోయెను. ఓ గురువాయూరప్ప! తెలుగు పద్యంలో నేను తెలిపే ఈ విష్ణుగాథను ఆలకింపుము తండ్రీ!



4/4

**కం॥ విరిబోణి సుందరాంగికి**
**కురులున్ తుమ్మెదల బోలె, గోకులమునకున్**
**అరుదెంచె 'కపట బాలక!'**
**గురువాయూరప్ప! వినుము కోరి భజింతున్**

తా॥ ఓ కపటబాలకా! అప్పుడు ఆ గోకులమున (కదలుచున్న) తుమ్మెదలవంటి ముంగురులు కల ఒక సుందరమైన యువతి నీ దగ్గరకు అరుదెంచెను. గురువాయూరు దేవా! నేను అనురాగముతో భజించెదను. ఈ గాథనాలకింపుము.



4/5

**ఆ॥ పూతన యను అసురి 'పూనిక' నేతెంచి**
**గోపస్త్రీలు ఆమె గూడినారు**
**"మీరలెవ్వర"నిరి గురువాయు పురనాథ!**
**ఎంతొ ప్రేమ నిన్ను ఎత్తికొనెను.**

తా॥ కావాలని చిన్ని పాపలందరిని చంపుచున్న ఆ రాక్షసి పేరు పూతన. ఆమె గోకులమునకు వచ్చింది. అతి సుందరంగానున్న ఆ స్త్రీని జూచి గోపికలందరు ఆమె ఎవ్వరని ఆమె చుట్టూ మూగారు. ఓగురువాయూరప్ప! అందాల పాపవైన నిన్ను ఆమె ఎంతో ప్రేమ నటిస్తూ ఎత్తుకొనెను.



4/6

**తే॥ స్వామి! ఆ సుందరి లలిత భావములకు**
**ఆమె హొయలకు ముగ్ధులై అచటి స్త్రీలు**
**అడ్డగింపరు పూతన నందుచేత**
**నీవు వున్నట్టి సౌధంబు నెలత చేరి**
**స్తన్యమును త్రాప అందించి తల్లి వోలె**
**మాయ రూపుడవైన నీకీయబోయె**
**తెలుగు పద్యంబులో నేను తెలుపుచుంటి**
**వినుము శ్రీ గురువాయూరు! విష్ణుదేవ!**

తా॥ స్వామీ! ఆ సుందర స్త్రీ యొక్క లలిత భావములకు, ఆమె హొయలకు ముగ్ధులైన గోపికలు ఆ పూతనచే ఆకర్షింపబడి ఆమెను అడ్డుకొనకుండిరి. ఆమె నువ్వు వున్న సౌదంబున ప్రవేశించి నిన్ను ముద్దు చేయుచు మాయలమారివైన నీకు స్తన్యము త్రాపించుటకు ప్రయత్నించెను. నేను తెలుగు పద్యం వలె తెలుపుచున్న ఈ గాథను ఓ గురువాయూరప్ప! నీవు ఆలకింపుము తండ్రీ!

4/7

ఉ॥

**పూతన చంటి పాపలను పూనిక జంపుటచేత క్రోధివై**
**పాతకి చేర్చగా ఒడిని పాపడివై నువు శంకలేక యా**
**పూతన స్తన్యమున్ విషములూరెడి దానిని, పీల్చినాడవే**
**చూతఫలంబు కైవడిని చూచునుండగ, హే జగద్విభో!**
**నాతరమౌనె చెప్పుటకు నాగురువాయుపురీశు లీలలన్**

తా॥ ఓ జగన్నాధా! పూతన చంటి పిల్లలను కావాలని చంపుట చేత నీవు మిక్కిలి కోపము కలిగినవాడవై ఆ పాతకి నిన్ను ఒడిలోకి తీసికొనగానే చిన్నారి పాపాయివలె ఏ మాత్రము శంకలేక మహావిషపూరితమైన ఆమె స్తనమును మామిడిపండును వలె చూస్తుండగానే పీల్చినావు. నా గురువాయూరు దేవా! నీలీలలు వర్ణించుట నాతరమా.



4/8

**తే॥ స్వామి! నీవు పూతన విషస్తన్యమపుడు**
**పీల్చి ప్రాణాలు హరియించ, పిడుగువంటి**
**శబ్దమును జేసి తాను రాక్షసిగ మారి**
**పడెను భూమిపై చేతులు బారుచాచి**
**తెలుగు పద్యంబు జెప్పెద దీక్షితుడను**
**వినుము శ్రీ గురువాయూరు విష్ణుదేవ!**

తా॥ స్వామీ! నీవు పూతన స్తన్యమును దాని ప్రాణములతో పాటు పీల్చగా పూతన పిడుగు పాటున మేఘ గర్జనవంటి శబ్దము (ఆర్తనాదము) చేయుచు తన రాక్షసి రూపమును ధరించి రెండు చేతులు చాచి భూమిపై పడెను. ఓ గురువాయూరప్ప! ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!



4/9

ఉ॥

**గోకులమందు గోవులును గోపికలున్ భయభ్రాంతులైరిఆ**
**కేకల నాలకించి తిలకించిరి రక్కసి కొండవంటి ఆ**
**భీకర రూపమున్ పిదప పీల్చిన చన్గవపైన ఆడు, నిన్**
**ఆకడ జూచి భీతిలుచు అక్కున జేర్చుకొనేరు గోపికల్**
**ఈ కథ నీకు జెప్పుదును హే గురువాయు పురీశ! ధన్యుడన్**

తా॥ నందగోకులమందున్న గోవులును గోపికలను భయంకరమైన ఆ పూతన కేకలను విని, కొండవలెనున్న దాని భీకరమైన రూపము జూచి భయభ్రాంతులైరి. వారు పూతనయొక్క (పీల్చివేసిన) దాని వక్షఃస్థలముపై (కూర్చొని) ఆడుకొనుచున్న నిన్ను వెంటనే భీతినొంది నిన్ను తమ అక్కున చేర్చుకొన్నారు. ఓ గురువాయూరప్పా! ఈ కథ నీకు చెప్పి ధన్యుడనైతిని.



4/10

**తే॥ ముజ్జగాలకు శుభములన్ మోదములను**
**గూర్చు, గురువాయు పురనాధ! గోపికలును**
**మంగళకరమౌ నీ నామ పఠనజేసి**
**రక్ష కట్టిరి నీకు ఆ రమణులెల్ల**
**నాదు రోగము తొలగించి నీదు 'బంటు'**
**చేసికొనుమయ్య గోపాల! చిన్ని కృష్ణ!**

తా॥ ఓ గోపాల! చిన్ని కృష్ణ! ముల్లోకములకు శుభములు, ఆనందములు గూర్చు ఓ గురువాయూరప్ప! ఆ గోపికలు మంగళకరమైన నీ నామమును పఠించుచు నీకు రక్ష కట్టిరి. అట్టి నీవు నా రోగమును తొలగింపుము. నన్ను నీ సేవకుని జేసికొనుము.

## 5. గోపికల ఆనంద హేల

**చం॥**

**విని వసుదేవు బోధనలు వేగిరపాటున నందగోపుడున్ చని తను ఇంటికేగునెడ చచ్చిన పూతన దేహమున్ గనెన్ ఘనమగు వృక్షరాజములు గ్రక్కున కుప్పగ కూలినుగ్గయెన్ కనుక భయావహుండయెను కంజదళాక్షుని రక్షకోరుచున్ వినుగురువాయు పట్టణపు విష్ణునిగాధను హే జగద్విభో!**

తా॥ ఓ జగదీశ్వరా! వసుదేవుని బోధలు విని నంద గోపుడు అతి తొందరగా తన గృహమునకు పోవు సమయమున త్రోవలో ఒకభీకరమైన కళేబరము (పూతన శవము) కనిపించినది. అది క్రిందపడుటచే పెద్ద పెద్ద చెట్లు అనేకము కుప్పకూలి నుగ్గు నుగ్గయినవి. అందుకు నందుడు భయపడి పరమాత్ముడవైన నీ శరణు కోరాడు ఓగురువాయూరప్ప! ఈ విష్ణుగాధను ఆలకింపుము.



5/2

**ఉ॥**

**పూతన గాధనంతయును పూసలు గుచ్చినయట్లు విన్న ఆ చేతలడంగు గోపకులు చెందిరి భీతియు విస్మయంబులన్ పూతన కాయమంతయును ముక్కలు గొడ్డళులెత్తిచేయుచున్ ఆ తనువున్ దహించి రటు అగ్గిని దూరపు కాననంబులన్ ప్రీతిని ఆలకింపు మనవిన్, గురువాయు పురీశ! ధన్యుడన్.**

తా॥ పూసలు గుచ్చినట్లు వివరంగా గోపికలు పూతన కథనంతయు వివరించగానే వినిన ఆ గోపాలురందరికి చేష్టలు ఆగిపోయాయి. ఎంతో భయభ్రాంతులయ్యారు. తరువాత ఆ పూతనయొక్క భయంకరమైన శరీరాన్ని గొడ్డళ్ళతో చిన్న ముక్కలుగా ఖండించి గోకులమున చాలదూరంగా నున్న అడవులలో అగ్నికి ఆహుతి చేశారు. ఓ గురువాయూరు పురీశ్వరా! నీ గాధను నా మనవిని ప్రీతితో ఆలకింపుము. నేను ధన్యుడన్ ప్రభూ!



5/3

**తే॥ నీవు స్తన్యము త్రావ పునీతమైన**
**పూతన శరీరమే కాలి బూదియగుచు**
**నున్నవేళ సువాసనలుర్వి నిండె**
**అగరు ధూపమో! చందనమౌనొ! లేక**
**గుగ్గిలపు ధూపమో! యని గోకులంబు**
**శంకనొందెను, వినిపింతు శౌరిగాధ**
**తెలుగు పద్యంబులో నేను దీక్షబూని,**
**వినుము శ్రీగురువాయూరు విష్ణుదేవ!**

తా॥ ఓ శౌరీ! నీవు స్తన్యము త్రాగుటచే పునీతమైన పూతనయొక్క శరీరము కాలిపోవుచున్నప్పుడు సువాసనతో నిండిన పొగలు అంతటా వ్యాపించెను. ఆ పొగను చూచి గోకులము ఇది అగరు ధూపమా! చందనపు ధూపమా! లేక గుగ్గిలపు ధూపమా! అను శంకకు గురియైనది. శ్రీ గురువాయూరు విష్ణుదేవ! తెలుగు పద్యంగా నేను దీక్షబూని చెప్పు ఈ గాధనాలకింపుము.



5/4

**ఉ॥**

**“నా తను స్పర్శ భాగ్యమున నాణ్యత కల్గును సత్ఫలంబులౌ ఈ తరుణిల్ పునీతలయి ఇంతకుమించిన సౌఖ్య, మోద, వి ఖ్యాతుల గాంతు” రంచుయనినట్లుగ కాలెను దేహ మో ప్రభూ! పూతన పాపముల్ తొలగి యుర్వి సుగంధము నిండె, ఆపయిన్ నాతరమా! వచించుటకు నా గురువాయు పురాధినాయకా!**

తా॥ “నాయొక్క దేహ స్పర్శభాగ్యమున మంచి పుణ్యం కలుగును. ఆపై సత్ఫలితంబులు కలుగును. త్వరలోనే ఆ ఫలితములు కనిపించును, సౌఖ్యము, సంతోషము, పేరు ప్రతిష్టలు కలుగును’ అని నువ్వు గోపికలతో అన్నట్లు ఆ దేహం కాలిపోయింది. ఓప్రభూ! పునీతయైన ఆ పూతన కాలుతున్న దేహం నుంచి సుగంధం వచ్చి నేలపై వ్యాపించింది. నా తండ్రీ! గురువాయూరప్ప! ఇంతకన్న ఏం వర్ణించగలను?

5/5

**సీ॥ బాలపిశాచమౌ పాతకి పూతన**
**చంపనేరక పోయె స్వామినేల?**
**ఎంత విచిత్రంబు! ఈ ఉపద్రవములు**
**ఇట్లౌట వసుదేవుడెట్లు నేర్చె?**
**చెప్పుకొనిరి యంత చిత్రమౌ విషయంబు**
**గోపజనులు తాము కూడినపుడు**
**నీదివ్యవదనంబు ముదమార కాంచంగ**
**తహతహలాడిరి అహరహంబు**

తే॥ భక్తుడైన నారాయణ, భట్టతిరులు
సంస్కృతించ భాగవతపు సారమెల్ల
తెలుగు పద్యంబులో నేను తెలుపుచుంటి
వినుము శ్రీగురువాయూరు విష్ణుదేవ!



తా॥ స్వామి! “బాల పిశాచమైన ఈ పూతన బాలుని చంపలేక పోవుట ఎంతో విచిత్రముగా నున్నది. ఇట్టి ఉపద్రవములు కలుగునని వసుదేవుడు ముందుగానే ఎట్లు తెలిసికొనెను. ఇదిచాల విచిత్రమైన విషయము” అని గోపజనులు ఒకరితోనొకరు చెప్పుకొనుచు నీ దివ్యముఖారవిందము సందర్శింపవలెనని రేబవళ్ళు తహతహలాడిరి.
భక్తుడైన నారాయణ భట్టతిరులు సంస్కృతంలో సంక్షిప్తంగా చెప్పిన భాగవత సారమును నేను తెలుగు పద్యంలో తెలుపుచుంటిని.
ఓగురువాయూరప్పా! ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!



5/6

**చ॥**
**ఘనముగ వాసుదేవ! నువు కాచి వసించుట గోకులంబునన్**
**దినదినమున్ ప్రవృద్ధమయె దీటుగ భాగ్యములన్ని సౌఖ్యముల్**
**చెనకొని మంగళంబులును శ్రేణిని గూడెను వాటినన్నిటిన్**
**అనుభవమంది గోకులమునందున నుండిరి గోపులందరున్**
**వినుగురువాయు పట్టణపు విష్ణునిగాధను హే జగద్విభో!**

తా॥ వాసుదేవా! నీవు నివసించి రక్షించుటచేత గోకులమున భాగ్యములు సమస్త సౌఖ్యములు కలిగి అది దినదిన ప్రవృద్ధిని జెంది ఎన్నియో మంగళములు వరుసగా కూడినవి అని గోకులమున ఉన్నవారంతా అమితమైన ఆనందముననుభవింప సాగిరి. ఓ గురువాయు పురాధినాధా! జగద్విభో! ఈ విష్ణుగాధను ఆలకింపుము ప్రభూ!



5/7

**చ॥**
**అనుపమ సుందరుండు మనకందని నవ్వుల పంట, శ్రద్ధగా**
**వినుమని నీదు లీలలను వింతగు గాథల వోలె జెప్పుచున్**
**పనులు ముగించి వేగిరమె భామలు నీదరి మూక జేరుచున్**
**అనుదిన మాతృతన్ కనుచు నందరు మోదము నొందిరో ప్రభూ!**
**విను గురువాయి పట్టణపు విష్ణుని గాథను నందనందనా!**

తా॥ ఓ ప్రభూ! గోకులమున గొల్లభామలందరూ ఈ చిన్నారి సాటిలేని అందాల మొలక, నవ్వుల పంట అని, శ్రద్ధగా వినమని నీ లీలలను గాథలుగా చెప్పుకొనసాగిరి. తమ ఇంటి పనులు త్వరగా ముగించి నిన్ను చేరి చూచుటకై నీవద్దకు వచ్చుచుండిరి. ఆవిధంగా ప్రతిదినము సంతోషము నొందుచుండిరి. నందనందనా! గురువాయు పురాధీశుని గాధను ఆలకింపుము.

5/8

సీ॥ **చూడుడీ చిన్నారి చూచుచున్నాడులే**
**నను జూచి నవ్వుచున్నాడ" నంచు**
**ఒకరితో నొకరు ఆ ఉవిదలు పలుకుచు**
**చేతులు జాపుచు శిశువు జేరి**
**"కన్నయ్య! రారా బంగారు కొండా!రార**
**నేనెత్తుకొందును నిన్న" నంచు**
**ముద్దుముచ్చట్లాడి మురిపాలదేలుచు**
**కురిపించిరనురాగ ఝరులు తాము**

తే॥ స్వజన గారాల చేతకు మారు కలదె!
హద్దు ఆత్మీయతకు నుండదయ్య స్వామి!
తెలుగు పద్యంబుగా దీని తెలుపుచుంటి
వినుము శ్రీగురువాయూరు విష్ణుదేవ!



తా॥ స్వామీ! గోపికలు ఒకరితో నొకరు "ఈ చిన్నారిని చూడండే, నన్నే చూస్తున్నట్టుంది కదా! నన్ను చూసి నవ్వుతున్నాడే' అని చెప్పుకొనిరి. ఆ పాపడిని చేరి చేతులు జాచి "కన్నయ్యా! బంగారు కొండా! రారా! నిన్ను నేనెత్తుకొంటాను నాన్నా!'' అని ముద్దుముచ్చట్లుతోనూ మురిపాలతోనూ తేలుచూ, అనురాగ ఝరులు కురిపించుచూ ఆనందించిరి. ఆత్మీయుల గారాబమునకు హద్దులుండునా! స్వజనుల అనురాగమునకు అంతుండదు కదా! తెలుగు పద్యంగా నేను తెలుపుచున్నాను. ఓగురువాయూరప్ప! ఈ విష్ణుగాథనాలకింపుము తండ్రీ!



5/9

తే॥ **అమిత, సుకుమార, సుమనోహర మది స్వామి!**
**నీదు మృదువైన దేహంబు నిమర గోరి**
**గోపికలు తహతహలాడి కొలువుదీరి**
**కర కమలముల మధ్య నిన్ మురిసి త్రిప్ప**
**దేవ! కెందామరల యందు తిరుగుచున్న**
**తుమ్మెదై విరాజిల్లితో తోయజాక్ష!**
**తెలుగు పద్యంబులో భట్టతిరుల కృతిని**
**వినుము శ్రీగురువాయూరు విష్ణుదేవ!**

తా॥ స్వామీ! అతి సుకుమారముగా మనోహరముగా నొప్పు నీ మృదువైన శరీరమును నిమురుటకు (స్పృశించు ఆనందమొందుటకు) గోపికలు తహతహలాడుచు ఒకచోట జేరి నిన్ను వారి పద్మముల వంటి చేతులలో తీసికొనుచుండిరి. తోయజాక్షుడవైన ఓ దేవా! అప్పుడు నీవు ఎఱ్ఱటి తామరపూవుల మధ్య తిరుగాడుచున్న తుమ్మెదవలె విరాజిల్లితివి. నారాయణ భట్టతిరుల కృతిని నేను



తెలుగు పద్యంగా చెబుతున్నాను. ఓగురువాయూరప్పా! ఈ విష్ణుగాథను ఆలకింపుము తండ్రీ!

5/10

తే॥ తల్లి అయిన యశోదమ్మ స్తన్యమీయ
నిన్ను ఒడిచేర్చి మురియుచు నిన్ను పుణికి
మధురభావ లహరిలోన పరవశించి
చూచె ఆనందమూర్తి! నీ శోభనంత
నాదు రోగంబు నణగించి ఆదుకొనుము
వినుము శ్రీ గురువాయూరు విష్ణుదేవ!

తా॥ ఓ ఆనందమూర్తీ! నీ తల్లియైన యశోదమ్మ నిన్ను ఒడిని జేర్చి స్తన్యము నిచ్చి అతి సంతోషముతో ముద్దు చేయుచు నీ సుందర ముఖారవిందమును జూచి మధురభావ లహరిలో వోలలాడుచు పరవశించుచుండెడిది. అట్టి ఓ విష్ణుదేవా! నారోగమును తొలగించి నన్ను రక్షింపుము. శ్రీగురువాయూరప్ప! ఈ గాథను ఆలకింపుము తండ్రీ!

## 6. శకటాసురవధ

**చం॥**

**జనని యశోద బాలకుని జన్మదినంబున గోకులంబునన్**
**తన పరివారమున్ హితుల ధాత్రిసురోత్తములందరిన్ గృహం**
**బునకును బిల్చి దీవెనలు బొట్టికి నీయగ జేసె, ఆపయిన్**
**నిను యొక 'బండి' దాపునను నిల్పుచుబోయెను వంటయింటికిన్**
**విను గురువాయు పట్టణపు విష్ణుని గాధను హే జగద్విభో!**

తా॥ ఓ జగదీశ్వరా! ఒకప్పుడు నీ జననియైన యశోదాదేవి నీ జన్మదినమున గోకులమున తన బంధువులను, స్నేహితులను, భూసురులైన బ్రాహ్మణోత్తములను ఆహ్వానించినది. వారిచే పాపాయికి దీవెనలిప్పించినది. ఆ తరువాత ఆ తల్లి నిన్ను ఒక బండి దగ్గర ఉంచి తాను వంటయింటి లోనికి వెళ్ళినది. ప్రభూ! గురువాయూరు పురంలో నున్న ఆ విష్ణుదేవుని గాధను ఆలకింపుము తండ్రీ!



6/2

**తే॥ ఆ యశోదమ్మ నిను గావ సాయమునకు**
**గోప బాలుర నీచెంత 'కాపు' నుంచె**
**వారు కొంతసేపయినాక భయమునొంది**
**ఏడ్చి పెనుకేకలను పెట్టి రెంతొ తడవు**
**పెద్ద ఛటఛటా ధ్వనులతో విరిగియున్న**
**కలపబండి నొక్కటి వారు గాంచినారు**
**వారి కేకలు ఆ ధ్వనిన్ తరుగజేసె**
**వినుము శ్రీగురువాయూరు విష్ణుదేవ!**

తా॥ ఆ యశోదాదేవి నీ సంరక్షణ కొరకు కొంతమంది గోపబాలురను నియోగించింది. కొంతసేపు గడిచాక ఆ బాలురు పెద్దగా ఏడ్చుచు, చాలసేపు ఆర్తనాదములు చేసిరి. పెద్ద ఛటఛటా ధ్వనులతో, అంతవరకు అక్కడనే నిలిచియున్న ఒక కర్రబండి ఉన్నట్లుండి విరిగి ముక్కలైపోయెను. వారి ఆర్తనాదములు ఆ ధ్వనిలో మిళితమై పోయెను. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధను ఆలకింపుము.



6/3

**ఉ॥**

**భీకరమైన యాధ్వనులు విన్న లతాంగులు గోపభామినుల్**
**పాకొని భీతిచే వణకు వక్షములన్ అరచేత నొక్కుచున్**
**ఆకడ జేరి చూచిరట అంతట ముక్కలు చెక్కలౌచు యే**
**కాకృతిగుట్ట మధ్య నువు ఆడుచునుంటివి నందనందనా!**
**ఈ కథనాలకింపుమిక హే గురువాయుపురాధినాయకా!**

తా॥ నందనందనా! భయంకరమైన ఆ శబ్దములను విన్న గోపికాంగనలు భీతిల్లి ఆయాసముతో వగర్చుచు (కంపించెడి వక్షస్థలములను అరచేతులతో నొక్కుకొనుచు) వచ్చిరి. అప్పుడు అన్నిచోట్లా విసిరివేయబడిన ఒక గుట్టలా ఉన్న పెద్ద పెద్ద చెక్కముక్కలను వాటి మధ్య వారికి నువ్వు కనిపించావు. ఓ గురువాయురప్పా! ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!



6/4

**తే॥ "అయ్యయో! పసివానికి ఆయెనేమి?"**
**అనుచు ఆర్తనాదముల నందాది జనులు**
**బ్రాహ్మణోత్తముల్ మున్నగు వారు జేరి**
**కనులు భాష్పపూరితములై చనిరి అటకు**
**తల్లి ఒడిలోన నందనందనుని గాంచి**
**ఊరడిల్లిరి కొంచెము ఊరిజనులు**
**తెలుగులో చెప్పెదను భట్టతిరుల కృతిని**
**వినుము శ్రీగురువాయూరు విష్ణుదేవ!**

తా॥ "అయ్యయో! పసివానికి ఏమైనది? ఏమైంది?" అని ఆర్తనాదములు చేయుచు నందుడు మొదలైన గోపజనులు, బ్రాహ్మణోత్తములు కన్నీరు కార్చుచు అక్కడకు వచ్చిచేరారు. అప్పుడు క్షేమంగా తల్లి యశోదాదేవి ఒడిలో నందనందనుడవైన నిన్ను చూచి కొంత ఊరడిల్లినారు. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!

6/5

ఉ॥

**"అక్కజమాయె! ఏమిటిది? అంతటి బండియు తుక్కుతుక్కయెన్**
**ఎక్కడి చోద్యమీ ఘటన యెందులకాయెను నేర్వమైతిమే!"**
**అక్కడ నున్న గోపకులు అద్భుతమే! యని విస్మయంబునన్**
**ముక్కున వ్రేలువైచికొని మూగగ మారిరి నందనందనా!**
**ఇక్కథనాలకింపుమిక హే గురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ నందనందనా! ఇదేమి ఆశ్చర్యము? అంతటి పెద్దబండి ముక్కలుముక్కలైపోయి తుక్కు తుక్కయింది. దీనికి కారణమేమిటి? ఈ సంఘటన లెందుకు జరుగుతున్నాయి తెలుసుకోలేకపోతున్నాం అనుచు అక్కడయున్న గోపాలురలో ప్రతియొక్కరు మహాశ్చర్యంతో ముక్కున వ్రేలు వేసుకొన్నారు. మాటలు రాక మూగపోయారు. ఓ గురువాయూరప్ప! ఈ కథ నాలకింపుము తండ్రీ!



6/6

చం॥

**తను చనుబాలకేడ్చుచునె తక్కిన బాలురు చూచుచుండగా**
**జనహితుడైన ఆ శిశువు చాచిన కాళ్ళను ఊపి తన్నగా**
**ఘనమగు బండి నేలబడి గ్రక్కున ఆయెను క్రిందమీదగా**
**కనులతొ మేముజూచితిమి కల్లలు కావని చెప్పిరందరున్**
**వినుగురువాయు పట్టణపు విష్ణుని గాథను ఓ జగద్విభో!**

తా॥ ఓ జగత్పతీ! ఈచిన్నారి బాలుడు చనుబాల కొరకు ఏడ్చుచు (తక్కిన బాలురు చూస్తుండగానే) జనముద్దు బాలుడైన ఆకృష్ణయ్య కాళ్ళనటూనిటూ కదల్చుచు కాళ్ళు చాచి తన్నగా అతని కాళ్ళు తగిలి ఘనమైన ఆ బండి తలక్రిందులైనది. ఈ వింతను మేము కనులారా చూచితిమి (అబద్ధంకాదు) అని అందరూ చెప్పిరి. గురువాయూరప్పా! ఈ విష్ణుగాథను ఆలకింపుము, తండ్రీ!



6/7

తే॥ **నీ ప్రభావము నెరుగని నీ స్వజనులు**
**ఈ కథంతయు జూడక ఇటుల అనిరి**
**భీతిజెందిన బాలురు మతులు తప్పి**
**చెప్పు కథలను నమ్మలేమెప్పుడైన;**
**పూతన విషయం బెరిగిన వూరి జనులు**
**నిజము ఈగాథ అని నమ్మి నిలచినారు**
**తెలుగు పద్యంబుగా భట్టతిరులకృతిని**
**వినుము శ్రీగురువాయూరు విష్ణుదేవ!**

తా॥ స్వామీ! నీ ప్రభావము తెలియని నీ గోపజనులు కొందరు ఈ కథనంతా చూడనందున "భయంతో మతిబోయిన గొల్లపిల్లలు చెప్పుకొంటున్న కథల్ని ఎప్పటికీ నమ్మజాలమని" పలికిరి. మరికొందరు పూతన సంఘటన చూచినవారు ఆ అనుభవంతో ఇది నిజముగా జరిగియే యుండుననే నమ్మకంతో నిలిచియుండిరి. నారాయణ భట్టతిరుల కృతి తెలుగు పద్యముల రూపంలో చెబుతున్నాను. ఓగురువాయూరప్ప! ఈ కథను ఆలకింపుము తండ్రీ!



6/8

చం॥

**పగడపు కాంతితో చెలగు బాలుని పాదసరోరుహాలకున్**
**తగిలిన వేమొ దెబ్బలని తామర చేతులు కందిపోయెనో**
**మిగుల గగుర్చు దేహముల ప్రేమగ నిన్ నిమిరేరు గోపికల్**
**తగు గురువాయు పట్టణపు దైవమ! నీ కథనాలకింపుమా**

తా॥ ప్రభూ! "పగడాలవలె ఎఱ్ఱటి కాంతితో నొప్పు కన్నయ్య పాదపద్మములకు దెబ్బలు తగిలినవేమో, అందమైన తామరలవంటి చేతులు కందిపోయినవేమో" అని గోపికలు అధికమైన అనురాగముతో (గగుర్పాటు చెంది) నీ దేహమును ప్రేమగా నిమర సాగిరి. ఓ గురువాయూరు దేవా! నీ కథను ఆలకింపుము తండ్రీ!

6/9

**చం॥**

**"ఘనుడు మురారి దీవెనలు గట్టిగనుండుట బాలకృష్ణుడున్**
**తను కుశలంబు నుండెగద! ధన్యుడనైతిని బాలునీయుడీ"**
**తనువు గగుర్చబాహువుల తానును ఎత్తికొనంగ సిద్ధమై**
**తన హృదయంబుకద్దుకొనె తన్మయుడై నిను నందగోపుడున్**
**విను గురువాయు పట్టణపు విష్ణునిగాథను హే పరాత్పరా!**

తా॥ "జగదీశ్వరుడైన ఆ మురారి కృపాకటాక్షములు బలంగా ఉండుట వలన నేడు మా బాలకృష్ణుడు క్షేమముగా ఉన్నాడు. ధన్యుడను. నా చిన్నారిని ఒకసారి నాకివ్వండి" అని నీతండ్రి నందగోపుడు శరీరమంతయు గగుర్పాటు చెందగా నిన్ను తన చేతులలో ఎత్తుకొని హృదయానికి హత్తుకొని తన్మయత్వం చెందాడు. ఓ గురువాయూరప్ప! ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!



6/10

**తే॥ బండిలో దాగి నిను జంప వచ్చినట్టి**
**అసురునా విధి నవలీల నంతమొంద**
**జేసియుందువు హే ప్రభూ! చిన్ని కృష్ణ**
**శుద్ధ సత్త్వస్వరూపుడౌ సురనుతుండ**
**వైననీయందు లీనమైనందుజేత**
**వాని ఎముకలున్ చూర్ణమై మాయమయ్యె**
**తెలుగు పద్యంబుగా భట్టతిరుల కృతిని**
**వినుము శ్రీగురువాయూరు విష్ణుదేవ!**

తా॥ ఓ ప్రభూ! బండిలో దాగికొనిన రాక్షసుడు ఆవిధముగ నిన్ను చంపప్రయత్నించగా వానిని నీవే అవలీలగా అంతమొందించినట్లున్నావు. ఓ చిన్నికృష్ణా! శుద్ధ సత్త్వస్వరూపుడవై దేవతలచే కీర్తింపబడు నీయందు లీనమైపోవుటచేత ఆ రాక్షసుడు అస్థికలు కూడ చూర్ణమై కనిపించకుండ బోయెను. నారాయణభట్టతిరుల కావ్యాన్ని తెలుగులో చెబుతున్నాను. ఓగురువాయూరప్ప! ఆలకింపుము తండ్రీ!



6/11

**ఉ॥**

**అంతట నందగోపుడును ఆదరమొప్పగ భూసురాళికిన్**
**సంతసమంద కాన్కలిడి సౌఖ్యమునుండగ దీవెనల్ గొనెన్,**
**వింతగు బాల్యచేష్టలతొ ప్రీతిని గొల్పితివయ్య నాపయిన్**
**సుంత దయుంచుమో వరద! జూపుము నీకృప బాపరాద,నా**
**కింతటి రోగబాధనిక హే గురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ గురువాయూరప్ప! అప్పుడు నందగోపుడు, గౌరవ మర్యాదలనందుకొన్న బ్రాహ్మణులకు సంతోషముతో చాల కానుకలిచ్చి ''సౌఖ్యముగానుండ''మని ఆశీస్సులను పొందెను. కృష్ణా! నీవు నీ వింతైన చిలిపి బాల్య చేష్టలచే గోకులమును ప్రీతితో పరవశింప జేసితివి. ప్రభూ! నామీద కరుణతో నీకృపజూపి నా రోగమును నిర్మూలించి నా బాధను తొలగింపుము, తండ్రీ!



## 7. తృణావర్త సంహారము

**సీ॥ జనని యశోదకు స్వామి! నీవొకనాడు**
**స్ఫురియింపజేస్తివి చోద్యమొకటి,**
**'అద్దాలపాపడు' అమిత భారంబాయె**
**ఇదియేమి ఆశ్చర్య మింతి తలచె**
**నిన్నొక పాన్పుపై నిద్రింపగా జేసి**
**విస్మయ భావాల వెలది మునిగి**
**పనిభారమధికమై వంటింట జేరెను**
**పనిలో నిమగ్నమై మఱచె నిన్ను,**

**తే॥ బాలలీలలు చూపావు మఱొకసారి,**
**భట్టతిరుల భాగవతము పద్యకృతిగ**
**తెలుగు జేసితి ధన్యుడన్ దేవదేవ!**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ**

తా॥ ఓ గురువాయూరప్ప! నీవు మఱియొకసారి, నీ బాల్యలీలలను చూపావు. ఆ కథనాలకింపుము. ఒకనాడు నీ తల్లియైన యశోదాదేవికి నీవు మిక్కిలి బరువైపోయినట్లు స్ఫురింపజేశావు అప్పుడు ఆమె "నా చిన్నారి పాపడు ఇంత బరువున్నాడేమిటి?" అని ఆశ్చర్యపడుచు నిన్ను ఒక ప్రక్కపై పరుండబెట్టి ఇంకా ఆశ్చర్యపోతూనే వంటింట్లో తనపనిలో నిమగ్నమైపోయింది. అప్పుడు నీవు నీ బాలలీలలు మఱొక్కసారి చూపావు. ఓ దేవదేవ నారాయణభట్ట తిరుల కృతిని నేను తెలుగు పద్యములో చెబుతున్నాను. ధన్యుడను తండ్రీ!



7/2

**తే॥ అంత చాల దూరమునుండి అమిత భీతి**
**గొలుపు శబ్దంబు వినబడి కలచె మదిని**
**దుమ్ము వ్యాపించి దిక్కులు తోపవాయె**
**భక్త హృదయాల దోచెడి వాడవైన**
**నిన్ను ఆ తృణావర్తుడన్ నిశిచరుండు**
**వచ్చి సుడిగాలిలా గొని పారిపోయె,**
**భట్టతిరుల కావ్యంబును పద్యమందు**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.**

తా॥ స్వామీ! అప్పుడు చాల దూరమునుండి అతి భయంకరమైన శబ్దము వినవచ్చెను. అది మనస్సులను కలత బరచెను. ఇంతలో విపరీతమైన దుమ్ము అన్ని దిక్కులలో వ్యాపించెను. భక్తజన హృదయాలను హరించు శ్రీహరివైన నిన్ను తృణావర్తుడను రాక్షసుడు సుడిగాలి రూపంలో వచ్చి ఎత్తుకొని పారిపోయెను. ఓ గురువాయూరప్ప! నారాయణభట్ట తిరుల కావ్యాన్ని తెలుగు పద్యంగా వినుము దేవా!



7/3

**చం॥**
**ఘనమగు దుమ్మరేగియట కమ్మెను దట్టపు కారుచీకటుల్,**
**కనబడకుండబోయెనిక కన్నులకేమియు గోకులంబునన్**
**"మన చినపాపడేడనుచు" మాత యశోదయు చేరెనాస్థలిన్**
**కనులకు తోపవాయెనిక కంటికి మింటికి ఏడ్చె తల్లియున్**
**విను గురువాయు పట్టణపు విష్ణునిగాథను, నందనందనా!**

తా॥ నందనందనా! చెలరేగిన దుమ్మువలన దట్టమైన కారుచీకట్లు అలముకొని గోకులమున ఎవ్వరికీ ఏమీ కనబడకుండ బోయెను. ఇంతలో నీ జనని యశోదాదేవి మన చిన్నవాడు ఏడి? అని ప్రశ్నించుచు అచటికి వచ్చి నీకేమన్నా అయిందేమోనని కంటికి దారగా రోదిస్తూ అడిగింది. ఓ గురువాయూరప్ప! ఈ విష్ణుగాథను ఆలకింపుము తండ్రీ!



7/4

**తే॥ దనుజుడెంతయో బలశాలియైన గాని**
**ఓప లేకుండె నీభారమో మహాత్మ!**
**అతని వేగము క్షీణించె, ధృతియు తగ్గె,**
**చేష్టలుడిగెను, మితిలేని చింత ఆయె**
**అంత సుడిగాలి హోరునూ అధికమాయె**
**గోకులంబున ఆ తల్లి గోలయంత**
**బాగ వినిపించసాగెను వాసుదేవ!**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ**

తా॥ ఓ మహానుభావా! తృణావర్తుడను ఆ రాక్షసుడు మిక్కిలి బలశాలియై కూడ నీ మహాభారమును మోయలేకపోయెను. తనవేగము క్షీణింపగా అతడు నిస్సత్తువ కలిగి నిశ్చేష్టుడై మిక్కిలి మనోవ్యథ జెందెను. అంతలో సుడిగాలి యొక్క హోరుకూడ అధికమైనది. గోకులంబంతయు ఆ తల్లి ఆక్రందనలు వినిపింపసాగినవి. వాసుదేవుడవైన ఓగురువాయూరప్ప! ఈ విష్ణుగాథనాలకింపుము తండ్రీ!

7/5

సీ॥ ఆ యశోదాదేవి ఆర్తనాదము, యేడ్పు
వినిి నందగోపుండు వేగిరంబె
మీ ఇంటికేతెంచి మిత్రులందరితోటి
విషయంబు గ్రహియించి బెక్కి ఏడ్చె,
సర్వజీవులకును సర్వేశ! ముక్తిప్ర
సాదించు వాడవు స్వామి వీవు
అట్టినిన్ విడనాడి అసురుండు పారిపో
బోయె, వానిని వీడవాయె నీవు,

తే॥ పడె తృణావర్తుడాకాశ పరిధినుండి
భట్టతిరి కృతి సంక్షిప్త భాగవతము
తెలుగు పద్యంబు జేస్తిని దేవదేవ!
వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ



తా॥ ఆ యశోదాదేవి ఆర్తనాదముతో గూడిన ఏడుపును విని నందుడు ఇతర గోపాలురందరితో కలిసి మీ ఇంటికి వచ్చి, విషయమును గ్రహించి వారును రోదించ మొదలిడిరి. సర్వజీవులకు ముక్తిని ప్రసాదించు సర్వేశా! వాటి స్వామివి నువ్వు. అట్టి నిన్ను వదిలించుకొని పాఱిపోబోయిన తృణావర్తుడను ఆ రాక్షసుని విడిచి పెట్టక యుంటివి. అంతట ఆ రాక్షసుడు ఆకాశ మార్గమునుండి క్రిందపడిపోయెను. నారాయణభట్టతిరి కృతి అయిన సంక్షిప్త భాగవతమును తెలుగు పద్యరూపంలో వ్రాయుచున్నాను. ఓ దేవదేవా! శ్రీగురువాయూరులోని విష్ణుదేవుని గాథను ఆలకింపుము తండ్రీ!



7/6

చం॥
మనమున దుఃఖతప్తులగు వారలు నందుడు వాని
మిత్రులున్
కనుగొనినారు భీకరపు కాయమునొక్కటి
పెద్దబండపై
ముని అటువంటి దృశ్యమును మొత్తము
గోకులమందు జూడరే
దనుజుని రొమ్ముపై నువు ముదంబున ఆడుట
చూచిరందరున్
విను గురువాయు పట్టణపు విష్ణుని గాథను,
నందనందనా!

తా॥ ఓ నందనందనా! మనస్సులో దుఃఖాక్రాంతులయిన నందుడు మొదలైన గోపాలురందరికి గోకులమున ఒక పెద్ద బండపై ధృఢముగనున్న ఒక మహా భయంకరమైన దేహము పడిపోవుచుండుట గోచరమైనది. అటువంటి దృశ్యమును వారు ఇంతకు



మునుపు చూచియుండలేదు. పిదప అచట పడియున్న తృణావర్తుడను ఆ రాక్షసుని వక్షస్థలముపై నీవు ఆనందముగా ఆడుకొనుచుండుట గోపకులందరు గమనించిరి. ఓ గురువాయూరప్ప! ఈ విష్ణుగాథను ఆలకింపుము తండ్రీ!

7/7

తే॥ పడెను నింగినుండొక పెద్ద బండపైన
అసువులను బాసె చిటికెలో నసురుడంత
చితికి నుగ్గాయె కాయము అతనిపైన
నవ్వులొలుకుచు కూర్చొని నల్లనయ్య!
లేత తామర హస్తాల లీలవోలె
కొట్టుచుంటివి; జూపట్టి కొండపైన
నీలమణి వలె నందుడు నిన్నుజూడ
వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.

తా॥ ఓ గురువాయూరప్ప! ఆకాశమునుండి పెద్దబండపై పడి, ప్రాణములను పోగొట్టుకొన్న ఆ తృణావర్తుడను రాక్షసుని మహాకాయము చితికి నుగ్గయిపోయినది.

అంతట ఆ రాక్షసునిపై నీవు కూర్చొని నవ్వుచూ, కమలములవంటి నీ హస్తముతో లీలగా కొట్టుచుంటివి. అప్పుడు కొండపై భాసిల్లుచున్న నీలమణివలె నందుడు మొదలైన వారికి కనిపించితివి. ఓ దేవా! ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!

7/8

**సీ॥ నందాది గోపులానందంబుతో నిన్ను**
**అందరు యెదలకు హత్తుకొనిరి,**
**ముద్దాడుచుండిరి మోహనాకార! నిన్**
**గోపికలందరు గుంపుజేరి**
**ఆతృతహెచ్చిన అతివలు నిన్నెత్తి**
**కొన సిద్ధపడిరి ఆ గోకులమున**
**కరకమలంబులన్ వారివైపున నీవు**
**జాపుచుంటివి ప్రభూ! జనులు మురియ**



**తే॥ అట్టి నీకు వందనములు ఆదిదేవ!**
**భట్టతిరులు చెప్పినయట్టి భాగవతము**
**తెలుగు పద్యంబుగా నేడు తెలుపుచుంటి**
**వినుము గురుమరుత్పురనాధ! విష్ణుగాధ**

తా॥ నందుడు మొదలైన గోపకులలో పెద్దలంతా ఒక్కొక్కరు వరుసగ నిన్ను తమహృదయములకు హత్తుకొని ముద్దులాడిరి. ఆ తరువాత గోపికలు కూడ నిన్ను ఆతురతతొ తమచేతులలోనికి తీసికొనుటకు సిద్ధపడుచుండిరి. నీవును నీ కరకమలములను వారివైపు చాచుచుంటివి. అట్టి నీకు నమస్కారములు చేయుదును. నారాయణ భట్టతిరులు రచించిన సంక్షిప్త భాగవతమును నేడు తెలుగుపద్యంగా తెలుపుచున్నాను. ఓగురువాయూరప్పు! ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!



7/9

**ఉ॥**
**అంతట నందదంపతులు అచ్యుతు నివ్విధి గొల్చి నారు "మా**
**కింతటి లోకమందునిక యెవ్వరు దిక్కగు లోకరక్షకా!**
**కంతుని తండ్రియౌ హరివి కావగ మాసుతు లేరులేరయా",**
**వింతగ నీకు మ్రొక్కిరట విష్ణుడు జిష్ణుడు నీవె కృష్ణుడన్**
**చింతనలేక పోయెకద! శ్రీగురువాయుపురాధినాయకా!**

తా॥ అప్పుడు నీ తల్లిదండ్రులై యశోదానందులు మొదలైన వారు "ఓ అచ్యుతా! ఇంక మేమేమి చేయగలము? ఈ లోకంలో మాకు దిక్కెవరు? మన్మధుని జనకుడైన ఆ శ్రీహరి దక్కమాబిడ్డను రక్షించుటవలన మా బాధలను పోగొట్టగల వేరు దిక్కులేదు. ఆయనకు మ్రొక్కెదము" అని వింతగా విష్ణుదును, జిష్ణుదును, శ్రీకృష్ణుదును నీవే అనే ఆలోచనే లేక, ఓ గురువాయూరప్పు! వారందరు దేవదేవుడు అయిన నీకు మ్రొక్కిరి.



7/10

**తే॥ స్వామి! ఇట్లు గాలిగ మారి వచ్చినట్టి**
**అసురు నంతబు జేసిన అచ్యుతుడవు**
**నాదు వాతరోగంబును నయము జేయ**
**వేల? నిశ్శేషముగ దేవ! ఏమి జేతు?**
**మాటి మాటికి ప్రార్థింతు, వదలబోకు**
**వినుము గురుమరుత్పురనాధ! విష్ణుగాధ**

తా॥ ఓ గురువాయూరప్పు! స్వామీ! నీవు ఈ విధముగ గాలి రూపమున వచ్చినట్టి రాక్షసుడు తృణావర్తుని నాశనము జేసితివి. ఇకనాకు సంక్రమించిన వాతరోగములను నిశ్శేషముగా ఎందులకు రూపుమావవు? నేనేమి చేయగలను? నిన్నే మాటిమాటికీ ప్రార్థింతును. నన్ను విడనాడకుము. ఓ దేవదేవా! ఈ విష్ణుగాధ నాలకింపుము తండ్రీ!

## 8. శ్రీకృష్ణునకు జాతక కర్మాది సంస్కారములు

సీ॥ కర్మబంధములేని ఘనుడవు నీవయ్య
కర్మసంస్కారముల్ గఱప వచ్చె
మౌనిగర్గుడు తాను వసుదేవు పనుపుపై
మీఇంటికేతెంచె మిమ్ము కలియ
జ్యోతిష్కమున మౌని అతిప్రవీణుండౌట
జాతకర్మంబులన్ జరుపవచ్చె
ఆ మహాత్ముండును అరుదెంచె నొకనాడు
గొల్లపల్లెకు అతి గోప్యముగను

తే॥ సంస్కృతమున భాగవతపు సారమెల్ల
భట్టతిరులు చెప్పిరి రోగ బాధ తొలగ
తెలుగు పద్యంబు జేస్తిని దేవదేవ!
వినుము గురువాయుపురనాథ! విష్ణుగాధ



తా॥ ఓ దేవదేవా! నీకెట్టి కర్మబంధములును లేవు. అయినప్పటికీ వసుదేవుని మాటమన్నించి నీకు జాతకర్మాది సంస్కారములను అతి రహస్యముగా జరిపించుటకు గర్గమహర్షి మీ ఇంటికి విచ్చేసెను. ఆ మహర్షి జ్యోతిష శాస్త్రమున నిష్ణాతుడు. కావుననే ఆ మహాత్ముడు మీ నందవ్రజమును గొల్లపల్లెకేతెంచెను. నారాయణ భట్ట తిరులవారు సంస్కృతములో అతి సంక్షిప్త భాగవతమును తమరోగపీడ తొలగుటకు జెప్పిరి. నేను దానిని తెలుగు పద్యం చేశాను. ఓ గురువాయూరప్ప! ఈ విష్ణుగాధనాలకింపుము.

**8/2**

తే॥ **యాదవుల కులగురువైన యట్టి మౌని**
**గర్గుడేతెంచ తమ ఇంటిగడప యందు**
**నందుడా నందపడి వందనంబు జేసి**
**నీకు జాతకర్మాదుల నెఱపు కోర్కె**
**తెలిపె, చిరునవ్వుతో మౌని పలికెనంత**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాధ**



తా॥ ఓ గురువాయూరప్ప! యాదవుల కులగురువు మునీశ్వరుడు అయిన గర్గమహర్షి తమ ఇంటి గడప త్రొక్కుట జూచి ఆనందం పొందిన నందగోపుడు వందనమాచరించెను. నందునికి గూడా నీకు జాతకర్మాది సంస్కారములను చేయించవలెనను కోర్కె ఉన్నందున ఆ ముని చిరునవ్వుతో తన మనసులోని మాటను చెప్పెను. ఈ విష్ణుగాధనాలకింపుము దేవదేవా!

**8/3**

ఉ॥
"ఈపని గోప్యముంచవలె నెవ్వడు దీనిని నేర్వరాదయా"
ఆ పలుకన్న గర్గునికి అప్పుడు మిమ్ముల అన్నదమ్ములన్
చూపుచు నందుడున్ తలచె "చోద్యము ఇంతటి గోప్యమేలనో!"
తాన్ పులకించు మౌనియును తానొనరించెను జాతకర్మలన్
హే పురుషోత్తమా! వినుము ఈ గురువాయుపురేశు గాధలన్



తా॥ యదువంశ కుల గురువైన గర్గాచార్యుల వారు నందునితో అయ్యా! ఈ పని చాల రహస్యముగా నెరవేర్చవలెను. ఎవ్వరికిని తెలియరాదు అని పలుకగా, నందుడు మీ అన్నదమ్ములిద్దరిని ఆయనకు చూపించెను. నందుడు ఆశ్చర్యంతో ఎందుకింత గోప్యమో అనుకొనెను. పులకించి పోతున్న ఆ ముని మీకు జాతకర్మలు నిర్వహించెను. పురుషోత్తముడవైన ఓ గురువాయూరప్ప! ఈ విష్ణుగాధ నాలకింపుము, తండ్రీ.

**8/4**

చం॥
**ఘనుడగు బాలకుండితడు గాన అనంతుడు వేలనామముల్**
**చెనకని దేని నెంచెదను చెప్పెదనేమని గర్గమౌనియున్**
**అనుకొని తాన్ రహస్యముగ అద్భుత నామము చెప్పెనీ చెవిన్**
**విను గురువాయుపట్టణపు విష్ణుని నామము 'కృష్ణ'యే ప్రభూ!**

తా॥ ఈ బాలుడు చాలగొప్పవాడు. వేలకొలది పేర్లున్న అనంతునివంటివాడు. ఇప్పుడు ఈయనకు నేను ప్రయత్నించి ఏమని నామమును నిశ్చయించను, అని గర్గమహర్షి అనుకొనుచు నీకు తాను రహస్యముగా నీ చెవిలో అద్భుతమైన నామమును ఉచ్చరించెను. ఓ గురువాయూరప్ప! విష్ణునియొక్క ఆ నామము 'కృష్ణ' యే ప్రభూ! ఆ దివ్యమైన నామమును ఆలకింపుము తండ్రీ!

**8/5**

**తే॥ అరయ 'కృషి' ధాతువును కూడి ఆ'ణ' యనెడి**
**ధాతు విచ్చును స్వామి! శబ్దమ్ము 'కృష్ణ'**
**దానినస్తిత్వ మానందమని తెలియుము**
**అట్లె లోకాల పాపమ్ములన్ని నీవు**
**గొనుచు నశియింపజేతువు అనెను మౌని**
**నీకు కృష్ణుడు అను పేరు నిశ్చయించె**
**తెలుగు పద్యంబు జెప్పెద దేవదేవ!**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ**



తా॥ స్వామీ! పరిశీలించగా 'కృషి' అనే ధాతువును కూడినచో 'ణ' అనే ధాతువు 'కృష్ణ' అను శబ్దమునిచ్చును. దానికి అస్తిత్వము, ఆనందము అని అర్ధములు. అదే విధముగా దేవదేవా! లోకాలన్నిటిలోని పాపమును ఆకర్షించి నశింప జేసెడి వాడు అనియు అర్థమున్నది, అని గర్గముని కృష్ణుడు అని పేరు పెట్టెను. ఓ గురువాయూరప్ప! నీ విష్ణుగాధను నేను తెలుగులో చెబుతున్నాను ఆలకింపుము తండ్రీ!

**8/6**

**చం॥**
**ఇతరములైన నామము లనేకము తెల్పన సాధ్యమో ప్రభూ!**
**అతి 'బలశాలి' రాముడని అన్నకు నామమొసంగె గర్గుడున్**
**ప్రతియొక నామమెందులకు వచ్చెనొ తెల్పెను మౌని ఆ సభన్**
**అతడిది తెల్పదాయె ఇతడచ్యుతుడంచని గోప్యముంచె శ్రీ**
**పతి! గురువాయుపట్టణపు పాలకుడీవయ, నందనందనా!**



తా॥ నందనందనా! నీకు ఇంకా ఇతర నామములనేకమున్నవని గర్గాచార్యులు వాని నెరింగించెను. నీ అన్న రాముడు అతి బలశాలియని (బలభద్రుడని) నామమొసంగెను. ఆ నామములలో ప్రతియొక్క దానికి అర్థమును వివరించెను. అయితే ఈ బాలుడు స్వయంగా అచ్యుతుడైన శ్రీమన్నారాయణుడను సత్యమును మాత్రము గోప్యముగా నుంచెను. గురువాయూరప్పవైన నీవే శ్రీపతివి.

**8/7**

**చం॥**
**తెలుపుచు నీ మహాత్మ్యమును తేకొని గర్గుడు వెల్లడించె తాన్**
**కలుగదు దుఃఖమెన్నటికి కానరు మాయను వీనికోరినన్**
**తెలియుడు ఈ మహామహుని ద్వేషి నశించుట నిత్యసత్యమౌ**
**పలికిన గర్గమౌనికట వందనముల్ పలుచేసె నందుడున్**
**ఇల గురువాయు పట్టణపు ఈశ్వర! నీ కథ జెప్పెదన్ ప్రభూ!**



తా॥ ఓ ప్రభూ! గర్గమహర్షి నందగోపునితో నీ మహాత్మ్యమును గురించి చెప్పుచు "నిన్ను కోరుకొన్నవాడు మాయవలన కలుగు దుఃఖములను పొందదు. అట్లే నిన్ను ద్వేషించువాడు నిశ్శేషముగా నశించును. ఇది నిత్యసత్యము" అని పలికిన ఆ మహర్షికి నందుడు వందనమాచరించెను. ఓ గురువాయుపురాధి నాధా! నేనీ ప్రపంచమునకు నీ కథ నెరింగింతును.

**8/8**

**చం॥**
**దనుజుల బట్టిజంపు, నిక తన్మయులై శరణన్న వారికిన్**
**గొనకొని మేటి సద్గతుల గూర్పును, ఈతని కీర్తి చంద్రికల్**
**అనుపమలీల వ్యాప్తిగను అయ్యగ విందువు వానిగాథలన్**
**అని తను జెప్పె నందునకు ఆ వివరంబుల గర్గమౌనియున్**
**విను గురువాయు పట్టణపు విష్ణుని గాధను హే జగద్విభో!**

తా॥ ఇక ఇతడు అనేక రాక్షసులను జయించును. తనను ఆరాధనతో శరణన్నవారికి ఉత్తమమైన సద్గతులనందించును. ఇతని కీర్తిచంద్రికలు నిరుపమానంగా వ్యాప్తిచెందును. ఇతని గురించి అనేక కథలు ప్రచారమగును. వాని తండ్రిగా అవన్నీ నీవు వింటావు అని గర్గమహాముని నీ ప్రభావమును గూర్చి నందునకు చెప్పెను. జగద్విభుడవైన గురువాయూరప్ప! ఈ విష్ణుగాథను ఆలకింపుము, తండ్రీ!

**8/9**

ఉ॥

**"ఈతనిపైన శ్రద్ధయును ఎక్కుడు భక్తిని గల్గియున్నచో**
**తాన్ తొలగించు నాపదలు తప్పక, వీనికి ప్రేమ నీయుడీ"**
**ప్రీతిగ జెప్పె గర్గముని విష్ణుడ వీవని దాచె నిక్కమున్**
**శ్రీతరుణీ విభో! వినుము శ్రీగురువాయు పురీశు గాథలన్**

తా॥ శ్రీనాథుడవైన గురువాయూరప్పా! గర్గాచార్యులిట్లు చెప్పిరి" ఇతనిపై శ్రద్ధభక్తులు కలిగియున్నచో మీకు అన్ని ఆపదలను తప్పకుండ తొలగించును. కావున



ఇతనికి అంతులేని ప్రేమ నీయండి" ఓ ప్రభూ! ఆ మహర్షి నీవే శ్రీమన్నారాయణుడవనే సత్యమును మాత్రం గోప్యముగా నుంచెను.

**8/10**

**తే॥ నీకు జాతకర్మల నిట్లు నిర్వహించి**
**మౌని గర్గుడు తృప్తితో తాను వెడలె**
**గోపవృద్ధులు, నందుడు కూడ నిన్ను**
**పొగడ సాగిరి మనముల ముదము నిండ**
**కరుణతో నాదు రోగంబు పారద్రోలు**
**వినుము గురువాయుపురనాథ విష్ణుగాథ.**

తా॥ ఓ గురువాయూరప్పా! గర్గమహర్షి ఇట్లు మీకు జాతకర్మలు నామకరణము మొదలైన సంస్కారములను చేసి తృప్తిగా మరలిపోయెను. అప్పుడు నందుడు మరియు ఇతర గోపవృద్ధులు కూడ నిన్ను పొగడసాగిరి. అట్టి నీవు కృపజూపి నా రోగమును తొలగింపుము తండ్రీ! ఈ విష్ణుగాథనాలకింపుము.



# 9. శ్రీకృష్ణుని బాల్యక్రీడలు

**సీ॥ బలరాము గూడిన బాలకృష్ణా! నాదు**
**అన్నతో పాకాడుచున్న నీవు**
**నందవ్రజంబున అందరిండ్లకు బోవ**
**కాళ్ళనందియలెల్ల ఘల్లుమనెను**
**వింతగు ఆ ధ్వని విన్న మీరిద్దరు**
**గడపలు దాటిరి కౌతుకమున**
**కాళ్ళనీ విధముగ కదలించి సులువుగా**
**అతివేగమున బోయి రందముగను**

**తే॥ తిరిగి రిల్లిల్లు మీరలు దేవదేవ!**
**గోకులంబున మురిసిరి గోపికలును,**
**తెలుగు పద్యంబుగా నేడు తెలుపుచుంటి**
**వినుము గురువాయు పురనాథ! విష్ణుగాథ.**



తా॥ బలరామునితోనున్న ఓబాలకృష్ణా! నువ్వు నీ అన్నతో కలిసి అంబాడుచున్నప్పుడు (పసిపాపలు మోకాళ్ళపై చేతులతో పాకుటను అంబాడుట అందురు) నంద వ్రజములోనున్న గోపికల ఇండ్లకు పోవుచున్నప్పుడు మీ కాలిమువ్వలు ఘల్లు ఘల్లుమనెడివి. వింతగానున్న ఆ ధ్వనిచే ఆకర్షితులై మీరు మాటమాటికి గడపలు దాటుచుండిరి. ఈ విధముగా మీ కాళ్ళను ఇటునటు కదలించుచు అతి వేగముగ, అందముగ గోకులమునంతట తిరుగుచుండిరి. ఓ దేవదేవా! గోకులమునా విధముగా మురిపించుచుండిరి. తెలుగు పద్యంగా నేడు నీ కథ నాలకింపుము. ఓ గురువాయూరప్పా! నన్ను కరుణింపుము, తండ్రీ!

**9/2**

సీ॥ చిరునవ్వులొలకంగ చిన్ని పలువరుస
కనిపించు ముఖమున కనులవిందె
మృదువైన ముంగురుల్ కదలాడి మోముపై
పడుచుండ వర్ణింప మాటరాదు
పాకాడుచుండంగ పాదంబులెరుపెక్కి
అడుగు భాగంబులు అతిశయించె
భుజముల కడియాలు మోచేతిపై జారి
సమ్మోహపరచెను జనుల నెల్ల

తే॥ సుందరపు రూపు దాల్చిన సోదరులను
చూచువారిదే భాగ్యము శుభప్రదంబు,
తెలుగు పద్యంబు జెప్పెద దేవదేవ!
వినుము గురువాయు పురనాథ! విష్ణుగాథ.



తా॥ ఓ గురువాయూరప్ప! తెలుగు పద్యం రూపంలో ఈ భాగవత గాథను ఆలకింపుము తండ్రీ! మీరిద్దరు చిరునవ్వు నవ్వుచున్నప్పుడు మీ చక్కని చిన్ని పలువరుస కడు మనోహరముగా కనులకు విందు చేయుచుండెను. అల్లలాడుచు మనోహరముగనున్న నీ అందమైన ముంగురులు కదలాడుచుండెను. అంబాడుచున్నపుడు మీ చిన్ని పాదములు ఎఱ్ఱదనముతో వాటి అడుగు భాగము ప్రకాశించుచుండెను. భుజములకున్న కడియములు మోచేతులపై జారి జనులను సమ్మోహన పరచుచుండెను. సుందరమైన మీ రూపములు కనులారా గాంచిన వారిదే భాగ్యము.



**9/3**

సీ॥ వ్రజ వీధులన్ నిన్ను బలరాముతో గూడి
తిలకించినారంత తిరుగుచుండ
అస్పష్ట ధ్వనులతో అతి ముద్దుగా మీరు
పరుగిడుచుండిరి వాసుదేవ!
తల వెనకకు త్రిప్పి కిలకిల నవ్వుచు
చూచుచుండిరి, మిమ్ము జూడ జనులు
వచ్చుచుండిరి వెంట ప్రజలెల్ల మురియుచు
ఆనంద వార్ధిలో మునిగిరంత

తే॥ భక్తులైన నారాయణ భట్టతిరులు
సంస్కృతించ భాగవతపు సారమెల్ల
తెలుగు పద్యంబు జెప్పెద దేవదేవ!
వినుము గురువాయు పురనాథ! విష్ణుగాథ



తా॥ ఓ దేవదేవా! అన్నదమ్ములైన మీరు వ్రజవీధులలో తిరుగుచున్నప్పుడు జనులందరు ఆనందముతో చూచుచుండెడివారు. అప్పుడు మీరు ముద్దుముద్దుగా అస్పష్టమైన ధ్వనులను చేయుచు పరుగిడుచుంటిరి. కిలకిల నవ్వుచుంటిరి. (ఒకానొకప్పుడు) తలలను వెనుకకు త్రిప్పి చూచుచుండిరి. మీ వెంటబడి ఆనందముతో గోకులములోని ప్రజలందరు వచ్చుచుండిరి. అందరూ ఆనంద సాగరములో తేలియాడుచుండిరి. భక్తులైన నారాయణ భట్టతిరులు సంక్షిప్తముగా సంస్కృతములో భాగవతము రచించిరి. ఓ గురువాయూరప్ప! దానిని తెలుగు పద్యాలలో చెబుతున్నాను, ఆలకింపుము తండ్రీ!

**9/4**

**సీ॥ అతి వేగముగ బోయి ఆ వ్రజవీధులన్**
**పడిపోవుచుండిరి పాపలగుట**
**పడిలేచి ముందుకు పయనించుచుండగా**
**బురదతో ఒళ్ళంత మురికి ఆయె**
**దారిలో మునివరుల్ దర్శించి మిమ్మట్లు**
**వందనంబులు సేసిరిందిరేశ!**
**మిముజూచి అప్పుడు మీ తల్లులిద్దరూ**
**మురిసి వాత్సల్యాన ముద్దులిడిరి**

**తే॥ హత్తుకొని గుండెలకు మిమ్ము అతివలపుడు**
**సంతసించిరి మీగాత్ర సౌఖ్యమునకు**
**తెలుగు పద్యంబు జెప్పెద దేవదేవ!**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.**



తా॥ ఓ ఇందిరామనోవల్లభా! ఆ వ్రజమునందలి మార్గములలో మీరు తొందరగా పోవుచు క్రిందపడిపోవుచుండిరి. తిరిగి లేచి మరల ముందుకు పోవుచుండిరి. అప్పుడు మీ శరీరములు బురద అంటుకొని మురికి అయెను. మిమ్ము ఆ విధముగా జూచిన మునీంద్రులు చిరునవ్వుతో మీకు నమస్కరించుచుండిరి. అప్పుడు మీ తల్లులైన రోహిణీ దేవి యశోదాదేవి మిమ్ము అతి వాత్సల్యముతో ముద్దాడుచుండిరి. మిమ్ము తమ హృదయాలకు హత్తుకొని ఆ గాత్ర పరిష్వంగ సుఖమునకు పరవశించుచుండిరి.
ఓ దేవదేవా! తెలుగు పద్యరూపంలో నీగాథను తెలిపెదను. ఓ గురువాయూరప్ప! దీని నాలకింపుము తండ్రీ!



**9/5**

**ఉ॥**
**ఎంతటి ధన్యురాలు! జగదీశునికిచ్చెను స్తన్యమో ప్రభూ!**
**ఇంతి యశోద చేర్చియొడి, ఈవు ముదంబున నవ్వుచుండగా**
**దంతములున్ కనంబడెను తన్మయమొందెను అందమైన యా**
**కాంతిని జూచి ఆ జనని కన్నులు వెల్గెను, ముజ్జగాలలో**
**ఇంతటి భాగ్యమెవ్వరిది? హే గురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ కపట గోపాలబాలా! జగదీశ్వరుడివైన నిన్ను తన ఒడిలో చేర్చుకొని స్తన్యమిచ్చిన ఆ యశోదామాత యెంత ధన్యురాలో కదా! అప్పుడు నీవు సంతోషముతో నవ్వగా నీదంతములు బయటకు కనిపించెను. ఆ సుందరమైన ముఖకాంతిని జూచి ఆ దేవి తన్మయురాలై కనులు వెలిగి ఆనందము పొందెను. ముల్లోకాలలో ఇంతటి మహాద్భాగ్యమెవ్వరికి దక్కుతుంది? ఓ గురువాయూరప్పు! నువ్వే చెప్పవయ్యా నా తండ్రీ!



**9/6**

**సీ॥ కాలంబు గడచెను మెలమెల్లగా నీవు**
**కాళ్ళపైన నడువ గలిగినావు**
**పిల్లలతో గూడి ఇల్లిల్లు తిరిగావు**
**ఆ గోకులంబున ఆడుకొనుచు**
**పిల్లుల, చిలుకల, పిన్న దూడల వెంట**
**పరుగిడుచుండ భవంతులందు**
**గోపాలురందరు కుశలంబుగా నవ్వి**
**వారించుచుండిరి 'వలదు' అనుచు**

**తే॥ పట్టి ఆపుచు భయముతో పరుగులిడుచు**
**అలిసిపోవుచుండెడి వారు ఆ వ్రజమున**
**తెలుగు పద్యంబుగా నేడు దేవదేవ!**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.**

తా॥ ఓ దేవదేవా! కొంత కాలం గడిచాక నీవు నెమ్మదిగా కాళ్ళపై నడచుట ప్రారంభించావు. అప్పుడు గోకులమున నీతోటి పిల్లలతో ఇల్లిల్లూ తిరిగి ఆడుకొన్నావు. బాల్య చాపల్యము ప్రదర్శించుచూ భవనములలోగల చిలుకలను, పిల్లులను, చిన్ని దూడలను మొదలైన వాటి వెంట పరుగిడు చుంటివి. అది చూచి గోపాలకులు నవ్వుకొనుచుండిరి. అయినప్పటికీ వాటికపకారము జరుగునన్న భయముతో నిన్ను పట్టుకొని ఆపుచూ వారు గూడ పరుగులెత్తెడివారు. అందుచేత అలిసిపోయేవారు. నీ లీలలన్ని తెలుగు పద్యంగా చెబుతున్నాను. ఓగురువాయూరప్పా! ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!



9/7

**చం॥**
**బలవరి రామునిన్ కలిసి బాల ముకుందుడు చేరియున్న ఆ స్థలమున గోపికాంగనలు సంతసమందుచు తన్మయంబునన్ తలపక వారి స్వంతపని తక్కువచూచిరి కన్నబిడ్డలన్ కొలిచెడి సేవికాజనుల గూర్చి తలంపరు, నిన్ను జేరనై వెలదులు, ఆలకింపుమిక హే గురువాయు పరీశ! నీకథన్.**

తా॥ ఓ ప్రభూ! బలశాలియైన బలరామునితో గూడిన నీవు చేరిన చోట గోపికలు ఆనందముతో మైమరచి వారి స్వంత ఇంటిపనులు అలక్ష్యం చేసెడివారు. తమ కన్నబిడ్డలను, సేవకులను కూడా పట్టించుకొనకుండిరి. ప్రతిదినము నిన్ను చూచుటకు ఆత్రుత పడుచుండిరి. ఓ గురువాయూరప్పా! నీ కథను ఆలకింపుము తండ్రీ!



9/8

**సీ॥ నవ నవనీతంబు నయముగా నీకీయ**
**పెరుగు చిల్కెదరు గోపీ తరుణులు**
**ఆ వెన్న తినుటకై ఆరాటపడినావు**
**గోపికల్ తినిపించ 'గోరుముద్ద'**
**"ఆడరా కన్నయ్యా! పాడరా ఒకసారి"**
**గారాబు చేసేరు ఆ రమణులు**
**ఆటపాటలతోటి అలరించితివి నీవు**
**ముద్దు జేయగ నిన్ను ముదితలంత**

**తే॥ ప్రేమతో నీయ గొనినావు వెన్న నెయ్యి**
**వేడిపాలను గ్రోలావు వెలదు లీయ**
**బాల లీలలు వర్ణించు భాగ్యమబ్బె**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాధ.**



తా॥ ఓ ప్రభూ! అప్పటికప్పుడు తీసి వెన్ననీయుటకు గోపికలు పెరుగును చిలికెడివారు. ఆ వెన్న తినుటకు నీవు ఆరాట పడుచుంటివి. గోపికలు ముద్దు మురిపెములతో కృష్ణునకు ఘుమఘుమలాడెడి వెన్నను కొసరి తినిపించెడివారు. దానికి ఎంతో ప్రేమగా 'కన్నయ్యా! నీ ఆట ఒకసారి చూపించవూ, ఒక్కసారి పాట పాడవూ' అని బ్రతిమాలుచుండెడివారు. వారిని నీ ఆటపాటలతో అలరించుచుంటివి. అప్పుడు గోపికలు ప్రేమతో నిచ్చెడి వెన్నకాచిన నెయ్యి నారగించుచుంటివి. వారు అందించు వేడి వేడి పాలు త్రాగుచుంటివి. ఓ గురువాయూరప్పా! నీ బాలలీలలు వర్ణించే భాగ్యం నాకు దక్కింది. ధన్యుడిని. ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!

9/9

సీ॥ అలనాడు సురలకై బలిచక్రవర్తిని
చేరి యాచించావు, వేరుమాట!
నేడు ఈ అబలలన్ నేనేల యాచించ
వలెనంచు తలచావ వాసుదేవ!
అందుకే కాబోలు యాచన మానేసి
దొంగాట నేర్చావు తోయజాక్ష!
పాలు, వెన్నలు, నేయి మాత్రమే నా స్త్రీల
మనసులున్ దోచావు అనుదినంబు

తే॥ అతి మనోహరంబయ్యె నీకబ్బినట్టి
చౌర్యలీల ఓ గోవింద! సాధువినుత!
తెలుగు పద్యంబు జెప్పెద దేవదేవ!
వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.



తా॥ ఓ దేవదేవా! పూర్వకాలమున నీవు బలిచక్రవర్తివద్ద యాచించి, ఆ దేవతల కోసం 'భవతి భిక్షాం దధాతు' అన్నావు. అది వేరుమాట. కాని నేడు అబలలైన గోపికలముందు నేనెందుకు చేయిచాపాలి అనుకొన్నావేమో! కాబోలు, 'యాచన' అను లీలను మాని, పాలు, వెన్న, నేయి అనువానితోపాటు గోపికల మనస్సులను గూడ దోచుకొనుటకు పూనుకొనినట్లున్నావు. ఓ గోవిందా! మనోహరముగా నీవు నేర్చుకొన్న ఈ చౌర్యలీల అత్యద్భుతము. నేను తెలుగు పద్యంగా చెప్పే నీ గాథను ఓ గురువాయూరప్ప! ఆలకింపుము తండ్రీ!



9/10

సీ॥ మధురంబు ఓ ప్రభూ! బాల లీలలు చూప
గోకులంబున నాడు గోపికలకు
పెరుగు వెన్నల దోచ తిరిగావు ఇల్లిల్లు
పేరు దక్కెను నీకు 'వెన్నదొంగ'
గోపిక కెవతెకున్ కోపమే రాకుండె,
మనసుల దోచావు మాయజేసి
ఆనంద వార్ధిలో నలరించినావయ్య
దుఃఖమెవ్వతె పొందు సుఖము దక్క

తే॥ నాదు రోగమ్ము నణగించి నయమునిమ్ము
కృష్ణ! శరణన్న వానిపై కృపను జూపు
తెలుగు పద్యంబు జెప్పెద దేవదేవ!
వినుము గురువాయు పురనాథ! విష్ణుగాథ.



తా॥ ఓ దేవదేవా! మధురమైన నీ బాల్య లీలలు ఆనాడు గోకులమున గోపికలకు చూపావు. వాటి భాగముగ పాలు, పెరుగు మొదలైన వానిని అపహరించుకొని పోవుచుండగా ఆ గోపికలలో ఒక్కదానికైన నీపై కోపము కలుగలేదు. పైగా వాటితో పాటు వారి మనస్సులను కూడా దోచుకొనినావు. వారిని ఆనందాబ్ధిలో వోలలాడించినావు. ఇక మాకు దుఃఖమనునది ఏ విధముగా కలుగును? సుఖము మాత్రమే లభించును. శ్రీకృష్ణా! నీ శరణము నర్థించు నన్ను దయచూడుము తండ్రీ! నా రోగమును రూపుమాపుము. ఓ గురువాయూరప్ప! నీ కథను ఆలకింపుము.

## 10. విశ్వరూప దర్శనము

**చం॥**

**తన ఒడి నిన్ను జేర్చికొని తల్లి యశోదొకనాడు స్తన్యమున్**
**పనిచెను నీకు, వెల్లకిల పాలను గ్రోలుచు ఆవులించుచున్**
**అనుపమ లీల జూపితివి ఆమెకు నీముఖమందు విశ్వమున్**
**కనులకు జూపినావు ప్రభు! గ్రక్కున ఆ భ్రమవీడె పిమ్మటన్**
**వినుగురువాయు పట్టణపు విష్ణునిగాథను నందనందనా!**

తా॥ ఓ ప్రభూ! నీవు ఒకనాడు వెల్లకిలా పరుండి నీజనని యశోదవద్ద పాలు త్రావుచు నుంటివి. అప్పుడు నీకు ఆవులింతవచ్చి నోరు తెఱవగా యశోదకు నీముఖమందు (నోటిలో) విశ్వమంతయూ గోచరించినది. వెనువెంటనే ఆమెకు ఆ భ్రమ తొలగి పోవునట్లు చేసితివి. గురువాయూరప్పవైన నందనందనా! ఈ విష్ణుగాథనాలకింపుము తండ్రీ!





**సీ॥ నీతోటి బాలురు నీవును ఆటలో**
**పండ్లు సంపాదించి పంచుకొనగ**
**సమముగా పంచుట జరుగలేదని వారు**
**నిను తప్పుపట్టిరి నిరసనమున**
**అందుచే వారలు అలిగి యశోదతో**
**కొండెముల్ చెప్పిరి గుంపుజేరి**
**"మన కృష్ణుడీనాడు మన్ను తిన్నాడంచు**
**కొండెములను చెప్పుకొనిరి వారు**

తే॥ చేరి ఏమేమొ చాడీలు చెప్పినారు
భట్టతిరి నాడు వ్రాసిన భాగవతము
తెలుగు పద్యంబు జెప్పితి దేవదేవ!
వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.



తా॥ జగన్నాథుడవైన ఓ దేవదేవా! నీవును నీతోటి బాలురును కలిసి ఆటల్లో పండ్లు పంచుకొంటుంటే, తమకు సమపాలు రాలేదని నీ స్నేహితులు నిన్ను తప్పుపట్టిరి. అందువలన వారు నీపై కినుక వహించి యశోద వద్దకు పోయి గుంపుగా కొండెములు చెప్పిరి. "మనకృష్ణుడు మన్ను తినుచున్నాడు. కొంటె పనులు చేయుచున్నాడు" అని నీపై ఏమేమో చాడీలు చెప్పినారు. నారాయణ భట్టతిరి సంస్కృతంలో చెప్పిన భాగవతమును తెలుగు పద్యంగా చెబుతున్నాను. ఓగురువాయూరప్ప! దీనిని ఆలకింపుము తండ్రీ!





**తే॥ పంచభూతాలనన్నిటిన్ ప్రళయమందు**
**కడుపులో దాచుకొని కాచు ఘనుడవీవు,**
**నీ మహాత్మ్యము నెరుగని ఆమె బేల**
**మన్నుతిని అనారోగ్యపు పాలబడుదు,**
**వనుచు భయపడి చాడీల నామె నమ్మి**
**నిన్ను మందలించగ బూనె చిన్నికృష్ణ!**
**తెలుగు పద్యంబులో నేను తెలుపుచుంటి**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.**

తా॥ ఓ చిన్ని కృష్ణా! ప్రళయ కాలమందు నీవు భూమి, నీరు మొదలైన పంచభూతములను నీ కడుపునందు దాచుకొందువు. ఈ నీ మహాత్మ్యము నెరుగని అమాయకురాలైన నీ తల్లి నీవు నిజముగా మన్నుతింటివని నమ్మి, నీవు అనారోగ్యము పాలవుదువను భయముతో నిన్ను మందలించ బోయెను. ఓ గురువాయూరప్ప! తెలుగు పద్య రూపంలో నేను తెలిపే నీకథ నాలకింపుము.

10/4

ఉ॥

**“అల్లరి కృష్ణ! మన్నుతిని అమ్మను తిప్పలు బెట్టబోకురా”**
**తల్లియశోద మాటవిని “టక్కరి నవ్వుల అమ్మ!నమ్ముమనన్,**
**కల్లలు వీరు చెప్పెదరు, కావున ఒట్టును పెట్టి చెప్పెదన్”**
**ఎల్ల జగాలు బొజ్జగల ఈశ్వరుడీవని తెల్వదో ప్రభూ!**
**ఇల్లిదె నీకథన్ వినుము హే గురువాయుపురాధి నాయకా!**

తా॥ “ఓ అల్లరికృష్ణా! మన్నుతిని అమ్మను తిప్పలు పెట్టవలదురా తండ్రీ!” అని తల్లి యశోద విలవిల్లాడింది. అప్పుడు కొంటె నవ్వు లొలికిస్తూ ఇలా అన్నావు “అమ్మా! నన్ను నమ్మవే, ఈ మాటలన్నీ అబద్ధాలే. నేను మన్ను తినలేదు” అని ఆమెను నమ్మబలికినావు. జగములన్నింటినీ బొజ్జలో దాచిన ఈశ్వరుడని ఆమెకు తెలియదు కదా! ప్రభూ! ఇదిగో నీ కథను ఆలకించి గురువాయూరప్పా! నన్ను ధన్యుణ్ణి చేయుము తండ్రీ!



10/5

ఉ॥

**“అన్నయు నీదు మిత్రులును అనృతమాడరు చెప్పరెన్నడున్**
**మన్ను తినెన్ యనంచునిక మాటలవేటికి మన్నునోటిలో**
**నున్నదొ లేదొ చూచెదను ఒప్పుగ నోటిని నాకు జూపుమా”**
**అన్నది గట్టిగా; తెఱచి అబ్జముఖంబున ఆ యశోదకున్**
**చిన్నటి నోరు జూపితివి శ్రీగురువాయు పురాధినాయకా!**

తా॥ ఓ కృష్ణా! నీ అన్న బలరాముడు మరియు నీ మిత్రులును అబద్ధమాడరు. వాళ్ళు నువ్వు మన్ను తిన్నావని ఎందుకంటారు? మాటలెందుకు నీనోటిలో మన్ను ఉన్నదో లేదో చూచెదను నీ నోరు తెఱువుమని యశోదాదేవి గద్దించి నిన్ను అడిగెను. అప్పుడామెకు పద్మమువంటి నీ మొగమున నున్న చిన్ని నోరు చూపుటకు తెఱచినావు కదా! గురువాయూరప్ప!



10/6

ఉ॥

**నీ ముఖమందు నీ జనని నేర్పుగ జూడగ నెంచె క్షిప్తమై**
**ఆమెకు చిన్న మట్టి కతికైనను తోపునొ యంచు, బాపురే!**
**ఏమది అద్భుతంబనగ ఎల్ల జగంబులు పృథ్వితోడుతన్**
**ఆమెకు నోట జూపితివి హద్దులు దోపవు నందనందనా!**
**ఏమని నేను జెప్పెదను హే గురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ నందనందనా! నీ తల్లియైన యశోదాదేవి, నీ నోటిలో చిన్న మట్టిగడ్డయైనా దాగి యుండి కనబడునేమో అని పరీక్షగా చూచినది. అమ్మో! ఎంత అద్భుతం అనునట్లు నీ చిన్ని నోటిలో ఆమెకు హద్దులు కనిపించని సమస్త లోకములు, భూమండలంతో పాటు గోచరమైనది. ఓ గురువాయూరప్ప! ఆ అద్భుత దృశ్యాన్ని నేను ఏమని వర్ణించగలను తండ్రీ!



10/7

సీ॥ **నీనోట గాంచెను నీజనని యశోద**
**ఒకచోట అడవులన్ ఓ మహాత్మ!**
**సరిలేని జలరాశి సంద్రమ్ము నొకచోట**
**గాంచెను నీమాత కనులు చెదర**
**అవధులు లేనట్టి ఆకాశవీధిని**
**ఒకచోట గాంచెను ఉలికిపడగ**
**పాతాళ లోకంబు పరికించెనొకచోట**
**సుర, నర, దనుజుల మరొకచోట**

తే॥ **భామ గాంచెను బ్రహ్మాండ భాండమెల్లఇ**
**భట్టతిరినాడు చెప్పిన భాగవతము**
**తెలుగు పద్యంబు జేసెద దేవదేవ!**
**వినుము గురువాయు పురనాథ! విష్ణుగాథ.**

తా॥ ఓ మహాత్మా! యశోదాదేవికి నీ నోటిలో ఒకచోట అడవులు మరియు వేరొకచోట కళ్ళు చెదిరిబోవునట్లు అంతులేని జలరాశియైన సముద్రము కనబడినది మరియొక చోట అవధులు లేని ఆకాశం ఆమెకు కానవచ్చి ఉలికిపడినది. ఇంకొకచోట పాతాళలోకమును జూచినది. మరియొక చోట దేవతలను, నరులను, అసురులను గాంచినది. ఈ విధంగా ఆ యశోద బ్రహ్మాండ భాండమునంతయు తిలకించినది. నారాయణ భట్టతిరి సంస్కృతములో రచించిన కృతిని నేను తెలుగుపద్యంగా చెబుతున్నాను. ఓ గురువాయూరప్ప! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!



10/8

**తే॥ స్వామి! నీ ముఖమందు నీ జనని గాంచె**
**పాలసంద్రంబుపై శేషపాన్పునందు**
**పవ్వళించిన శ్రీహరిన్, పరమధామ**
**మైన వైకుంఠమును గాంచె నచ్యుతుడిని,**
**ఆమె చిన్ని బాలుడవైన ఓ మహాత్మ!**
**వివిధ రూపాల కనుపించినావు నాడు,**
**తెలుగు పద్యంబు జెప్పెదన్ దీక్షబూని**
**వినుము గురువాయు పురనాధ! విష్ణుగాధ.**

తా॥ స్వామీ! ఆ యశోదాదేవికి నీ ముఖ మందు క్షీరసాగరమున ఆదిశేషునిపై పవ్వళించిన శ్రీమన్నారాయణుడు గాను, పరంధామమైన వైకుంఠమునందున్న అచ్యుతుడైన శ్రీమహావిష్ణువుగాను, ఆమె చిన్నారి పాపాయిగాను వివిధ రూపములలో కనిపించితివి. ఓ మహాత్మా! తెలుగు పద్యంగా దీక్షతో నీ కథ చెబుతున్నాను. ఓ గురువాయూరప్ప! ఆలకింపుము తండ్రీ!



10/9

**చం॥**
**కనుగొనె విశ్వమెల్ల తనకన్నులతోటి యశోద నీ ముఖం**
**బున, అటు నోటనిన్ తెరచి పూర్తిగ నీవెదుటన్ నిలంబడన్**
**నిను కనుగొన్నదా రమణి నీవును నోటిని విప్పినట్లుగా**
**విను గురువాయు పట్టణపు విష్ణుని గాధను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! ఇట్లు యశోదాదేవికి నీ ముఖమున సమస్త విశ్వము గోచరించినది. అట్లే ఆ జగత్తులో నీవునూ నోరు తెరచి నిలబడినట్లు స్పష్టముగా కనబడినది. ఆ విధముగా నీ నోటిలో సమస్త భువనములను తిలకించినది. మైమరచిపోయిందామె. నీ నోటిలో నిన్నే చూచుట అను అద్భుతము చూచినది. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణు గాధనాలకింపుము తండ్రీ!



10/10

**సీ॥ స్వామి! ఆ పరమాత్మ సాక్షాత్తు నీవనే**
**క్షణమాత్రమామెకు జ్ఞానముండె**
**క్షణికమా జ్ఞానమ్ము నణగించి వెంటనే**
**ముద్దు ముచ్చట్లలో ముంచినావు**
**మోహ వివశమున ముంచినావో ప్రభూ!**
**ముద్దుగా అడిగావు వద్ద జేరి**
**"అమ్మ! నాకాకలి అవుచున్నదే పాల**
**గుడిచెద"నంటివి ఒడిని జేరి**

**తే॥ అట్టి అద్భుత బాలుడవయ్య నీవు**
**నన్ను రక్షించు రోగమ్ము నయము జేసి**
**తెలుగు పద్యంబు జెప్పెద దేవదేవ!**
**వినుము గురువాయు పురనాధ! విష్ణుగాధ.**

తా॥ భగవంతుడవైన ఓ స్వామీ! యశోదాదేవికి నీవు సాక్షాత్తు పరమాత్మవనే జ్ఞానం కలిగింది. కాని ఆమెకు అట్టి జ్ఞానం ఒక్క క్షణం మాత్రమే ఉన్నది. క్షణికమైన ఆ జ్ఞానము నణగించి వెంటనే ఆమెను నీ ముద్దు ముచ్చట్లలో ముంచి మోహపరవశురాల్ని చేశావు. ఆమె ఒడిలో చేరి ముద్దుగా "అమ్మా! నాకు ఆకలి వేస్తున్నదే, పాలు త్రాగుతాను, ఈయవే" అని గారాబంగా అడిగావు. అట్టి నీవు అద్భుత బాలుడవయ్యా. నా రోగము నయము జేసి నన్ను రక్షింపుము తండ్రీ! ఓ దేవదేవా! నేను తెలుగు పద్యంబును చెప్పెదను. గురువాయూరప్ప! ఈ విష్ణుగాథనాలకింపుము, తండ్రీ!



## 11. ఉలూఖలబంధనము

**చం॥**

**తను యొకనాడు నీజనని తానును చిల్కుచునుండగా దధిన్**
**పనులను సేయనీయవుగ పట్టును వీడక కృష్ణ! "నాకునున్**
**ఘనమగు ఆకలయ్యెనని కావలె స్తన్యమ"నంచు జేరుచున్**
**గునియుచు పాలు త్రావుటకు కూర్చొన జేసితివామెనో ప్రభూ!**
**విను గురువాయు పట్టణపు విష్ణుని గాథను నందనందనా!**

తా॥ ఓ ప్రభూ! ఒకరోజు యశోదాదేవి పెరుగు చిలుకుచున్నది. నీవు ఆమె పనికి అడ్డము వచ్చి "అమ్మా! నాకు బాగా ఆకలి వేస్తున్నది పాలు కావాల"ని మారాముచేయుచు స్తన్యము కొరకు పట్టుబట్టితివి. నందనందనా! నీవు ఆ దేవి ఒడిలో కూర్చుని చనుబాలు త్రాగుచుంటివి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథనాలకింపుము తండ్రీ!



11/2

**తే॥ అపుడు చిరునవ్వు చిందు నీ అబ్జముఖము**
**ఉండె సుమనోహరంబుగా నోమహాత్మ!**
**పాలు త్రాగుచునుండగా మధ్యలోనె**
**పొయ్యిపై కాగు పాలన్ని పొంగుననుచు**
**ఆమె గమనించి త్వరపడి ఆ క్షణమున**
**వదలివైచె నిన్ పొయ్యిపై పాలు దించ**
**లోనికేగెను ఆ తల్లి కనక నిన్ను**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.**

తా॥ ఓ మహాత్మా! అప్పుడు చిరునవ్వు చిందించుచున్న నీ ముఖపద్మము సుమనోహరంబుగా నుండెను. నీవు నీ తల్లి దగ్గర పాలు త్రాగుచుండగా మధ్యలోనే పొయ్యిపై పాలు పొంగిపోవుచున్నట్లు గమనించి నీ తల్లి వెంటనే నిన్ను వదలిపెట్టి పాలను దించుటకై లోనికి వెళ్ళింది. ఓ గురువాయూరప్ప! ఈ విష్ణుగాథనాలకింపుము తండ్రీ!



11/3

**ఉ॥**

**పాలను పూర్తిగా గొనెనొ మానెనొ చూడక పొంగుచున్న ఆ**
**పాలనుజూడతల్లి చనె, పట్టుట శక్యము కాక కోపమున్**
**బాలుడు చల్లకవ్వమును బాహువులన్ గొని కుండమోదగా**
**నేలకు కారెనా పెరుగు, నివ్వెర బోయెను ఆయశోదయున్**
**ఏలికవయ్య అందరికి హే గురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ గురువాయూరప్పా! నీవు పాలను పూర్తిగా త్రాగక ముందే వంటింట్లో పొంగిపోతున్న పాలకోసం తల్లి దించి వెళ్ళిపోయిందని పట్టరాని కోపము వచ్చెను. వెంటనే నీవు అచటినున్న చల్ల చిలికెడి కవ్వమును దీసికొని పెరుగు కుండను పగులగొట్టగా ఆ పెరుగంతా యశోదా దేవి నివ్వెరపోవునట్లు నేలపాలయ్యెను. ఓ ప్రభూ! నీవు మా అందరికి ఏలికవు తండ్రీ!

11/4

చం॥

**కినుక వహించి నీవు దధిక్రిందపడన్ అటు కుండ గొట్టుగా**
**ఘనమగు సవ్వడిన్ వినుచు గ్రక్కున వెల్వడి ఆ యశోదయున్**
**కనియెను నేలపై పెరుగు కారగ యెల్లెడ విశ్వవ్యాప్తమౌ**
**అనుపమ నీదు కీర్తివలె అంతట శోభిలుచుండెనో ప్రభూ!**
**విను గురువాయు పట్టణపు విష్ణుని గాధను నందనందనా!**

తా॥ ఓనందనందనా! నీవు కోపముచే పెరుగుకుండను పగులగొట్టి పెరుగంతా నేలపాలవగా చాల పెద్ద ధ్వని వచ్చినది. అది విని యశోద వెంటనే పరుగెత్తుకొని బయటకు వచ్చెను. అప్పుడు నేలపై అంతటను విస్తరించి, విశ్వమంతా వ్యాపించిన తెల్లని స్వచ్ఛమైన నీకీర్తివలె, ఆ పెరుగు శోభిల్లెను. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధనాలకింపుము ప్రభూ!



11/5

తే॥ **వేద మెరిగింప లేదాయె నీదు ఉనికి**
**అట్టి నీవు కన్పింపక ఆ యశోద**
**కోపమెక్కుడై వెదకె నీ కొఱకు దేవ!**
**ఆమె ధన్యాత్మురాలైనదందుచేత**
**ఱోలువద్ద కోతులకు, పిల్లులకు, గోప**
**బాలురకు వెన్న తినిపించువాడవైన**
**నిన్ను గాంచెను ఆ దేవి నీరజాక్ష!**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ**

తా॥ దేవా! నీ ఉనికిని వేదములు గూడ కనుగొన జేయవు. అట్టి నీవు కనుపించనందువల్ల యశోదా దేవికి వెంటనే కోపమధికముగా వచ్చెను. కాని ఆమె సుకృతాత్మురాలైనందుచేత నిన్ను వెదకుచుండగానే నీవు ఱోలు దగ్గర కోతులకు, పిల్లులకు, గోప బాలురకు వెన్నను తినిపించుట ఆ దేవి జూచినది. పద్మనయనుడవైన ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథ నాలకింపుము తండ్రీ!



11/6

చం॥

**జనని యశోద నీపనికి చాలని కోపము కల్గి ఎఱ్ఱనౌ**
**తన వదనంబు జూచి కడుతాపము జెందితి వన్న తృప్తితో**
**గొనకొని నిన్నుపట్టుకొని కోపముజూపుచు కట్టి వేయనై**
**తను సఖురాండ్రతో కలిసి త్రాటిని చేకొనగా భయంబుతో**
**విను గురువాయుపట్టణపు విష్ణుని గాధను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! నీవు చేసిన పని చూడగానే నీతల్లి యశోదాదేవికి అలివిమాలిన కోపమువచ్చి ముఖము ఎరుపెక్కినది. తన వదనం చూచి నీవు భయపడి నట్లున్నందువల్ల ఆమె కొంతతృప్తి జెంది నిన్ను పట్టుకొని కట్టివేయాలని అనుకొని ఆమె తన స్నేహితురాండ్రతో కలిసి ఒక త్రాటిని చేతులలో తీసికొనినది. ఓ గురువాయూరప్ప! ఈ విష్ణుగాధ నాలకింపుము తండ్రీ!



11/7

తే॥ **కోరి నిను ముక్తి సుజనుల శరణనెదరు**
**అట్టి నిను కట్టివేయంగ నామె తలచె,**
**ఎన్ని తాళ్ళను తెచ్చినా ఏమి మాయొ!**
**తగ్గె రెండంగుళంబులు త్రాళ్ళ పొడవు**
**తెలుగు పద్యంబు జెప్పెద దేవదేవ!**
**వినుము గురువాయుపురనాథ విష్ణుగాథ.**

తా॥ ఓ దేవదేవా! సజ్జనులు మోక్షమును కాంక్షించి నిన్ను శరణు గోరుచుందురు. అట్టి నిన్ను ఆ తల్లి కట్టి బంధించాలని ఆలోచించెను. కాని ఆమె నిన్ను కట్టివేయుటకై ఎన్ని త్రాళ్ళను తెచ్చినా రెండంగుళములు పొడవు తక్కువయే యగుచుండెను. అది ఏమి విచిత్రమో! తెలియకున్నది. ఓ గురువాయూరప్ప! తెలుగు పద్యంలో విష్ణుగాధను చెప్పెదను ఆలకింపుము తండ్రీ!

11/8

చం॥

**జనని యశోద మిక్కిలి అశాంతిని జెందెను దస్సెనామె జూ**
**చిన సఖురాండ్రు నవ్వుకొని స్వేదన నిండిన నందపత్నినిన్**
**కనుగొని వింతజెంది తమ కన్నులనమ్మరు;నిత్యముక్తుడౌ**
**నిను యెటుకట్ట సాధ్యమగు? నీవిక చాలని జాలిగొంటివే**
**విను గురువాయు పట్టణపు విష్ణుగాధను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! నీ తల్లియైన యశోద మిక్కిలి అలిసిపోయి అశాంతిగా నుండెను. ఆమె శరీరమంతయు చెమటపట్టి తడిసిపోయి యుండెను. ఆమె సఖురాండ్రు ఆమె అవస్థను జూచి నవ్వుకొని నమ్మలేని ఆశ్చర్యంతో నివ్వెరపోయిరి. స్వామీ! నీవు నిత్యముక్తుడవు. నిన్ను కట్టివేయుట సాధ్యమా? ఆ తల్లియొక్క దీనావస్థను జూచి ఇక చాలని నీవేకట్టు బడుటకు నిశ్చయించుకొంటివి. ఓ గురువాయూరప్ప! ఈ విష్ణుగాధ నాలకింపుము తండ్రీ!



11/9

తే॥ **ఇటుల కట్టిపడుండుము రోటియందు**
**చాలసేపు నిన్ వదలను తులువవౌర!**
**అనుచు ఇంటిలోనికి బోయె నా యశోద**
**వెనుక రోటిలో దాచిన వెన్నముద్ద**
**తినుచు ముదమున నుంటివి దేవదేవ!**
**వినుము గురువాయుపురనాధ! విష్ణుగాధ.**

తా॥ “నీవు ఇదే విధముగా రోటికి బంధింపబడి చాల సేపు ఉండుము అల్లరివాడ!” అని యశోదాదేవి తన ఇంటిలోనికి పోయినది. అప్పుడు నీవు ఇదివరకే రోటిలో దాచిన వెన్నముద్ద తినుచూ సంతోషముగా నుంటివి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణు గాధను ఆలకింపుము తండ్రీ!



11/10

సీ॥ **ఎట్టి ఆశలుగాని ఏ బంధములు గాని**
**కలుగని సుజనులే తెలియగలరు**
**సులభంబు వారికి జూడ నిన్ను మహాత్మ!**
**అన్యులకందని అచ్యుతుడవు**
**ఐనను గొల్లెత ఆ యశోదకు కట్టు**
**బడితివి వింతగా పరమపురుష!**
**ఈ విధంబుగ నిన్ను యెల్ల దేవతలును**
**స్తుతియించసాగిరి చేతులెత్తి**

తే॥ **నాదు రోగమ్ము పోగొట్టి నయము గూర్చు**
**భట్టతిరి నాడు చెప్పిన భాగవతము**
**తెలుగు పద్యంబు జేసెద దేవదేవ!**
**వినుము గురువాయు పురనాధ! విష్ణుగాధ.**



తా॥ ఓ మహాత్మా! నీవు ఎట్టి ఆశలు, బంధములు లేక యున్న సత్పురుషులకు మాత్రమే సులభముగా లభించు వాడవు. ఐననూ నీ తల్లి గనుక ఆ గొల్లభామ యశోదకు కట్టుబడితివి. ఈ విధముగా దేవతలందరూ నిన్ను స్తుతించసాగిరి. ఓ దేవదేవా నాయొక్క రోగమును నిర్మూలింపుము ప్రభూ! నారాయణ భట్టతిరులు నాడు సంస్కృతమున భాగవతపు సారమును రచించెను. దానిని నేడు తెలుగు పద్యముగా చెప్పుచుంటిని. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!

## 12. యమళార్జునోద్ధరణము

**సీ॥ తను యశోదాదేవి త్రాటిచే రోటికి**
**కట్టివేయంగ నిన్ కనిన సురులు**
**అమిత మౌముదముతో దామోదరుడవని**
**వినుతించి నారంత వేయినోళ్ళ**
**బహుసున్నితము కదా! ప్రభు! నీదు ఉదరము**
**త్రాటిచే కట్టెనే! తల్లినిన్ను**
**ఆ సమయమునైన అచ్యుతా! నీదృష్టి**
**ఆర్తరక్షణమీదె అమరియుండె**

**తే॥ రెండు మద్దిచెట్లను చూచుచుండినావు**
**భట్టతిరి తొల్లి జెప్పిన భాగవతము**
**తెలుగు పద్యంబులో నేను తెలుపుచుంటి**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాధ.**



తా॥ ఓ ప్రభూ! నిన్ను నీ జనని యశోదాదేవి త్రాటిచే రోటికి కట్టివేసినపుడు దేవతలు చూచి అమితానందముతో నీవు దామోదరుడవని అనేక విధముల స్తుతించిరి. నీవు సున్నితమైన ఉదరము కలవాడవు కదా! మరి నిన్ను నీమాత త్రాటిచే నీ ఉదరమును రోటికి బిగించినది. ఆ సమయమున నీవు సమీపముననున్న రెండు మద్దిచెట్లను చూచితివి. ఓ అచ్యుతా! ఆర్తత్రాణ పరాయణుడవైన నీదృష్టి వాటిపై పడినది.
నారాయణ భట్టతిరి సంస్కృతములో జెప్పిన భాగవతమును నేను తెలుగు పద్యంబుగా చెబుతున్నాను. ఓ గురువాయూరప్ప! దీని నాలకింపుము తండ్రీ!





**తే॥ అల కుబేరుని పుత్రులు కలరిరువురు,**
**జ్యేష్టుడు “నలకూబరుడు” కనిష్టుడు “మణి**
**కంఠు” డిరువురు గొలుతురు గరళకంఠు**
**పరమశివుని కరుణ గొన్న మదము జేత**
**హరికి మ్రొక్కరు మెచ్చరు హరిజనులను**
**విషయ సుఖముల మత్తిల్లి వివశులైరి**
**తెలుగు పద్యంబు జెప్పెద దేవదేవ!**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాధ.**

తా॥ ఓ దేవదేవా! పూర్వం కుబేరునికి ఇద్దరు పుత్రులుండెడివారు. పెద్దవాడు నలకూబరుడు, చిన్నవాడు మణికంఠుడు. వారిద్దరు గొప్ప శివభక్తులై అతని అనుగ్రహమును సంపాదించిరి. అందుచేత వారు మదాంధులై శ్రీహరివైన నిన్ను సేవింపక నీ భక్తులను కూడ నిరసించుచుండిరి. విషయ సుఖములందు మత్తిల్లి యుండిరి. ఓ గురువాయూరప్ప! తెలుగు పద్యంలో నేను తెలిపెడి నీ కథను ఆలకింపుము తండ్రీ!





**చం॥**
**ఇరువురు ఒక్కనాడు మదమెక్కిరి మద్యము త్రావి పాడుచున్**
**సురనది గంగలో మునిగి సుంత విచక్షణలేకయే దిగం**
**బరులుగ తానమాడు నెడ భామలగూడుచు;నారదుండు ఆ**
**తెరవున బోవుచున్ గనెను దిగ్భ్రమ జెందెను నందనందనా!**
**హరి! గురువాయు పట్టణపు అప్రభు గాథయె ఆలకింపుమా**

తా॥ ఓ ప్రభూ! ఒకనాడు నలకూబరుడు, మణిగ్రీవుడను వారిద్దరు మదమెక్కినవారై మద్యమును సేవించి దేవనదియైన గంగానదిలో ఇచ్చవచ్చినట్లు పాడుచు అనేకమంది యువతులతో విచక్షణారహితులై నగ్నంగా స్నానము చేయుచుండిరి. ఆ దారిన నీ అనన్యభక్తుడైన నారద మహర్షి పోవుచు ఈ దిగంబరుల శృంగారమును జూచి దిగ్భ్రమజెందెను. నందనందనుడవైన గురువాయూరప్పా! ఓ శ్రీహరీ నీ కథనాలకింపుము తండ్రీ!

12/4

సీ॥ ఆ కుబేరుని పుత్రులకు లజ్జ లేదాయె
కాని వారల స్త్రీలు గాంచి మునిని
వడివడి తడబడి, తొడవులు తొడిగిరి
శాపభయంబున జవ్వనులును
తగని మదాంధుల ధనదుని పుత్రులన్
మౌని నారదుడిట్లు తను శపించె
"హరిపాద శరణమే తరియించు మిమ్ముల
అందాక శాంతంబు నరయ" రనెను

తే॥ లేక మనసుకు శాంతమ్ము లేదు సుఖము
చిత్రమైనదా శాపము చిన్ని కృష్ణ!
తెలుగు పద్యంబులో నీకు తెలుపుచుంటి
వినుము గురువాయు పురనాథ! విష్ణుగాథ



తా॥ ఓ చిన్ని కృష్ణా! సిగ్గులేని ఆ నలకూబర మణిగ్రీవులతో నున్న ఆ స్త్రీలు నారద మహర్షిని చూడగానే శాప భయముతో వెంటనే బట్టలు కట్టుకొనిరి. కానీ అంతులేని మదమత్తులైన ఆ సోదరులు, కుబేర పుత్రులు మాత్రము నారదమహర్షిని చూచి కూడ లక్ష్యము జేయరైరి. అందువలన ఆ మౌని "హరిపాద శరణము నందు వరకు మీకు మనశ్శాంతి దూరమగుగాక" అని శపించెను. మనశ్శాంతి లేనివారికి సుఖము కలుగదు కదా! ప్రభూ!
ఓ గురువాయూరప్ప! తెలుగు పద్యరూపంలో నీగాథను ఆలకింపుము తండ్రీ!



12/5

తే॥ "ఓరి మదమత్తులార! మీరిరువు రిలను
చాలకాలంబు గడుపుడు శాంతిలేక
మద్దిచెట్టై పడుండుడు, మాధవునికి
కరుణ కలిగి పాదపు స్పర్శనరయగలరు
నాడు మీ పూర్వ రూపమ్ము చూడగలరు"
మౌని శాపాన గోకులమున నిలిచిరి
మద్ది చెట్టైరి పొంద నీపాద స్పర్శ
వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.

తా॥ ఓ మదోన్మత్తులారా! మీరిద్దరూ చాలాకాలం భూలోకంలో మనశ్శాంతికి దూరమై బ్రతకండి. మద్దిచెట్లుగా గోకులమున పడి ఉండండి. మాధవుని దర్శన భాగ్యం కలిగిన తరువాత మాత్రమే మీ పూర్వరూపం మీకు వస్తుంది" అని నారదుడు ఆ నలకూబర, మణిగ్రీవులను శపించెను. వారట్లే శాపము ననుభవించుచుండిరి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథనాలకింపుము తండ్రీ!



12/6

ఉ॥
జాగును సేయకుండగ ప్రశాంతముగా చని చెట్ల మధ్యగా
లాగుచు రోటినిన్ హరి! పురాతనమైన తరుద్వయంబుపై
సాగుచు చెట్లగూల్చితివి శాపము బాపగనెంచి ఓ ప్రభూ!
ఓ గురువాయుపట్టణమహోదయ! నీ కథనాలకింపుమా.

తా॥ ఓ ప్రభూ! నీవు ఎట్టి యాలస్యము చేయకుండ ప్రశాంతముగా దోగాడుచు ఆ చెట్ల మధ్యగా ఆ రోటిని లాగుచు పోయితివి. ఓ శ్రీహరీ! చాల పురాతనమై శిథిలావస్థలో నున్న రెండు మద్దిచెట్ల మధ్యనుండి సాగిపోతూ ఆ రోటి తాకిడికి ఆ చెట్లను కూలగొట్టితివి. (శాపము నావిధముగా తొలగింప జూచితివి) ఓ గురువాయూరప్పా! నీ గాథనాలకింపుము తండ్రీ!

12/7

చం॥

**వెలువడ చెట్ల మధ్యమున భీకరమౌ ధ్వని గూలెనాతరుల్**
**వెలుగులు జిమ్ముచుండగ కుబేరుని పుత్రులు స్వస్వరూపులై**
**నిలుపగ లేని మోదమున నీ స్తుతిజేసిరి; రావునాకు, మా**
**టలు గురువాయుపట్టణపు ధర్మసురక్షక! నందనందనా!**

తా॥ నందనందనుడవైన ఓ గోవిందా! నీవు ఆ రెండు మద్దిచెట్ల మధ్య నుండి ఆ రోలును లాగికొనిపోగా భయంకరమైన ధ్వనితో ఆ చెట్లు నేల గూలినవి. అప్పుడు ఆ చెట్లనుండి పెద్ద వెలుగు వెదజిమ్మబడింది. కుబేరుని పుత్రులైన నలకూబరుడు, మణిగ్రీవుడు అను గంధర్వులు వెలువడి పట్టరాని ఆనందంతో నిన్ను అనేక విధముల స్తుతించిరి. ఓ గురువాయూరప్ప! ధర్మరక్షకా! ఆ కథ నింతకంటె వర్ణించుటకు నాకు మాటలు రావు తండ్రీ!



12/8

సీ॥ **అన్యదేవతలను అతి భక్తి సేవించు**
**వారును నీదయ వారికున్న**
**క్రమముగా నీ భక్తి కలిగి నీ శరణమ్ము**
**పొందెదరో ప్రభూ! పూని అటుల**
**పరమేశు భక్తులౌ వారలు నారద**
**ముని దయన్ నీయందు మనసు నిలిచి**
**నీపాదదాసులై నీభక్తి వారికి**
**నిరతంబు నుండంగ కోరినారు**

తే॥ **"నీవు పరమాత్మవో ప్రభూ! నిన్ను అన్య**
**మేది కోరము నీభక్తినిమ్ము చాలు"**
**తెలుగు పద్యంబులో నేను తెలుపుచుంటి**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.**



తా॥ ఓ ప్రభూ! ఇతర దేవతలను భక్తితో సేవించు వాడుకూడా క్రమముగా నీదయచేత నీమీద భక్తికలిగి నీ శరణాగతి పొందును. పరమేశ్వరునియందు భక్తి కలిగిన ఆ నలకూబరుడు మణిగ్రీవుడు కూడ నారదమహాముని కరుణవల్ల నీ భక్తులై నీపైననే మనసు లగ్నం చేసికొనిరి, నీ పాదదాసులైరి. వారు పరాత్పరుడవైన నీవు దక్క అన్యమేదైనా అవసరం లేదనే నిశ్చితాభిప్రాయమునకు వచ్చిరి. ఓ గురువాయూరప్పా! తెలుగు పద్యంగా నేను తెలుపు నీ కథను ఆలకింపుము తండ్రీ!



12/9

సీ॥ **దామోదరా! రెండు తరువులు నేలపై**
**కూలగా పిడుగులా కలిగె ధ్వనులు**
**ఆ శబ్దమును విని అందరు గొల్లలు**
**భయపడి పరుగుతో వచ్చిరటకు**
**జనని యశోదయు తన పని తలచుచు**
**సిగ్గుతో తలవంచి చితికిపోయె**
**బంధాలనన్నిటిన్ వదలించు వాడవు**
**నీబంధనము త్రెంచె నీదు తండ్రి**

తే॥ **స్వామి! ఇదియంత నీలీల సాధ్యపడునె!**
**ఒరుల కెన్నడు తెలియంగ ఓ మహాత్మ!**
**తెలుగు పద్యంబు జెప్పెద దేవదేవ!**
**వినుము గురువాయు పురనాథ! విష్ణుగాథ.**

తా॥ ఓ దామోదరా! మద్దిచెట్లు రెండు నేలపై కూలిపోగా పిడుగు పడినట్లు ధ్వనులు వినిపించెను. ఆ శబ్దములను విని గొల్లపల్లెలో వున్న వారందరు భయముతో అక్కడకు చేరుకొనిరి. అప్పుడు నీ తల్లి యశోదాదేవి తాను చేసిన పనికి (చిన్న పాపాయిని రోటికి త్రాటితో కట్టివేయడం) సిగ్గుపడి తలవంచుకొని బాధపడినది.
స్వామీ! లోకములో అందర్నీ బంధవిముక్తుల్ని జేసి రక్షించు నిన్ను నీ తండ్రి నందగోపుడు బంధవిముక్తుని చేసెను. ఇదంతా నీలీలయే కదా! మహాత్మా! ఇతరులకు వానిని అర్థం చేసుకోవడం సాధ్యమా? ఓ గురువాయూరప్పా! తెలుగు పద్యంగా నేను చెప్పే నీ కథను ఆలకింపుము తండ్రీ!



12/10

**సీ॥ ఈ మహావృక్షాలు ఇటుపడిపోయెను**
**చిన్నారిపై పడకున్నవాయె**
**శ్రీహరే కాపాడె చిన్నికృష్ణునియని**
**ఆపద తొలగెను అందుచేత**
**అనుకొని అందరు చనిరి వారిండ్లకు**
**నీ లీల ఎవరికి తెలియు స్వామి!**
**నీ మహిమన్ దెల్వ ఆ మునీశ్వరులకున్**
**సాధ్యమా ఓ ప్రభూ! జలజనాభ!**

**తే॥ నాదు రోగమ్ము తొలగించి నయము నిమ్ము**
**భట్టతిరి తొల్లి చెప్పిన భాగవతము**
**తెలుగు పద్యంబు జేసితి దేవదేవ!**
**వినుము గురువాయు పురనాథ! విష్ణుగాథ.**



తా॥ ఓ చిన్నికృష్ణా! ''ఈవిధంగా పడిపోయిన మహావృక్షాల మధ్యచిక్కుకొని ఉన్నాకూడ అవి వీనిపై పడలేదాయె! ఇదంతా భగవానుడైన ఆ శ్రీహరి కరుణవలన ఆపద కలుగక తప్పిపోయింది" అని అచట నున్న వారందరూ అనుకొని తమతమ ఇండ్లకు పోయిరి. స్వామీ! నీ లీలలు ఇతరులకు ఎలా అర్థమవుతాయి? నీ మహిమను ఆ మునీశ్వరులే తెలుసుకోలేరు కదా? నా వ్యాధిని పోగొట్టి నన్ను రక్షించుము ప్రభూ! ఓ గురువాయూరప్పా! తెలుగు పద్యంగా నేను తెలుపు నీ కథను ఆలకింపుము తండ్రీ!



## 13. బృందావన విహారము

**తే॥ గోకులంబుననున్నట్టి గోపులెవరు**
**నీ స్వభావంబు నెరుగరు నీదు మహిమ**
**"బండి విరుగుట, తరువులు పడుటవంటి**
**ఇట్టి ఉత్పాతముల హేతువేమొగాని,**
**తగదు గోకులముననుంట" తలచినారు,**
**నిశ్చయించిరి మరియొక నెలవు జేర**
**తెలుగు పద్యంబు చెప్పెద దేవదేవ!**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.**

తా॥ ఓ దేవదేవా! గోకుల వాసులకు ఎవ్వరికీ నీ ప్రభావము తెలియదు. అందుచేత "చెట్లు విరిగి పడిపోవుట, బండి విరిగి ముక్కలై పోవుట మొదలైన ఉపద్రవములు ఏ కారణము లేక జరుగవు" అని భావించి ఆగోకులమునుండి మరియొక చోటికి తరలిపోవుటకు నిశ్చయించుకొనిరి. ఓ గురువాయూరప్పా! తెలుగు పద్య రూపంలోని ఈ విష్ణుగాథను నీవు ఆలకింపుము తండ్రీ!

13/2

**తే॥ అపుడు, గోపాల! పరమాత్మవైన నీదు**
**ప్రేరణము చేత వారిలో పెద్దయొకడు**
**పేరు 'ఉపనందు' డాతడు వారితోటి**
**"పశ్చిమపు దిక్కుబోయిన మంచితావు**
**కలదు, బృందావనంబని పిలువబడును"**
**అనుచు పలికెను తలలూచ అందరున్న**
**తెలుగు పద్యంబులో నేను తెలుపుచుంటి**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.**

తా॥ ఓ గోపాలా! ఆ సమయమున పరమాత్మవైన నీ ప్రేరణము చేత 'ఉపనందుడు' అను పేరుగల గొల్లపెద్దలేచి తనతోటి వారితో "ఇక్కడికి పశ్చిమ దిక్కున 'బృందావనము' అనుపేరుగల అందమైన వనమున్నది" అని పలికెను. దానికందరు తలలూపి అంగీకరించిరి. ఓ గురువాయూరప్పా! తెలుగు పద్యంగా నేను తెలిసే నీ గాథను ఆలకింపుము తండ్రీ!



13/3

**ఉ॥**
**ఆ యెడ నందుడాదిగల అందరు గోపులు యాల మందతో బోయిరి వీడుచున్ తమరి పూర్వపు తావగు ఆ బృహద్వనిన్ మోయుచు తట్టబుట్టలను, ముందర నీవు యశోదలున్ చనన్, పోయిరి 'బృంద'యన్ వనికి వుండగ పిల్లల స్త్రీలతో సహా ఈయదు సింహుగాథ విను హేగురువాయు పురాధినాయకా!**

తా॥ ఓ గురువాయూరు అధినాయకా! అప్పుడు నందుడు మొదలైన గోపాలురందరును తాము నివసించుచున్న బృహద్వనమను ప్రదేశమును వదలివైచి బృందావనమను ప్రదేశమునకు తమ ఆవుల మందలతో తట్టాబుట్టా ఆలుబిడ్డలతో వెళ్ళిపోయారు. వారి ముందర పెద్ద బండిలో నీవూ యశోదాదేవి పోవుచుండిరి. ఓ మహాత్మా యదుసింహుడైన నీ గాథను నీకే వినిపించుచున్నాను ప్రభూ!



13/4

**సీ॥ బృందావనికి వారు వెళ్ళుచుండగ ప్రభూ!**
**ఆ దృశ్యమెంతయో అద్భుతంబు**
**ఈడ్చుచుండగ బండ్ల నెద్దుల మెడలోని**
**గంటలు మ్రోగెను గణగణమని**
**గిట్టల సవ్వళ్ళు, కిలకిల మనుస్త్రీలు**
**చెవులకు సంగీత రవము తోపె**
**నీ ముద్దు మాటలు నీనవ్వు చేష్టలున్**
**హాయిగా తోపింపవలుపు సొలుపు**

**తే॥ చాలదూరము బోయిరి సంతసమున**
**భట్టతిరి నాడు చెప్పిన భాగవతము**
**తెలుగు పద్యంబు జేసితి దేవదేవ!**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.**



తా॥ ఓ ప్రభూ! వారందరును బృందావనమునకు వలసపోవుచున్నపుడు ఆ దృశ్యం చాల అద్భుతంగా వుండినది. వారి బండ్లకు కట్టిన ఎద్దుల మెడలలోని గంటలు గణగణమని మ్రోగినవి. గోవులు నడుచు చున్నపుడు గిట్టల సవ్వడులు, స్త్రీల కిలకిలలు మనోహరముగా చెవులకు సంగీతములా వినిపించినవి. నీవు వినోదముగా పలుకుచున్న ముద్దుమాటలు హాయిగా వినుచు వారు ఎంతో సంతోషముతో చాల దూరము ప్రయాణించిరి. నీవలన కలిగిన ఆహ్లాదముతో వారికి ఎంతమాత్రము ఆయాసము తెలియలేదు. ఓ గురువాయూరప్పు! భట్టతిరి భాగవతమును నేను తెలుగు పద్యములలో చెప్పుచున్నాను. ఆలకింపుము తండ్రీ!

13/5

సీ॥ బాగుగా వికసించు మల్లెపూ పొదరిళ్ళు
బృందావనంబున వెలసియుండె
ఆకర్షణీయమౌ అద్భుత వృక్షాలు
గావించెనో ప్రభూ! కనుల విందు
పరచింది నేలపై పచ్చని పచ్చిక
మరకతంబుల పొన్పు మదిని దోప
దర్శనీయంబు బృందావనంబెంతయో
సంతసించితివి ఓ స్వామి! నీవు

తే॥ భక్తుడైన నారాయణ భట్టతిరులు
సంస్కృతించ భాగవతపు సారమెల్ల
తెలుగు పద్యంబు జెప్పితిన్ దేవదేవ!
వినుము గురువాయు పురనాథ! విష్ణుగాథ



తా॥ ఓ దేవదేవా! బృందావనమునందు బాగుగా వికసించిన పూలతో విలసిల్లుచున్న చక్కని మల్లెపొదలు, ఆకర్షణీయముగా నున్న మహావృక్షములు కనులకు విందు చేయుచున్నవి. అంతటా నేలపై పచ్చిక పచ్చగా పరచినట్లుండి ఆకుపచ్చని మణుల (మరకతముల) పొన్పును తలపించుచుండెను. దర్శనీయముగా నున్న ఆ బృందావనమును గాంచి నీవెంతో సంతసించితివి. పరమ భక్తుడైన నారాయణ భట్టతిరి భాగవత సారమును సంస్కృతములో చెప్పారు. ఓ గురువాయూరప్పా! దానిని నేను తెలుగు పద్యంగా చెబుతున్నాను. ఆలకింపుము తండ్రీ!



13/6

తే॥ క్రొత్త భవనాల గట్టిరి గోపజనులు
అర్ధచంద్రాకృతిని బోలె ఆ వరుసలు
వాటిలో సుఖంబుండి గోపాలురెల్ల
సేదదీరిరి, నీవు నీ స్నేహితులును
కలిసి బృందావనపు శోభ గాంచినారు
వినుము గురువాయు పురనాథ! విష్ణుగాథ.

తా॥ ఓ గురువాయూరప్పా! గోపాలురందరు అక్కడ క్రొత్తగా పలురకములైన భవనములను గట్టిరి. ఆ గృహముల వరుసలు అర్ధచంద్రాకారములో ఉన్నవి. అప్పుడు నీవు నీ స్నేహితులు కలిసి అందరు ఆ ప్రదేశములన్నీ తిరుగుచు ఆ బృందావనపు శోభను తిలకించినారు. ఓ ప్రభూ! ఈ విష్ణుగాథను ఆలకింపుము తండ్రీ!



13/7

సీ॥ ప్రభూ! మనోహరముగా ప్రవహించుచున్నట్టి
యమునా నదీ కన్య నరసినావు
తహతహలాడె నీదరినుండ నన్నట్లు
వంకరటింకర పథముబట్టె
కలహంస రవముల్ కన్నయ్య పలుకులన్
అనుకరించిన వేమో!! ఆ ఝరులును
వికసించు కమలముల్ విరజిమ్మి కాంతులన్
నీ పద్మవదనంబు నిలిపె కనుల

తే॥ యమున నిర్మల జలముల అలరుచుండె
భట్టతిరినాడు చెప్పిన భాగవతము
తెలుగు పద్యంబు జేస్తిని దేవదేవ!
వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ

తా॥ ఓ ప్రభూ! మనోహరముగా ప్రవహించుచున్న 'కాళింది' అని పిలువబడే యమునానది యనెడి కన్యను నీవుగాంచితివి. ఆ నది నిన్ను అనుసరింపవలెననెడి తహతహతో వంకర టింకరగా సాగుచున్నది. కలహంస రవము వంటి నీ పలుకలను ఆ నదీ రఝరులు అనుకరించుచున్నవి. ఆ నదిలోని వికసించిన కమలములు కాంతిని విరజిమ్ముచూ పద్మము వంటి నీ ముఖారవిందమును కనులకు స్ఫురింప జేయుచున్నవి. ఆ నది నిర్మలమైన జలముతో నిండి ప్రవహించుచున్నది. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి రచించిన భాగవతమును నేను తెలుగు పద్యంగా చెబుతున్నాను. ఓ దేవదేవా! దీని నాలకింపుము తండ్రీ!



13/8

సీ॥ బృందావనము చెంతనుంది గోవర్ధన
మనుగిరి యొక్కటి 'కనుల పంట'
వందల నెమళుల వలన 'క్రేంకారంబు'
గిరి సానువులయందు మారు మ్రోగు
పలు వన్నెలున్ జిమ్ము 'మణులు' ఆగిరిలోన
అతి మనోజ్ఞంబుగా నలరుచుండు
తాకునా ఆ బ్రహ్మలోకంబు యనునట్లు
ఉన్నతంబై గిరి యున్నదచట

తే॥ అట్టి గోవర్ధనగిరిని యచట నీవు
గాంచి పులకించి నావయ్య కమలనాభ!
తెలుగు పద్యంబులో నేను తెలుపుచుంటి
వినుము గురువాయుపురనాథ! విష్ణు గాథ.



తా॥ ఓ కమలనాభా! బృందావనమునకు సమీపములోనే 'గోవర్ధనము' అను పర్వతమొకటి కనుల పండువగా కలదు. వందలకొలది నెమళ్ళు అచట 'క్రేంకారములు' చేయుచుండగా ఆ పర్వత సానువు లాధ్వనితో మారు మ్రోగుచుండును. అనేకమైన రంగులు వెదజల్లు మణులు ఆ పర్వతం మీద మనోజ్ఞంగా శోభిల్లుతుంటాయి. ఆ పర్వతము చాల ఉన్నతమైన దగుటచేత ఆ గిరి శిఖరం బ్రహ్మదేవునియొక్క సత్యలోకమును తాకుచున్నదా అనునట్లుండును. అటువంటి గోవర్ధన పర్వతమును జూచి నీవు పులకించిపోయావు. ఓ గురువాయూరప్పా! తెలుగు పద్యంగా నేను చెబుతున్న నీ గాథనాలకింపుము తండ్రీ!



13/9

చం॥
ఘనముగ నీవునున్ సఖులు గాంచుచు ఆవని శోభలన్నియున్
వనమున అంతయున్ తిరిగి పారవశమ్మును బొందిరో ప్రభూ!
తను అనురాగ బద్ధవలె తన్వి "కళింద"యు ఒంపుసొంపులన్
కనులకు విందుగా నురక, గాంచితి వానది సోయగంబులన్
వినుగురువాయుపట్టణపు విష్ణునిగాథను నందనందనా!

తా॥ ఓ నందనందనా! నీవు నీతోటి బాలురతో కలిసి బృందావనము యొక్క శోభలను తిలకించుటకై ఆవనమునందు అంతటా అందమును చిందించుచు తిరుగుచుంటివి. అంత నీపై అనురాగవతియైనదా అన్నట్లు 'కళిందకన్య' అని పిలువబడు యమునా నది ఒంపు సొంపులతో ఒయ్యారముగా నడయాడి కనులకు విందుగా నురుకులతో ప్రవహించుట నీవు గాంచితివి. ఓ గురువాయూరప్ప! ఈ విష్ణుగాథను ఆలకింపుము తండ్రీ!

13/10

తే॥ అట్టి బృందావనంబున ఆలమంద
కనువుయైన బీళ్ళను జూచి అన్న తోటి
నీదు సఖులు, గోపాలురు నీవు కూడ
'ఆల గాచిరి' ఉత్సాహమలర స్వామి!
నాదు రోగమ్ము తొలగించి నయమునిమ్ము
వినుము గురువాయుపుర విభో! విష్ణుగాథ.

తా॥ స్వామీ! ఆ విధముగా ఆ బృందావనమున ఆవులమందలకు, ఇతర పశువులకు అనువైన పచ్చిక బీళ్ళను జూచి నీ అన్న బలరామునితోను, నీతోటి గోపాలురతోను కలిసి నీవు ఉత్సాహముగా తిరుగుచు గోవులను కాచినావు. ఓ గురువాయూరప్ప! నీ గాథను ఆలకింపుము. నన్ను రక్షించి నా వ్యాధిని నయము జేయుము తండ్రీ!



## 14.వత్సాసుర, బకాసుర సంహారము

సీ॥ నీ శరీరపు కాంతి నిరుపమానము ప్రభూ!
అతి మనోహరముగా అలరియుండె
బలభద్రు వెంట గోపాలురు జేరగా
కలిసి దూడల నీవు కాచినావు
ఝుమ్మని పాడుచు తుమ్మెదల్ చెవులకు
బృందావనంబున విందుజేసె
శృంగనాదంబుతో చేదాల్చి వేణువున్
పట్టావు బెత్తమ్ము మరొక చేత

తే॥ తిరిగి దూడల కాచావు దేవదేవ!
భట్టతిరినాదు చెప్పిన భాగవతము
తెలుగు పద్యంబులో నేను తెలుపుచుంటి
వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ



తా॥ ఓ దేవదేవా! శ్రీమన్నారాయణా! నీ శరీరపు కాంతి చూపరులకు చాల మనోహరముగా నున్నది. నీవు నీయన్న బలరాముడు వెంట వచ్చుచుండగా గోపబాలురతో కలిసి దూడలను కాయుచు బృందావనమున తిరుగుచుంటివి. ఆ వనమున తుమ్మెదలు వీనుల విందుగా ఝుంకారములు చేయుచుండెను. నీవు కూడ చిన్న చిన్న దూడలను కాయుచున్నప్పుడు ఒకచేత శృంగనాదము (కొమ్ము వాద్యము) మరియు వేణువును, మరియొక చేత బెత్తమును పట్టుకొని తిరుగుచుంటివి. అట్లు ఆవుదూడలను కాయుచుంటివి. నారాయణ భట్ట తిరుల కృతిని నేను తెలుగు పద్య రూపములో చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! దీనిని ఆలకింపుము తండ్రీ!



14/2

సీ॥ పావనంబైన బృందావనంబున ప్రభూ!
ఆవుదూడల మేపినావు తిరిగి
నీపాద చిహ్నాలు నిలిచి ఆ వనియందు
కనిపించినవి గోపికలకు స్వామి!
కరకమలములచే కమల లాలించెడి
నీ పాదపద్మాలు నిఖిల జగతి
శ్రీరామరక్షయై చేకూర్చు శుభములు;
అట్టి నీ స్పర్శచే ఆ వనమున

తే॥ చెట్లు, తీగలు, గుట్టలు, క్షేత్రములును,
నీరు సర్వసమృద్ధమై వరలుచుండు
తెలుగు పద్యంబు జెప్పెద దేవదేవ!
వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.

తా॥ ఓ లక్ష్మీపతీ! ప్రభూ! నీవు పవిత్రమైన బృందావనమున ఆవుదూడలను మేపుచు తిరుగుచుంటివి. అప్పుడు నీ పాద చిహ్నములు బృందావనమంతయు (గోపికలకు) కనిపించినవి. ఈ లోకములన్నింటికీ శ్రీరామరక్ష, తన పద్మములవంటి హస్తములతో కమల (లక్ష్మీదేవి) లాలించెడి నీ పాదపద్మములే. సకల సన్మంగళములను నీ చరణకమలములే కలిగించును. నీ స్పర్శచేత బృందావనములోని చెట్లు, తీగలు, గుట్టలు, క్షేత్రములు, నీరు మొదలైనవన్నియు సర్వసమృద్ధములై వర్ధిల్లుచున్నవి. ఓ గురువాయూరప్పా! తెలుగు పద్యంగా నేను తెలుపుచున్న నీ గాధనాలకింపుము తండ్రీ!



14/3

సీ॥ వనవిహారీ! లతా, తృణ, గుల్మముల చేత
 వరలుచున్నట్టి యా వనములందు
విహరించుచుంటివి విమలకీర్తీ! ఆవు
 దూడల కాచావు తోయజాక్ష!
మందమారుతము కాళిందీ తటంబున
 వీచగా తిరిగావు అచట నిచట,
గోవర్ధనంబును కూడ యెక్కితివయ్య!
 మ్రోగించుచుంటివి మురళి నీవు

తే॥ అచట యొకనాడు వనిలోన చూచినావు
ఆవుదూడ రూపమునున్న అసురునొకని
తెలుగులో భట్టతిరికృతి తెలుపుచుంటి
వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ



తా॥ ఓ వనవిహారీ! లతా, తృణ, గుల్మములచే శోభాయమానముగనున్న ఆ వనములందు నీవు విహరించుచుంటివి. చల్లని మందమారుతములు వీచు ఆ యమునానదీ తీరమున నీవు తిరుగుచుంటివి. గోవర్ధనగిరి శిఖరములను కూడ ఎక్కి, మురళిని మ్రోగించుచు, ఆవుదూడలను కాయుచు సంచరించుచుంటివి. ఈ విధముగా నుండగా ఒకనాడు ఆవుదూడ రూపముతో వచ్చిన రాక్షసుని ఆ వనములో చూచితివి. భట్టతిరి కృతిని నేను తెలుగు పద్యంగా చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! ఈ కథ నాలకింపుము తండ్రీ!



14/4

సీ॥ తోకను పైకెత్తి దూకుచు నటు నిటు
 వత్సాసురుడు, స్వామి! వచ్చెనటకు
సమయమెప్పుడు చిక్కు సంహరింపగ నిన్ను
 పరికించుచుండెను శిరము త్రిప్పి,
దొంగచూపులవాని సంగతి గమనించి
 వెనుక కాళ్ళనుపట్టి వేగిరముగ
గిరగిర త్రిప్పుచు తరువొక్క దానిపై
 విసిరి కొట్టావయ్య వెరపులేక

తే॥ వాని ప్రాణాలనంతమౌ వాయువులను
కలిసిపోయెను అసురుని కథ ముగిసెను,
తెలుగు పద్యంబు జెప్పెద దేవదేవ!
వినుము గురువాయుపురనాథ! ఈ విష్ణుగాథ.

తా॥ ఓ దేవదేవా! ఆ వత్సాసురుడు తనతోకను పైకెత్తి అటు నిటు దూకుచు నిన్ను సంహరించుటకు సమయమెప్పుడు చిక్కునా యని మాటిమాటికి తలను వెనుకకు త్రిప్పుచు గమనించుచుండెను. ఆ దైత్యుని (దొంగ) చూపులను నీవు గమనించి వాని వెనుక కాళ్ళను గట్టిగా ఎత్తిపట్టుకొని వేగముగ గిరగిర త్రిప్పి ఒక మహాతరువుపై విసిరి కొట్టావు. వెంటనే ఆ రాక్షసుని ప్రాణాలు అనంత వాయువులలో కలిసిపోయాయి. వాడి కథ పరిసమాప్తమైపోయింది. ఓ గురువాయూరప్పా! తెలుగు పద్య రూపంలో నేను తెలుపు ఈ విష్ణుగాథ నాలకింపుము తండ్రీ!



14/5

చం॥

**దనుజుడు బుద్ధిచే కడు అధర్ముడు, దుష్టుడు స్వంతరూపమున్**
**తను ధరియించి నేలబడి తానటవిన్ గల పెక్కు వృక్షముల్**
**గొనకొని వ్రేళ్ళతో టెగసి కూలగ జేసెను; నింగిదేవతల్**
**ఘనమగు పుష్పవృష్టి కలుగంగ నుతించిరి దేవదేవ! నిన్**
**విను గురువాయు పట్టణపు విష్ణుని గాథను నన్ను బ్రోవగా**

తా॥ ఓ దేవదేవా! ఆ రాక్షసుడు స్వభావముచేత అధర్మవర్తనుడే కాక చాల దుర్మార్గుడు కూడ. వాడు చనిపోవుచున్నపుడు తన నిజరూపమును పొంది భూమిపై పడిపోయెను. అతని బరువు వలన ఆ అడవిలోనున్న అనేక వృక్షములు నేలగూలెను. అప్పుడు ఆకాశమున దేవతలు గుంపుగా చేరి సంతోషముతో గొప్ప పుష్పవర్షం నీ శిరస్సుపై కురిపించి నిన్ను కీర్తించారు. ఓ గురువాయూరప్పా! నీవు ఈ విష్ణుగాథనాలకించి నన్ను రక్షింపుము.



14/6

సీ॥ **ప్రభు! నీదు శిరసుపై పరిమళాలెగజిమ్ము**
**విరులు రాలుట జూచి మిత్రులంత**
**మిగుల విస్మయమంది పిమ్మట "కన్నయ్య!**
**విరివాన యెవ్విధి కురిసె ననిరి**
**ఆ మేధకుల జూచి అన్నావు నవ్వుచు**
**"దనుజుని విసిరేసినాను గనుక**
**విరులన్ని నింగికి వేగంబుగా బోయి**
**రాలిపడినవేమొ! నేలపైన"**

తే॥ **నమ్మి నారంత నీమాట నల్లనయ్య!**
**భట్టతిరి నాడు చెప్పిన భాగవతము**
**తెలుగు పద్యంబు చేసితి దేవదేవ!**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ**



తా॥ ప్రభూ! నీ శిరస్సుపైన సువాసనలు విరజిమ్ము పుష్పవర్షము కురియుచుండుట జూచి, నీతోడి గోపబాలురు మిక్కిలి ఆశ్చర్యముబొంది అటు పిమ్మట నీతో ''కన్నయ్యా! ఈ పూలవాన ఎక్కడినుండి, ఎట్లు పడుచున్నది?" అని ప్రశ్నించిరి. ఆ అమాయకులను జూచి నీవు చిరునవ్వుతో "నేను రాక్షసుని విసిరివేసినందు చేత వాడితో పాటు చెట్లపైన పూలు కూడ పైకి వేగముగా బోయి మెల్లగా నేలపై రాలినవేమో" అని చెప్పితివి. ఓ నల్లనయ్యా! ఆ గొల్లపిల్లలు నీ మాట నమ్మినారు. నారాయణ భట్టతిరి చెప్పిన భాగవతమును నేను పద్యరూపంలో చెబుతున్నాను. ఓ దేవదేవా! గురువాయూరప్పా! ఈ విష్ణుగాథనాలకింపుము తండ్రీ!

14/7

చ॥

**వనమున ఎండవేడిమికి బాలురు దాహముతో తపించుచున్**
**కనుగొన త్రాగునీరు తము గాసిలి, ఆ యమునా తటంబునన్**
**ఘనమగు కొంగ నొక్కటిని గాంచిరి; ఇంద్రుని వ్రేటు తప్పగా**
**చనియిటజేరినట్టి 'హిమశైలము' రీతిగ దోచెనో ప్రభూ!**
**విను గురువాయుపట్టణపు విష్ణుని గాదను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! ఒకరోజు ఆ బృందావనమున ఎండ వేడిమి చాల అధికముగా నుండెను. గోపబాలురు ఆ తాపమును తట్టుకోలేక నీతో కలిసి త్రాగునీటికై వెదకుచు యమునానది ఒడ్డుకు జేరిరి. అక్కడ తెక్కలాడించుచున్న ఒక పెద్ద కొంగను మీరు చూచిరి. అది దేవేంద్రునిచే శిక్షింపక వదలి వేయబడిన తెల్లని మంచుకొండయైన ఆ కైలాస పర్వతమా! అన్నట్లు ఒప్పుచున్నది, ప్రభూ! ఓ గురువాయూరప్ప! ఈ విష్ణుని గాధనాలకింపుము తండ్రీ!



14/8

**సీ॥ నీతోటి బాలురు నీరు త్రాగిరి, ప్రభూ!**
**బకుడు నీపై నొక్క మాటుబడెను**
**కబళింపగా 'నిప్పు కణికవై' కాల్చావు**
**'లబలబలాడెను' ఆ బకుండు**
**వానికంఠమునుండి బయటకు దుమికావు**
**నిను వీడదాయెను నిశిచరుండు**
**రక్కుచు గోళ్ళతో ముక్కుతో చీల్చంగ**
**యత్నించుచుండెనా అసురుడంత**

**తే॥ దుష్టశిక్షణా దక్ష! ఓ దురితదూర!**
**ఒక్కసారిగా చీల్చావు ముక్కుబట్టి**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమందు**
**వినుము గురువాయురప్ప! ఈ విష్ణుగాథ**



తా॥ ఓ ప్రభూ! నీతోటి గోప బాలురు అందరు యమునా నదిలో నీరు త్రాగుచుండిరి. అప్పుడు బకాసురుడు (ఆ కొంగ) ఒక్కమాటుగా నీపై బడి కబళించెను. అంత నీవు నిప్పుకణికవలె వాని నోటిని కాల్చితివి. వాడు లబలబలాడుచుండగా వాని కంఠమునుండి వెలుపలికి దుమికితివి. ఆ దుష్టుడు నిన్ను గోళ్ళతో రక్కుటకు, ముక్కుతో చీల్చుటకు ప్రయత్నించెను. ఓ దుష్ట శిక్షణా దక్షా! దురిత దూరా! ఒక్కసారిగా వాని ముక్కుని తెఅచి చీల్చివైచి వానిని సంహరించితివి. ఓ గురువాయూరప్ప! నారాయణ భట్ట తిరి వ్రాసిన కృతిని నేను తెలుగు పద్యంగా చెబుతున్నాను. దీని నాలకింపుము ప్రభూ!



14/9

ఉ॥

**పూతన అన్న ఆ బకుడు, ముందర బోయిన చెల్లిజూడనై**
**పూతన జేరెనో!, అఘుని ముందుగ వెళ్ళెదనంచు యెంచెనో!,**
**ఆతడు కాలు జూడచనె, ఆకసమందున పుష్పవృష్టినిన్**
**ప్రీతిగ దేవతాళి కురిపించగ; ఇంటికి జేరినావయా**
**ఈతడు ఆర్తుడంచు వినుహే గురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ గురువాయూరప్పా! ఆ బకాసురుడు తనకంటే ముందుగానే చనిపోయిన తన చెల్లెలు పూతనని చూచుటకు బోయెనో లేదా తన తమ్ముడు అఘుడనే దనుజుని కంటే ముందుగానే వెళ్ళి అతనికై ఎదురు చూచుటకు బోయెనో, లేక యముని చూచుట కొరకు యమ సదనంబు జేరెనో కాని వాడు మరణించెను. ఆకాశమునుండి దేవతలు పుష్పవృష్టి గురిపించిరి. నీవు నీ మిత్రులతో కలిసి ఇంటికి జేరితివి. ఓప్రభూ! వీడు ఆర్తుడనంచునను రక్షింపుము.

14/10

సీ॥ బృందావనంబున వెలుదులు గోపికల్
లలిత మధుర వేణు రవము వినుచు
చాల దూరమునుండి సంతోషమున పొంగి
పరుగు పరుగులతో వచ్చి చేరి
నిను జూచి మనసంత నిండి ఆనందమ్ము
భావలహరి దేలు భామలెల్ల
జనని యశోదయు జనకుండు నందుడు
పులకించిపోయిరి పుత్రు గాంచి

తే॥ నాదు రోగంబు సడలించు నయము గూర్చు
నన్ను రక్షింప వేడెదన్ నందబాల!
భట్టతిరి కృతి తెలుగులో పద్యమందు
వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.



తా॥ ఓ నందబాలా! గోపికలు మధురమైన నీ వేణుగానమును చాల దూరమునుండియే విని తొందర తొందరగా నీ దగ్గరకు వచ్చి సంతోషముతో పొంగిపోవుచు నిన్ను చూచి వారి మనసంతా ఆనందముతో నిండిపోయి మధుర భావలహరిలో తేలియాడుచుండిరి. నీ తల్లియైన యశోదాదేవి తండ్రియైన నందగోపుడు కూడ నిన్ను జూచి పులకించిపోయిరి. పరమాత్ముడవైన గురువాయూరప్పా! నా వ్యాధిని తొలగించి స్వస్థత చేకూర్చుము. నన్ను రక్షింపుము. నాడు నారాయణ భట్టతిరి సంస్కృతమున రచించిన కావ్యమును నేను తెలుగు పద్య రూపంలో చెబుతున్నాను. దీనిని ఆలకింపుము తండ్రీ!



## 15. అఘాసురవధ

తే॥ స్వామి! ఒకనాడు తోటి గోపాలకులతొ
నీవు వనభోజనము జేయ నిశ్చయించి
తెల్లవారు జామున లేచి పిల్లలంత
వంట సామగ్రి, కూరలు, భక్ష్యములను
వెంటచేకొని పోయిరి బిరబిరమని
ఆవుదూడలతో పాటు ఆ వనమున,
భట్టతిరి కృతి తెలుగులో పద్యమందు
వినుము గురువాయు పురనాథ! విష్ణుగాథ.

తా॥ ఓ స్వామీ! ఒకనాడు తోటి గోపబాలకులతో పాటు నీవు వనభోజనము చేయవలెనని నిశ్చయించితివి. తెల్లవారుజాముననే లేచి బాలకులంతా ఆవుదూడలను తోడ్కొని వంటసామగ్రి, కూరలు, తినుబండారాలతో పాటు బిరబిరమని బృందావనమున దూర ప్రదేశమునకు బోయిరి. భట్టతిరి చెప్పిన భాగవతము ఓ గురువాయూరప్పు! నా ద్వారా ఆలకింపుము తండ్రీ!



15/2

చం॥
వనమున పాదచారివలె స్వామి! చరించుచునున్న వేళలన్
ఘనమగు పాదపద్మముల గల్గిన ధూళితొ ముజ్జగంబులన్,
మునులు పవిత్రులౌదమని మూగిరి నీకడ ఉద్యమించుచున్
తనువున పుల్కలై తలను దాల్చిరి నీపద ధూళినో ప్రభూ!
విను గురువాయు పట్టణపు విష్ణుని గాథను నందనందనా!

తా॥ స్వామీ! నీవు వనభోజనమునకై పాదచారిగా బయల్వెడలుట జూచి ఆ సమయమున నీ ఘనమైన పాదములకంటిన దుమ్ములేచినది. ఆ ధూళితో ముల్లోకములనున్న మునులును పవిత్రులై తరించుటకు గుంపుగా మూగుటకు సిద్ధపడిరి. వారి శరీరములు పులకరించగా నీ పాదరజమును తమ శిరస్సులపై దాల్చిరి ప్రభూ! ఓ గురువాయూరప్పు! నందనందనా! ఈ విష్ణుగాథను నీవు ఆలకింపుము తండ్రీ!

15/3

**తే॥ అవని పచ్చని గడ్డితో అలరియుండె**
**అందు ఆవుదూడల మేపనందరున్ను**
**తిరుగుచుండిరి, అంతలో దేవదేవ!**
**'అఘుడు' అను దనుజుడు నిన్ను అంతమొంద**
**జేయ 'కొండచిలువ' వోలె జేరినాడు**
**పాపబుద్ధిచే యడ్డె నీ మార్గమతడు,**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమందు**
**వినుము గురువాయుపురనాథ! ఈ విష్ణుగాథ**

తా॥ ఓ దేవదేవా! దట్టమైన గడ్డిచే అక్కడ భూమియంతయు పచ్చగా నుండెను. అచ్చోట నీవు నీ స్నేహితులందరును ఆవుదూడలను మేపుచు తిరుగుచుండిరి. ఆ సమయమున 'అఘుడు' అను రాక్షసుడు పెద్ద కొండ చిలువ రూపమును ధరించి నిన్ను చంపవలెనను పాపబుద్ధిచే మీ మార్గమడ్డగించెను. నారాయణ భట్టతిరి కావ్యమును నేను తెలుగు పద్యంగా చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! దీని నాలకింపుము తండ్రీ!



15/4

**సీ॥ ఆ వనంబున ప్రభూ! అడ్డంబుగా వాడు**
**కొండచిలువ వోలె పండుకొనెను**
**వాని శరీరంబు పర్వతంబై తోచె**
**పరికించి చూడగా తెరచియున్న**
**నోరు విస్తృతగుహద్వారంబులా తోచె**
**అచట నీ మిత్రులు ఆడుకొనుచు**
**నినువీడి దవ్వున నిలువరింపగ లేని**
**కౌతుకంబున గుహగా తలచి**

**తే॥ దాని నోటిలో దూరిరి తాము అపుడు**
**భట్టతిరి నాడు చెప్పిన భాగవతము**
**తెలుగు పద్యంబు జేసితిన్ దేవదేవ!**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ!**



తా॥ ఓ దేవదేవా! ఆ వనమునందు అడ్డముగా పండుకొనియున్న ఆ కొండచిలువ శరీరము ఒక మహాపర్వతమువలె నున్నది. వాడు అఘాసురుడు. తెరచియున్న ఆ కొండచిలువ యొక్క విశాలమైన నోరు ఒక పెద్ద గుహవలెనుండెను. నీవు కొద్ది దూరములో ఉండగా నీతోడి గోపబాలురు నిన్ను వదిలి కొద్ది దూరమున ఆపుకోలేని కుతూహలముతో దాని నోరు ఒక పెద్ద గుహ అనుకొని దాని నోటిలో ప్రవేశించిరి. వారివెంట దూడలు కూడా అనుసరించినవి. నారాయణ భట్టతిరి సంస్కృతములో సంక్షిప్తంగా భాగవతమును రచించిరి. ప్రభూ! దానిని తెలుగు పద్య రూపంలో నేను తెలుపుచున్నాను. ఓ గురువాయూరప్పా! నన్ననుగ్రహించి దానినాలకింపుము.



15/5

**ఉ॥**
**చూడక గోపబాలకులు జొచ్చిరి సర్పపు నోట, దేహముల్**
**మాడెను, తాపమెక్కి భయభ్రాంతులు చేసిరి ఆర్తనాదముల్**
**వీడవు ఆర్తులన్ గనుక, వేరుగ బ్రోచెడి వారు లేరుగా,**
**కూడగ మిత్రులన్ అఘుని క్రూరు ముఖంబున దూరినావు,కా**
**పాడగ నీకు సాటెవరు? మా గురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ స్వామీ! గోప బాలురందరూ చూడక ఆ విధముగా ఆవుదూడలతో కలిసి పొరపాటున ఆ కొండచిలువయొక్క నోటిలో ప్రవేశించిరి. అప్పుడు వారి శరీరములు తాపము భరించలేక మాడిపోవుచున్నవి. వారు ఆర్తనాదములు చేయసాగిరి. వారి దుస్థితిని చూచిన నీవు ఆర్తత్రాణ పరాయణుడవగుటచే, వారిని రక్షించు వారెవరు లేనందున నీ మిత్రులను రక్షించుటకై ఆ క్రూర సర్పముయొక్క నోటిలో ప్రవేశించితివి. ఆర్తులను కాపాడటంలో ఓ గురువాయూరప్పా! నీసాటి ఎవరు? తండ్రీ!

15/6

**చం॥**

**అనుపమ లీల నీవపుడు ఆ విషసర్పము గొంతులోపలన్**
**గొనకొని దూరి దేహమును గొప్పగ బెంచగ, ఊపిరాడకన్**
**తను పొరలాడె భూమిపయి తాళక సర్పము, నోరు చీల్చుచున్**
**మును అది మ్రింగివేసినవి మొత్తము తెచ్చితివయ్య వెల్వడన్**
**విను గురువాయు పట్టణపు విష్ణుని గాధను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! నీవు ఆ మహాసర్పము యొక్క గొంతులో ప్రవేశించి, నీ శరీరమును విపరీతముగా పెంచితివి. దానివలన ఆ సర్పము ఊపిరి ఆడక భూమిపై పొరల సాగినది. నీవు వెంటనే దానినోటిని చీల్చివేసి ఇంతకు పూర్వం ఆ దుష్ట సర్పము మ్రింగిన మొత్తమన్నింటినీ బయటకు వెలువడగా తెచ్చితివి. అందరినీ ఆవిధంగా నువ్వు రక్షించావు. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!



15/7

**తే॥ అజగరము వలె నున్న ఆ అసురుడట్లు**
**వీడె ప్రాణముల్ అవ్వాని మేనినుండి**
**దివ్యకాంతి పుంజంబొండు దిశలు వెలుగ**
**మెరిసి నింగిలో క్షణమున జేరె నిన్ను**
**అప్సరసలు నాట్యంబాడనా సురులును**
**పాడి నిన్ను కీర్తించిరో పరమపురుష!**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమయ్యె**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.**

తా॥ ఓ పరమపురుషా! ఆ కొండచిలువ రూపమున నున్న అఘాసురుడు మరణించగానే వాని శరీరమునుండి దివ్యకాంతి వెలువడి క్షణకాలము ఆకాశమున మెరిసి నీలో విలీనమై పోయినది. నీవు దాని శరీరము నుండి వెలువడి బయటకు రాగానే దివ్యకాంతి నీలో కలియుట జూచి అప్సరసలు నృత్యము చేసిరి. దేవతలు నిన్ను స్తుతించిరి. నారాయణ భట్ట తిరి వ్రాసిన భాగవతమును నేను తెలుగులో పద్యరూపంలో చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! దీని నాలకింపుము తండ్రీ!



15/8

**చం॥**

**వనజభవుండు దేవతలు ప్రస్తుతి జేసిరి అక్కజంబుతో**
**అనుపమ లీల బాలురతొ ఆడితివేమియు కానియట్లుగా**
**తినుటకు వేళయై ఇనుడు దీటుగ జేరెను నెత్తిమీదికిన్**
**వనమున భోజనంబునకు బాలురు నీవును గూడిరో ప్రభూ!**
**విను గురువాయు పట్టణపు విష్ణుని గాధను సర్వరక్షకా!**

తా॥ ఓ సర్వరక్షకా! బ్రహ్మదేవుడు మొదలైన దేవతలందరు నీవు అఘాసురుని సంహరించుట జూచి ఆశ్చర్యముతో నిన్ను కీర్తించిరి. ఆ తరువాత ఏమీ జరుగనట్లే ఆ గోపబాలకులతో అద్భుతముగా ఆడుకొంటివి. అంతలో మధ్యాహ్నం కావటం వలన సూర్యుడు నడినెత్తిపైకి వచ్చాడు. తినుటకు వేళ అయిందని నీవు నీతోడి బాలురును వనభోజనము చేయుటకు గుమిగూడినారు. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధనాలకింపుము ప్రభూ!



15/9

**సీ॥ శృంగనాదంబును చేర్చి వేణువుతోటి**
**కటియందు తినువేళ కట్టినావు,**
**పెరుగన్నమున్ తినువేళ పచ్చడిముక్క**
**నంజుకు తిన్నావు నవ్వులొలక**
**స్నేహితులందరిన్ చిలిపి మాటలతోటి**
**నవ్వించి కవ్వించినావు స్వామి!**
**అటువంటి అరుదైన అద్భుత దృశ్యంబు**
**గాంచిరా సురులెల్ల గగనమందు**

**తే॥ ఎంత భాగ్యము దక్కెను!! ఏమి పుణ్య**
**ములను గోపాలురేనాడు సలిపినారొ!!**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమందు**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.**

తా॥ స్వామీ! నీవు భుజించుచున్నపుడు నీ కొమ్ము బూరను, మురళిని నీనడుమునకు కట్టుకొంటివి. చేతితో, పెరుగన్నము తినునప్పుడు నంజుకొని పచ్చడి (ఆవకాయ పచ్చడి) ముక్కలు (వ్రేళ్ళమధ్య ఉంచుకొని) తిన్నావు. ఆ సమయమున నీ మిత్రులతో చలోక్తులాడుతూ వారిని నవ్వించి కవ్వించినావు. అట్లు వనభోజనము చేయుచున్న నిన్నుజూచి నింగిలోని దేవతలంతా అరుదైన ఆ అద్భుత దృశ్యం తిలకించి 'ఆహా! ఈ గోపాలురు ఏమి పుణ్యము చేసుకున్నారో కదా! ఇటువంటి భాగ్యం దక్కింది. ఇది ఏనాటి సుకృతమో' అని ప్రస్తుతించారు. నారాయణభట్ట తిరుల కావ్యాన్ని తెలుగు పద్యంగా చెబుతున్నాను. ఓ గురువాయూరప్ప! దీనినాలకింపుము తండ్రీ!



15/10

**తే॥ గోపబాలురతో నీవు కూడి 'చద్ది'**
**తినెడి దృశ్యంబు తిలకించ "దేవతలతొ**
**యజ్ఞభాగము తినుటను అతిశయించి**
**నీకు తోచెనేమో కదా!!" నీరజాక్ష!**
**అనుచు సురులెల్ల కీర్తించిరంత స్వామి!**
**అల్పులను కూడ కరుణతో ఆదరించు**
**దేవ! నావ్యాధి తొలగింపు బ్రోవుమయ్య!**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ**

తా॥ ఓ నీరజాక్షా! గోపబాలురతో వారి మధ్య సుఖముగా కూర్చుని వనభోజనము చేస్తూ చద్ది అన్నం తింటున్న నిన్ను చూచి ఆ దృశ్యమును దేవతలతో యజ్ఞ భాగమును తినుచున్న నిన్ను పోల్చుకొని నీవు ఇదియే ఎక్కువ ఆనందించుచుంటివని అంటూ దేవతలు నిన్ను కీర్తించిరి. అల్పులను కూడా కరుణించి ఆదరించే ఓ గురువాయూరప్ప! నా వ్యాధిని నివారించి నన్ను రక్షింపుము. ఈ విష్ణుగాథ నాలకింపుము తండ్రీ!



## 16. బ్రహ్మాకృతవత్సాపహరణము

**ఉ॥**
**వేగమె నీవునా అఘుని ప్రీతితొ బ్రోచితి విచ్చిమోక్షమున్**
**ఈగతి జూచెనానలువ ఏ అవతారము పోల్చిజూచినన్**
**తూగదు నందనందనునితో యనిపించగ నీ మహాత్మ్యమున్**
**తాగొని చూతమంచు తను దాచెను మాయతొ ఆవుదూడలన్**
**హే గురువాయు పట్టణపు ఈప్సితదాయక! ఆలకింపుమా**

తా॥ ఇష్టకామనలు తీర్చు ఓ గురువాయూరప్పా! అఘాసురుని నీవు సంహరించి కూడా ప్రేమతో వానికి నీవు మోక్షం ఇచ్చి కృతార్థుని చేశావు. ఇది గమనించి ఆ బ్రహ్మదేవుడు నీవు ఇదివరలో ఏ అవతారము నందునూ ఇటువంటి దివ్య మహిమలు ప్రదర్శించలేదు కదా! ఈ నందనందనుని అవతారంతో గతంలోని ఏ అవతారమూ తూగదు. ఇప్పుడు నీ ఈశ్వరత్వమెటువంటిదో ఒకసారి పరీక్షించెదము అనుకొని తనమాయచేత ఆవుదూడలను అదృశ్యము చేసెను. ఓ ప్రభూ! ఆ ఉదంతము నాలకింపుము తండ్రీ!



16/2

**సీ॥ దూడలు లేక ఆందోళన చెందిన**
**గోప బాలురు తాము గోడువెట్ట**
**'నలువ' తుంటరి పని తెలిసిన నీవంత**
**"నిశ్చింత నుండుడు నేను జూతు"**
**అని నీవు తినుచుండ అన్నంబు నా బ్రహ్మ**
**గోపులజేసె నగోచరంబు**
**నీ మహిమన్ జూప నిశ్చయించితివేమొ!!**
**బ్రహ్మతండ్రివి గదా!! పరమపురుష!**

**తే॥ తప్పుదారిని బట్టిన తనయునెట్లు**
**తండ్రి కాపాడునో యట్లె తలచినావు,**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమందు**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.**

తా॥ ఓ పరమపురుష! తాము కాయుచున్న దూడలు కనబడనందున గోపబాలురందరు చాలా ఆందోళన చెంది దుఃఖించిరి. ఇది యంతయు బ్రహ్మదేవుడు చేసిన చిలిపి పని అని గ్రహించిన నీవు గోపాలురతో నిశ్చింతగనుండుడని దెలిపి నీవు అప్పటికే సగము తినిన అన్నమును తినుచుంటివి. నీవు స్వయముగా ఆ బ్రహ్మకే తండ్రివగుటచే నీ మహిమను బ్రహ్మదేవుని కెరింగించ వలెననుకొంటివి. నీవు అప్రమత్తుడుగా లేనట్లు అన్నము తినుచుండగా బ్రహ్మగోపాలురను కూడ మాయము చేసెను. నీ బిడ్డయైన బ్రహ్మ తప్పుదారి పట్టుచున్నాడు గాన వానిని సన్మార్గములో బెట్టవలెనని నిశ్చయించుకొంటివి. నారాయణ భట్టతిరి కావ్యమును నేను తెలుగు పద్యరూపంలో చెబుతున్నాను. ఓ గురువాయూరప్ప! ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!



16/3

చం॥

**వనమున గోపబాలురుగ వత్సలుగా నువు మారిపోయినీ**
**ఘనతను జూపి, గోవులును, కాపరులున్, హరివోలె మారుచున్**
**గొనితమ వస్తుసంపదను గూడుచు సర్వము నీవెయై గృహం**
**బున కరుదెంచినావు, మిము పోల్చగ జాలకపోయి రొక్కరున్!!**
**వినుగురువాయుపట్టణపు విష్ణుని గాధను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! బృందావనమున నీవే స్వయముగా, గోపబాలురుగాను ఆవుదూడలుగాను మారిపోతివి. ఆ గోపాలుర వస్తు సముదాయములైన చిక్కములు, ముంతలు, మురళి, కొమ్ము వాద్యములు కూడా నీవే అయిపోతివి. చూసేవారికి నీమాయవలన వేరు వేరు గోపాలురు దూడలు కృష్ణుడు అక్కడ ఉన్నట్లు తోచుచున్నది. సర్వమూ నీవే అయితివి. సాయంకాలం మీరంతా ఇళ్ళకు రాగానే మిమ్మల్ని ఆ గోకులంలో ఏ ఒక్కరూ పోల్చుకోలేక పోయారు. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!



16/4

తే॥ **అట్లు గోవులు దూడలు అన్ని నీవె**
**ఐతివో ప్రభూ! గోకులమందు, నిన్ను**
**పోల్చకుండిరి తమతమ పుత్రునెవరు,**
**వారు ఆనందమొప్ప అవ్యాజమైన**
**ప్రేమ లాలించి దరిజేర్చి తాము 'మురియ'**
**కడుమనోహరంబా లీల కమలనాభ!**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమందు**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! ఆవిధముగా నీమాయచేత గోప బాలురు, వారి సామాగ్రి ఆవుదూడలు కూడా నీవే అయిపోతివి. గోకులములో ఎవ్వరూ నిన్ను తమపుత్రుడు కాదని పోల్చుకోలేకపోయారు. వారి ఆనందము ప్రకటించుచు అవ్యాజమైన ప్రేమతో తమ బిడ్డల రూపములోనున్న నిన్ను దగ్గరకు తీసికొని మురిసిపోయిరి. ఓ కమలనాభా! నీ ఆ లీల ఎంత



మనోహరముగా నున్నది!! నారాయణ భట్టతిరి కృతిని నేను తెలుగు పద్య కావ్యంగా వ్రాస్తున్నాను. ఓ గురువాయూరప్ప! దీనినాలకింపుము తండ్రీ!

16/5

ఉ॥

**జీవుడు యెవ్వడో తమను జేరిన సంతతి వోలె ఈభువిన్**
**నావుడు అందరున్ తమరి 'నందనుడే' యని ప్రేమనిత్తురే**
**ఈ విధి వింతకాదు కద! ఇప్పుడు విష్ణుడె బిడ్డడైనచో**
**ఆ వివరంబు జెప్పగలయంత కవిత్వము రాదు ఓ ప్రభూ!**
**కావుము నన్ను నీ సుతునిగా గురువాయు పురాధి నాయకా!**

తా॥ ఓ ప్రభూ! సాధారణముగా ఎవరో ఒక జీవుడు తమకు సంతానముగా పుట్టినప్పుడు ఆ జీవుని బిడ్డగా భావించి, వానిపై మమతానురాగములను విశేషముగా చూపుదురు. ఇందులో వింతేమీ లేదు. ఇక ఇప్పుడు పరమాత్ముడైన విష్ణువే బిడ్డడైతే వారెంత

మమత అనురాగం చూపిస్తారో చెప్పటం సాధ్యమా? ఓ గురువాయూరప్ప! నాకు అంత కవిత్వం రాదుయ్యా. అయినా నన్ను రక్షింపుము తండ్రీ!

16/6

**సీ॥ ఆ రీతి గోపికల్ ఆవులున్ నిను తమ**
**సంతానముగ పొంది సంతసించి**
**నీముద్దు మురిపాలు నిర్మలంబౌ ప్రేమ**
**పొందిరి ఏ జన్మ పుణ్యమయ్యా!**
**నీ అన్న బలరాముడున్ అది నేర్చెను**
**ఒక వత్సరము అయినాక స్వామి!**
**పరమాత్మ రూపులే ఇరువురుయైనను**
**ఎంత భేదము ప్రభూ! ఇందిరేశ!**

**తే॥ ఇంక నీమహిమెరుగంగ ఎవరికగును?**
**భట్టతిరినాడు చెప్పెను భాగవతము**
**తెలుగు పద్యంబు జేస్తిని దేవదేవ!**
**వినుము గురువాయు పురనాథ! విష్ణుగాథ**



తా॥ ఓ ప్రభూ! ఇందిరా రమణా! దేవదేవా! ఆ విధముగా గోపికలు, ఆవులు తమ సంతానరూపములో నున్న నిన్ను పెల్లుబుకుచున్న ఆనందముతో నీ ముద్దు మురిపాలను నిర్మల ప్రేమను పొంది ఎంతో సంతోషించిరి. ఆ ఆనందమంతా ఏ జన్మ పుణ్యఫలమో అని తలంచిరి. ఈ నీమహిమను నీ అన్న బలరాముడు కూడ ఒక సంవత్సరం గడచిన తరువాత మాత్రమే గ్రహించగలిగెను. మీరిద్దరూ పరమాత్మ స్వరూపములే అయిననూ మీ ఇద్దరిలో ఎంత భేదమున్నదో కదా! (శ్రీకృష్ణుడు నిష్కల పరబ్రహ్మ, బలరాముడు సకల పరబ్రహ్మ) అటువంటప్పుడు మాబోటి సామాన్యులకు నీ లీలలు అర్థమవుతాయా? భాగవత గాథను నారాయణ భట్టతిరి సంస్కృతంలో రచించారు. నేను తెలుగు పద్యంగా చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! దీని నాలకింపుము తండ్రీ!



16/7

**సీ॥ ఈ విధిగడచెను ఏడాది ఓప్రభూ!**
**తొలగించె మాయ చతుర్ముఖుండు,**
**గోపబాలురు గాని గోవత్సములు గాని**
**రెండేసి కనిపించె లెక్కజేయ**
**ఎవ్వని దాచాడొ? ఎవ్వడు మాయయో?**
**తెలియరాకుండెనా నలువకైన**
**వ్యామోహమున బడి ఆలోచనే పోయి**
**భ్రమ పాలబడెను ఆ బ్రహ్మయంత**

**తే॥ వారు అందరు విష్ణులై బ్రహ్మ చూడ**
**నాల్గుభుజముల 'శ్యాము' లైనారు అపుడు,**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమందు**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.**



తా॥ ఓ ప్రభూ! ఆ విధముగా ఒక సంవత్సరము గడిచినది. తరువాత బ్రహ్మదేవుడు తన మాయను ఉపసంహరించుకొనెను. కాని అతనికి ఇద్దరేసి గోపబాలురును వారి ఆవుదూడలును ఒకేచోట కనిపించిరి. వారిలో నిజమైన వారెవరో, మాయచే శ్రీకృష్ణుని సృష్టి ఎవరో ఆ బ్రహ్మకు పోల్చుట అసాధ్యమయ్యెను. అతడు వివేకమును కోల్పోయి వ్యామోహములో పడి భ్రమపడసాగెను. అతనికి అందరును కిరీటధారులై సాయుధులైన చతుర్భుజుడు శ్రీమన్నారాయణునిగా గోచరించిరి. అంతమంది శ్యామసుందరులను జూచిన ఆ విరించి అప్రతిభుడయ్యెను. నారాయణ భట్టతిరి రచించిన భాగవతమును నేను తెలుగు పద్యములలో చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! దీని నాలకింపుము తండ్రీ!

16/8

సీ॥ ప్రతియొక్క గోపబాలకునిలో, దూడలో
నయనంబులార ఆ నలువగాంచె
అరమోడ్పు కన్నుల హరిశేషశయనుడై
తిలకించుచుండె శ్రీదేవి తనకు
పదపంకజములొత్తి పతిసేవ చేయంగ
ప్రతిచోట గాంచెనా బ్రహ్మయంత
అనుపమ భక్తితో సనక సనందను
లందరు గొలువంగ అతిశయించి

తే॥ నీదు లీలామహాత్మ్యంబు నిరుపమాన
మయ్య! నలువకున్ తెలియంగ నలవికాదు,
భట్టతిరి కృతి తెలుగులో పద్యమందు
వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.

తా॥ ఓ గురువాయూరప్పా! ఆ బ్రహ్మదేవుడు ప్రతియొక్క గోపబాలునిలోను ప్రతియొక్క ఆవుదూడలోను నీరూపమునే గాంచెను. ఆ విష్ణువులందరు ఆదిశేషునిపై పవశించి అరమోడ్పు కన్నులతో



చిరునవ్వుతో శ్రీలక్ష్మి ప్రేమగా పాదపద్మముల నొత్తుచు సేవించుచుండగా, అనేకమంది శేష శయనులను ఆ బ్రహ్మ అప్పుడు తిలకించెను. భక్తి తత్పరులై సనక సనందనాది మహాయోగులు ఆ పరాత్పరుని సేవించుచుండిరి. ఓ ప్రభూ! నీ లీలా మహాత్మ్యములు నిరుపమానములు. ఆ బ్రహ్మకు కూడ నీ మహిమ తెలుసుకొనుట అసాధ్యం. నారాయణ భట్టతిరి రచించిన భాగవతమును నేను తెలుగు పద్యంగా చెబుతున్నాను. ఆలకింపుము తండ్రీ!

16/9

చం॥
కనుగొనెనా విరించి తన కన్నుల నమ్మడు వేల బ్రహ్మలన్,
ఘనులగు వేల విష్ణులకు కాళ్ళకు మ్రొక్కుచు ఒక్కచోటనే,
అనుపమ మాయలీలయది అంతము జేయగ కాంచెనోప్రభూ!
తిని సగమన్నమున్ నిలిచె దీటగు బాలుడు చేతముద్దతో
విను గురువాయు పట్టణపు విష్ణుని గాథను నందనందనా!



తా॥ ఓ నందనందనా! బ్రహ్మదేవునకు తన కన్నులను తనే నమ్మలేని ఒక లీల జరిగింది. అనేక (వేలకొలది) నారాయణ రూపములు, ఘనులైన ఆ మహామహుల పాదసేవ చేయుచున్న అనేక (వేలకొలది) బ్రహ్మలను ఒకేచోట కనుగొనెను. అనిర్వచనీయమైన ఆ మాయను వివరించుట అసాధ్యము. అప్పుడు నీవే నీ మాయనుపసంహరించితివి. ఓ ప్రభూ! అప్పుడు బ్రహ్మ కనులముందు సగము తిన్న అన్నపుముద్ద ఒకచేత పట్టుకొని నిలుచున్న బాలకృష్ణుడు ఒక్కడే కనిపించెను. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథనాలకింపుము తండ్రీ!

16/10

తే॥ బ్రహ్మదేవుని మోహంబు పరిసమాప్తి
చెందె, నాతండు జగపతి శ్రీరమణుని
నిన్ను స్తుతియించి వెడలెను నిగమవంద్య!



వెనుక ముదముతో చెలికాండ్రు వెంటరాగ
చేరినావు గోకులమును చిన్ని కృష్ణ!
నాదు వ్యాధిని తొలగించి నయము గూర్పు
భట్టతిరి కృతి తెలుగులో పద్యమందు
వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.

తా॥ ఓ చిన్ని కృష్ణా! బ్రహ్మదేవునియొక్క మోహమంతయు నశించినది. అందువలన అతడు జగన్నాథుడవైన నీకు అనేక నమస్కారములను చేయుచు అనేక విధముల స్తుతించెను. తరువాత తన లోకమునకు పోయెను. అప్పుడు సంతోషముతో నున్న నీ స్నేహితులు వెంటరాగ నీవు గోకులమునకు చేరుకొంటివి. ఓ గురువాయూరప్పా! నాకు నా వ్యాధిని తొలగించి స్వస్థత చేకూర్చుము. నారాయణ భట్టతిరి వ్రాసిన భాగవతాన్ని తెలుగు పద్యంలో చెబుతున్నాను, ఆలకింపుము తండ్రీ!

# 17. ధేనుకాసుర వధ

కం॥ ఆ గతి బాల్యము గడచెను
బాగుగ కౌమార దశను బడసితివాపై
చేగొంటి 'వాల గాయుట'
ఓ గురువాయుపురినాథ ఉత్సాహముగా

తా॥ ఓ గురువాయూరప్పా! ఆ విధముగా నీకు బాల్య దశ గడచి పోయినది. బాగుగా కౌమార దశను చేరుకొంటివి. అందువలన ఇకమీద నీవు ఆవు దూడలను కాయుట మాని ఆలను (ఆవులను) కాయుటను ఉత్సాహముగా స్వీకరించితివి.



17/2

ఆ.వె॥ 'గోత్ర' రక్ష కొఱకు కోరగా సురులెల్ల
గోత్ర పాలనంబు గొంటి వయ్య!
ధరను వెలసినావు గురువాయుపురనాథ!
నీకు తగిన పనియె నిగమవంద్య!

తా॥ ఓ గురువాయూరప్పా! నీవు చేయుచున్న పని నీకు అనుగుణముగానే ఉన్నది. నీవు గోత్ర (భూలోకము) రక్షణమునకు (భూ భారమును తగ్గించుటకు) దేవతలు కోరగా అవతరించావు.కావున దానికి తగ్గట్లుగానే గోత్రపాలన (గోవులను కాయుట) మొదలు పెట్టావు. వేదములు కీర్తించెడి ప్రభూ! నీకు నీవే సాటి.



17/3

ఉ॥
**చేరెను యొక్కనాడు తన స్నేహితులన్ గొని అన్న రాముడున్**
**కోరిరి నేడు చూతమని గుంపుగ అందరు వన్య శోభలన్**
**దూరిరి ధేనుకాసురుడు దుష్టుని తాళవనంబు చూడగన్**
**మీరిన సంతసంబునను మిత్రుని ప్రోద్బల మెక్కుడౌటచే**
**శ్రీరమణీవిభో! వినుము శ్రీగురువాయు పురీశుగాథలన్**

తా॥ ఓ గురువాయూరప్పా! ఒకనాడు నీయన్న బలరాముడు, నీ స్నేహితులతో గుంపుగా కలిసి వనశోభలను తిలకించుచు హాయిగా విహరించ సాగిరి. అప్పుడు నీ మిత్రుడు (శ్రీదాముడను పేరుగలవాడు) చేసిన ఒక సూచన ప్రకారం ఆరోజు తాళవనం (తాటిచెట్లతోట) చూచెదమని అనుకొంటిరి. ఆ వనంలో ధేనుకాసురుడనే దుర్మార్గుడైన రాక్షసుడు నివసిస్తున్నాడు. శ్రీపతివైన నీవు నీ మిత్రులు మిక్కిలి సంతోషముగా నుండిరి. ఓ తండ్రీ! ఈ కథనాలకింపుము.



17/4

తే॥ **దేవ! నీమాటపై బలదేవుడపుడు**
**తాటి పండ్లకై ఊపెను తాటిచెట్టు**
**నతని రెండు చేతులతోటి అటు నిటునుచు**
**జలజలా రాలిపడె పండ్లు జలజనాభ!**
**ధ్వనిని విని గార్ధభపు రూపి దనుజుడొకడు**
**ధేనుకుండని యెడివాడు తరలివచ్చె**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమందు**
**వినుము గురువాయు పురనాథ! విష్ణుగాథ**

తా॥ ఓ దేవా! అప్పుడు నీమాట మీద బలరామ దేవుడు తాటిపండ్లకొరకు ఒక తాటిచెట్టును చేతులతో పట్టుకొని గట్టిగా ఊపెను. అప్పుడు తాటిపండ్లు జల జలా రాలినవి. ఆ ధ్వనిని విని గాడిద రూపములో నున్న ధేనుకాసురుడు వెంటనే అక్కడికి తరలివచ్చెను. ఓ పద్మనాభా! భట్టతిరి కావ్యం తెలుగు పద్యరూపంలో ఆలకించుము తండ్రీ! గురువాయూరప్పా! నన్ను రక్షింపుము.

17/5

ఉ॥

**ధేనువులన్ సురక్షగొని దీటుగ 'కాతు'నటంచు దీక్షతో**
**ఏనుజనించినాడ నిక నెవ్విధి నావ్రత భంగపాటునన్**
**'ధేనుక' దేత్యు జంపనని, తేకొని అన్నను బంపినావొకో!!**
**వానిని యుద్ధమందు బలభద్రునిచే హతుజేస్తివో ప్రభూ!**
**పూనిక నాలకింపుమిది ఓ గురువాయుపురాధి నాయకా!**

తా॥ ఓ ప్రభూ! ధేనువులను (ఆవులను) రక్షించుటకు దీక్షబట్టినావేమో!! అందుకే నేను ఈ ధేనుకుని జంపను. ఈ ధేనువును (ధేనుకాసురుని) దేవతల వైరియైనందున వదలను. వీనిని నా అన్న బలరామునితో చంపించెదననుకొన్నావేమో, అందుకనే వానిని యుద్ధంలో నీ అన్నతో చంపించావు. ఓ గురువాయూరప్పా! పనివడి ఈ భాగవతమును ఆలకింపుము తండ్రీ!



17/6

తే॥ **తమ అధిపుడైన ధేనుకున్ యమునికడకు**
**బంప, జంబూకముల వోలె వాని భటులు**
**మిమ్ము జంపంగ బడిరి మీ మీద స్వామి!**
**వారి జంబూఫలములట్లు ఇరువురున్ను**
**బాది తాళవృక్షాలపై వడిగ విసరి**
**సంహరించిరి చూడ మీ సఖులు యెల్ల**
**భట్టతిరి నాడు చెప్పిన భాగవతము**
**వినుము గురువాయుపురనాథ! తెనుగు కృతిగ**

తా॥ ఓ స్వామీ! తమ అధిపతియైన ధేనుకాసురుడు చంపబడినందువలన అతని భటులు, భృత్యులు అయిన రాక్షసులు జంబుకముల (నక్కల) రూపంలో మీమీద పడిరి. అప్పుడు నీవు, నీ అన్న బలభద్రుడు జంబూఫలములను (అల్లనేరేడు పండ్లను) మాదిరి ఆ జంబుకమును బోలిన రాక్షసులను తాటిచెట్లకు బాది సంహరించి విసిరివేసిరి. ఓ గురువాయూరప్పా! భట్టతిరి కృతిని తెలుగు పద్య గాథగా ఆలకింపుము తండ్రీ!



17/7

చం॥

**పనివడి జంబుకంబులను పాయక జంపుట చూచి భీతిచే**
**అనుకొనెనేమొ!! ఆ వరుణుడంతట 'జంబుక'నామధేయమున్**
**గొననిక నేను కూడయని గోప్యముగా, భళి!! వేదమందునన్**
**తనుగనె పేరు జంబుకని తక్కినచోట్లను కాక, ఓ ప్రభూ!**
**విను గురువాయుపట్టణపు విష్ణుని గాథను నందనందనా!**

తా॥ వరుణుడు వేదములలో 'జంబుక' అనే పేరుతో ప్రసిద్ధుడు. కాని ఆ పేరు కేవలము వేదములకే పరిమితమై తక్కినచోట్ల ఎక్కడా ప్రస్తావించ బడలేదు. ఓ నందనందనా! నీవూ బలరాముడూ ఆరోజు జంబూకములను (నక్కలను) అట్లు సంహరించుట జూచి భయపడి తనుకూడ రహస్యముగా ఆ నిర్ణయం తీసికొనినాడేమో!! ఎందుకంటే తక్కిన ఏ సందర్భంలోను వరుణుడు 'జంబుక' అని పిలువబడలేదు. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!



17/8

చం॥

**దునుముట నీ వ్రతంబు కద! దుష్టుల, కాయుచు శిష్టులందరిన్**
**ఘనమగు, రూపు దాల్చితివిగా యది సత్ఫలమిచ్చెనివ్విధిన్**
**నిను కొనియాడిరీ పగిది నీకు విధేయులు దేవతల్ ప్రభూ!**
**విని నువు నవ్వుకొంటివిగ విందుగ గైకొని తాటిముంజలన్**
**విను గురువాయుపట్టణపు విష్ణుని గాథను నందనందనా!**

తా॥ ప్రభూ! దుష్టులను శిక్షించుట, శిష్టులను రక్షించుట నీ ఆచారము. అట్టి ఘనమైన ఆచారము నీ అవతారము యొక్క సత్ఫలితము. నేడు గదా! ఆ ఫలితము లభించినది అని దేవతలు నిన్ను కొనియాడ సాగిరి. నీవు ఆ మాటలు విన్నట్లు నవ్వుకొంటివి. నీ స్నేహితుల గూడి నీవు తాటి ఫలములను (ముంజలను) ఆరగించితివి. నందనందనుడివైన గురువాయూరప్పా! ఈవిష్ణుగాధనాలకింపుము తండ్రీ!

17/9

కం॥ **కలుగుచు తీయటి గుజ్జును**
**ఫలములు రసమూరె గోపబాలురు మెచ్చన్**
**తలిదండ్రులకును దెచ్చిరి**
**అల గురు వాయూరు నాథ! హరికథ వినుమా**

తా॥ ఓ గోపాలా! మంచి గుజ్జు కలిగి, మిక్కిలి తీయని రసమును స్రవించు తాటి పండ్లను తీసికొని నీవును నీ మిత్రులును మెచ్చుకొంటూ ఆరగించిరి. కొన్ని పండ్లు తల్లిదండ్రుల కొఱకు ఇళ్ళకు తీసికొని పోయిరి. అక్కడ నెలకొన్న ఓ గురువాయూరప్పా! ఈ శ్రీహరిగాధను ఆలకింపుము తండ్రీ!



17/10

తే॥ **నందనందనా! ఈ కథ నందవ్రజము**
**నందు వ్యాపించె ఆనందమందిరంత,**
**తాటిపండ్లు భుజించుచు తనివిదీర**
**"జయము శ్రీకృష్ణ! వర్ధిల్లు జయమునీకు"**
**అనుచు దీవించిరందరు మనసు నిండ**
**నాదు వ్యాధిని తొలగించి నయము నిమ్ము**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమందు**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ**

తా॥ ఓ నందనందనా! ఈ కథను నందవ్రజము లోనున్న గోపాలురందరు 'ధేనుకాసురుడు చనిపోయినాడట' అని చెప్పుకొనుచు తీయటి తాటిపండ్లు భుజించుచు "శ్రీకృష్ణా నీకు జయము, కలకాలము జయముతో వర్ధిల్లుము" అని దీవించిరి. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి కావ్యమున తెలుగు పద్య రూపములో ఆలకించి నావ్యాధి తొలగించి, నన్ను రక్షింపుము తండ్రీ!



## 18. కాళీయోపాఖ్యానము

తే॥ **పరమభక్తుడు 'సౌబరి' మౌని, తొల్లి**
**నిలిచి కాళింది నదిని పన్నెండు యేళ్ళు**
**ఘోర తపమాచరించెను, పరమపురుష!**
**కామపీడిత మీనాల గాంచి తాను**
**తమిని తిలకించినాడు మీనముల జంట,**
**అచట క్షుద్బాధతో జేరె అభ్రగపతి**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమందు**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ**

తా॥ ఓ పరమపురుషా! పూర్వకాలంలో నీకు పరమభక్తుడైన "సౌబరి" మహాముని యమునా నదిలో ఉండి పన్నెండేళ్ళు ఘోరతపస్సు చేశాడు. అప్పుడతనికి భోగాసక్తిగల మీన మిధునం (చేపలజంట) కనబడి వానిపై మమకారం కలిగినది. ఆ సమయమున ఆకలిగొన్న గరుత్మంతుడు చేపలను తినుటకు యమునానదికి వచ్చెను. ఓ గురువాయూరప్పా! భట్టతిరి భాగవతమును తెలుగు పద్యరూపంలో ఆలకింపుము ప్రభూ!



18/2

చం॥
**గరుడుడు ఆ నదీ తటిని గ్రక్కున మ్రింగెను మీల జంట తాన్**
**అరయుచు మౌని 'సౌబరి' యునయ్యది తానిడె శాపమివ్విధిన్**
**దురితము చేసినావు కద! దుష్టుడ! చంపితివేని ఈ తటిన్**
**త్వరపడి, చత్తువింక ఇది తథ్యము ప్రాణము నిల్పుకొమ్మికన్**
**గురు అనిలాలయాధిపతి! క్రొత్తగ జెప్పెద విష్ణుగాథలన్**

తా॥ ఓ గురు అనిలాపురీశా! (గురువాయూరప్పా!) నీ వాహనమైన గరుత్మంతుడు ఆ యమునా నది ఒడ్డున ఆకలికి తాళలేక ఆ సౌబరి కావ్యాయువైన చేపలజంటను గుటుక్కున మ్రింగెను. అది చూచి ముని విపరీతముగా కోపించి 'ఇచ్చట చంపి తినుట అనే తప్పు ఇకపై చేశావంటే తప్పక చచ్చిపోతావు పో! ఇక ఇటు రాకుండా ప్రాణాలు నిలుపుకో" అని శపించాడు. నేను నూతన విధానంలో చెప్పెడి నీ కథను ఆలకింపుము తండ్రీ!

18/3

**సీ॥ స్వామి! కాళియుడను సర్పరాజొక్కండు**
**మదమెక్కియుండెను అదియుగాక,**
**పన్నగవైరిదౌ 'బలి భాగమును' గాంచి**
**తానే భుజించెడి 'తప్పు' జేసె**
**'బంటు' నీకైన ఆ వైనతేయుడు క్రుద్ధు**
**డై నాడు కాళియుపైన బడెను,**
**రెక్కలు జాడించి యొక్క సారిగ దూకి**
**లావుదెబ్బను కొట్టి వివశుజేసె**

**తే॥ శాపవృత్తాంత మెరిగిన సర్పరాజు**
**యమునలో దాగె రాలేదు 'అరి' యటంచు**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమందు**
**వినుము గురువాయూరప్ప! ఈ విష్ణుగాథ.**



తా॥ స్వామీ! కాళియుడను ఒక సర్పరాజు ఒకడు కలదు. వాడు గర్వముతో మదించి యుండెను. గర్వాంధుడైన ఆ కాళియుడు, వినతాసుతుడైన గరుత్మంతునికి నిర్దేశించబడిన 'బలి' భాగమును తానే భుజించెను. సర్పముల ద్వేషియైన ఆ గరుత్మంతుడు కోపించి తన రెక్కలతో కాళియుని బలముగా దెబ్బవేసి వివశుని జేసెను. ఆ కాళియునకు గరుత్మంతుని శాపవృత్తాంతము తెలియుటచేత యమునానదిలో ప్రవేశించి తన శత్రువక్కడికి రాడని నదిలో దాగియుండెను. ఓ గురువాయూరప్పా! భట్టతిరి కృత భాగవతమును నేను తెలుగు పద్యముగా చెబుతున్నాను. ఆలకింపుము తండ్రీ!



18/4

**ఉ॥**
**ఆ నది దాగియున్న ఉరగాధిపుడవ్విధి నీటినంతటిన్**
**తాను విషంబు జేసెను మదంబున, వృక్షములెండిపోవగా**
**కానక నింగిబోయెడి ఖగంబులు, నీటిని త్రాగుజంతువుల్**
**పూనిక జచ్చె నీమనసు వూరట బాసెనశాంతి జెందివో**
**దీన జనాళి బ్రోచు సుమతీ! గురువాయుపురాధి నాయకా!**

తా॥ దీనజనులను రక్షించే మంచి బుద్ధిగల గురువాయూరప్పా! ఆ నదీ పరివాహక ప్రదేశమును, నీటిని ఆ నదిలో దాగియున్న సర్పరాజు విషప్రాయం చేస్తుండగా అందరూ భీతిల్లుటచే ఆ కాళియుడు మదించి యుండెను. ఆ విషప్రభావముచే చెట్లన్నీ ఎండిపోయెను, పక్షులు ఆకాశములో ఎగురుచున్నను చనిపోయెను. జంతువులు ఆ నీరు త్రాగి మరణించెను. అందుచే నీ మనసు అశాంతి జెందెను. ఆ ప్రాణులపై కరుణ కలిగెను. ఓ ప్రభూ! నీవే రక్షించవలెను.



18/5

**ఉ॥**
**ఆలను గాయబోతివిగ అచ్యుత! నీవొకనాడు మిత్రులున్**
**మేలుగ కూడినారు నిను వెంబడి, రాముడు లేదు తోడుతన్**
**కాలెను ఎండ గ్రీష్మమది కావలె నీరము, తాపమాపగన్**
**జాలక, దప్పితో గొనిరి, స్వాంతన బొంద నదీజలంబులన్**
**ఏలుదువార్తులన్ నిలిపి హే గురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ అచ్యుతా! ఆ సమయమున ఒకనాడు ఆవులను కాయుటకు నీ మిత్రులతో వనమునకు బోయినావు. నీ అన్న బలరాముడు ఆరోజు మీతో వెళ్ళలేదు. యమునానదీ తీరముననున్న మీకు అది గ్రీష్మ ఋతువైనందున కాలే ఎండలో ఉన్న వారగుటచే తాపము ఆపుటకు సాధ్యము కాక నెమ్మది పొందుటకు ఆ ప్రదేశముననున్న యమున లోని నీరు త్రాగిరి. ఓ గురువాయూరప్పా! ఆర్తులను నిలిపి రక్షించే తండ్రివి నీవేకదా!

18/6

తే॥ అచ్యుతా! నీరు త్రావి ఆ యమునలోన
గోపబాలురంతంబైరి గోవులున్ను,
పడిరి భూమిపై, కరుణతో మనసు నిండ
వెంటనే నదీతటికిని వెడలినావు
నీకృపా కటాక్షంబులు నిలిపి కురియు
అమృత ధారలై బ్రతికించె అందరిన్ని,
భట్టతిరి కృతి తెలుగులో పద్యమందు
వినుము గురువాయు పురనాథ! విష్ణుగాథ

తా॥ అచ్యుతా! యమునా నదిలోని నీరు త్రాగి ఆవులు, గోపాలకులు ప్రాణములు కోల్పోయి భూమిపై పడిపోయిరి. అదిచూచి నీమనస్సంతయూ జాలితో నిండిపోయెను. వెంటనే నీవు యమునానదీ తీరమునకు చేరుకొన్నావు. అమృతధారలను వర్షించు నీ కృపా కటాక్షములచేత ఆ జీవులందరిని బ్రతికించినావు. ఓ గురువాయూరప్పా! భట్టతిరి కావ్యమును తెలుగు పద్యరూపంలో వినుము తండ్రీ!



18/7

తే॥ "ఎంత సుఖముగా నున్నది!! వింత గొలుప
దేహములు చెప్పలేనట్లు తేలికాయె"
గోపులను కొనసాగిరి; కొంత తడవు
అయిన పిమ్మట తెలిసి నీ మాయ వారు
"నీ అనుగ్రహంబిది యంత నీరజాక్ష!"
పలికి కౌగిలించిరి నిన్ను ప్రస్తుతించి,
భట్టతిరి కృతి తెలుగులో పద్యమందు
వినుము గురువాయుపుర విభో! విష్ణుగాథ

తా॥ గోపాలకులు తమలో తాము ఈవిధంగా అనుకొన సాగిరి. ''మా శరీరమందంతా తేలికయై ఎంతసుఖముగా నున్నది! ఇది గొప్పవింత''. తరువాత వారికి నీదివ్య ప్రభావము తెలిసి యున్నందున ఇది అంతా నీ అనుగ్రహం వలననే జరిగినది అని తెలిసినది. ఓ నీరజాక్షా! అట్లు



పలుకుచు వారు నిన్ను కౌగలించుకొని పొగొడ్తలతో ముంచెత్తినారు. ఓ గురువాయూరప్పా! భట్టతిరి కృతిని తెలుగు పద్యంగా ఆలకించు ప్రభూ!

18/8

కం॥ గోవులు బ్రతికెను నీదయ
గోవిందా! ఎదుట నీవు కూడుట చేతన్
గావించె రవము "లంబా"
ఆవులు, ఓ గురుమరుత్పురాధిప! యంతన్

తా॥ ఓ గోవిందా! అప్పుడు నీ దయవలన గోపాలురతో పాటు, వారి ఆవులు కూడ బ్రతికినవి. వాటికి ఎదురుగా నీవుండుటచే ఆనందభాష్పములు కార్చుచూ 'అంబా' అను రవమునుగావించినవి. ఆవులన్నియు నీచుట్టూ చేరినవి.



18/9

ఆ.వె॥ ఒడలు పులకరించె నోముకుందా! విషం
బిట్లు ముదము గొలుపుటేమి వింత!!
గోపులెల్ల పొగిడి గురువాయురప్ప! నిన్
ప్రస్తుతించినారు వందనముల

తా॥ ఓ ముకుందా! మా శరీరములన్నియు పులకరించి మనస్సులన్నియు ఆనంద భరితములైనవి. విషము యొక్క ప్రభావమువలన ఇట్లు జరుగుట ఎంత వింత!! అని గోపబాలురందరు నిన్ను పొగిడినారు. నిన్ను అభినందించుచూ నీకు వందనమాచరించిరి. ఓ గురువాయూరప్పా! నీ కథనాలకింపుము తండ్రీ!

18/10

**తే॥ ప్రాణములు కోలుపోయిన భక్తవరుల**
**బ్రతుకునిత్తువు నీదయ వారికున్న**
**నీదు భృత్యుల రోగముల్ నిలువరించి**
**కాచు వాడవు, నాపైన కరుణబూని**
**నాదు వ్యాధిని సడలింపు నయము నిమ్ము,**
**భట్టతిరి నాడు చెప్పిన భాగవతము**
**తెలుగు పద్యంబు జేసితిన్ దేవదేవ!**
**వినుము గురువాయుపుర విభో! విష్ణుగాథ.**

తా॥ ఓ దేవదేవా! ప్రాణములను కోల్పోయిన నీ భక్తులను నీకృపాకటాక్షములచే ఈ విధముగా బ్రతికించితివి. అంతేకాదు నిన్ను సేవించెడి వారి రోగములన్నింటిని తొలగించెదవు. నన్ను కరుణించి నావ్యాధిని తగ్గింపుము, నాకు సేమము గూర్పుము. ఓ గురువాయూరప్పా! నారాయణభట్ట తిరుల కావ్యమును నేను తెలుగు పద్యంగా చెబుతున్నాను. ఆ భాగవతము నాలకింపుము తండ్రీ!



## 19. కాళియమర్దనము

తే॥ యమున జలములనున్న భయంకరమగు
సర్పమును అడ్డగించుచు జక్కజేయ
నిశ్చయించుకొంటివి ప్రభూ! నీవు; యమున
గట్టుపైనున్న 'ఎండిన' కడిమచెట్టు
నెక్కి కాళియుపై దూక నెంచినావు,
భట్టతిరి నాడు చెప్పిన భాగవతము
తెలుగు పద్యంబు జేసితిన్ దేవదేవ!
వినుము గురువాయుపుర విభో! విష్ణుగాథ.

తా॥ ఓ దేవదేవా! యమునానదీ జలములలోనున్న భయంకరమైన సర్పము కాళియుని అడ్డగించి వానిని చక్కగా చేయవలెనని నీవు నిశ్చయించుకొంటివి. ఓ ప్రభూ! నీవందుచేత వెంటనే యమునా తీరమున నున్న ఎండిపోయిన కడిమచెట్టుపై నెక్కి ఆ చెట్టున తన విషవాయువులచే ఎండించిన కాళియుపైన దూక నిశ్చయించుకొంటివి. భట్టతిరి వ్రాసిన భాగవతమును తెలుగు పద్యంలో చెబుతున్నాను. ఓ గురువాయూరప్పు! ఈ కథనాలకింపుము తండ్రీ!



19/2

**చం॥**
**అనుపమ కోమలంబులు పదాబ్జము లెంతొ మనోహరంబులున్**
**గొనకొని నిశ్చయించుకొని ఘోరవిషంబును లెక్కసేయకన్**
**వెనుకడుగేయకన్ కడిమివృక్షమునెక్కి నదీతరంగముల్**
**ఘనముగ పైకి పైకెగయగా వడి దూకితివయ్య మాధవా!**
**విను గురువాయు పట్టణపు విష్ణుని గాథను నన్ను బ్రోవుమా.**

తా॥ ఓ మాధవా! నీ పాదపద్మములు మిక్కిలి కోమలములు ఎంతయో మనోహరములు కాళియుడు వెదజిమ్ముచున్న ఘోరవిషమును కూడ లెక్కసేయక కృతనిశ్చయుడవై ఆ కడిమి చెట్టు నెక్కి భయంకరమైన అలలతో అల్లకల్లోలముగనున్న యమునానది మడుగులోనికి మిక్కిలి వేగముగా దూకితివి. ఓ గురు వాయూరప్పా! ఈ విష్ణుగాథనాలకించి నన్ను రక్షింపుము తండ్రీ!



19/3

**సీ॥ ముజ్జగంబుల భారమును బొజ్జలో మోయు**
**ఈవు కాళిందిలో ఎనసి వడిగ**
**దూక 'గభాలున' నీకున్న బరువుకు**
**తాకిడి యెక్కుడై తగిలెగాన**
**చెల్లాచెదరు నదిన్ చేసెను,భీకర**
**శబ్దమ్ము వినవచ్చె శ్రవణములకు**
**ఇరుదరులను ముంచె నూరు ధనస్సుల**
**దూరంబు క్షణములో నీరు జిమ్మె**

**తే॥ అలల తాకిడి ఓ ప్రభూ! అధికమాయె,**
**భట్టతిరి నాడు చెప్పిన భాగవతము**
**తెలుగు పద్యంబుగా నేడు తెలుపుచుంటి**
**వినుము గురువాయుపుర విభో! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! ముల్లోకపుల భారము నీ బొజ్జలో దాచుకొని నీవు ఆ యమునానదిలో మహా వేగముగా 'గభాలున' దూకుటచేత నీ బరువుకు తాకిడి ఎక్కువగా తగిలినందు వలన, ఆ నదిలోని నీరు పెద్ద శబ్దముతో చెల్లాచెదురై పోయెను. నదీ జలము క్షణకాలంలో నదికి ఇరువైపులా నూరు ధనస్సుల (చాల ఎక్కువ) దూరం ఎగజిమ్మింది. అలల తాకిడి అధికమై నీరు వ్యాపించినది.
నారాయణభట్టతిరి వ్రాసిన భాగవతము నేను పద్య రచన జేయుచున్నాను. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!



19/4

ఉ॥

**దిక్కుల విస్తరించెను నదీ జలమంతయు సుళ్ళు జుట్టుచున్**
**దిక్కులు పిక్కటిల్లినవి ధీరత జంపెడి శబ్దమాయె తాన్**
**మిక్కిలి కోపియై తను వివేకము బాసిన కాళియుండహో!**
**అక్కడ జేరె తెచ్చి పగ, ఆ నది గర్భము వీడెనో ప్రభూ!**
**చక్కగ నాలకింపు మనసా గురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ ప్రభూ! నీవుఎత్తునుండి దుముకుట చేత యమునానది నీరంతయు చెల్లాచెదురై దిక్కులందంతయూ విస్తరించెను. సుడులు జుటి నీరు వ్యాపించెను. దిక్కులు మారు మ్రోగు శబ్దము చూపరుల ధైర్యమును రూపుమాపునట్లు వినిపించెను. అందువలన కాళియుడు రెచ్చిపోయి మిక్కిలి కోపముతో వివేకశూన్యుడై నీటి అడుగును వీడి నీ దగ్గరకు వచ్చెను.
ఓ గురువాయూరప్పా! నిన్ను చక్కగా మనసారా ఆరాధింతును నీ కథను ఆలకింపుము తండ్రీ!



19/5

తే॥ **వేల పడగల సర్పంబు విషపుజ్వాల**
**అగ్ని శిఖలను బోలగ నతడు గ్రక్కు,**
**పెక్కు శిఖరములున్నట్టి పెనునగంబు**
**అంజనాద్రిని తలపించు, అతని పేరు**
**'కాళియుడు', వాని ఎదురుగా గాంచినావు,**
**భట్టతిరినాడు చెప్పిన భాగవతము**
**తెలుగు పద్యంబు జేస్తిని దేవదేవ!**
**వినుము గురువాయుపురనాధ! విష్ణుగాధ**

తా॥ ఓ దేవదేవా! వేల పడగలున్న ఆ సర్పము అగ్ని శిఖలవంటి విషజ్వాలల కక్కుచుండెను. ఆ సర్పము పేరు కాళియుడు. అనేక శిఖరములున్న 'అంజన్న' పర్వతమువలె నున్న ఆ పన్నగము వెరప కలిగించు నట్లుండెను. వానిని నీ ఎదురుగా చూచితివి. నారాయణ భట్టతిరి వ్రాసిన కావ్యమును నేను తెలుగుపద్యములలో చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! ఈ కథనాలకింపుము.



19/6

చం॥

**ఉరగపు కండ్లు తామెగసె నుజ్వల భీకర అగ్నిజ్వాలలన్**
**బరువుగ కొట్టుచుండె 'బుస' పన్నగమట్లు విషంపు వాయువుల్**
**వెరపుగ గక్కె, నిన్నతడు వేసెను కాట్లను యెన్నొ మారులున్**
**దురుసుగ నిన్నుచుట్టుకొనె, తోపవు యేరికి నీదు చేష్టలున్**
**గురువనిలుండు గొల్చుటకు కూడిన దేవర! ఆలకింపుమా.**

తా॥ ఓ దేవరా! ఆ మహాసర్పము యొక్క కండ్లనుండి అగ్ని జ్వాలలు యెగసి పడుచున్నవి. అతను పెద్దగా బుసకొడుతుంటే ఆ పన్నగము ముఖములనుండి భయంకరమైన విష వాయువులను కక్కింది. అతుడు (అనంతమైన బలముకల) నిన్ను (చాలచోట్ల) ఎన్నోమారులు కాట్లను వేసెను. అట్లె నిన్ను బిగించి చుట్టుకొనుట చేత నీవుగాని నీవు చేసే పనులుకాని ఎవ్వరికీ కనిపించుట లేదు. ఓగురువాయూరప్పా ఈ కథ నాలకింపుము తండ్రీ!

19/7

**కం॥ కనబడక నీవు, మిత్రులు**
**పెను కలతన్ జెంద, గోపవృద్ధులు రేప**
**ల్లెను చెడ్డ శకునముల్ గని,**
**చనిరో గురువాయురప్పు! సంరంభమునన్**

తా॥ ఓ గురువాయూరప్పా! యమునానదీ తీరమున నిలిచియున్న ఆ గోపాలురు, కృష్ణుడు తమకెవ్వరికి కనబడక పోవుట చేత గొప్ప కలతను చెందిరి. వ్రజభూమియైన రేపల్లెలో నందుడు మొదలైన గోపవృద్ధులకు చాల అపశకునములు కనిపించినవి. వారందరూ పరుగు పరుగున నదీ తీరమునకు వచ్చి చేరిరి.



19/8

**చం॥**
**జగముల నాయకా! తలచి సంకటమందున కృష్ణుడుండగా**
**తగదిక ప్రాణముల్ నిలుప, దాల్చిన దేహము లాభమేటికిన్?**
**అగునది మేలు చచ్చుటయె యంచని గోపులు సిద్ధమౌటచే,**
**నగవుచు సర్పబంధనము నాశము జేస్తివి జేరనెత్తిమీ**
**దుగ, గురువాయు పట్టణపు తోయజనాభని గాథ తెల్పెదన్.**

తా॥ ఓ జగపతీ! అప్పుడు నీవు సంకట స్థితిలో నున్నట్లు భావించి, అచట నిన్ను వారందరు (తమ బహిః ప్రాణమైన నీవు లేని తమ జీవితములు వ్యర్థములని భావించి) తమ ప్రాణములను వీడుటయే మేలని నిశ్చయించుకొని అందుకు సిద్ధపడిరి. ఆ విషయమును గ్రహించిన నీవు వెంటనే సర్పబంధనము తొలగించుకొని ఆ కాళియుని నెత్తిపైకి (పడగలమీదకు) చేరుకొంటివి. ఓ గురువాయూరప్పా! నేను శ్రీపద్మనాభుడైన శ్రీమన్నారాయణుని గాథను తెలిపెదను. ఆలకింపుము తండ్రీ!



19/9

**తే॥ కాళియుని పడగలపైన కాంతులీను**
**సున్నితంబైన పాదాల సుందరముగ**
**నాట్యమాడితివో ప్రభూ! నాడు నీదు**
**కాలి అందియల్ ఘల్లున సలిపె రవము,**
**కంకణంబులు జెసెను కలరవములు,**
**మధురధ్వని నిండె శ్రుతి యొప్ప వనమునందు,**
**తెలుగు పద్యంబు జెప్పెద దేవ దేవ!**
**వినుము గురువాయు పురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ దేవదేవా! నీవు కాళియుని పడగలపై కెక్క మనోహర కాంతులను వెదజల్లు సున్నితమైన నీ పాదముల యొక్క విన్యాసములతో నాట్యము చేయసాగితివి. అప్పుడు నీకాలి అందెలు ఘల్లుఘల్లుమని మధురముగా మ్రోగుచు నీచేతి కంకణముల యొక్క కలరవముతో శ్రుతి గలుపుచుండెను. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథను తెలుగు పద్యముగా ఆలకింపుము తండ్రీ!



19/10

**సీ॥ మృదుపాద విన్యాసమది అద్భుతము ప్రభూ!**
**అబ్బురపడిరి వారందరున్ను**
**మునులెల్ల మితిలేని ముదముతో గోపాల!**
**ప్రస్తుతించిరి నిన్ను పరవశించి**
**ఇంద్రాది దేవతల్ ఎంతయో పులకించి**
**కురిపించి నారయ్య! విరులవాన,**
**కమనీయ నృత్యంబు గాంచినవారల**
**భాగ్యమే భాగ్యంబు పరమపురుష!**

**తే॥ రూపుమాపుము ఈనాడు రోగమిపుడు**
**భట్ట తిరినాడు చెప్పిన భాగవతము**
**తెలుగు పద్యంబుగా నేడు తెలుపుచుంటి**
**వినుము గురువాయు పురనాథ! విష్ణు గాథ.**

తా॥ ఓ ప్రభూ! నీ మృదువైన పద విన్యాసము అత్యద్భుతము. ఆ గోపాలురందరు ఆశ్చర్యంతో చూస్తుండిపోయారు. గోపాలా! మునీశ్వరులందరు అంతులేని ఆనందంతో నిన్ను కీర్తించినారు. ఇంద్రాది దేవతలు ఎంతగానో పులకరించి సంతోషముతో పుష్పవృష్టి కురిపించినారు. కనువిందు చేయునట్టి ఆ నృత్యమును చూచిన వారి భాగ్యమే భాగ్యము గదా! ఓ పరమపురుషా! నా ఈ వ్యాధిని నిర్మూలింపుము. నారాయణ భట్టతిరి చెప్పిన భాగవతమును నేడు తెలుగు పద్యములలో వినిపిస్తున్నాను. ఓ గురువాయూరప్పా! నన్ననుగ్రహించి ఆలకింపుము తండ్రీ!



## 20. శ్రీకృష్ణుడు కాళియుని అనుగ్రహించుట

**చం॥**
**సలుపగ నీవు నృత్యమును చక్కగ కాళియు నెత్తిపైన, చె**
**వ్వుల మణికుండలంబులును ఊగినవయ్య మనోజ్ఞదృశ్యమై**
**మిలమిల; దేవదుందుభులు మిక్కిలి ఇంపుగ మ్రోగెనో ప్రభూ!**
**నిలిచిరి దేవతాంగనలు నింగిని పాడుచు దివ్యగానముల్**
**అల గురువాయు పట్టణపు ఆ హరిగాథను చిత్తగించుమా.**

తా॥ ఓ ప్రభూ! నీవు కాళియుని పడగలపై (నెత్తిపై) చాలాసేపు అద్భుతంగా నృత్యం చేయుచున్నప్పుడు నీ చెవులనున్న మణికుండలములు మనోజ్ఞముగా మిలమిలలాడుచు ఊగినవి. దేవదుందుభులు చెవులకు ఇంపుగా మ్రోగినవి. ఆకాశమున దివ్యాంగనలు మధురంగా గానము చేయుచు నిలుచుండిరి. ఆ సమయమున గురువాయు పురంలో నెలకొన్న శ్రీహరీ నీ గాధను చిత్తగించుము తండ్రీ!



20/2

**తే॥ కాళియుడు నీదు నర్తించు కాళ్ళక్రింద**
**నలిగి ఆ హేల సైపంగ నలవికాక**
**పడగలను యొక్క టొకటిగా వంచుకొనియె,**
**నిలిపియున్నట్టి తక్కిన తలలపైన**
**దుమికి చిందులు వేశావు తోయజాక్ష!**
**చిందులకు 'తాళ' మేయుచు చేతులూపి,**
**నాట్యలీలను జూపావు నందబాల!**
**వినుము గురువాయు పుర విభో! విష్ణుగాథ.**

తా॥ ఓ నందబాల! ఆ కాళియ సర్పము నీ అద్భుత నృత్య హేలకు తట్టుకోలేక క్రమముగా ఒక్కొక్క పడగ వంచుకొన సాగెను. అప్పుడు నీవు తక్కిన పడగలపైకి దుమికి చిందులు వేయుచు చేతులతో తాళములు వేయుచు నీ నాట్య లీలను ప్రదర్శించితివి. తోయజాక్షుడవైన ఓ గురువాయూరప్పా! ఈవిష్ణుగాథనాలకింపుము తండ్రీ!



20/3

**సీ॥ పన్నగేంద్రుని వేయి పడగలపై నీవు**
**తాండవం బాడగ, తాళలేక**
**బరువుకు అవ్వాని పడగలు నలుగుచు**
**వంగిపోయిన వయ్య! బాధ పెరిగె**
**అందుచే కాళియు నన్ని ముఖంబులున్**
**స్రవియించె రక్తంబు నవిరళముగ,**
**కెందామరెఱుపెక్కె సుందరంబౌ నది**
**యమునంత రక్తంబు వరదలాయె**

**తే॥ వాని భార్యలు వెలువడి వందనముల**
**నిన్ను వేడిరి మన్నింపు సన్నుతించి,**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమందు**
**వినుము గురువాయుపుర విభో! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! ఆ పన్నగేంద్రుని వేయి పడగలపై నీవు నిలిచి తాండవ నృత్యమాడుచుండగా నీ బరువుకు తాళలేక వాని పడగలు నలిగి వంగిపోయినవి. అందువలన కాళియుని ముఖములన్నిటి నుండి ఆగకుండ రక్తము స్రవించసాగెను. సుందరమైన నదీ జలములు గల యమున ఎఱ్ఱని తామర మొగ్గలవలె ఎఱ్ఱబారిన వరదలా మారిపోయింది. అంత ఆ కాళియుని భార్యలు వెలువడి నదిపైకి వచ్చి నీకు వందనము లాచరించి క్షమాభిక్ష వేడి ప్రార్థించారు. నారాయణ భట్టతిరుల భాగవతమును నేను తెలుగు పద్యములలో చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! ఈ కథనాలకింపుము తండ్రీ!



20/4

ఉ॥

**పన్నగరాజు కాళియుని భార్యలు మాధవ! నీప్రభావముల్**
**మున్నె యెరింగినారు, తమముందర నిల్చిన లోకపాలకున్**
**కన్నుల గాంచి భక్తి తమకంబున గొల్చిరి తేటతెల్లమై**
**నిన్ను మహర్షులందరికి నేత, స్వతంత్రుడవంచు మ్రొక్కుచున్**
**సన్నుతి జేసి నారు మనసా గురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ మాధవా! సర్పముల రాజైన కాళియుని భార్యలు నీ ప్రభావములను ఇదివరకే తెలుసుకొనిరి. అందువల వారు తమ ముందర వున్నది లోకపాలకుడని గుర్తించి కనులారా గాంచి భక్తితో తన్మయత్వం చెందుతూ నిన్ను సేవించిరి. నీవు మహర్షులందరికీ నాయకుడు (పూజ్యుడు) మరియు సర్వస్వతంత్రుడవని వారికి తేటతెల్లమై మనస్ఫూర్తిగా అనేక విధముల స్తుతించిరి. ఓ గురువాయూరప్పా! ఈ నీ కథ నాలకింపుము తండ్రీ!



20/5

**కం॥ కనుగొని భార్యల దుస్థితి**
**కనికరమున నిండి గుండె కరుణించితివే**
**ఘన గురువాయుపురీశా!**
**తను బ్రతుకుచు కాళియుండు ధన్యత తెలిపెన్**

తా॥ అచ్యుతుడవైన ఓ గురువాయూరప్పా! కాళియ సర్పము యొక్క భార్యల దుస్థితి జూచి వారు నీ భక్తులైనందున నీ హృదయము కనికరముతో నిండిపోయింది. అందువలన నీవు కాళియుని కూడ కరుణించావు కదా! దాని మూలంగ కాళియుడు ప్రాణములతో బయటపడి నీ పాదములపై మోకరిల్లి తన ధన్యవాదములను తెలిపెను.



20/6

ఉ॥

**సాగరమధ్యమందు నొక చక్కటి ద్వీపము నాదు దీవెనన్**
**కాగలదయ్య! ఆ 'రమణకంబు' నివాసము నీకు కాళియా!**
**ఆ గరుడుండు రాదటకు అక్కడ నుండుట మేలనంటివే**
**వేగమె ఆతడున్ సతులు మిత్రులు కూడగ వీడెనా నదిన్**
**హే గురువాయు పట్టణపు ఈప్సితదాయక! ఆలకింపుమా.**

తా॥ ఓ గురువాయూరులో నెలకొన్న కొంగుబంగారమా! నీవు కాళియు నీవిధంగా ఆజ్ఞాపించితివి. "కాళియా! నీకు సముద్రము యొక్క మధ్యన యున్న ఒక చక్కని ద్వీపమును నీకు నివాసము కాగలదు. ఆ ద్వీపము పేరు 'రమణకము'. నా దీవెనల వలన అచ్చట గరుత్మంతుడు రాడు. నిన్ను అక్కడ శత్రువని అతడు ద్వేషించడు. నీకు మేలు జరుగును'' అతడు భార్యలతోను పరివారముతోను వెంటనే ఆ యమునా నదిని వదలి నీవు చెప్పినట్లు చేసెను.

20/7

**సీ॥ నాగకాంతలు యంత నానా విధములైన**
**మణులు, హారంబులు గణనలేని**
**పట్టువస్త్రంబులన్ బహుమతిగా నీయ**
**తనరగా శోభతో తరలినావు**
**నదియొద్దనున్నట్టి నందాదులందరు**
**ప్రాణాధికుని నిన్ను ప్రాప్తినొంది**
**ఆనంద భాష్పాల నక్కున జేర్చిరి**
**సాయంత్రమున దక్కె సంబరమని**

**తే॥ స్వామి! నీవారి జేరావు సంధ్యవేళ**
**భట్టతిరి కృతి సంక్షిప్త భాగవతము**
**తెలుగు పద్యంబు జేసెదన్ దేవదేవ!**
**వినుము గురువాయుపుర విభో! విష్ణుగాథ.**



తా॥ ఓ స్వామీ! అంత నాగకాంతలు నానా విధములైన మణులను ప్రకాశించుచున్న హారములను, పట్టు వస్త్రములను నీకు బహుమతిగా సమర్పించిరి. నీవు వాటిని ధరించి మిక్కుటముగా శోభించితివి. అప్పుడు యమునా నదీ తీరమున నిన్ను జూచి ప్రాణతుల్యుడ వైన నీవుక్షేమముగా నున్నందున గోపాలకులంతా ఆనందభాష్పములు కారుచుండగా నిన్ను అక్కున జేర్చుకొనిరి. ఆ సాయం సమయమున నీతోగూడి సంతోష సాగరమున తేలియాడిరి. సంధ్యా సమయమంతా వారితో గడిపావు. నారాయణ భట్టతిరి కృత శ్రీమన్నారాయణీయమును తెలుగు పద్య రచనగా చెప్పుచుంటిని. ఓ గురువాయూరప్పా! దీని నాలకించి నన్ను చరితార్థుని జేయుము తండ్రీ!



20/8

**చం॥**
**కనులకు దారి తోపకను కమ్మెను చీకటి గోగణంబులన్**
**గొనకొని ఇల్లు జేరుటకు గోపులు జంకిరి నిద్రజేయగా**
**ననుకొని నిశ్చయించిరి మహాత్ముడు తోడను నమ్మకంబుతో**
**పెను అనలంబు చుట్టుకొనె భీతిల జేసెను నందనందనా!**
**విను గురువాయు పట్టణపు విష్ణుని గాథను నేడు జెప్పెదన్**

తా॥ ఓ నందనందనా! అప్పటికే చాల ఆలశ్యమై పోయింది. బాగుగ చీకటి కమ్ముకొని దారి కనిపించుట లేదు. అందుచే గోవులు గోపాలురు ఇంటికి పోవుటకు జంకి, ఆ నదీతీరమున అక్కడే నిద్రించుటకు నిశ్చయించుకొనిరి. మహాత్ముడవైన నీవు తోడుంటివను నమ్మకంబున నిశ్చింతగా నిద్రించిరి. ఇంతలో గొప్ప దావాగ్ని భయము కలిగించు నట్లు వ్యాపించెను. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణు గాథనాకర్ణింపుము.



20/9

**ఆ.వె.॥ పాహి! పాహి! యనుచు ప్రార్థించ గోపులు**
**'అడవి నిప్పు' నీవు అదిమి పట్టి**
**గుటక వేసినావు గురువాయుపురవిభో!**
**అగ్నిముఖుడ వీవు అది నిజంబు**

తా॥ ఓ గురువాయూరప్పా! అప్పుడు గోపాలకులు వారి సంతానము దిగ్గున లేచి "పాహి! రక్షింపుము స్వామీ!" అని నిన్ను ప్రార్థించిరి. ఆ దావాగ్నిని నీవు నీ చేతులతో పట్టి గుటుక్కున కబళించి ఆక్రందనలు చేయుచున్న గోపకులమును రక్షించినావు. ఇందులో ఆశ్చర్యపడుటకేమున్నది? ప్రభూ! "ముఖాదింద్రశ్చాగ్నిశ్చ" అని వేదమెన్నడో నిన్ను కీర్తించినది కదా! నీవు అగ్ని నోటియందు గలిగిన అగ్ని ముఖుడవు. అది సత్యం పునః సత్యం, తండ్రీ!

20/10

తే॥ పీతవర్ణంబు అగ్నిది, 'పీత' మయ్యె
నీదు 'ముఖమున' అందుచే నిగమవినుత!
పీతమనుపేరు అగ్నికి అతికినట్లు
సార్ధకంబయ్యె నని తాము సంతసించి
గోపులెల్లరు కీర్తించి కొలిచినారు
అట్టి నీవు నా వ్యాధిని, అఘము బాపు
తెలుగు పద్యంబు చెప్పెద దేవదేవ!
వినుము గురువాయుపుర విభో! విష్ణుగాధ

తా॥ ఓ దేవదేవా! వేదములు కొనియాడెడి నిగమ వినుతా! అగ్నియొక్క రంగు పీతవర్ణము (పసుపు పచ్చనిది) కాని ఇప్పుడు ఆ అగ్ని నీ నోటిద్వారా పీతమగుటచే (త్రాగబడుటచేత) ఆ అగ్నికి 'పీతము' అను పేరు సార్ధకమైనది. ఇట్లాలోచించిన గోపాలకులు సంతోషముతో నిన్ను స్తుతించిరి. అటువంటి ఓ గురువాయూరప్పా! నా వ్యాధిని, పాపమును తొలగించి, ఈ విష్ణు గాధనాలకింపుము తండ్రీ!



## 21. ప్రలంబాసురవధ

**కం॥ ఆవులమేపుట కడవికి**
**నీవేగితి వొక్కనాడు నీ మిత్రులతో**
**గావించి యలంకరణము,**
**ఈవే గురువాయుపురపు ఈశా! వినుమా**

తా॥ సర్వకామనలు తీర్చే ఓ భగవంతుడా! నీవు ఒకరోజు ఆవులను మేపుటకు నీ మిత్రులు (బలరామునితో పాటు) అందరితో కలిసి అడవికి పోయావు. నీవు బాగుగా అలంకరించుకొని యుంటివి. ఓ గురువాయూరప్పా! నీవే ఈ గాధను ఆలకింపుము తండ్రీ!



21/2

**తే॥ అన్న బలభద్రునకు నాడు ఆ వనంపు**
**శోభలన్నియు శ్రద్ధగా చూపుచుండ**
**తోడి బాలురు కర్రలతో కలిసిరి,**
**ఆడిపాడుచు ఆనాడు అచటనున్న**
**మఱ్ఱి చెట్టొక దానిని బాలురంత**
**కనిరి యచట భాండీరకంబని పిలుతురు,**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమందు**
**వినుము గురువాయుపుర విభో! విష్ణుగాధ**

తా॥ ఓ ప్రభూ! నీ అన్నయైన బలరామునకు ఆనాడు ఆ బృందావనములోని శోభలన్నింటినీ వివరముగా చూపించుచుంటివి. నీవట్లు చేయుచుండగా నీతోటి బాలురు కర్రలను పట్టుకొని అక్కడకు వచ్చిరి. వారితో కలిసి ఆడుతూ పాడుతూ అక్కడ ఉన్న మఱ్ఱిచెట్టు ఒకదాని దగ్గరకు వచ్చిరి. వారంతా అచటనున్న



భాండీరకము అను ఆ వృక్షమును చూచిరి. ఓ గురువాయూరప్పా! భట్టతిరి కావ్యమును తెలుగు పద్య రచనగా ఆలకింపుము తండ్రీ!

21/3

**కం॥ దనుజుడు ప్రలంబుడున్ నిను**
**తునుమన్ గోపకుని రూపుతో తాన్ వచ్చెన్,**
**అనుపమ బలశాలివయా!**
**విను గురువాయుపురినాధ! విష్ణుని గాధన్**

తా॥ సాటిలేని బలశాలివైన గురువాయూరప్పా! ప్రలంబాసురుడను పేరుగల ఒక రాక్షసుడు నిన్ను సంహరించాలనే తలంపుతో ఒక గోపబాలుని రూపముతో నీ దగ్గరకు వచ్చాడు.

21/4

చం॥

**ఎరిగియు దుష్ట దానవుని ఈప్సితమించుక యేని తొట్రుబా**
**టెరుగక మఱ్ఱి చెట్టుకడ ఈవును ఆడగ "ద్వంద్వ యుద్ధమన్"**
**గురుతరమైన ఆట నటగూడితివో ప్రభు! నిశ్చయంబుతో**
**గురు అనిలాల యేశ్వరుని గొల్తును ఈకథ నాలకింపగన్**

తా॥ ఓ ప్రభూ! ప్రలంబాసురుని దురభిప్రాయమును, (వాని యొక్క మారువేషమును) నీకు తెలిసియును, ఏమియూ కంగారులేక తెలియని వానివలె 'భాండీరక వటవృక్షము క్రింద గొల్ల పిల్లలతో ఆటలాడుచుంటివి. ఆనాడు "ద్వంద్వ యుద్ధం" అను ఆటను ఆడుకోవాలని నిశ్చయించు కొనిరి. అది గొప్ప ఆట. ఓ గురువాయూరప్పా! ఈ కథను నీవు ఆలకించుటకై ప్రార్థింతును.



21/5

ఉ॥

**ఆ యెడ రెండు జట్లవలె అందరు బాలురు చీలిపోవగా**
**నాయకులీవు అన్నయును; నమ్మిక గొల్పుచు నీదు జట్టులో**
**మాయలమారిదైత్యుడు అమాయ బాలునివోలె తోడయెన్**
**హే యదుభూషణా! వినుము ఈ గురువాయుపురీశు గాధలన్**

తా॥ భగవంతుడవైన ఓ యదుభూషణా! నీవప్పుడు నీతోడి గోపాలురను రెండు జట్లుగా విభజించితివి. ఒక జట్టుకు నీవును, రెండవ జట్టుకు అన్న బలరాముడును నాయకులైరి. నీ జట్టులో మారు రూపముననున్న ఆ మాయలమారి ప్రలంబాసురుడు అమాయకమైన గొల్లపిల్లవానిగా చేరాడు. తెలియనట్లే నీవు వాడిని నీ జట్టులోనికి తీసుకొన్నావు. ఓ గురువాయూరప్పా! ఈ అద్భుతమైన నీ గాధనాలకింపుము తండ్రీ!



21/6

సీ॥ **ఆశ్చర్య గుణములకాలయం బైనట్టి**
**యదుకుల భూషణా! ఆటలందు**
**ఓడిన వారు తమ్మోడించువారిని**
**భుజములపై నెత్తి మోయవలెను**
**ఒపొందమదియని యొప్పుకొన్నారంత**
**ఆటలో ఓడావు నటకిశోర!**
**శ్రీదాముడనువాని చేతిలో నోడావు**
**మోయుట నీవంతు అయినదయ్యా!**

తే॥ **పరమభక్తుండు నీకు ఆ బాలకుండు**
**దాసుడై వాని ప్రీతితో మోసినావు**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమందు**
**వినుము గురువాయుపుర విభో! విష్ణుగాధ!**



తా॥ ఆశ్చర్య గుణములకు నిలయమైన ఓ యదుకుల భూషణా! ఈ ఆటలో ఓడిపోయినవారు గెలిచిన వారిని ఎత్తుకొని (భుజములపై) తిరుగవలెను; అని ఒప్పందం చేసికొన్నారు. అప్పుడు నీవు బలరాముని పక్షమున ఆడుచున్న శ్రీదాముడు అనువాని చేతిలో ఓడిపోతివి. ఆ శ్రీదాముడు నీకు పరమభక్తుడైనందున ఆతనిని నీవు ప్రీతితో వానినంగీకరింపజేసి నీ భుజములపై మోసితివి. నారాయణ భట్టతిరి సంక్షిప్తముగా భాగవతమును సంస్కృతములో రచించెను. నేను దానినే తెలుగు పద్యరచన గావించితిని. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!

21/7

ఉ॥

**ఓడినవారు గెల్చుకొను ఉన్నతులన్ తము మోయుచుండగా**
**ఓడెను ఆ ప్రలంబుడును ఒప్పుగ రాముని చేత, నందుచే**
**చూడక ముందు వెన్కలకు సుంతయు, కృష్ణుని భీతిపాఱుచున్**
**వాడు సుదూరమేగె, గురువాయుపురాధిప! రాము మోయుచున్**

తా॥ ఓ గురువాయూరప్ప! ఈ ఆటలో ఓడిన గోప బాలకులు గెలిచినవారిని భుజములపై మోయుచుండవలెను. ఆ ఆటలో బలరాముని చేతిలో ప్రలంబుడు ఓడిపోయినందున వాడు బలరాముని తన భుజములపై మోయవలసి వచ్చెను. కృష్ణుడనిన విపరీతముగా భయపడుచు, ముందు వెనుకలు చూడక వాడు చాలా దూరము బలరాముని మోయుచు పరిగెత్తెను. ఓ ప్రభూ! నీ కథనాలకింపుము.



21/8

చం॥

**దనుజుడు రామునెత్తుకొని దవ్వున బోయెను, శంకకల్గె తా**
**మనుకొనియున్న ఒప్పిదము నంతయు దైత్యుడు లెక్కజేయడే!!**
**తనబరువున్ మరింతలుగ తానొనరించగ, తాళలేకపో**
**యెను, నిజరూపుతో చకితునెంతయొ చేసెను రామునోప్రభూ!**
**విను గురువాయుపట్టణపు విష్ణునిగాథను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! ప్రలంబాసురుడు ఒప్పందమును లెక్కచేయక బలరాముని ఎత్తుకొని అనుకున్న దానికంటే ఎక్కువదూరం తీసుకొని వెళ్ళుట జూచి శంక కలిగి బలరాముడు తన బరువును అనేక రెట్లు పెంచెను. ఆ బరువుకు తాళలేక ఆ రాక్షసుడు తన నిజరూపమును ప్రదర్శించి రాముని ఆశ్చర్య చకితుని జేసెను. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుని గాథను ఆలకింపుము ప్రభూ!



21/9

సీ॥ **అచ్యుతా! చకితుడై అన్న రాముండును**
**దనుజుని భుజముల తాను నిలిచె**
**కాయంబు ఎత్తుగా కలుగుట చేతనే**
**వాడు ప్రలంబుడై వరలుచుండె**
**వానిపై నిలిచిన బలభద్రుడును నిన్ను**
**గాంచెను కనులార కలిగె ధృతియు**
**బలరాముడాపైన బలమైన పిడికిలి**
**పోట్లచే నసురిని పొడిచి చంపె**

తే॥ **నుగ్గునుగ్గాయె దైత్యుండు నుదురు పగిలె**
**భట్టతిరినాడు చెప్పిన భాగవతము**
**తెలుగు పద్యంబు జేస్తిని దేవదేవ!**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.**



తా॥ ఓ అచ్యుతా! ఆ ప్రలంబాసురుని కాయము ఎత్తుగానుండుటచే సార్ధక నామధేయుడైన వాని భుజములపై నిలిచి ఆ బలరాముడు పరికించగా దూరమందున్న నీవదనారవిందము కనిపించినది. వెంటనే అతని భయం తొలగిపోయి అంతులేని ధైర్యం కలిగినది. అంతట బలరాముడు మిక్కిలి దురాత్ముడైన ప్రలంబాసురుని బలమైన తన పిడికిలి పోట్ల చేత వాని దేహాన్ని నుగ్గునుగ్గు జేసి సంహరించెను. నారాయణ భట్టతిరి చెప్పిన భాగవతమును నేను తెలుగులో పద్య రచనగా చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథను ఆలకింపుము తండ్రీ!

21/10

ఆ.వె॥ దైత్యుజంపి నీదు దరిజేరు రాముని
బిగియ కౌగిలించి ప్రేమజూప
కురియజేసిరంత గురువాయుపురవిభో!
విరుల వాన నింగి సురవరులును.

తా॥ ఓ గురువాయూరప్పా! ఈ విధముగా బలరాముడు ప్రలంబాసురుని సంహరించి నీ దగ్గరకు రాగానే నీవు ప్రేమతో అతనిని బిగి కౌగిలిలో నిలిపితివి. ఇట్లు పరస్పరము అభినందనలు తెలుపుకొనుచున్న మీపై ఆకాశంలో నిలిచిన దేవతలు పుష్పవృష్టి కురిపించిరి.



## 22. దావానలమునుండి గోవులను గోపాలురను రక్షించుట

కం॥ ఆ విధి ప్రలంబు వధతో
దేవా! గురువాయుపురపుధీరా! జాగై
ఏవో ఆటల మునిగిరి
ఆవులు 'ఐషీక' విపిన మరిగెను మేయన్

తా॥ ఓ దేవా! నీవు నీ స్నేహితులతో కలిసి ఏవేవో ఆటలలో మునిగిపోతివి. నీవు ప్రలంబాసురుని ఆ విధముగా చంపించుటకు కొంచెము జాగు అయినను ఆటలవలన ఇంకొంచెము జాగు అయినందువల్ల ఆవులు పచ్చగడ్డిని స్వేచ్ఛగా మేయుచూ తిరిగి తిరిగి దూరముగానున్న 'ఐషీకము' అను ఒకానొక అడవికి చేరుకొనినవి.



22/2

సీ॥ బృందావనంబున పెను వృక్షముల్ యుంట
తొలినాళ్ళ 'గ్రీష్మంబు' తెలియకుండె
ఆ వనంబును దాటి అరిగిరి నేడిట్లు
'ముంజవనంబు' న మురవిదూర!
విపరీతమైనట్టి వేడితో ఆలకున్
దప్పి అధికమాయె 'డస్సి' పోయె
చల్లని నీచూపు స్వామి! వాటికి లేక
వ్యాకులమున నుండె ఆవులన్ని

తే॥ ఏమి చేయుట యుక్తమో ఎరుగవాయె
నిలిచి నిశ్చేష్టులై గోగణాలు వగచె
భట్టతిరి కృతి తెలుగులో పద్యమందు
వినుము గురువాయుపుర విభో! విష్ణుగాథ.



తా॥ ఓ మురారీ! బృందావనమందు దట్టమైన చెట్లు ఉండుట వలన వేసవి కాలపు వేడిమి మీకిది వరకు తెలియలేదు. కాని మేయుచున్న ఆవులు ఇప్పుడు ఆ వనములన్నీ దాటి 'ముంజ' వనము చేరినందున ఈ వనమందు విపరీతమైన వేడికి ఆవులు దప్పికతో బాగ డస్సిపోయినవి (అలసిపోయినవి). పైగా కరుణా రసపూరితములైన నీ చల్లని చూపులు వాటికి ఆనందకరముగా వాటిపై ప్రసరించుటలేదు. ఆ గోగణములన్నియూ మిక్కిలి వ్యాకుల పడినవి. వాటికి ఏమి చేయుటకు తోచక చేతలుడిగి దిక్కుతోచకున్నవి. నారాయణ భట్టతిరి సంస్కృతములో రచించిన భాగవతమును నేను తెలుగు పద్యరచనగా వినిపిస్తున్నాను. ఓ గురువాయూరప్పా! దీని నాలకించి నన్ను చరితార్థుని చేయుము తండ్రీ!

22/3

**ఉ॥**

**త్రోవను తప్పిముంజవని తోయజనాభ! మరింతదూరమున్**
**గోవులు జేరి బాధపడె, కూడుచు మిత్రుల నీవు అన్నయున్**
**ఆవులకై ప్రయాసపడ అయ్యో!! అదేమొ హఠాత్తుగా ప్రభూ!**
**ఆ వని కాఱు చిచ్చెగసె అచ్చెరువొందగ ప్రజ్వరిల్లుచున్**
**ఈవివరంబులన్ వినుము హే గురువాయుపురీశ! ధన్యుడన్**

తా॥ ఓ ప్రభూ! ఇట్లు గోగణములు త్రోవతప్పి ముంజారణ్యమున ప్రవేశించి చాల బాధలకు గురైనవి. ఆ గోవులకోసం వెతుకుతూ నీవు నీ అన్న బలరాముడు నీ స్నేహితులు ఎంతో ప్రయాసతో చాల దూరమువరకు వెదకిరి. ఇంతలో హఠాత్తుగా కాఱు చిచ్చు (దావాగ్ని) అన్నివైపులా కమ్ముకున్నది. ఆశ్చర్యకరంగా చూస్తుండగానే వ్యాపించి ప్రజ్వరిల్లింది. పద్మనాభా! ఓ గురువాయూరప్పా! ఈ వివరములను ఆకర్ణించి నన్ను ధన్యుని చేయుము, తండ్రీ!

**283**

22/4

**చం॥**

**చిటపట శబ్దముల్ యెసగ చిందులు వేసెను అగ్నిజ్వాలలున్**
**అటునిటు వ్యాప్తిచెందె "మము అందర గావుము లోకబాంధవా!**
**ఎటులయినన్ హరింపుమిక ఈపెను తాపము"యన్నవారి, బా**
**సట గురువాయు పట్టణపు స్వామి! నువైతివి దిక్కువారికిన్**

తా॥ స్వామీ! దావాగ్ని భయంకరముగా చిటపట శబ్దములు విజృంభిస్తుండగా ప్రజ్వలించి చిందులు వేస్తున్నట్లు అన్నివైపులా వ్యాపించింది. గోపాలురందరు భయవిహ్వలులై "ఓ లోకబాంధవా! మమ్మందరినీ కాపాడుము. ఏదోవిధంగా (సగంవరకు కాలిపోయినట్లు కలుగుతున్న) ఈ గొప్ప తాపమును పోగొట్టుము. శరణు ప్రభూ!'' అనుచున్నవారికి బాసటయై వారికి నువ్వు దిక్కు అయ్యావు. ఓ గురువాయూరప్పా! నన్నుకూడ రక్షించుము తండ్రీ!

**284**

22/5

**తే॥ "భయము వీడుడు గోపాల బాలులార!**
**కనులు మూయుడు ఒకసారి కలతవీడి"**
**వారు నీమాట తలదాల్చినారు, అంత**
**కనులు తెరచిన దావాగ్ని కానరాక**
**ముంజవని కూడ వారల ముందులేక**
**కలయో!! 'భాండీర' వనమందు నిలిచినారు**
**దివ్య మహిమల లీలల దేవదేవ!**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ "ఓ గోపబాలకులారా! మీరు భయపడవలదు. విచారం మాని మీరంత ఒకసారి కళ్ళుమూసుకోండి" అని పలికితివి. ఓ దేవదేవా! నీవు దివ్యమహిమలు, లీలలు కలవాడవు కావున వారు కనులు తెరువగా దావాగ్ని కానరాలేదు. ముంజవనం మాయమై వారు భాండీర వనములోనున్నారు. ఇది కలయా!!! ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథను ఆలకింపుము తండ్రీ!

**285**

22/6

**సీ॥ "స్వామి! నీమాయను సాధ్యమా వర్ణింప?**
**సర్వేశ్వరా! నీకు జయము, జయము"**
**పలు విధంబులుగ గోపాలురు స్తుతియించ**
**మొలక నవ్వులవారి ముంచినావు**
**బృందావనంబున అందరెప్పటి వోలె**
**గోవులమేపారు కుశలముగను**
**మల్లెలు మొదలైన పలురకంబుల పూలు**
**వికసించె ఘుమఘుమలె వెల్లివిరియ**

**తే॥ ఎండమండించె కాల్చుచు నెల్ల జగతి**
**వస్తుతః చల్లగా నుండె వనమునందు**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమందు**
**వినుము గురువాయు పురవిభో! విష్ణుగాథ!**

**286**

తా॥ అప్పుడు గోపబాలకులందరు నిన్ను అనేక విధములుగా ఇట్లు స్తుతించిరి. ఓ స్వామీ! నీమాయను వివరించటం మా బోంట్లకు సాధ్యమా? సర్వేశ్వరా! నీకు సర్వదా జయమగుగాక. ఆ మాటలకు నీ చిరునవ్వుల జల్లులో వారిని ముంచినావు. ఆ విధముగా నీలీలా విలాసములను చూపుచు బృందావనమున గోవులను మేపుచుంటివి. ఆ వనమున మల్లెలు మొదలైన వివిధ పుష్పములు చాల సువాసనలు ఘుమఘుమల గుబాళించినవి. ఎండాకాలమగుటచే ఎండ మండించుచున్నప్పటికి బృందావనమున వస్తుతః చల్లగానుండెను. నారాయణ భట్టతిరుల కావ్యమును నేను తెలుగు పద్యరచనగా చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! నన్ననుగ్రహించి ఆలకింపుము తండ్రీ!



22/7

సీ॥ నీ విరహితులను భవబంధములు మాడ్చు
మనజుల గ్రీష్మంబు మాడ్చెనట్లు
నీ కృప భక్తుల నిఖిల మాలిన్యముల్
శుద్ధిజేసినయట్లు సూర్యుడవని
తీవ్రతాపంబుతో దీటుగా బురదను
శుష్కింప జేసెను చోద్యమలర
అంతకంతకు తీవ్రమాయెను తాపంబు
నీ పరాక్రమమట్లు నిగమవినుత!

తే॥ యమున ఒడ్డున గ్రీష్మ కాలమును నీవు
హాయిగా గడిపావయ్య! అలుపులేక
భట్టతిరి కృతి తెలుగులో పద్యమందు
వినుము గురువాయు పురవిభో! విష్ణుగాధ



తా॥ వేదములు కీర్తించెడి ఓ పరమపురుషా! నిన్ను సేవింపని వారిని తాపత్రయములు బాధించునట్లు గ్రీష్మతాపము లోకములను పరితపింప జేయుచున్నది. నీ అనుగ్రహము నీ భక్తుల మనోమాలిన్యములను శుద్ధిచేయునట్లు వేసవికాలమునందలి తీవ్రమైన ఎండ నదిలోని బురదను ఇంకింప జేయుచు ఆశ్చర్యము గొలుపుచున్నది. నీ బాహు పరాక్రమము వలె గ్రీష్మతాపము కూడ క్షణక్షణము తీవ్రతరమగుచున్నది. అట్టి గ్రీష్మ ఋతువునంతా నీవు యమునా నదీ తీరమున శ్రమనెరుగక హాయిగా గడిపితివి. ఓ గురువాయూరప్పా! భట్టతిరి కృతిని తెలుగు పద్య కావ్యంగా విని నన్ను అనుగ్రహింపుము తండ్రీ!



22/8

సీ॥ 'గ్రీష్మంబు' తదుపరి కేశవా! వర్షంపు
ఋతువు తరలివచ్చె ప్రీతి గొలుప
జలపూరితములైన నీలమేఘములన్ని
తలపుకు తెచ్చె నీతనువు శోభ
మేఘముల్ తళతళా మెఱయుచు నీపట్టు
పీతాంబరపు 'తళుకు' మతికి దెచ్చె
వర్షఋతువు సర్వప్రాణులకున్ హాయి
గొలుపుచుండెను ప్రభూ! కలతమాన్పి

తే॥ కోరి గోవర్ధనపు గిరి గుహలయందు
స్వేచ్ఛగా విహరించావు సేదదీర,
భట్టతిరి కృతి తెలుగులో పద్యమందు
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ!

తా॥ ఓ కేశవా! గ్రీష్మ ఋతువు గడచిన పిమ్మట వర్ష ఋతువు ప్రవేశించినది.

అప్పుడు జలములతో నిండిన నీలమేఘములన్నియు నీ శరీర వర్ణమును తలపింప జేయు చుండెను. ఆ మేఘములలో మెఱుపులు నీపట్టు పీతాంబరపు తళుకులను స్ఫురింప చేయుచుండెను. ఆ వర్షఋతువు సమస్త ప్రాణులకు హాయిని గొలుపుచుండెను. ఆ వర్షాకాలమున నీవు గోవర్ధనగిరి గుహలలో స్వేచ్ఛగా విహరించితివి. భట్టతిరి కృతిని తెలుగు పద్యరచనగా వినిపించుచున్న నన్ననుగ్రహించి గురువాయూరప్పా దీనిని ఆలకింపుము తండ్రీ!



22/9

**తే॥ వర్షఋతువున స్వామి! గోవర్ధనగిరి**
**పైన నెమళులు క్రేంకార ధ్వనులు జేసి**
**నిన్ను స్తుతియించునట్లుండె కన్నుగవకు**
**కొండమల్లెలు, కడిమి పూల్గాడ విరిసి**
**నిన్ను గొలుచునట్లుండెను నిగమవినుత!**
**వినుము గురువాయుపుర విభో! విష్ణుగాథ!**

తా॥ స్వామీ! నీవు వర్షాకాలమున గోవర్ధనగిరి గుహలలో నుండగా ఆ గోవర్ధన పర్వతము దానిపైనున్న నెమళుల క్రేంకారనాదములతో నీ స్తోత్రములను చేయుచున్నట్లు స్ఫురించెను. ఆ కాలమున వికసించెడి కొండమల్లె పూవులతోను కడిమి పుష్పములతోను ఆ గోవర్ధనము నిన్ను అర్చించుచున్నట్లుండెను. వేదములచే నుతింపబడు ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథ నాలకింపుము తండ్రీ!



22/10

**తే॥ వర్షఋతువది గడచెను వచ్చి చేరె**
**ఆ శరదృతువు నిండగనన్ని నదులు**
**సరసులున్ నిండి నిర్మల జల వనరుల**
**నీదు భక్తుల హృదయాలు మదికి తోచె**
**అపుడు బృందావనంబున ఆలవేసి**
**నావు; తొలగించవేలనో నాదు వ్యాధి**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమయ్యె**
**వినుము గురువాయుపుర విభో! విష్ణుగాథ!**

తా॥ ఓ గురువాయూరప్పా! వర్షాకాలము గడచిన పిమ్మట శరదృతువు వచ్చినది. ఆ సమయమున నదులు సరస్సులలో నీరు నీ భక్తుల హృదయముల వలె నిర్మలముగా నుండెను. ఆ శరదృతువులో నిర్మలమైన బృందావనమందు గోవులను మేపుచు తిరిగినావు. అట్టి నీవు నా వ్యాధిని నిర్మూలించి నన్ను రక్షించుము ప్రభూ! నారాయణ భట్టతిరుల కావ్యమును తెలుగు పద్యములలో విని నన్ను అనుగ్రహింపుము తండ్రీ!



## 23. వేణుగానము

**చం॥**
**తనువది నల్లనౌకలువ తానతి కోమలమైన దౌటచే**
**నిను కనువారలందరకు నీవన ప్రేమలు కల్గుచుండగా**
**మనమున మోహమాయె పరమాత్మ! నినున్ గనగోప భామినుల్**
**అనుదినమట్లె నీ సరసనందరు చేరుదురో పరాత్పరా!**
**వినుగురువాయు పట్టణపు విష్ణుని గాథను నందనందనా!**

తా॥ ఓ పరమాత్మా! నీ శరీరము నూతనముగ వికసించిన నల్లకలువ వలె మిక్కిలి కోమలముగా నుండును. నిన్ను చూచెడి వారలకందరికి నీపై ప్రేమతో కూడిన భావములు కలుగును. వారి మనస్సులు మోహపూరితములై పోవును. ఓ పరాత్పరా! నిన్ను చూచుచున్న గోపికలు ప్రతిదినము పరవశించి నీచెంతనే గడుపు ఆశతో నుండిరి. ఓ నందనందనా, గురువాయూరప్పా! నీ గాథను ఆలకింపుము తండ్రీ!

23/2

**కం॥ నీపై యెక్కుడు ప్రేమై**
**గోపికలున్ నీవు వనికి గోవుల తోడన్**
**మేపగ వేకువ బోవుట**
**సైపరు, గురువాయుపురపు స్వామీ! వినుమా!**

తా॥ ఓ గురువాయుపుర శ్రీపతీ! నీపై అధికమైన ప్రేమ కలిగియుండి ఆ గోపికలు (నిరంతరము నిన్నే చూచుచుండవలెనని) నీవు ప్రాతఃకాలమున ఆవులను మేపుటకు అడవికి బోవుట కూడ ఇష్టపడకుండిరి.

23/3

**తే॥ ఆవులను మేపనడవికి యరిగినంత**
**వారి చూపులు మనసులు వాసుదేవ!**
**లగ్నమైయుండు నీపైన; రమణులంత**
**నీవు వోయిన త్రోవనే నిశిత దృష్టి**



**నరయుచుందురు, నీ వేణు నాలకించి**
**నీదు స్మరణతో మురిసిరి ముదితలంత,**
**భట్టతిరి కృతి తెనిగించు వాడనయ్య**
**వినుము గురువాయుపురి నాథ! విష్ణుగాథ.**

తా॥ ఓ వాసుదేవా! నీవు పశువులను మేపుటకై అడవికి పోవునప్పుడు, వారి చూపులు మనసులు నీయందే లగ్నమైయుండెడివి. పైగా వారు నీవు పోయిన త్రోవనే నిశితంగా చూస్తూ యుండెడివారు. నీ మురళీ ధ్వని దూరమునుండి వినిపించినను నీ లీలలను స్మరించుకొనుచు చాల సంతోషముతో మురిసిపోవుచుండిరి. ఓ గురువాయూరప్పా! భట్టతిరి కృతిని నేను తెనిగించుచుంటిని. దీని నాలకింపుము తండ్రీ!



23/4

**కం॥ ఆ వని తరువుల నీడను**
**పావన! వ్యత్యస్త పాద భంగిమయందున్**
**నీవటు మురళీనాదము**
**గావింతువు గురువనిలపు గ్రామనివాసా!**

తా॥ ఓ పావనుడవైన గురువాయూరప్పా! నీవు అడవిలోనికి పోయి ఆ చల్లని చెట్ల నీడలలో వ్యత్యస్త పాద భంగిమలో (ఒక కాలు నిటారుగా ఉండి, ఒక కాలు దాని కడ్డంగా మునివేళ్ళపై నిలచునట్లు వేసికొని) మధురముగా మురళీ నాదమును చేయుచుండెడి వాడవు.



23/5

**ఉ॥**
**నీ మురళీరవంబు విని నింగి సురాంగనలైరి ఓ ప్రభూ!**
**కాముని తాప పీడితలుగా, ఖగజంతువులన్ని భూమిపై**
**తాముసు పారవశ్యమున ధన్యత నొందిరి చేష్టలొగ్గుచున్**
**ఏమని చెప్పుదున్ శిలలు నెల్ల ద్రవించెను నందనందనా!**
**స్వామి! గ్రహింపుమయ్య! గురువాయు పురాధిప! నన్ను బ్రోవుమా**

తా॥ ఓ ప్రభూ! నీవు మురళిని మ్రోగించునప్పుడు ఆ వేణుగానమును విని ఆ కసమునందలి దేవకాంతలు కూడ మన్మధ తాపమునకు గురియగుచుండిరి. పశువులు, పక్షులు ఆ ధ్వనిని విని ఆనంద పారవశ్యము నొందుచుండెడివి. నిశ్చేష్టలగు చుండెడివి. ఇక చేష్టలు లేని శిలలు కూడ ద్రవించి పోసాగినవి. ఓ స్వామీ! గురువాయూరప్పా! ఇంకా ఎట్లా చెప్పను? దీనిని నీవే గ్రహించి నందనందనా! నన్ను రక్షింపుము తండ్రీ!

23/6

చం॥

**సలలిత రాగముల్ మురళి చక్కగ పల్కును చేతి వ్రేళ్ళతో**
**కలిగిన రంధ్రముల్ పనిచి కప్పుచు తీయచు గాలి ఊదినన్**
**సలుపుచు నాదమున్ అటుల స్వామి! కదల్తువు పాదపద్మముల్**
**తలచుచు నిన్ను గోపికలు తన్మయులౌదురు మోహమెక్కుడై**
**ఇల గురువాయు పట్టణపు ఈప్సితదాయక! చిత్తగించుమా**

తా॥ స్వామీ! నీవు వేణువుపై లలితమైన రాగములను మ్రోగించునప్పుడు నీ చేతి వ్రేళ్ళు ఆ మురళియొక్క రంధ్రములపై ఒక పరి మూయుచు, ఇంకొక పరి తెరచుచు నుండగా నీవు గాలిని ఆ మురళిలోనికి ఊదినప్పుడు ధ్వని లయబద్ధముగా కలుగును. అట్లు ధ్వనిని తెప్పించుచు దానికి తాళము వేయుచున్నట్లు నీ పాదములు చలించును. అట్టి నీ సుందరాకారమును తలచుచు గోపికలు మోహ పారవశ్యమున తన్మయులౌదురు. ఈ భువిలో ఈప్సితములనొసగే గురువాయూరప్పా! నాపలుకులను చిత్తగించుము తండ్రీ!



23/7

**సీ॥ దివ్యాంగనలు నీదు భవ్యదర్శనమొంద**
**తామెంతా పరమాత్మ! ధన్యులైరి**
**పశు, పక్షి, మృగములు పలుజాతులున్ ప్రభూ!**
**చేసిన పుణ్యంబు చెప్పలేము**
**నీ పాదస్పర్శచే నిలువెల్ల పులకించు**
**ధన్యాతి ధన్య బృందావనంబు**
**సర్వదా తలపోసి సఖియలు గోపికల్**
**నీ స్పర్శకై వేచి నిలిచినారు**

**తే॥ నీదు చూపుకై వేచిరి నెలతలెల్ల**
**వారు ఉత్సాహపడిరయ్య అరయ నిన్ను**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె**
**వినుము గురువాయు పురవిభో! విష్ణుగాథ.**



తా॥ ఓ పరమాత్మ! ఎల్ల వేళలలోను నీ భవ్య దర్శనమునకు నోచుకొనెడి దివ్యాంగనలు నిజముగ ఎంతో ధన్యులు. పశు పక్ష్యాదులు, మృగములు చేసికొనిన పుణ్యమేమో చెప్పలేము గాని బృందావనంలోని సమస్తము నీపాద మరియు కరస్పర్శచే పులకరించి, ధన్యాతి ధన్య అయినది. సర్వదా నిన్నే తలపోయుచు గోపికలు నీ స్పర్శచే కలుగు ఆనందము కొరకు తపించు చుండెడివారు. నీ దర్శనం కోసం ఎంతో ఎంతో ఉత్సాహంతో ఎదురు చూచెడి వారు. నారాయణ భట్టతిరి వ్రాసిన సంస్కృత భాగవతమును నేను తెలుగు పద్యములలో చెబుతున్నాను. ఓగురువాయూరప్పా! దీని నాలకింపుము తండ్రీ!



23/8

చం॥

**మధురముగా ప్రభూ! మురళివాదన మమృతమూరుచుండు నీ**
**అధరములన్ స్పృశించి, ఇక అంతటి భాగ్యము మాకు దక్కునా!!**
**అధరములూరు అమృతము అల్లన జుర్రిన ఒక్కసారి ఆ**
**సుధ నిక గోరబోమనిరి సుందర! ఓ గురువాయునాయకా!**

తా॥ ప్రభూ! గురువాయూరప్పా! నీవు వేణుగానము మధురముగా చేయుచున్నప్పుడు అది నీ అధరములను స్పృశించుటవలన ఆ వాదన అమృత మూరుచుండును. అది ఎంతటి భాగ్యమో కదా! “అది ఆస్వాదించు భాగ్యము మాకు దక్కునా? నీ అధరామృతము (వేణువు పీల్చగా మిగిలిన అమృతము) మెల్లిగా ఒక్కసారి జుర్రుకునే అదృష్టం మాకు కలుగుతుందా? కలిగితే మాకు సుధ (దేవలోకంలోని అమృతం) కూడవద్దు అనిరి.

23/9

**తే॥ మదన పీడిత గోపికా మదవతులకు**
**స్వామి! నీపైన అనురాగమను దినంబు**
**అధికమవ జొచ్చె వారలకందుచేత**
**మోహపరవశులై గోపముదితలెల్ల**
**నిత్యకృత్యంబులను గూడ నెరపలేక**
**పోవుచుండిరి నీచింతపోక విడచి,**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాధ.**

తా॥ ఓస్వామి! మదన వికారములకు లోనైన గోపికలకు నీపై అనురాగము దినదినాభివృద్ధి చెందుచుండినది. ఆ గోపికలు అందుచేత మోహ పరవశులగు చుండెడివారు. అట్టి పరిస్థితికి లోనైన వారు తమ నిత్యకృత్యములను సైతము నీ ధ్యాసలో పడి మరచిరి. భట్టతిరి భాగవతమును నేను తెలుగు పద్యములలో చెప్పుచున్నాను. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!



23/10

**సీ॥ అనురాగబద్ధులై ఆత్మీయులను జేర**
**సహజమే లోకాన జనులకెల్ల**
**వైరాగ్యమోక్షముల్ వారల కబ్బుటు**
**జరుగవచ్చును లేక జరుగబోదు**
**ఎంత భాగ్యము!! వీరలీ రెండు పొందిరి**
**జ్ఞానమార్గంబను జాడలేక**
**గొల్లభామలు కూడ కోరి నీకర్పించి**
**మనసు ధన్యలు యైరి మమత పంచి**

**తే॥ వారి భాగ్యమే భాగ్యము వాసుదేవ!**
**నన్ను రక్షింపుమో ప్రభూ! నయము నిమ్ము**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె**
**వినుము గురువాయు పురవిభో! విష్ణుగాధ**



తా॥ ఓ వాసుదేవా! లోకములో ఆత్మీయులపై అనురాగము కలుగుట ప్రజలందరికి సహజమే. దానికే ప్రయత్నము అక్కరలేదు. కాని వారికి వైరాగ్యము మోక్షమూ లభించవచ్చును, లభించకపోవచ్చును. ఎంత భాగ్యమో కాని వీరికి (ఈగోపికలకు) ప్రేమ మరియు మోక్ష రూపమై సాంసారిక వైరాగ్యము అనెడి రెండు యోగములను లభించినవి. వారికి జ్ఞాన మార్గమే అవసరం లేకపోయినది. పరమాత్మ ప్రేమను మోక్షమును కూడ సంపాదించారు. వారు మనస్సులు నీకు అర్పించి మమతాను రాగాలను పంచి తద్వారా మోక్షం సంపాదించారు. వారి భాగ్యమే భాగ్యము. ఓ ప్రభూ! గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి వ్రాసిన భాగవతమును నేను తెలుగు పద్యకావ్యంగా చెబుతున్నాను. నన్నునుగ్రహించి దీని నాలకింపుము తండ్రీ!



## 24. గోపికా వస్త్రాపహరణము

**ఉ॥**
**నీయనురాగమొందుటకు నీరజనేత్రలు గోపకన్యలున్**
**తోయజనాభ! నీచరణతోయజ సేవను కోరిరో ప్రభూ!**
**ఆ యమునా తటిన్ ఇసుకయందున శంకరు రాణిమూర్తినిన్**
**పాయక నిత్యమున్ కొలిచి వారలు కోరిరి నందనందనున్**
**ఈ యదుసింహు గాధ విను హే గురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ పద్మనాభా! పంకజాక్షులైన ఆ గోపకన్యలు నీ ప్రేమానురాగములను పొందుటకు నీ పాదపద్మములను నిత్యము సేవించు మహత్ భాగ్యమును వాంఛించిరి. అందువలన వారందరు యమునా నదీ తీరమునకు పోయి, ఇసుకతో శంకరుని రాణియైన కాత్యాయనీదేవి ప్రతిమను చేసికొని ప్రతిదినము పూజింపసాగిరి. యదు సింహుడవైన ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధ నాలింపుము తండ్రీ!

24/2

**తే॥ నీదు నామగుణము లెన్న నిరతిగలుగు**
**గోపకన్నియలందరు కూడుకొనుచు**
**తాము వేకువ యమునలో తానమాడి**
**షోడశోపచారంబుల శుభకరముగ**
**కొలిచి కాత్యాయనీదేవి కోరిరట్లు**
**"మాత! నందనందనుని మాపతిని సేసి**
**మమ్ము కరుణించవే తల్లి! మలయ పుత్రి!"**
**వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.**

తా॥ ఓ గురువాయూరప్పా! నీ నామ గుణములను కీర్తించుటయందు నిరతి గలిగిన గోపీకన్యలు అందరు కలిసికొని తామందరు వేకువ జామునే యమునా నదీతీరమునకు స్నానమాచరించగ బోవుచుండిరి. తదుపరి కాత్యాయనీ దేవికి షోడశోపచారములతో పూజ గావించి "పర్వత రాజపుత్రివైన ఓ మాతా! మాకు నందనందనుని భర్తగా అనుగ్రహించి కరుణింపు తల్లీ!" అని ప్రార్థించుచుండిరి. తండ్రీ! ఈ విష్ణుగాథ నాలకింపుము.



24/3

**కం॥ నెల దినములిట్లు గౌరిని**
**కొలిచిరి అనుదినము నీవు కూడగదయతో**
**తలచితివి బ్రోవ నదిలో**
**వెలదుల, గురువాయుపురపు విష్ణుడ! వినుమా.**

తా॥ ఈ విధముగా ఒక నెలదినములు కాత్యాయనీ దేవిని ప్రతిదినము వారు నీవు దక్కాలని పూజించగా నీవు వారిపై కరుణతో వారిని యమునా నదియందే అనుగ్రహింప దలచి ఆ గోపకన్యల కొరకు వెళ్ళావు. ఓ గురువాయూరప్పా! నీ కమనీయమైన గాథనాలకింపుము తండ్రీ!



24/4

**చం॥**
**అనుపమ దీక్షతో వ్రతమునా విధి పూర్తిగ జేసి అమ్మెయిన్**
**గొనకొని తానమాడుటకు గొల్లెతలందరు చేరిరా నదిన్**
**తనువున వస్త్రముల్ విడచి తన్మయులై జలమందు నాడుచున్**
**కనుగొని నారు నిన్ను తమ కట్టెదురన్ కడు సిగ్గుముంచగా**
**విను గురువాయు పట్టణపు విష్ణుని గాథను నందనందనా!**

తా॥ ఆ విధముగా ఆ గోపకన్యలు వ్రతదీక్షను పూర్తిచేసి కొని అటు పిమ్మట స్నానము చేయుటకు వారు తమవంటి మీద బట్టలను తీసివేసి తన్మయత్వంతో నదిలో జలక్రీడలాడుచుండిరి. అప్పుడు వారు తమ కన్నులయెదుట నిన్ను కనుగొని సిగ్గ ముంచెత్తిపోయిరి. ఓగురువాయూరప్పా! ఈ విష్ణుగాథను ఆలకింపుము తండ్రీ!



24/5

**ఆ.వె॥ స్త్రీలు నిన్ను జూచి సిగ్గుతో తలవంచి**
**నదిని దాటిరాక ఒదిగినారు**
**గొనుచు వలువలన్ని గురువాయుపుర విభో!**
**చెట్టునెక్కినావు గట్టుమీద**

తా॥ ఓ గురువాయూరప్పా! గోపకన్యలు నిన్ను చూచి సిగ్గుతో తలవంచుకొని నదిలోనే ఉండిపోయారు. అప్పుడు నీవు నదీ తీరమున వున్నవారి వస్త్రములన్నింటినీ తీసికొని ఆ సమీపమున గట్టుమీదనున్న చెట్టుపైకి ఎక్కితివి.
(దీనిని వ్రాస్తున్న రోజు శ్రీకృష్ణాష్టమి అవటం నిజంగా నా అదృష్టం)

24/6

కం॥ "భామల్లారా! రండిటు
మీమీ చేలముల గొనుడు వెలువడి" అనగా
తామంత చేష్టలుడిగిరి
భామలు; గురువాయుపురపు స్వామీ! వినుమా

తా॥ "గోపకన్నియలారా! మీరంతా ఆ నదిలోంచి బయటకు వచ్చి ఇక్కడికి వచ్చి మీ మీ వస్త్రములను చేకొని పొందు" అని చిరునవ్వుతో విలాసముగా నీవు పలుకగా ఆ గోపికలు ఏమి చేయుటకు తోచక తామందరు అయోమయ స్థితిలో పడిపోయారు. ఓ గురువాయూరప్పా! నీ కథను ఆలకింపుము తండ్రీ!



24/7

తే॥ "స్వామి! చిరజీవిగా నీవు వరలుగాక!
నీదు పాదదాసీలను నీవు ఇటుల
ఎందుకిబ్బంది పెడుదువు? ఇంతజేసి,
అంబుజేక్షణా! అందించు అంబరములు"
అనుచు వేడిరి దీనలై అతివలెల్ల
ఊరకుంటివి చిరునవ్వులొలకబోసి,
భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె
వినుము గురువాయుపుర విభో! విష్ణుగాథ.

తా॥ "స్వామీ! శ్రీకృష్ణా! నీవు చిరంజీవిగా వర్ధిల్లుదువుగాక! నీయొక్క పాదసేవకులమైన మమ్ములను నీవు ఎందులకు ఇబ్బంది పెట్టుచుంటివి? ఓ అంబుజేక్షణా! మా వస్త్రములను మాకిమ్ము" అని గోపికలందరు వేడుకొనగా నీవు చిరునవ్వు నవ్వి ఊరకుంటివి. ఓ గురువాయూరప్పా! భట్టతిరి కృతి భాగవతమును నేను తెలుగు పద్యములలో చెప్పుచున్నాను. నన్ననుగ్రహించి ఆలకింపుము తండ్రీ!



24/8

**చం॥**
**రమణులు నీదుమాటవిని లజ్జనువీడుచు నమ్మకంబుతో**
**అమలినులైరి నీకు శరణాగతి అంజలిలిన్ ఘటింపుచున్**
**తమతమ వస్త్రముల్ గొనిరి తామును వెల్వడి;సంతసించుచున్**
**విమల యశస్వి! పల్కితివి మించిన నీకృప జూపుచున్ ప్రభూ!**
**మము గురువాయుపట్టణపు మాధవ! బ్రోవుము చిత్తగింపుమా.**

తా॥ ఓ మాధవా! ఆ గోపకన్యలు నీమాట ప్రకారము నదీ తీరమునకు వచ్చి అంజలి ఘటించిరి. నీకు శరణాగతులై మనోమాలిన్యము పోగొట్టుకొని నిన్నాశ్రయించి వారి వారి వస్త్రములను స్వీకరించిరి. పిదప సంతోషముతో పరిశుద్ధమైన కీర్తిగల నీవు నీ కరుణ చూపుచు మాటలాడితివి. ఓ గురువాయూరప్పా! అహంకారము గల మాపై నీకృప జూపి మమ్ము రక్షింపుము. ఈ కథను చిత్తగించుము.



24/9

**ఉ॥**
**"గోపికలార! మీ వలపు కోర్కెల నెల్ల నెరుంగ జాలితిన్**
**నాపలుకుల్ వినుండు ఇది నందసుతుండును చేయుబాసగా**
**తాపము నిచ్చు వెన్నెలిది తానిడు ఉత్తర మీనదీతటిన్**
**సైపుడు" అంటివయ్య! మనసా గురువాయుపురాధి నాయకా!**

తా॥ "ఓ గోపికలారా! మీ మనస్సులో ఉన్న కోరిక నేనెరుగుదును. నా మాటలను నమ్మండి. నందనందనుడైన నేను మీకు బాస చేస్తున్నాను. మీకు తగిన సమాధానమును యమునా నదీ తీరమున తాపము కలిగించు ఈ వెన్నెలయే ఇవ్వగలదు అందాకా ఓర్చుకోండి" అని మనస్ఫూర్తిగా అన్నావు కదా స్వామీ! ఓ గురువాయూరప్పా నన్ననుగ్రహింపుము.

24/10

కం॥ **సుందర కన్నెలు నీముఖ**
**సౌందర్యము జూచి, వినుచు సరసపు పలుకుల్**
**పొందుగ ఇండ్లకు బోయిరి**
**మందముగా గురు అనిలపు పట్టణవాసా!**

తా॥ ఓ గురువాయూరప్పా! సుందరీమణులైన గోపికలు అందరూ నీ మధురమైన మాటలను విని, తరువాత అందములొలుకు నీ ముఖ సౌందర్యము గాంచి కుశలముగా తమతమ ఇండ్లకు మెల్లగా పోయిరి.

24/11

తే॥ **నీవు బృందావనంబున ఆ విధముగ**
**కరుణ జూపావు గోపికా తరుణులందు**
**తొంటి వలె బూని స్వేచ్ఛగా తోయజాక్ష!**
**తిరుగుచుంటివి ముదముతో, దేవదేవ!**



**నీవు దయగలవాడవు బ్రోవుమయ్య**
**నాదు వ్యాధిని తొలగించి నయము నిమ్ము**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాధ**

తా॥ దేవదేవుడవైన ఓ శ్రీహరీ! నీవు ఆ విధముగా గోపకన్యలను అనుగ్రహించి, పూర్వమువలె స్వేచ్ఛగా, సంతోషముతో ఆ బృందావనంబున తిరుగుచుంటివి. ఓ కమలనేత్రా! నీవు దయాసాగరుడవు. ఈ దీనుని అనుగ్రహించి నా వ్యాధిని నివారించి నన్ను చల్లగా రక్షించుము. నారాయణ భట్టతిరులవారు రచించిన భాగవతమును నేను తెలుగు పద్య కావ్యంగా చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! ఈ కథ నాలకింపుము తండ్రీ!



## 25. ద్విజపత్నులను అనుగ్రహించుట

తే॥ **నీవు ఒకనాడు గోవుల, నేస్తములను**
**వెంటనిడుకొని బోతివి వేకువందు**
**మీరు బృందావనికి చాలదూరమందు**
**కలుగు అడవికి బోయిరి కమలనాభ**
**వనికి దాపున బ్రాహ్మణ భక్తురాండ్ర**
**గాంచి కరుణించగా నీవు యెంచినావు,**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె**
**వినుము గురువాయు పుర నాధ! విష్ణుగాధ**

తా॥ ఓ కమలనాభా! ఒకనాడు నీవు గోపాలకులను, గోవులను వెంటబెట్టుకొని తెల్లవారు జామున ఆవులను మేపుటకు బోతిని. మీరు బృందావనమునకు చాలదూరమున నున్న అడవికి వెళ్ళితివి. ఆ అడవికి దగ్గరలోనే నీకు పరమ భక్తురాండ్రయిన బ్రాహ్మణ స్త్రీలను నీవనుగ్రహింప దలచితిని. నారాయణ భట్టతిరి భాగవతమును నేను తెలుగు పద్యంగా చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! దీనినాలకింపుము తండ్రీ!



25/2

చం॥
**వనికదు నిర్జనంబగుట బాలురు దూరము నెంచకుండుటన్**
**చని చని దప్పిచే నిలుపజాలని ఆకలిచే తపించగా**
**"వినుడిది కొంతదూరమున విప్రులు కొందరు యజ్ఞమొక్కటిన్**
**ఘనముగ చేయుచుండిరట కావలె అన్నమనంచు వేడుడీ"**
**అని గురువాయుపట్టణపు అచ్యుత! అంటివి, ఆలకింపుమా**

తా॥ ఓ అచ్యుతా! ఆ అడవి నిర్జనమైనదగుటచే గోపబాలురకు తామెంతదూరము వచ్చిరో తెలియకుండెను. మీరు చాల దూరం నడచి యుండుటచేత గోపబాలురకు ఆకలి దప్పులు మెండుగానయి తపించి పోయారు. అప్పుడు జాలిగొనిన నీవు వారితో "కొలది దూరముననే బ్రాహ్మణులు యజ్ఞము చేయుచున్నారు. అచటికి వెళ్ళి ఆహారమునకై వారి నర్థింపుడు" అని వారిని అక్కడికి పంపితివి. ఓ గురువాయూరప్పా! ఈ కథను ఆలకింపుము తండ్రీ!

25/3

తే॥ యజ్ఞ తత్పరులైనయా అవనిసురుల
కడకు బోయిరి గోపులు వేడుకొనుచు,
"కృష్ణుడే మమ్ము బంపె మీ కృపను వేడ
కొంచె మన్నము, నీరము కోరుమనుచు"
మాట వినరైరి విప్రులు మంచి మరచి
ఊరకుండిరి విననట్లు కరుణ వీడి,
భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె
వినుము గురువాయు పుర విభో! విష్ణుగాథ

తా॥ ఆ గోప బాలురంతా చివరకు నీవు చెప్పినట్లే యజ్ఞ తత్పరులైన ఆ బ్రాహ్మణులవద్దకు పోయి ఆహారమునకై అర్థించుచు "మమ్మల్ని శ్రీకృష్ణుడు మీవద్దకు దయతో కొంచెము అన్నము నీరు ఇమ్మని అడుగవలసినదిగా అభ్యర్థింపుడని పంపినాడు" అని చెప్పిరి. కాని శ్రౌత కార్యములయందు మునిగి మంచితనం మరచిన ఆ విప్రులు వారి మాటలు వినలేదు. విన్నవారు విననట్లు నటించిరి. ఓ గురువాయూరప్పా! భట్టతిరి చెప్పిన భాగవతమును తెలుగు పద్యరూపంలో ఆలకింపుము తండ్రీ!



25/4

కం॥ ఖిన్నులు గోపులు మరలిరి,
ఎన్నడు నీ 'అభక్తు'లును ఏ'భక్త'మునున్
మిన్నగ నెవ్విధి నిత్తురు?
సన్నత! గురువాయుపురపు స్వామీ! వినుమా.

తా॥ ఓ గురువాయూరప్పా! బ్రాహ్మణులచే నిరాదరింపబడిన గోపబాలకులు చాల ఖిన్నులై వెనుదిరిగి వచ్చిరి. ఎల్లప్పుడు సన్నుతింపబడు ఓ స్వామి నువ్వు ఇది విను. ఎప్పుడైనా నీ అభక్తులైన (భక్తిలేనివారు, ఉపవాస దీక్షలో నిరాహారులైనవారు) ఆ బ్రాహ్మణులు భక్తమును (భక్తిని, ఆహారమును) ఏ విధముగా నీకీయగలరు?



25/5

ఉ॥
"అన్నము వేడెకృష్ణుడని ఆ ద్విజపత్నులవద్ద తెల్పుడీ
మన్నన తోటి జాలి గల బ్రాహ్మణ పత్నులు తీర్తురాకలిన్"
సన్నుటి నవ్వుతోపలుక చక్కటిమాటను వింటిరందరున్
ఎన్నికయైనగాథ విను హే గురువాయుపురాధినాయకా!

తా॥ "ఓ గోపాలులారా! మీరు ఆ బ్రాహ్మణుల పత్నుల దగ్గరకు పోయి శ్రీకృష్ణుడు అన్నము అడిగినట్లు తెలుపుడు. మర్యాదపూర్వకముగా జాతి గుండెలుకల బ్రాహ్మణ పత్నులు తప్పక మీకు ఆహారము నిత్తురు" అని మొలక నవ్వులతో నీవు పలుకగా మధురమైన నీ మాటలను అందరూ శిరసావహించారు. ఓ గురువాయూరప్పా! అత్యుత్తమమైన నీ గాథను ఆలకింపుము తండ్రీ!



25/6

సీ॥ బ్రాహ్మణ పత్నుల వద్ద గోపాలురు
నీపేరు జెప్పిరి గోపబాల!
భక్ష్య, భోజ్యమ్ములు, పలుచోష్య లేహ్యముల్
షడ్రుచుల్ కలుగు భోజనము గొనుచు
విప్రవనితలంత వేగిరపాటుతో
నీవద్ద జేరిరి నిగమ వినుత!
చాలకాలమునుండి స్వామి! నిన్ జూడగా
ఆశతో నుండిరా అతివలంత

తే॥ కాన, భర్తలసైతము కాదననుచు
భోజనముతోటి వచ్చిరా ఉవిదలంత
భట్టతిరికృతి తెలుగులో పద్యమాయె
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ఆ గోపబాలకులు బ్రాహ్మణ స్త్రీలవద్ద నీపేరు చెప్పిరి. ఓ గోపబాల! వెంటనే ఆ స్త్రీలు భక్ష్య, భోజ్య, చోష్య, లేహములు అను చతుర్విధములై షడ్రుచులు కలిగిన ఆహారమును తీసికొని నీదగ్గరకు బయలుదేరిరి. వారు చాలకాలమునుండి నిన్ను చూడవలెనని ఆశతో నీ దర్శనమునకై కుతూహలముతో నిరీక్షించుచుండిరి. అందువలన వారు తమ భర్తలు తమను నివారించినను ఆగక వెంటనే ఆ స్త్రీలు నీయొద్దకు భోజనముతో వచ్చిరి. వేదములు కీర్తించు ఓ స్వామీ! నారాయణ భట్టతిరి కృతిని నేను తెలుగు పద్యములో చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! దీనినాలకింపుము తండ్రీ!



25/7

**సీ॥ నీ ముంగురులపైన నెమలిపింఛము కాంతు**
**లొదవుచు అటునిటు కదలుచుండె**
**ప్రతిఫలించెను నీదు పాలచెక్కిళ్ళపై**
**మిలమిలా నీకుండలాల కాంతి**
**తొణికిసలాడెను తోయజాక్షంబులు**
**కరుణారసపు వృష్టి కురియజేసి**
**చెలికాని భుజముపై చెయినుంచి శ్రీకృష్ణ!**
**నీవు విలాసాన నిలిచినావు**

**తే॥ స్వామి! నినుజూచి ఆ విప్రసాధ్వులంత**
**ఓలలాడిరి సంతోష జలధియందు**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె**
**వినుము గురువాయుపుర విభో! విష్ణుగాధ.**



తా॥ ఓ స్వామీ! ఆ బ్రాహ్మణ స్త్రీలు నీ దివ్య మంగళ విగ్రహం దర్శించారు. అప్పుడు, నీ ముంగురులపై నెమలిపింఛము కాంతులీనుచు అటునిటు కదలాడుచుండెను. నీ మణికుండలముల కాంతి మిలమిలలాడుచు నీలేత చెక్కిళ్ళపై ప్రతిఫలించుచుండెను. నీ కనులలో కృపారసము తొణికిసలాడుచుండెను. ఓ శ్రీకృష్ణా! నీ స్నేహితుని భుజముపై నీ చేతినుంచి నీవు విలాసముగా నిలబడియుంటివి. అటువంటి నిన్ను జూచి ఆ బ్రాహ్మణ పత్నులు ఆనందమున ఓలలాడిరి. నారాయణభట్టతిరి భాగవతమును నేను తెలుగు పద్యములుగా చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! దీని నాలకింపుము తండ్రీ!



25/8

**ఉ॥**
**అంతట యొక్క విప్రసతి అచ్యుత! నీదరి జేరబోవగా**
**కాంతుడు ఆపి పోవుటకు కాదనె ఆ సతినెమ్మనంబునన్**
**వంతనుజెంది ఆ క్షణమె ప్రాణము వీడెను నిన్ దలంచుచున్**
**ఎంతటి ధన్య ఆ లలన ఇచ్చితివామెకు మోక్షప్రాప్తినిన్**
**సుంతదయుంచి నన్ను కృపజూడుము ఓ గురువాయుసుందరా!**

తా॥ గురువాయువులచే నెలకొల్పబడిన సుందరాకారా! గురువాయూరప్పా! అంత ఆ సమీపమున యున్న ఒక బ్రాహ్మణపత్ని భక్తి భావమున నిన్ను సమీపించుటకు రాబోవుచుండగా ఆమె భర్త ఆమెను చేయి పట్టుకొని వారించెను. అంతట ఆమె నిన్నే స్మరించుచు తన ప్రాణములను విడిచెను. ఆమె ఎంత ధన్యాత్మురాలోగదా! నీవు మోక్షమును ప్రసాదించితివి. ఓ కరుణామయా! కొంచెము నామీద కూడ దయచూపరాదా తండ్రీ!

25/9

సీ॥ ఆ విప్రసతులట్లు అతి భక్తితో నీకు
ఆహారమర్పింప యారగించి
తృప్తిజెందితివీవు దీవించినావయ్య
నిను వీడలేమని అనిరి వారు
తమ ఇండ్లు వాకిండ్లు తమరికి వద్దన్న
తిరిగి పంపించావు వారినీవు
యజ్ఞకార్య సమాప్తి అత్యవసరమని
నచ్చజెప్పావీవు నందబాల!

తే॥ వారి నాదరించిరి పతుల్ కొరతలేక
వారి మనసులు నీయందె జేరి యుండె
భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె
వినుము గురువాయుపుర విభో! విష్ణుగాధ.



తా॥ ఓ నందబాలా! ఆ బ్రాహ్మణ స్త్రీలు సంపూర్ణమైన భక్తితో నీకు సమర్పించిన ఆహారమును నీవు తనివిదీర ఆరగించి వారిని దీవించి అనుగ్రహించావు. కాని వారు నీ సాన్నిధ్యమునే కోరి తమ ఇండ్లు వాకిండ్లు సైతము విసర్జించి నీకడనే ఉండిపోదలచిరి. కాని విద్యుక్తముగా యజ్ఞకార్యము పూర్తియగుటకై నీవు వారిని తిరిగి యజ్ఞవాటికలకు బంపితివి. వారి భర్తలు కూడ తమ సతులయందు ఎట్టి దోషములేదని తలంచి వారిని ఏ కొరతలేక ఆదరించిరి. అట్లు బ్రాహ్మణ పత్నుల మనస్సులలో నిలిచిపోయి వారి ననుగ్రహించితివి. నారాయణ భట్టతిరుల భాగవతమును తెలుగు పద్యములలో చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! దీనినాలకించి నన్ను చరితార్థుణ్ణి చేయుము తండ్రీ!



25/10

సీ॥ తమరి భార్యలు నీయందె అమలమైన
భక్తి కలిగియుండుట జూచి బ్రాహ్మణులకు
హృదయ పరివర్తనము జెంది ఉదయమాయె
తగు వివేకంబు, అందుచే ధన్యులైరి
నీవు పరమాత్మవే యను భావమొంది
పలు విధంబుల కీర్తించి కొలిచినారు
నాదు వ్యాధిని తొలగించి నయము నిమ్ము
వినుము గురువాయుపుర విభో! విష్ణుగాధ.

తా॥ ఓ స్వామీ! ఆ బ్రాహ్మణులు తమ భార్యలయొక్క అనన్య భక్తిని గ్రహించిరి. అటు పిమ్మట వారిలో వివేకము ఉదయించెను. అంతట వారు తమ భార్యలయెడ తామొనర్చిన తప్పులను తెలుసుకొనిరి. అందుచేత వారు ధన్యులైరి. నీవు పరమాత్మవను భావముతో వారంతా నిన్ను పరిపరి విధముల ప్రస్తుతించిరి. ఓ గురువాయూరప్పా! నా వ్యాధిని తొలగించి నాకు స్వస్థత చేకూర్చుము. దీని నాలకించి నన్ను ధన్యుని జేయుము తండ్రీ!



## 26. ఇంద్రయాగ నిర్వహణము

తే॥ నందుడొకనాడు గోపాలురందరున్ను
కలిసి 'ఇంద్రయాగము' జేయ తలచినారు,
వలయు వస్తు సామగ్రిని వారు కూర్ప
తలచ, ఇంద్రుని గర్వంబు నిలువరించ,
నందు గడజేరి నీవు వినయము తోడ
"తండ్రి! ఈ యత్నములు దేని తలచి నీవు
చేయుచుంటివి" అడిగావు చిన్నికృష్ణ!
వినుము గురువాయుపురనాథ! విష్ణుగాధ.

తా॥ ఓ చిన్నికృష్ణా! ఒకనాడు నందాది గోపాలురందరు కలిసి ఇంద్రుని ప్రీతికై ఇంద్రయాగము చేయదలచి దానికి కావలసిన వస్తువులనన్నిటినీ సమకూర్చుకొనుచున్నారు. అంతట ఇంద్రుని గర్వమును అణచివేయదలచిన నీవు (అన్నియు తెలిసినను) నీ తండ్రితో వినయముగా ఇట్లంటివి "తండ్రీ! ఈ ప్రయత్నమంతయు దేని కొఱకు?" ఓగురువాయూరప్పా! ఈ విష్ణుగాధ నాలకింపుము తండ్రీ!

26/2

చం॥

**"ప్రతి యొక వత్సరంబటుల మానక జేసిన" ఇంద్రయాగమున్**
**అతను ముదంబుతో కురియనంపును వర్షము దానిజేతనే**
**అతులిత శోభతో అవనియందున పచ్చని గడ్డి, నీరమున్**
**బ్రతుకగ జీవరాశి, మనవారలు, గోవులు దక్కు నాయనా!"**
**అతననె శ్రీమరుత్ గురుపురాధిప! ఈ కథనాలకింపుమా.**

తా॥ శ్రీగురువాయూరప్పా! ఈ కథను వినుముస్వామీ! అప్పుడు నందగోపుడు నీతో ఇట్లనెను. "నాయనా! ప్రతి సంవత్సరము ఇంద్రయాగమును తప్పక చేయుదుము. అందువలన ఇంద్రుడు సంతోషించును. భూమిపై వానలు కురిపించును. ఈ భూతలమున మానవుల జీవితమంతయు వర్షముపైననే ఆధారపడియున్నది. మనము పెంచుకొనుచున్న ఆవులు, పచ్చని గడ్డితిని నీరు త్రాగి జీవించును. సమస్త జీవరాశి వర్షము వలననే జీవించుచున్నవి"



26/3

చం॥

**"మనవిని ఆలకింపుమిక మన్ననతో ఒకసారి నాయనా!**
**మనలకు ఇంద్రుడే పగిది వర్షమునీయును? కల్లలన్నియున్**
**ఘనముగ జీవరాశి మనగల్గుట వారల భాగ్యప్రాప్తిచే**
**వనములనున్న ఈ తరులు వాసవుకీగలవే హవిస్సునున్"**
**అని పలికావు నీవు వినవా గురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ గురువాయూరప్పా! నీవు అప్పుడు నీ తండ్రియైన నందునితో సరసముగా ఇట్లంటివి. "నాయనగారు! వర్షము ఇంద్రునివలన కలుగునను మాటలు అబద్ధములు. జీవులయొక్క జీవనమునకు వారు చేసికొనిన భాగ్యము (అదృష్టము) ప్రాప్తియే కారణము, కాని వేరెవరూ కాదు. వారి అదృష్టమునననుసరించి వానలు కురియును. అరణ్యములలోని మహావృక్షములు వాన వలన జీవించుచున్నవి కదా! అవి ఇంద్రునకు హవిస్సునర్పించునా? లేదు కదా!!"



26/4

సీ॥ **"నీపల్కుచొప్పున గోపాలకులమైన**
**మనవంశ సంపద ఘనత, తండ్రి!**
**మనగోగణంబులే, వాటికి బ్రతుకెట్లు?**
**గోవర్ధనముకదా!! జీవగర్ర,**
**ఆ గిరి తిరుగుచు హాయిగా పచ్చిక**
**మేయుచు బ్రతుకును, మేలుజేయు**
**పూజార్హులందుచే భూసురుల్ గోవులున్**
**గోవర్ధనంబును కొలువ తగును**

తే॥ **నచ్చజెప్పితివీరీతి నందుదాది**
**గోపులకు నీవు వివరించి ఆపినావు,**
**భట్టతిరికృతి తెలుగులో పద్యమాయె**
**వినుము గురువాయుపుర విభో! విష్ణుగాథ.**



తా॥ ప్రభూ! నీవింకను ఇట్లంటివి. "తండ్రీ! నీవన్నట్లు గోపాలకులమైన మనకు వంశ పరంపరగా వచ్చుచున్న గొప్ప సంపద ఈ ఆవులే. వాటికి ఈ గోవర్ధన పర్వతము జీవనాధారము. కావున పూజనీయము గోవర్ధన పర్వతము మాత్రమే" ఆ విధముగా నందుడు మొదలైన గోపాలురకు నీవు హితబోధ జేసితివి. నారాయణభట్టతిరి రచించిన భాగవతమును నేను తెలుగు పద్యరూపమున చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! దీనినాలకించి నన్ను చరితార్థుని చేయుము తండ్రీ!

26/5

ఉ॥

**మెచ్చిరి నీదు మాటలను పెద్దలు పిన్నలు కొల్చిరందరున్**
**ముచ్చటదీర బ్రాహ్మణుల, మోదముతో గిరి బెక్కురీతులన్**
**తెచ్చు శుభంబులంచనుచు తేకొని చేసి ప్రదక్షిణంబులన్**
**ఇచ్చిరిగా నివేదనను, ఈప్సితమొప్పగ, శృంగరూపియై**
**ఇచ్చట స్వీకరించితివి, హే గురువాయుపురాధి నాయకా!**

తా॥ నందుడు మొదలైన పెద్దలు మరియు పిన్నవారు కూడ నీ మాటలను గౌరవించిరి. తమందరు అనుకున్నట్లుగా బ్రాహ్మణులను రావించి పూజించారు. సంతోషముతో గోవర్ధనగిరికి నానావిధములైన పూజోపచారములను సమర్పించారు. ఆ పర్వతమునకు ప్రదక్షిణలు చేసి నమస్కరించారు. అప్పుడు నీవు గోవర్ధనగిరి రూపములో ఆ నైవేద్యమును స్వీకరించితివి. ఓ గురవాయూరప్పా! ఈ కథనాలకింపుము తండ్రీ!



26/6

చం॥

**"కనిరి గదా!! తమందరును గౌరవ మొప్పగ మీప్రసాదమున్**
**గొనినది శృంగమిప్పుడిక కొంచెము భీతినిజెందబోకుడీ**
**మనకిక వాసవుండు తను బాధలనీయగ శత్రువైననున్**
**ఘనతను జూపి ఈ నగము గాచును యెల్లర శంకవీడుడీ"**
**అను గురువాయుపట్టణపు అచ్యుత! నీకథ నాలకింపుమా.**

తా॥ "మీరే చూశారు కదా!! నేను పలికినది నిజమే కదా!! మీరిచ్చిన ప్రసాదమును గోవర్ధన పర్వతము స్వీకరించినది కదా!! కాబట్టి కొంచెంకూడ భయపడకండి. ఒకవేళ మనకు ఆ ఇంద్రుడే శత్రుత్వం వహించి హాని తలపెడితే అతడు పర్వతములకు శత్రువు కనుక గోవర్ధన పర్వతమే మనల్నందరినీ రక్షిస్తుంది, అనుమానం వద్దు" ఇట్లు గోపాలురందరు సంతోషించు విధముగా చెప్పెడి గురువాయూరప్పా! ఈకథ నాలకింపుము తండ్రీ



26/7

సీ॥ **నందాదులున్ తమ నైవేద్యమున్ గిరి**
**స్వీకరించగ సంతసించిరంత,**
**గృహముల జేరిరి కీర్తించుచున్ నిన్ను**
**తెలిసిపోయెను 'కథ' దేవపతికి,**
**పరమాత్మవగు నీదు మహిమలు సురపతి**
**బాగుగా నెరుగును పలు విధముల**
**నీకృప జేతనే నిలిచెను ఇంద్రత్వ**
**మెన్నియో మారులు మున్నతనికి**

తే॥ **రజగుణోపేతుడౌటచే నిజము మరచి**
**క్రోధవశుడయ్యె అవమాన వ్యధనుజెంది,**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె**
**వినుము గురువాయుపుర విభో! విష్ణుగాధ.**



తా॥ స్వామీ! నందుడు మొదలైన వారంతా తాము సమర్పించిన నైవేద్యం ఆ గోవర్ధన పర్వతము స్వీకరించుట చూచి చాల సంతోషించారు. పిమ్మట అందరు తమతమ గృహంబులకు చేరుకొనిరి. గోపాలురు ఇంద్రయాగమును మానివేసిరి. ఇది దేవేంద్రునికి తెలిసినది. పరమాత్మవగునీ మహిమలను దేవేంద్రుడు ఇదివరలోనే ఎరుగును. అతనికి ఎన్నోసార్లు ఇంద్రత్వము రాక్షసుల బారినుంచి రక్షించి ఇచ్చినది నీవేకదా! అత్యున్నతమైన ఆ దేవేంద్రపదవిలో ఉండికూడ రజోగుణ ప్రేరేపితుడై తను అవమాన పీడితుడై ఆగ్రహించెను. నారాయణ భట్టతిరుల భాగవతమును నేను తెలుగులో పద్యరూపములో చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణు గాధనాలకింపుము తండ్రీ!

26/8

చం॥

**"తనుహరియైననున్ అవని తాను జనించిన మానవుండుగా**
**గొనకొని దేవతాళినిక గొల్చుట ధర్మము, చిన్నచూపు ఆ**
**'మనుజుడు' చూడరాదు కద!! మాన్యతనీయక, వీనికింద్రుడున్**
**పనివడివారి సంపదను భగ్నము నెవ్విధిజేయు చూపెదన్"**
**అనె, గురువాయుపట్టణపు అచ్యుత! ఈ కథనాలకింపుమా**

తా॥ అచ్యుతా! అప్పుడు ఆగ్రహోదగ్రుడైన ఇంద్రుడిలా అన్నాడు. "శ్రీమన్నారాయణుడేయైనను మానవుడై భూమిమీద జన్మించాక అతడు కూడ దేవతలనందరిని పూజించుట ధర్మము. ఆ మానవుడు దేవతలను చిన్నచూపు చూడరాదు కదా! అది గౌరవహీనమైన పని. నేను దేవేంద్రుడను. ఈ గోపాలుని సంపదనంతయు నాశనము చేసెదను. నా ప్రతాపము జూపెదను" ఓ గురువాయూరప్పా!ఈ కథనాలకింపుము తండ్రీ!



26/9

సీ॥ **అమరేంద్రుడాగక అధిక గర్వంబుతో**
**నీ గోకులంబును నిహతిజేయ**
**ప్రళయ మేఘంబుల పనివడి రావించి**
**వాటి ప్రేరేపించె వరదముంచ**
**ఐరావతమునెక్కి ఆదివిజేంద్రుడు**
**వజ్రాయుధముబూని బయలుదేరె**
**అగ్ని, వాయువులాది అమరులు ఇదిజూచి**
**తేలిరి నవ్వుల త్రిభువనాథ!**

తే॥ **ఎంతవారికి నీమాయ ఎరుగనగునె?**
**మోహ పరవశులన్ జేతువో మురారి!**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఇంద్రుడు అధిక గర్వముచే వివశుడై నీ గోకులమును సర్వనాశనము చేసెదనని, ప్రళయ కాలమేఘములను



ప్రేరేపించెను. తానుకూడ ఐరావతము నెక్కి వజ్రాయుధమును చేబూని బయలుదేరెను. ఈ దృశ్యమును చూచిన అగ్ని, వాయువు మొదలైన దేవతలు అతని మూర్ఖత్వమును జూచి తమలో తాము నవ్వుకొనిరి. ఓ త్రిజగన్నాధా! నీమాయ ఎంత గొప్పవానినైనను మోహపరచును కదా! నారాయణ భట్టతిరుల కృతిని నేను తెలుగు పద్యంగా చెబుతున్నాను. దీనినాలకింపుము తండ్రీ!

26/10

సీ॥ **అంతట నీవు నందాదులతో నిట్లు**
**అంటివి శ్రీహరీ! అనునయముగ**
**"సురపతి కినియ భూసురుల ఆశీస్సుల**
**బలములే కాపాడు కలతవలదు**
**గోవర్ధననగంబు కూడ రక్షించును**
**కష్టంబు కలుగదే నష్టమైన**
**నచ్చజెప్పితివట్లు నందబాలా! నీవు**
**నమ్మిక కలిగించినావు స్వామి!**



తే॥ **ఇంకరాదేల కోపియై ఇంద్రుడనుచు**
**ఎదురుతెన్నులు చూశావు బెదురులేక**
**నాదువ్యాధిని తొలగించి నయము నిమ్ము**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ శ్రీహరీ! అప్పుడు నీవు నందాదులతో "సురేంద్రుడు కోపగించినచో బ్రాహ్మణులయొక్క ఆశీస్సులు మనలను కాపాడగలవు, భయము వలదు ఈ గోవర్ధన పర్వతముయొక్క దయచేత మనకు ఏకష్టములు నష్టములు కలుగవు" అని నచ్చజెప్పితివి. స్వామీ నీవు ఆ విధముగా గోపాలురకు నమ్మకం కలుగజేసినావు. తరువాత దేవేంద్రుడు ఇంకను రాలేదేమి యనుచు అతని రాకకై ఎదురు తెన్నులు చూచితివి. అట్టి గురువాయూరప్పా! నా రోగములను దయతో తొలగించి నన్ను రక్షింపుము. ఈ విష్ణుగాథ నాలకింపుము తండ్రీ!

## 27. గోవర్ధనోద్ధరణము

**చం॥**

**అనవుడు గోపపల్లె పయి ఆ సురనాధుడు పంపుమేఘముల్**
**అనుపమలీలతో ఉరిమి ఆకసవీధి నితాంతగర్జనల్**
**వినిచెను, దిక్కులన్నియును పిక్కటిలెన్, ఘననీలమేఘముల్**
**నిను తలపించె కృష్ణ! ఘననీరజనాభ! మదీయ ప్రార్థనల్**
**విను గురువాయుపట్టణపు విష్ణుని గాథను నందనందనా!**

తా॥ ఘనుడవైన పద్మనాభా! శ్రీకృష్ణా! అప్పుడు నందవ్రజముపై ఆ దేవేంద్రుడు పంపిన మేఘములు ఉరుముచు దట్టముగా అద్భుతముగా కమ్ముకొని దిగంతములన్నియు మారుమ్రోగి, దిక్కులన్నియును కంపించినవి. ఆ ఘననీలమేఘములు నీ నీలమేఘ తనూలతను స్ఫురింప చేయుచుండెను. ఓ గురువాయూరప్పా! నందనందనా! నా ప్రార్థన మన్నించి ఈ విష్ణుగాథ నాలకింపుము తండ్రీ!



27/2

సీ॥ దేవ! రేపల్లెపై తీవ్రమౌ వడగండ్ల
వాన కురియజేసె వాసవుండు
తాళలేకుండిరా ధాటికి గోపులు
పరుగిడిరటునిటు పలికిరిట్లు
"ఇంద్రుండు కోపించి ఈ విధంబుగ జేసె
ఇకమాకు శ్రీకృష్ణ ఈవె దిక్కు"
నిను వేడుకొనిరయ్య కనికరంబును జూప
కరుణా సముద్రుడై కరిగినావు

తే॥ "అభయ మిచ్చితి భీతిల్లు అవసరంబు
లేదు" అంటిని ఓ ప్రభూ! యదుకులేంద్ర!
భట్టతిరికృతి తెలుగులో పద్యమాయె
వినుము గురువాయుపురనాధ! విష్ణుగాథ.



తా॥ దేవా! ఆ దేవేంద్రుడు కోపించి ఆ నందవ్రజముపై తీవ్రమైన వడగండ్ల వానకురిపించెను. ఆ ధాటికి తట్టుకోలేక గోపాలురందరూ అటూనిటూ కకావికలై పరుగెత్తారు. వారు "ఇంద్రుడు కోపించి ఇట్లు వడగండ్ల వాన కురిపించుచున్నాడు. శ్రీకృష్ణా! మమ్మెట్లయినా రక్షించు, నీవే దిక్కు" అని నిన్ను వేడుకొనినారు. అప్పుడు నీవు వారిని "భయపడకండి" అని అభయమిచ్చి వారిని ఓదార్చినావు.
ఓ యదునాధా! గురువాయూరప్పా! నారాయణభట్టతిరి భాగవతమును నేను తెలుగు పద్యములలో చెబుతున్నాను. దీనినాలకింపుము తండ్రీ!



27/3

కం॥ "గోవర్ధనమే గోపుల
దైవంబా 'గిరులవైరి' దమనము నాపున్"
ఈవని గిరినిన్ పెకల్చి
నావే!! గురువాయుపురపునాధా! వినుమా.

తా॥ "గోపాలురమైన మనకందరికీ ఈ గోవర్ధన పర్వతమే దైవము. ఈ పర్వతమె గిరులవైరి అయిన ఆ ఇంద్రుని దమనకాండ నుంచి మనలను రక్షించును" ఈ విధముగా నీవు పలికి వెంటనే చిరునవ్వులొలికించుచు నీ చిన్నారి చేతులతో ఆ గోవర్ధనమును సమూలముగా పెకలించినావు కదా! ఔరా!! గురువాయూరప్పా! ఈ కథ నాలకింపుము తండ్రీ!

27/4

**సీ॥ గోవర్ధనంబును నీవు నీసుకుమార**
**కరముల పైకెత్తి కదు సులువుగ**
**అడిగావు నీవారి నందరిన్ ఆ గిరి**
**క్రిందున్నసైకతమందు జేర,**
**నీపల్కు చొప్పున నిలిచిరి వారంత**
**గోవర్ధనము క్రింద కుశలమరయ,**
**గోవులు, గోపులు, గోపరికరములు**
**చినుకుపైబడకుండ సేమముండె**

**తే॥ ఆపి వడగండ్ల వానను ఆ విధముగ**
**కాచి గోపాల! ఆపావు ఘాతుకమును**
**భట్టతిరి కృతి తెలుగులో పదమాయె**
**వినుము గురువాయుపుర విభో! విష్ణుగాథ.**



తా॥ ఓ గోపాలా! నీవు గోవర్ధన పర్వతమును సుకుమారమైన నీచేతితో పైకెత్తితివి. తరువాత నీవు ఆ గోపాలురను తమ పరికరములతోను, గోవులతోను ఆ పర్వతము క్రిందగల ఇసుక తిన్నెల మీదికి రమ్మని పిలిచితివి. వెంటనే వారు నీ మాట ప్రకారము ఆ గోవర్ధనము క్రింద జేరిరి. దాని వలన ఆ గోవులపైన గోపాలురపైన ఒక్క చినుకు వాన యైనను పడలేదు. ఓ గురువాయూరప్పా! ఆ విధముగా నీవు వడగండ్ల వాన నుంచి నీవారిని రక్షించుటకై ఇంద్రుని నిలువరించినావు. తండ్రీ ఆ కథ నాలకించి నన్ను రక్షింపుము.



27/5

**ఉ॥**
**నీవొక చేత ఆ గిరిని నిల్పుచు ఎత్తితివంత మిత్రులన్**
**ఆవల గోపకన్యలను అచ్యుత! నీ చతురోక్తి నవ్వులన్**
**బ్రోవులు చేసి అందరిని ముంచితివప్పుడుసంతసంబునన్**
**గోవుల దువ్వుచుంటి వట కూరిమి వేరొక చేత హాయిగా**
**భూవనితాపతే! వినుము ఓ గురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ అచ్యుతా! నీవు ఒక చేతితో గోవర్ధన పర్వతమునెత్తి ఆ పర్వతము క్రింద ఉన్న నీ స్నేహితులతో, గోపకన్యలతో విలాసముగా నీ చతురోక్తులతో నవ్వులు ప్రోవులుగా చేసి అందరినీ ఆనందమున ముంచితివి. అట్లే నీవు మరియొక చేతితో నీచెంతనున్న ఆవులను ప్రేమగా దువ్వుచు హాయిని గూర్చితివి. ఓ గురువాయూరప్పా! నీవు భూవల్లభుడవ. నీ కథనాలకింపుము తండ్రీ!



27/6

**చం॥**
**"ఘనమగు ఈ గిరీంద్రమును గ్రక్కున బాలుడు వామహస్తమం**
**దున యెటు నిల్పినాడు!! మతితోచదు అద్భుత కార్యమయ్యెడిన్**
**అనుపమమైనదీ అచల మాయెనొ దీని ప్రభావమంతయున్"**
**నినుగని నందుదాదిగల నీ హితులెల్లరు పల్కిరత్తరిన్**
**విను గురు వాయుపట్టణపు విష్ణుని గాథను నందనందనా!**

తా॥ ఈ గోవర్ధన పర్వతము చాల పెద్దది. ఈ బాలుడు ఒక్కసారిగా ఈ మహాపర్వతమును తన ఎడమ చేతితో అవలీలగా ఎత్తి పట్టుకొనినాడు. ఈ అద్భుతం ఎట్లా సాధ్యపడింది అర్థమగుటలేదు. ఇది యంతయు ఈ గోవర్ధన గిరి ప్రభావమేనేమో!!" నిన్ను చూచుచు నందాదులు విస్మయముగా అట్లు పలికిరి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథనాలకింపుము తండ్రీ!

27/7

కం॥ "గొలుపును నెప్పులు చేతికి
నిల దించును గిరిని వీడు;" ఏడుదినంబుల్
విలయము సలిపెను సురపతి
తలచుచు, గురువాయుపురపు దైవమ! వినుమా.

తా॥ ఓ గురువాయుపురపు దేవదేవా! దేవేంద్రుడు నీ లీలను జూచి కూడ ఇట్లు తలంచెను. ఈ అర్భకుడు ఈ పర్వతాన్ని ఎంతసేపు ఎత్తిపట్టుకొంటాడు? చేతులు నెప్పులు పుట్టి తప్పక క్రిందపడేస్తాడు. (అప్పుడు దానిక్రింద చితికి పోయి వాళ్ళే చస్తారు) ఈవిధంగా తలచి అసురపతి ఏడురోజులపాటు ఎడతెగకుండా భీభత్సాన్ని సృష్టించాడు.



27/8

సీ॥ గోవర్ధనంబును ఆవిధి హస్తాన
ఏడురోజులు నిల్పి యెడతెరుగక
అడుగైన కదలక అచలంబు నెత్తావు
జలదంబులన్ నీటి 'నిలువ' లేక
వర్షంబులాగెను వరదలంతంబయ్యె
గాలికి మేఘాలు తేలిపోయె
పాకారి యదిచూచి భయపడి పరువెట్టి
నీ కడకేతెంచె నిలువ లేక

తే॥ సురవిభుండు నీ లీలను సుంతయైన
ఎరుగడెన్నాళ్ళు గడచినా అరయలేడు
భట్టతిరికృతి తెలుగులో పద్యమాయె
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.



తా॥ ఓ ప్రభూ! నీవు ఆ విధముగా గోవర్ధన పర్వతమును నీ ఎడమ చేతితోఎత్తిపట్టుకొని ఒక అడుగైన కదల్చక స్థిరముగా నిలిచి యుంటివి. ఏడు దినముల తరువాత మేఘములలోని నీరంత నిలువ తరిగి పోయి వర్షములాగిపోయినవి. ఉత్తి మేఘములు గాలికి కొట్టుకొనిపోయినవి. అప్పుడు ఇంద్రుడు నీ మహిమకు భయపడి పరిగెత్తుకొని నీదగ్గరకు వచ్చాడు. ఆ ఇంద్రుడికి నీలీలా మహాత్మ్యం ఎన్నాళ్ళు గడిచినా అర్థంకాదు. ఓ గురువాయూరప్పా! నారాయణభట్టతిరి రచించిన భాగవతమును నేను తెలుగు పద్యరూపంలో చెబుతున్నాను. దీనినాలకించి నన్ను ధన్యుణ్ణి చేయుము తండ్రీ.



27/9

ఆ.వె.॥ వర్షమాగిపోయె పర్వతంబును వీడి
బయట చేరిరంత పరవశించి,
గిరినిద్రించగానె గురువాయుపురవిభో!
మురిసి కౌగలించినారు నిన్ను.

తా॥ ఓ గురువాయూరప్పా! వారము దినముల తరువాత వర్షము ఆగిపోయింది. అప్పుడు గోపాలురు గోవులు అన్నియు పర్వతము క్రిందనుంచి బయటకు వచ్చిరి. అంత ఆ గోవర్ధన పర్వతమును భూమిపై యథాస్థానమున దించిపెట్టావు. నీతోడి గోపాలురందరూ సంతోషంతో నిన్ను కౌగలించుకొనినారు.

27/10

తే॥ **"తొలుత కిటి రూపమున నీవు తోయజాక్ష!**
**భూమినంతయు అవలీల మోసినావు**
**అట్టినీకు గోవర్ధన అచలమిట్లు**
**మోయుటొక లెక్కకాదయ్య మురళిలోల!"**
**అనుచు ప్రస్తుతించిరి నిన్ను అమరులెల్ల,**
**నాదు వ్యాధిని తొలగించిన నయమునిమ్ము**
**భట్టతిరికృతి తెలుగులో పద్యమాయె**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ పద్మములవంటి నేత్రములుగల ప్రభూ! "ఆదివరాహ రూపమున నీవు మొత్తం భూమినే అవలీలగా నీ ముట్టెపై మోశావు. అటువంటి నీకు ఈ చిన్న కొండను ఎత్తటం చిటికెన వ్రేలిపనికదా. అది నీకు లెక్కయా?" అని దేవేంద్రునితో పాటు దేవతలంతా నిన్ను కీర్తించారు. ఓ గురువాయూరప్పా! నా వ్యాధిని తొలగించి నన్ను రక్షింపుము. నారాయణభట్టతిరులు రచించిన శ్రీమన్నారాయణీయమును నేను తెలుగు పద్యములలో చెబుతున్నాను. దీనినాలకించి నన్ను ధన్యుణ్ణి చేయుము తండ్రీ!



# 28. గోవిందాభిషేకము-గోపాలకుల పరమపద దర్శనమ

చం॥
**మును గిరినెత్తి గోకులము మోదముతోయటు రక్షజేయుటన్**
**కని నిను విష్ణువన్ దెలుపు కర్మలు శ్రీహరి లీలలౌ భళా!**
**నిను జగదీశుడంచెరిగి నీజనకున్ కడ గోపులందరున్**
**చని తమ నందనందనుని జాతక వైభవమెట్టిదో కదా!**
**వినెదమనంటిరయ్య మనవిన్, గురువాయుపురాధినాయకా!**

తా॥ ఇదివరలో నువ్వు గోవర్ధనపర్వతమునెత్తి గోకులమును రక్షించుట వంటినీ లోకోత్తర లీలను జూచి, నీ ఘనతను గుర్తించి ఆ కర్మలన్నియు నీవు విష్ణువే అని తెలుపుతున్నాయని భావించి ఆహా! అవి శ్రీహరి లీలలే అని అనుకొని నిన్ను జగదీశ్వరునిగా



భావించి నీతండ్రియైన నందగోపునివద్దకు వినయంగా గోపాలకులందరు వెళ్ళి మేము వింటాము కృష్ణుని జాతకముయొక్క వివరములు చెప్పుము అని అడిగారు. ఓ గురువాయూరప్పా! ఈ కథనాలకింపుము తండ్రీ!

28/2

ఆ.వె ॥ **గర్గమౌని నుడువు కథనంత వినినారు**
**నీ ప్రభావమెరిగి నిజము తెలియ**
**పెరిగె గౌరవంబు గురువాయు పురవిభో!**
**ప్రేమనిచ్చి రధిక విలువ జూపి**

తా॥ ఓ గురువాయూరప్పా! నందుడు తనవారికందరకు గర్గ మహర్షి పేర్కొనిన నీ ప్రభావము నంతయు వివరించెను. అందువలన వారికి నీయందు ప్రేమ ఇంకనూ అధికమయ్యెను. అప్పటినుండి నిన్ను అధికముగా గౌరవించసాగిరి.



28/3

ఉ॥
**నీదగు శక్తినిన్ మహిమ నీగతజన్మలో అన్న ఇంద్రుడున్**
**నీదయ బొందుటన్ దలచి నీకు వినమ్రత మ్రొక్కె అంతటన్**
**ఆ దివి కామధేనువును ఆతనివెంబడి తెచ్చి నీ కడన్**
**పాదము చెంతనుంచె తను ప్రార్ధన జేసెను స్వీకరింపగా**
**మోదము తోడ గొంటివదియున్ గురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ ప్రభూ! నీ వామనావతారమున నీకు అన్నగారైన ఇంద్రుడు నీ శక్తి ప్రభావములను తెలిసినందున గర్వమంతయు నశించి నీకు వినమ్రుడై మ్రొక్కెను. జ్ఞానోదయమైన ఆ ఇంద్రుడు స్వర్గంలో తనతోనుండు కామధేనువును తనవెంటతీసుకొని నీవద్దకు వచ్చి నీకర్పించి నీపాదములకడ మోకరిల్లి స్తుతించెను. నీవు సంతోషముతో కామధేనువును స్వీకరించితివి. ఓ గురువాయూరప్పా! నీకథనాలకింపుము.

28/4

తే॥ నిన్ను "గోవింద" యని తాను సన్నుతించె
'కామధేనువు' అనురాగ మమరియుండ
పాలు పొంగార పొదుగుల పరవశించి
నీకు జేసెను క్షీరాభిషేకమపుడు
పనిపి ఐరావతంబును వాసవుండు
బూని దివిగంగ దెప్పించి పోసి నీకు
జేసె ప్రీతితో తానభిషేకమంత
వినుము గురువాయు పురవిభో! విష్ణుగాథ!

తా॥ ఓ ప్రభూ! కామధేనువు నిన్ను 'గోవిందా' అను నామముతో కీర్తించెను. నీయందు అమితమైన అనురాగముతో తన పొదుగునుండి పొంగారిన పాలతో నీకు అభిషేకమొనరించెను. అంతట ఇంద్రుడు సంతోషముతోఐరావతమును పంపి ఆకాశ గంగ జలమును తెప్పించి నీకు అభిషేకము చేసెను. ఓ గురువాయరప్పా! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!



28/5

కం॥ గోకుల నాథుడ వనుచున్
నీకభిషేకంబు జేయ, నీదయ వనియున్
లోకముల మిన్న ఆయెను
ఆ కడ గురువాయు పురపు అచ్యుత! వినుమా

తా॥ ఓ త్రిలోక నాయకా! నీవు గోకులాధిపతివిగా అభిషిక్తుడ వగుటతో, ఆపై నీ అనుగ్రహము వలన ఆ వనము (బృందావనము) కూడా స్వర్గలోకము కంటెను, వైకుంఠము కంటెను మిన్న అయ్యెను. వాటిని మించి శోభావిలసితమాయెను. ఓ గురువాయూరప్పా! ఈ కథనాలకించి నన్ను రక్షించు తండ్రీ!



28/6

సీ॥ ఒకనాడు నందుడు ఒంటిగా పొరబడి
నడిరేయిని యమునానదికి బోయె
స్నానమాడ అసుర సంచార వేళలో
విధి వశమొక్కండు వెంటలేదు
వరుణ దేవునియొక్క బంటొక్కడది జూచి
తమ లోకమునకు నీతండ్రి గొనియె
భూభారమున్ ద్రెంచి బ్రోవంగ అవతార
మెత్తిన ఓ ప్రభూ! ఇదియు లీల

తే॥ నీదు తండ్రిని గొనిపోవ నిశ్చయించి
వెనుక వెళ్ళావు ఆ లోకమునకు నీవు
భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె
వినుము గురువాయుపుర విభో! విష్ణుగాథ



తా॥ ఓ ప్రభూ ఒకనాడు నీ తండ్రియైన నందగోపుడు పొరబాటున ప్రాతఃకాలమునకు ముందే ఒంటరిగా యమునా నదిలో స్నానము చేయుటకు వెళ్ళాడు. అది అసురులు సంచరించెడి వేళ. అప్పుడు వరుణుని సేవకుడైన ఒకడు నీ తండ్రిని వరుణ లోకమునకు తీసికొని పోయెను. భూభార నివారణకు మానవునిగా అవతరించిన నీవు నీలీలలు ప్రదర్శించుచునే యుందువు. నీవు నీతండ్రిని వెనుకకు తీసికొని వచ్చుటకు నిశ్చయించుకొని వరుణలోకము జేరితివి. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి భాగవతమును నేను తెలుగులో వినిపించుచున్నాను. దీనినాలకింపుము తండ్రీ!

28/7

**చం॥**

**వరుణుని లోకమందరుగ వందనపూర్వక గౌరవంబులన్**
**వరుణుదు నీకొసంగె, తను పంపెను మిమ్ముల గోకులంబుకున్;**
**మురియుచు నందుడా కథను మొత్తము జెప్పెను రక్తికట్టగా**
**తరగని బంధులందరును దాన యెరింగిరి నీ మహత్మ్యమున్**
**గురు అనిలాలయేశ! వినగోరని వాడొకడుండునే కథన్**

తా॥ ఓ గురువాయూరప్పా! నీవు వరుణలోకమునకు పోగానే వరుణుడు నిన్ను కడుంగడు గౌరవ పూర్వకముగా వందనమాచరించి పూజించెను. తరువాత నిన్ను, నీ తండ్రిని మీ గోకులమునకు పంపెను. నీ తండ్రి నందగోపుడు ఎంతో ఆనందంతో మీ బంధువులందరికీ జరిగిన వృత్తాంతమును చాల ఉత్సాహంగా వివరించెను. దానివల్ల వారందరికీ నందనందనుని ప్రభావం తెలిసింది. ఓ ప్రభూ! అటువంటి నీ అద్భుత గాధను వినని వాడెవడైనా ఉంటాడా?



28/8

**తే॥ నీవు సాక్షాత్తు వైకుంఠ నిలయుడైన**
**శ్రీహరివి యను నమ్మిక జేత వారు**
**పరమపద దర్శనంబును అరయు కోర్కె**
**అధికమౌటచే ఒరులకు అలవికాని**
**విష్ణులోక దర్శనమును పేర్మి యొసగి,**
**నావు, ఓ ప్రభూ! జగములనాధుడవుట**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె**
**వినుము గురువాయుపుర విభో! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! నీవు సాక్షాత్తు శ్రీమన్నారాయణుడవని వారికి గట్టి నమ్మకము ఏర్పడినది. అందుచే వారు నీ పరమపదమును దర్శింపవలెనని, అధికమైన కోరిక తెలిపినందున అనన్యాసాధ్యమైన వైకుంఠ దర్శనమును ప్రేమతో కల్పించితివి. జగన్నాధుడవైన ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి భాగవతమును తెలుగులో ఆలకింపుము. నన్ను చరితార్థుని చేయుము తండ్రీ!



28/9

**కం॥ పరమానంద రసంబన్**
**ఝరిగల మోక్షంపు దివ్యసాగరమందున్**
**వరలుచు; తొలి స్థితికొచ్చిరి**
**గురువాయుపురీశ! అటుల కోరిక తీరెన్.**

తా॥ ఓ పరమాత్మా! అప్పుడు గోపాలకులందరు పరమానంద రసమనే మహా ప్రవాహముకల దివ్యమోక్ష సాగరమున ఓలలాడిరి. తరువాత నీవే వారిని యధాస్థితికి చేర్చితివి. ఓ గురువాయూరప్పా! వారి కోరిక ఆ విధముగా సిద్ధింప చేశావు.

28/10

**సీ॥ అరచేతిలోని బదరిక తీరున ప్రభూ!**
**దరిశింప జేస్తివి పరమ పదము,**
**భక్తులౌ గోపులు బడసిరి నీ కృపన్**
**పరులకు సాధ్యమా? అరయదాని**
**ఇదివరలో మున్ను ఎవ్వరికిని గాని**
**కలుగలేదటువంటి ఘనత ఎప్పుడు**
**బృందావనంబున అందాల గోపాల!**
**సాక్షాత్తు పరమాత్మ స్వామివీవు**



**తే॥ నాదు వ్యాధిని తొలగించి నయము నిమ్ము**
**నన్ను రక్షింపుమో దేవ! నందబాల!**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ నందబాలా! నీ భక్తులైన ఆ గోపాలకులకు నీ పరమపదమును అరచేతిలో నున్న రేగుపండువలె దర్శింపజేస్తివి. అది సామాన్యులకు ఎవ్వరికినీ పొందరానిది. నీవు గత ఏ జన్మలోను సామాన్యులెవ్వరికి ఇట్టి వైకుంఠ దర్శనమిప్పింప లేదు. బృందావనములో గోపాలుని రూపములోనున్న నీవు సాక్షాత్తు పరమాత్మవు. అటువంటి నీవు నా వ్యాధిని నిర్మూలించి నన్ను రక్షింపుము తండ్రీ! ఓ గురువాయూరప్పా! నారాయణ భట్ట తిరులు రచించిన శ్రీమన్నారాయణీయమను సంక్షిప్త భాగవతమును నేను పద్యకావ్యంగా వ్రాస్తున్నాను. దీని నాలకించి నన్ను అనుగ్రహింపుము ప్రభూ!

## 29. రాసక్రీడ

తే॥ అపుడు కాత్యాయనీవ్రతంబాచరించు
గోప భామల మనసులకోర్కె తెలిసి
తగు సమయమున మీ కోర్కె తరుణులార!
తీర్తునంటివిగ, యమునా తీరమందు
నిండు పున్నమి జాబిలి, నీదు మురళి
రాసలీలకై మ్రోగెను రసస్వరూప!
భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె
వినుము గురువాయుపుర విభో! విష్ణుగాథ

తా॥ ఓ రసస్వరూపా! గోపికలు కాత్యాయనీ వ్రతమునాచరించిన తరువాత నీవు వాగ్దానము చేసినట్లు వారితో రాసలీల చేయ తలచితివి. పున్నమినాటి నిండు వెన్నెల చల్లని రేయిలో ఆ యమునా నదీతీరమందు నీవు మధురముగా మురళిని మ్రోగించ సాగితివి. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి కావ్యమును తెలుగు పద్య రూపంలో ఆలకింపుము తండ్రీ!



29/2

కం॥ ఆరోహణావరోహణ
నీరమ్యంబైన మురళి నిపుణత సలుపన్
వారట ఆనందాబ్ధిని
జేరిరి గురువాయు పురపు శ్రీకర! వినుమా.

తా॥ ఓ గురువాయూరప్పా! నీవు వేణుగానమును ప్రయోగించుచున్నప్పుడు ఆ మురళీ స్వరపు ఆరోహణావరోహణములను వినినంతనే గోపికలు, సర్వజగత్తు, ఆనందాబ్ధిలో తేలియాడిరి. అది అనిర్వచనీయమైన ఆనందానుభూతి.

29/3

చం॥
ఒకతె గృహంబునన్ పనుల నొప్పుగ జేయుచు నుండె తాను వే
రొకతె ముదంబుతో తమరి ఊయల పాపకు జోలపాడె నిం
కొకతె పతిన్ ప్రియంబలర నూరట నీయుచు సేవచేయగా
నిక విని వేణుగానమును యెల్లరు కార్యములన్ని ఆపుచున్
సకలము వీడి చేరిరట సద్గురువాయు పురాధి నాయకా!



తా॥ ఓ సద్గురువాయు పురాధిపా! నీ మధురమైన మురళీ గానము వినబడుచున్నపుడు గోపికలంతా తలకొక పనిచేసుకొనుచున్నప్పటికిని నీ మధుర మురళీ రవమునకు వశులైరి. ఒకతె ఇంటి పని చేసుకొనుచుండెను. ఒకతె తన ఊయల పాపాయిని లాలించుచుండెను. ఇంకొకతె తన భర్తకు పరిచర్య చేయుచుండెను. వారందరు ఇంక నీ వేణుగానమును విన్నవెంటనే మోహితలై సమస్తమును పరిత్యజించి, పనులన్ని వదలివైచి నీవద్దకు (యమునా తీరమునకు) వచ్చిరి.



29/4

ఉ॥
కొందరు గోప భామినులు కూరిమి భూషణముల్ ధరించుచున్
అందము నిగ్గుతేల్చునెడ అచ్యుత! వేణురవంపు మాధురిన్
బొందుచు మేనిసోయిచెడి పూర్తి అలంకరణంబు వీడుచున్
ముందుగ నిన్ను జేరుటకు యోచనతో దరిజేరవారిదా
అందము మించి తోచినదయా గురువాయుపురాధినాయకా!

తా॥ ఓ అచ్యుతా! కొందరు గోపకాంతలు ప్రీతితో అలంకరించుకొనుచు అందము నినుమడింపజేసి కొనుచుండగా నీవేణుగాన మాధుర్యమును పొంది మైమరచి పోవుటచేత తమ అలంకరణము పూర్తికాక మునుపే నిన్ను చేరుకోవాలనే ఆలోచనతో నీదరి జేరగా అలంకరణ పూర్తి కాకున్నను మిక్కిలి అందముగా తోచిరి. ఓ గురువాయూరప్పా! నీ కథనాలకింపుము తండ్రీ!

29/5

**కం॥ విని వేణువు తన్మయమై**
**తన నడుమున గోపికొకతె దాల్చెను హారం**
**బును మెడ ఒడ్డాణంబును**
**గొనె, ఆత్మ సమర్పణమున గురు అని లేశా!**

తా॥ ఓ గురువాయూరప్పా! ఒక గోప కన్యక నీ వేణు గానమును విని మైమరచి మెడలో ధరించవలసిన హారమును నడుము పైనను, నడుమునకు ధరించవలసిన ఒడ్డాణమును మెడలోను ధరించినది. ఆత్మ సమర్పణ భావముతో ఆమె మునిగిపోయినది.



29/6

**సీ॥ భక్తిలో ఒక భామ పరవశించుట చేత**
**చరమాంక స్థితితాను చేరుకొనియె**
**నీమురళిని విని మైమరచినదాయె**
**దాల్చుట రవికను తాను మఱచె**
**తామదే స్థితిలోన తనరెడి గోపికల్**
**గమనించరైతిరి కలికి స్థితిని**
**ప్రణయ సామ్రాజ్యపు పట్టాభిషేకంబు**
**చేయగా ఆ చాన సిద్ధపడియె**

**తే॥ పూర్ణకలశాభిషిక్తుని పొలతిచేయ**
**నెంచినట్లుగ తను కనిపించుచుండె**
**భట్టు తిరికృతి తెలుగులో పద్యమాయె**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాధ.**



తా॥ ప్రభూ! భక్తిలో చరమస్థితికి చేరిన ఒక గోపిక నీ మురళీగాన మాధురికి పరవశించి రవికను సరిగా తొడుగుకొనుటను కూడా మరచెను. ఇతర గోపికలు కూడా ఆనంద పారవశ్యమున ఆ విషయమును గమనించరైరి. ఆ గోపిక నిన్ను తన ప్రణయ సింహాసనముపై కూర్చుండబెట్టి పట్టాభిషేకము చేయుటకై కలశములను ధరించి వచ్చుచున్నట్లు కనిపించెను. నారాయణ భట్టతిరి కావ్యమును నేను తెలుగులో చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! దీనిని విని నన్ను అనుగ్రహింపుము తండ్రీ!



29/7

**చం॥**
**విని మురళీ రవంబు తమ పెద్దలు, భర్తలు, అత్తమామలున్**
**చెనకొని పెట్టు కట్టడిని ఛేదన చేయ నశక్యమౌటచే**
**మనసున నిన్ను నిల్పుకొని పార్థివ దేహములిండ్ల నుండియున్**
**నిను స్మరియించి ముక్తిగన నిక్కము ధన్యలు గోపభామినుల్**
**విను గురువాయు పట్టణపు విష్ణుని గాధను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! కొందరు గోపికలు నీ మురళీ గానమును విని పరవశించి తమ ఇంటనున్న పెద్దలను, భర్తలను, అత్తామామలను తిరస్కరించి, వారి కట్టడిని కాదని త్రెంచుకొనలేక నిన్నే తలంచుచు తమ స్థూల శరీరముల భ్రాంతిని వీడి నిన్ను మనస్సులలో నిల్పుకొని స్మరించుచూ ముక్తిని పొందిరి. ఓ గురువాయూరప్పా! నిజముగా వారెంత ధన్యులు!! ఓప్రభూ నీవు ఈ గాధను ఆలకింపుము తండ్రీ!

29/8

**చం॥**

**నిను పరమాత్మ భావమున నిశ్చలబుద్ధితొ గొల్వరైననున్**
**నిను యొకప్రేమ రూపునిగ నెమ్మది యెంచిరి గోప భామినుల్**
**మనమున నిన్ను యెంచికొని మానవులెట్లు తలంచి గొల్చినన్**
**అనువుగ మోక్షమందెదరు, అట్టి స్థితిన్ దయచేయుమో ప్రభూ!**
**విను గురువాయుపట్టణపు విష్ణుని గాథను నందనందనా!**

తా॥ ఓ ప్రభూ! గోపికలు నిన్ను పరమాత్మవను దృష్టితో పూజింపలేదు. నిన్నువారు ఒక ప్రేమ స్వరూపునిగా నెంచి మనస్సులర్పించారు. పరమహంసల వలె మోక్షం పొందారు. నీ పరమానంద స్వరూపమును మానవులు తమ మనస్సులలో ఏవిధంగా నిన్ను భావించి ఆరాధిస్తే వారికి ఆ విధంగా సులువుగా మోక్షం సిద్ధిస్తుంది. ఓ గురువాయూరప్పా! అట్టి స్థితిని నాకు కూడ అనుగ్రహింప రాదా!! నాద్వారా ఈ కథనాలకింపుము తండ్రీ!



29/9

**తే॥ మోము సర్వదా చిరునవ్వు మొలకతాను**
**అతి మనోహరంబుగనది అలరియుండు**
**గోపికలు తాము నీదరి గూడియుండ**
**నీకృపా దృష్టి వారిపై నిలుపుచుందు**
**వచ్యుతా! నాదు రోగమ్మునణచ వేల?**
**స్వామి! విశ్వైక సుందరా! సన్నుతింతు**
**భట్టతిరి కృతి తెలిపెద పద్యమందు**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ**

తా॥ ఓ అచ్యుతా! నీ ముఖము సర్వదా చిరునవ్వు చిందించుచు మనోహరముగానుండును. గోపికలు అందరును నిన్ను సమీపించి, నీ చుట్టూ చేరిరి. అప్పుడు నీవు వారిపై నీ కృపాదృష్టిని ప్రసరింప జేసితివి. ఓవిశ్వైక సుందరుడవైన గురువాయూరప్పా! నా వ్యాధిని నివారింపుము. భట్టతిరి కృతిని నేను తెలుగు పద్య రూపమున తెలుపుచున్నాను. దీని నాలకింపుము తండ్రీ!



## ౩౦. రాసక్రీడ

**తే॥ ప్రేమ పారవశ్యంబున తమరి ఇండ్లు**
**వదలి గోప భామినులు నీవద్ద జేర**
**వారి కోరిక నీకు సమ్మతమె కాని,**
**పైకి ప్రతికూలముగ నీవు పలికినావు**
**నవ్వులాటగా కాదనే నటన జూపి**
**నావు; గురువాయుపుర విభో! నన్ను వినుము**

తే॥ ఓ గురువాయూరప్పా! గోపికలు ప్రేమ పారవశ్యమున తమ ఇండ్లు వదిలి నీ దగ్గిర జేరిరి. గోపికల కోరిక తీర్చుట నీకు ఇష్టమే. కాని కొంతసేపు నవ్వులాటగా వారితో ప్రతికూలముగా పలికితివి. ఓ ప్రభూ నీవు నన్ను కరుణించి నీ కథను ఆలకింపుము.



30/2

**తే॥ నీదు రాసక్రీడను జూడ నింగిలోన**
**మునులు జేరిరి, వారలు వినుట కొరకు**
**కులపు స్త్రీ ధర్మములు నీవు గోపికలకు**
**బోధ జేశావు ధర్మము బూని, నీదు**
**దివ్య కర్మల తత్త్వంబు తెలియగలరె**
**పరులు? నేర్వనసాధ్యము వాసుదేవ!**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె**
**వినుము గురువాయుపురవిభో విష్ణుగాథ.**

తా॥ ఓ వాసుదేవా! నీ రాసక్రీడను దర్శించుటకు మునులందరు ఆకాశమున జేరిరి. వారికి వినబడునట్లుగా నీవు ఆ గోపికలకు కులస్త్రీల ధర్మములను బోధించితివి. ఆ వలుకులు ధర్మబద్ధములు. నీ దివ్యకర్మలు పవిత్రమైనవి. ఆ దివ్యకర్మల తత్త్వము నెరుగుట ఎవరికి సాధ్యము? ఓ గురువాయూరప్పా! నారాయణభట్ట తిరుల భాగవతమును నేను తెలుగు పద్యంగా చెబుతున్నాను. దీని నాలకింపుము తండ్రీ!

30/3

**చం॥**

**వనితలు నీదు 'వాడి' గలమాటలు సైపక బాధనొందుచున్**
**అనిరి "యశోదనందన! మహామహితాత్మ ఇదేమి న్యాయమో**
**కనికరమేలరాదు? మముకాదని వీడకుమో దయామయా!**
**కనుము రవంతజాలి అనఘా! దరిజేరుము ప్రేమజూపుమా"**
**వినుగురువాయుపట్టణపు విష్ణుని గాథను నందనందనా!**

తా॥ ఓ గురువాయూరప్పా! నీయొక్క పదునైన విరసపు మాటలు ఆ గోపికలను చాలా బాధించినవి.వారు ఆవేదనతో దీనాతి దీనముగా ఇట్లనిరి. "ఓ యశోద నందనా! మహానుభావా! నీకు మాపై దయ ఎందుకు రాదు? మమ్ము తిరస్కరించి జాలిలేకుండ విడిచి పెట్టుట తగునా? పాపరహితుడా! మాపై నీప్రేమ జూపరాదా?'' ఆ విధమున గోపికలు చాల దుఃఖముతో వేడుకొనిరి. ఓ నందనందనా! నీ గాథనాలకింపుము తండ్రీ!



30/4

**ఆ.వె॥ తరుణులేడ్వ కరిగి కరుణాంతరంగుండ**
**వైన నీవు కలిసి యమునతటిని**
**కూర్మిజూపినావు గురువాయుపురవిభో!**
**ఇసుక తిన్నెలందు ఇంతులకును.**

తా॥ ఓ గురువాయూరప్పా! ఈ విధముగా గోపికలు దీనాతి దీనముగా ఏడ్చుచు ప్రాధేయపడుచుండగా నీ మనస్సు కనికరముతో కరిగిపోయినది. స్వామీ! నీవు వారితో కలిసి యమునానదియొక్క చల్లని ఇసుక తిన్నెలపై ఇంతులతో స్వేచ్ఛగాక్రీడించుచు విహరించసాగితివి.



30/5

**ఉ॥**

**ఆ సమయాన వెన్నెలతొ ఆయమునాతటి తళ్కులీనగా**
**చేసిరి ప్రీతితో వలపు సేవలు సైకత శ్రేణులందు నీ**
**కోసము గోప భామినులు కూర్మిని వేసిరి ఉత్తరీయముల్**
**ఆసనమట్లు నీవు కదు హాయిగ కూర్చుని యుంటివో ప్రభూ!**
**ఏ సరిలేరు నీకు, విను హే గురువాయుపురాధి నాయకా!**

తా॥ ఓ ప్రభూ! ఆ సమయమున నిండుచంద్రుని చల్లని వెన్నెలతో ఆ యమునానదియొక్క ఒడ్డు ధగధగలాడుచుండెను. ఆ ఇసుకతిన్నెలపై గోపికలు నీకు ఆనందంతో ప్రేమ సపర్యలు చేశారు. ప్రేమతో తమతమ ఉత్తరీయములను పరిచి నీకు వారు చక్కని ఆసనమునేర్పరిచిరి.ఆ ఆసనముపై నీవు హాయిగా కూర్చొని యుంటివి. అటువంటి నీకు సరిపోల్చగల వారెవ్వరును లేరు. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథ నాలకింపుము తండ్రీ!



30/6

**ఉ॥**

**ఆ యమునానదీ తటిని అచ్యుత! నీవును గోపభామినుల్**
**తీయని మాటలాడితిరి తేకొని చేతులచేతులుంచుచున్**
**హాయిగ సల్పినారుగ, విహారము, గాఢపు కౌగిలింతలో**
**తోయజనాభ! గోపికలతో సుఖమందున తేలిపోవగా**
**తీయని ముద్దులిచ్చితివి దేవర హే గురువాయు నాయకా!**

తా॥ ఓ పద్మనాభా! ఆ యమునా నదీ తీరమున నీవు, గోపికలు మధుర సంభాషణములు సలుపుచు చేతులలో చేతులుంచుకుని హాయిగా విహరించుచు గడిపితిరి. ఇంకను ఆగోపికలతో గొప్ప సుఖంలో తేలిపోతూ బిగి కౌగిళ్ళలో తీయని ముద్దులు పెట్టుకొంటూ రమించితివి. ఓ దేవా! గురువాయూరప్పా! అచ్యుతుడవైన నీ కథను ఆలకింపుము తండ్రీ!

30/7

**తే॥ అపుదు గోపికా వస్త్రాపహరణ వేళ**
**మీ మనోరథంబును దీర్తు ప్రేమమీర**
**అనెడి వాగ్దానమును జేసి అలరినావు,**
**నేడు ఆనందమిచ్చావు విడువజేసి**
**వారి సంసార బంధాలు వాసనలును**
**మనసు నీమీద లగ్నమై అనవరతము**
**ఓల లాడిరి ఆనంద జలధియందు**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ**

తా॥ ఓ గురువాయూరప్పా! ఆనాడు గోపికా వస్త్రాపహరణ వేళ "మీ మనోరథమును పూర్తిగా తీర్చెదను"అని వాగ్దానమును గోపికలకు చేసియుంటివి. ఈనాడు వారికి ఆనందమును గూర్చితివి. వారి సాంసారిక వాసనలు కూడ తొలగించితివి. వారి చిత్తములు ఎల్లప్పుడును నీయందే లగ్నమై పరమానందమున ఓలలాడి పరవశించినవి.



30/8

**చం॥**
**అనవుడు సుందరంబయిన ఆననమందున స్వేదబిందువుల్**
**చెనకొనె మల్లెపూలవలె, చిందగ నవ్వులు మోముశోభిలెన్**
**నిను త్రిజగాలసుందరుని నెచ్చెలులౌవరగోపకాంతలున్**
**గొని హృదయాలకద్దుకొని గొప్ప సుఖంబును బొందిరో ప్రభూ!**
**విను గురువాయుపట్టణపు విష్ణుని గాథను నందనందనా!**

తా॥ ఓ నందసుతా! ఆ సమయమున నీ దివ్య ముఖమున చిరు చెమటలు క్రమ్మెను. మల్లెలవంటి చిరునవ్వులు నీ వదనమున శోభిల్లుచుండెను. ముల్లోకము లందును సుందరుడవైన నిన్ను గోపికలు తమ హృదయమునకు హత్తుకొని ఎనలేని ఆనందము ననుభవించిరి.
ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథనాలకించి నన్ను ధన్యుని చేయుము తండ్రీ!



30/9

**తే॥ నీ విరహ తాపమే కాల్చు నిప్పు కణిక**
**నీ సమాగమంబే యొక రాసలీల**
**గొప్ప శృంగార కావ్యము గోపరాజ!**
**స్వామి! అంగారమయుడవు సంగమమున**
**ఇది విచిత్రంబుగానుండె ఇంతులకును**
**భట్టతిరినాడు చెప్పిన భాగవతమును**
**తెలుగు పద్యంబు జేసెద దేవదేవ!**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ గోపరాజా! నీ విరహము నిప్పు కణికవలె తాపమును కలిగించును. నీ సమాగమము ఒక రాసలీలవలె గొప్ప శృంగార భరిత కావ్యము. స్వామీ! నీవు సంగమమున కూడ అంగారమయుడవే. [ఒక అర్థము కాల్చెడి విరహమును కలిగించువాడవు; ఇంకొక అర్థము (అంగ+అరమయః విడదీసి చదివితే) రమింపజేసితివి అని చెప్పవచ్చును] ఓ



దేవదేవా ఇది చాలా విచిత్రముగా నున్నదికదా! నారాయణ భట్టతిరి భాగవతమును తెలుగు పద్యకావ్యంగా చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా దీని నాలకింపుము తండ్రీ!

30/10

**కం॥ రాధాకృష్ణా! ముకుంద!**
**మాధవ! సేవించు నీదు భక్తుడనయ్యా!**
**వ్యాధిని సడలింపుమికన్**
**బాధలు గురువాయు దేవ వదలింపు ప్రభూ!**

తా॥ ఓ గురువాయూరప్పా! రాధాకృష్ణా! ముకుందా! మాధవా! నిన్ను సదా సేవించి నీ భక్తుడనగు నాయొక్క రోగమును దయతో తగ్గింపుము. ఓ దేవా! నాబాధలను నిర్మూలింపుము ప్రభూ!

## 31. శ్రీకృష్ణాంతర్ధానము- గోపికాన్వేషణము

**తే॥ నీవు ఆనందరూపుండ వవుటజేసి**
**అట్టి నీతో రమించిన అతివలెల్ల**
**అంతులేని ఆనందాబ్ధి నలరినారు**
**తమరి అనుభవమ్మును వారు తలచుకొనుచు**
**భాగ్యమన తమదేయను భావమలర**
**గర్వపడిరి ఆ గోపికా కాంతలెల్ల,**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె**
**వినుము గురువాయుపుర విభో! విష్ణుగాథ**

తా॥ ఓ స్వామీ! నీవు పరమానంద స్వరూపుడవు. అట్టి నీతో రమించిన గోపికలు అంతులేని ఆనందమున పరవశులైరి. తమయొక్క అనుభవమును తలచుకొని వారు భాగ్యమనగా తమదే అనుభావముతో చాలా గర్వపడిరి. నారాయణభట్టతిరి రచించిన భాగవతమును నేను తెలుగు పద్యకావ్యంగా చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! దీని నాలకింపుము తండ్రీ!



31/2

**చం॥**
**తను త్రిజగాల సుందరుడతండును నా విరహాన జిక్కుమన్**
**నను విడలేని బేలకద!! నందసుతుండని తల్వగోపికల్**
**మనమున యట్టి గర్వమును మాపగ తత్క్షణమందె మాయమై**
**కనపడకుండ బోతివిగ గ్రక్కున ఓ మురళీ మనోహరా!**
**వినుగురువాయుపట్టణపు విష్ణుని గాథను హే జగద్విభో**

తా॥ ఓ మురళీమనోహరా! ''ముజ్జగాలకెల్ల సుందరుడైనతను నా విరహాగ్నిలో చిక్కి నాకు బద్ధుడై నన్ను విడిచి యుండలేని అమాయకుడుగా మారిపోయెను" అని గోపికలందరూ తలచి, తమలో తాము గర్వింపసాగిరి. వారి మనస్సులలో అట్టి గర్వమును నీవు పోగొట్టదలచితివి. కనుక నీవు వెంటనే కనబడకుండ అంతర్ధానమైపోతివి. ఓ గురువాయూరప్పా! జగిద్విభో! ఈ విష్ణుగాథనాలకించి నన్ను ధన్యుని చేయుము తండ్రీ!



31/3

**ఉ॥**
**మాధవ! గోపికల్ పనికిమాలిన గర్వము నొందియున్ననున్**
**రాధను గోపికొక్కరిత రవ్వయినన్ గరువంబు నొంద దా**
**రాధన నీకు ప్రాణమయె రాధను గైకొని దూరసీమలన్**
**మాధవ! బోయినావు, వినవా గురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ మాధవా! ఆ గోపికలందరికీ వ్యర్ధమైన గర్వం కలిగింది కాని వారిలో రాధాదేవి అను ఆమె మాత్రము ఎట్టి గర్వమునకు గురికాలేదు. ఆ రాధ నీకు చాల ప్రియమైనది. అట్టి రాధాదేవిని తీసికొని నీవు చాలదూరము పోయి ఆ దేవితో విహరించసాగితివి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!



31/4

**తే॥ నీవు కనపడకుండుట నిలువలేక**
**గోపికలు దుర్భర విరహ తాపమొంది**
**అచట ప్రతిచెట్టు గాలించి ఆ వనముల**
**వెదక జొచ్చిరి కనరైరి నీదు 'ఛాయ'**
**ఎట్లు చూతము కృష్ణుని ఇంకననుచు**
**వారు నీదర్శనార్థమై వగచినారు**
**భట్టతిరికృతి జెప్పెద పద్యమందు**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ!**

తా॥ ఓ ప్రభూ నీవు కనబడకపోవుటచే భరించలేక గోపికలు దుర్భర విరహ తాపమునొందిరి. వారు అచటనున్న ప్రతి వనములోని ఒక్కొక్క చెట్టును వెదకజొచ్చిరి. ఐనను నీ నీడను గూడ వారు అందుకోలేకపోయిరి. కృష్ణుని ఎట్లు చూచెదమని వారు నీ దర్శనార్థమై కలవరపడిరి. నారాయణ భట్టతిరి కృతిని నేను తెలుగు పద్యంలో చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! దీని నాలకింపుము తండ్రీ!

31/5

తే॥ అడవులందున వెదకుచు అతివలెల్ల
అడిగిరొక్కొక్క చెట్టును ఆ వనముల
"చూతమా! చంపకమ! మీరు చూచినార?
మాలతీ! కర్ణికారమా! మల్లెలార!
యెదను దోచిన కృష్ణుడే పొదలనుండె?"
చాల దుఃఖించిరా గోప జవ్వనులును
వివశలైపోయిరో ప్రభూ! అవధిలేక
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ

తా॥ ఓ ప్రభూ! ఆ గోపికలు అడవులన్నియు తిరుగుచు వెదకుచు నీకై "ఓ చూతవృక్షమా! చంపకమా! కర్ణికారమా! మల్లికా! మాలతీ మాహృదయములను దోచుకొనిన శ్రీకృష్ణుడు మీకు కనిపించినాడా? అని దుఃఖిస్తూ నీయందు అనురాగ చిత్తలై, వివశలై అడిగారు. ఓ గురువాయూరప్పా! ఈ హరిగాథనాలకింపుము తండ్రీ!



31/6

సీ॥ భావనా దృష్టిచే భామిని యొక్కతె
దర్శించె నిను ప్రభూ! ధ్యానమందు
తోటి గోపిసఖులతో బల్కెనీరీతి
వ్యాకులపడుటచే మనసునందు
"పద్మనయనుడైన మనకృష్ణుడేనాడు
కనులముందున్నాడు కాంతలార!
ఆమె దుఃఖము జూచి ఆ గోపికలు కూడ
మరి మరీ బేలలై బాధపడిరి

తే॥ భక్తులైన నారాయణ భట్టతిరులు
సంస్కృతించ భాగవతపు సారమెల్ల
తెలుగు పద్యంబు జెప్పితిన్ దేవదేవ!
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.



తా॥ ఓ దేవదేవా! ఒక గోపిక తన భావనా దృష్టిచే నిన్ను తన ధ్యానమున దర్శించి, తనతోటి గోపికలతో ఇట్లనెను. "చెలియలారా! తామరలవంటి కన్నులుగల మన శ్రీకృష్ణుని నేను చూచితిని. అతడు నా కండ్లముందే ఉన్నాడు" అని వ్యాకులపాటుతో దుః ఖించుచు పలికెను. అంతట ఆ గోపికయొక్క పరిస్థితిని తలచుకొని తోడి గోపికలు మరింత బాధపడిరి. మహాభక్తుడైన నారాయణభట్టతిరులు సంస్కృత భాషలో సంక్షిప్త భాగవతమును రచించారు. ఓ గురువాయూరప్పా! దానిని నేను తెలుగు పద్యకావ్యంగా చెబుతున్నాను. నన్ను అనుగ్రహించి దాని నాలకింపుము తండ్రీ!



31/7

సీ॥ నిన్నే తలంచుచు అన్నులమిన్నలు
తాదాత్మ్యమొందిరి తలపులందు
యమునాతటంబున అనుకరించిరి వారు
నీ దివ్యలీలలు వెదకి, వెదకి
ఒకచోట వారికి ఒంటరిగా రాధ
కనిపించె నామెయు కలతనుండె
ఆమెయు గర్వియై అన్యగోపికలట్లు
నీప్రేమ తనదని 'నిక్కు' జూపె

తే॥ ఎవరి అహమునున్ సైపవు హే మురారి!
నీవు మాయమైపోతివి నిముషమందె
భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ

తా॥ ఓ ముకుందా! గోపికలు నిన్నే ధ్యానించుచు తమ బావనా బలము చేత నీయందే తాదాత్మ్యమును బొంది ఆ యమునానదీ తీరమున నీ దివ్యలీలలను అనుకరింప జొచ్చిరి. ఆ విధముగా వెదకి వెదకి నిన్నే స్మరింపసాగిరి. అట్లుపోవుచుండగా వారికి ఒకచోట ఒంటరిగానున్న రాధాదేవి కనిపించినది. ఆ దేవికూడ గోపికలవలె "శ్రీకృష్ణుడు నావాడు. అతని అనురాగము నాకు స్వంతము" అని భావించి ఒకింత గర్వము నొందెను. నీ భక్తుల అహంకారపు పీడను నీవు నిముషమైన సహించలేవు. అందుకే ఆమెకు కూడ ఎడబాట కలిగించుటకై నీవు అదృశ్యమైతివి. నారాయణ భట్టతిరి భాగవతమును తెలుగు పద్య కావ్యంగా చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! దీనిని ఆలకింపుము తండ్రీ!



31/8

**చం॥**

**వనముల రాధతో కలిసి భామినులందరు చెట్టుపుట్టలన్**
**నిను వెదకంగ బూనుకొన నీవు కనంబడవైతివంతటన్**
**పెను నిశి కమ్మెనా యమున వెంబడి యేడ్చుచు వారు నీ పొడన్**
**కనుగొనలేక ఆశచెడి గానము జేసిరి నీ మహాత్మ్యమున్**
**విను గురువాయుపట్టణపు విష్ణుని గాథను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! ఆ తరువాత రాధాదేవితో కలిసి ఆ గోపికలు నీకై అడవులన్నీ చెట్టుపుట్టా గాలించారు. నిన్నెంత వెదకినా కనిపించవైతివి. ఇంతలో గాఢమైన చీకట్లు కమ్ముకొనినట్లు ఆ యమునాతీరమంతా పెనుచీకటి అయిపోయింది. నిను కనుగొనజాలక నిరాశతో వారు రోదించి నీదివ్య మహాత్మ్యమును గానము జేసిరి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధ నాలకింపుము తండ్రీ!



31/9

**కం॥ నీ గూర్చి కలత చెందిరి**
**ఆ గోపికలన్న నీకు అమిత దయగుటన్**
**చేగొని దర్శనమిస్తివి**
**ఓ గురు అనిలాలయేశ! ఉవిదల బ్రోవన్**

తా॥ ఓ గురువాయూరప్పా! ఈ విధముగా గోపికలు నీకొఱకు అమితముగా దుఃఖించుచుండిరి. నీవు దయార్ద్ర హృదయుడవు, ముల్లోకములను పరవశింప జేయగలవాడవు. కావున గోపికలపై దయగలవాడవై వారిని రక్షించుటకై పూనుకొని వారి ఎదుట చిరునవ్వుతో సాక్షాత్కరించితివి.



31/10

**తే॥ తమకు ప్రియమైన కృష్ణుని తాము తిరిగి**
**చూతుమని ఆశవోయిన ఆ తరుణులు**
**కనులు విందుగ ఒకసారి కనపడంగ**
**పట్టలేని ఆనందాన పరవశించి**
**చేసిరేమేమొ ఓ ప్రభూ సిగ్గు మఱచి,**
**నాదువ్యాధిని తొలగించి ఆదుకొనుము**
**భట్టతిరి కృతి చెప్పితిన్ పద్యమందు**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! తమకు చాల ఇష్టమైన శ్రీకృష్ణుని తిరిగి కనిపించదని నిరాశ చెందిన గోపికలు హఠాత్తుగా నీ దర్శన భాగ్యమును పొంది పట్టలేని ఆనందంతో పరవశించిపోయారు. వారు సిగ్గును మఱచిపోయి ఏమేమొ చేశారు. ఓ గురువాయూరప్పా! నాయొక్క వ్యాధిని తొలగించి నన్ను రక్షింపుము. నారాయణ భట్టతిరి భాగవతమును తెలుగు పద్యంగా ఆలకించి నన్ను అనుగ్రహింపుము తండ్రీ!

## 32. భగవత్సాక్షాత్కారము

**కం॥ నినుజూచి పరవశించిరి**
**తనువులు అమృతంబునందు తానంబాడెన్**
**అనినట్లు ఊరడిల్లిరి**
**విను గురువాయుపురినాథ! వెలదులు యెదుటన్**

తా॥ ఓ గురువాయూరప్పా! గోపికలందరు నిన్ను జూచి సంతోష పరవశులైరి. వారందరు అమృత ధారలలో స్నానమాడినట్లు ఆనందమనుభవించుచు ఊరడిల్లిరి. ఆ గోపికలు ఆ విధముగా నీ ఎదుట నిలిచిరి. ప్రభూ! నీ రమ్యమైన గాథనాలకింపుము తండ్రీ!



32/2

**ఆ.వె॥ నీ విరహముసైప నేరని యొక లేమ**
**నీదు చేయి తనదు యెదను చేర్చె**
**మురిసె నందుచేత గురువాయుపుర విభో**
**నిలిచిపోయె తనువు పులకరింప**

తా॥ ఓ గురువాయూరప్పా! నీ విరహమును తాళలేక ఒక గోపిక బిడియము వదలివైచి నీ హస్తపద్మములను తన ఎదపై చేర్చుకొని పట్టుగొనినది. అందువలన ఆమె శరీరము పులకరించిపోగా మైమరచి అట్లే నిలిచిపోయెను.



32/3

**చం॥**
**మరియొక గోపకన్య తన ప్రాణము పోవునొ ఏమొ నీపయిన్**
**విరహపు బాధలోనె యనిపించగ నీ మృదువౌ భుజంబులన్**
**మురియుచు తాను చేర్చుకొనె మోదముతో మెడచుట్టు గట్టిగా**
**గురు అని లాలయేశ! నినుగోరెద నీ కథ నాలకింపగా**

తా॥ ఓ గురువాయూరప్పా! మరియొక గోపకన్య నీ విరహ దుఃఖము వలన పోవుచున్న తన ప్రాణమును అదిమిపట్టి ఆపుతున్నదా అనునట్లు కోమలము, మృదువైన నీ భుజములను తన మెడచుట్టూ ఆనందంగా చేర్చుకొని గట్టిగా పట్టుకొని ఉండిపోయినది. ఓ ప్రభూ! నీ కథను ఆలకింపగా కోరుచున్నాను తండ్రీ!



32/4

**కం॥ వనితొకతె లజ్జ వీడుచు**
**తను నీదగు నోటిలోని తాంబూలంబున్**
**తననోట లాగుకొనియెను**
**విను గురువాయూరు నాథ! ప్రేమతొ మురిసెన్**

తా॥ ఓ గురువాయూరప్పా! ఇంకొక గోపీవనిత ఏ మాత్రము సిగ్గులేకుండ నీవు నములుచున్న (నోటిలోని) తాంబూలమును తన నోటిలోకి లాగుకొని పెట్టుకొనెను. దానివలన ఆమె నీపై తన ప్రేమనంతయు జూపి సంతోషించెను. ఆ విధముగా ఆమె తన కోరికను తీర్చుకొనెను.

32/5

తే॥ నన్నుదయలేక ఒంటిగా నట్టడవిని
వదలి వైచితివో ధూర్త! వనిత యెవతె
నిన్ను స్పృశియించు? లేదాయె నీతి నీకు,
కోపమెక్కుడై పలికెను కోమలాంగి
ఒకతె నిను జూచి ఉక్రోషమోపలేక
పిదప కన్నీటి మున్నీట బేల ఆయె
భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ఓ ప్రభూ! ఇంకొక కోమలాంగియైన గోపిక నిన్నుజూచి ఆపుకోలేని ఉక్రోషముతో "దుర్మార్గుడా! నిర్దాక్షిణ్యంగా నన్ను ఒంటరిగా నట్టడవిలో వదలిపెట్టిపోయావు. నిన్ను ఏ ఆడది ముట్టుకొంటుంది? నీవు నీతిమాలిన వాడివి" అని నిందించి, ఆ తరువాత కన్నీరు మున్నీరుగా విలపించింది. ఓ గురువాయూరప్పా! భట్టతిరి భాగవతమును తెలుగు పద్యరూపంలో నాలకింపుము తండ్రీ.



32/6

ఉ॥
ఆ విధి గోపికాంగనలు హాయిగ ఆ యమునా తటంబునన్
లావగు సంతసంబున వరంబని, కుంకుమ పూసుగంధముల్
ప్రోవగు వల్వలుంచిరదె ఉన్నతమౌ తగు ఆసనంబుగా
నీవును కూర్చునుంటివటనే గురువాయుపురాధినాయకా!

తా॥ ఓ గురువాయూరప్పా! ఆ విధముగా నీతో కలిసిమెలసి యున్న గోపికలు యమునా నదీతీరమున చాల సంతోషముతో ఉండిరి. వారందరు ప్రేమతో కుంకుమపూవుయొక్క సుగంధముతోనున్న తమ ఉత్తరీయములను ఆసనముగా వేయగా నీవును దానిపై హాయిగా ఆసీనుడవైతివి. అట్టి నీ కథను ఆలకింపుము తండ్రీ!



32/7

చం॥
అనిరిటు కొంతమంది "వినుమచ్యుత! ప్రేమలు ముప్విధంబులౌ,
గొనకొని ప్రేమజూపెదరు కొందరు అందరియందు, కొందరున్
మనలను ఆశ్రయించి చనువారలకిష్టులు అట్లె కొందరున్
మనమున నమ్మువారి నవమానము చేతురు నీదుపోలికన్
విను గురువాయుపట్టణపు విష్ణునిగాధను నందనందనా!

తా॥ ఓ నందనందనా! కొంతమంది గోపికలు ఈ విధంగా నీతో నిష్ఠూరమాడిరి "ఓ అచ్యుతా! ఈ మాట విను. అనురాగం మూడు విధములు. కొందరు అందరియందును ప్రేమజూపించెదరు. కొందరు వారిని ఆశ్రయించి యున్నవారిపై ఇష్టము జూపి ప్రేమించెదరు. కాని కొంతమంది నీలాంటి వారు మనస్ఫూర్తిగా ప్రేమించినవారిని అవమానపరచెదరు. వారిపై నిర్దాక్షిణ్యంగా ప్రవర్తిస్తుంటారు". ఓ గురువాయూరప్పా! ఈ విష్ణు గాధను ఆలకింపుము తండ్రీ!



32/8

కం॥ "నారీమణులారా! నే
మీరిన కఠినుండగాను ప్రేమయె జుమ్మీ!
కోరిక స్థిరపడు నీవిధి
మారాడకు" దంటివి గురువాయూరప్పా!

తా॥ ఓ గురువాయూరప్పా! అప్పుడు నువ్వు ఆ గోపికలతో ఇట్లంటివి. "ఓ నారీమణులారా! నేను మీ యెడ కఠినాత్ముడను గాను. మీరనిన నాకు చాలా ప్రేమయే సుమా! మీయొక్క ప్రేమ ఎట్టిదో తెలుసుకొనుటకే గాక ఆ కోరిక స్థిరపడుటకు ఇట్లు జేసితిని. ఇక మారు మాట్లాడవద్దు"

32/9

తే॥ "ప్రాణ ప్రియలార! వినుడు నామాట మీరు
మిమ్ము బోల్చగ సరిలేరు ప్రియులు నాకు
అందువల్లనె మీరు ఈ యమున దరిని
స్వేచ్ఛ గడుపుడు రాత్రులు వెన్నెలందు
మీరు విహరింప రారండు ప్రేమమీర"
పలికితివి గోపికలతోటి వాసుదేవ!
భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ

తా॥ ఓ వాసుదేవా! నీవా గోపికలతో ఇట్లు పలికితివి. "ఓ ప్రాణ ప్రియలారా! నామాట మీరు శ్రద్ధగా వినుడు. మీవలె ప్రియమైన వారు నాకు వేరెవ్వరునూ లేరు. అందువలన మీరు ఈ యమునా నదీతీరమున అందమైన ఈ వెన్నెల రాత్రులయందు నాతో స్వేచ్ఛగా విహరింపుడు".నారాయణ భట్టతిరి కావ్యమైన భాగవతమును నేను తెలుగు పద్యంగా చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! దీనినాలకింపుము తండ్రీ!



32/10

తే॥ ఇట్లు పలికిన నిను విని ఇంతులెల్ల
సంతసించిరి గోవింద! అంతులేక
అట్టి గోపికా జనులతో హాయిగొలుప
నీవు విహరించినాడవు ఆ వనముల
రాసక్రీడలో రంజిల్లు నీ సరెవరు?
నన్ను రక్షించు తొలగించి నాదు వ్యాధి,
భట్టతిరికృతి తెలుగులో పద్యమాయె
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ఓ గోవిందా! ఇట్లు గోపికలతో నీవు పలికినందున, వారు మిక్కిలి సంతసించిరి. అట్టి గోపికా జనముతో నీవు కలిసి హాయిగా విహరించితివి. ఈ విధముగా రాసక్రీడయందు సంతోషముతో నున్న ఓ గురువాయూరప్పా! నా వ్యాధిని తొలగించి నన్ను రక్షింపుము. నారాయణ భట్టతిరి కృతి అయిన భాగవతమును నేను తెలుగు పద్యములలో చెబుతున్నాను. ప్రభూ! నన్ను అనుగ్రహించి ఈ కథను వినుము తండ్రీ!



## 33. రాసకేళి

సీ॥ రాసలీల నెరప రమ్యమౌ నీరూపు
ధ్యానింతు మంగళదాయకంబు
నీ శిరోజంబులన్ నెలకొన్న అందాల
నెమలిపింఛపు సొరునేమనందు
మకరకుండలముల పలువన్నె మిలమిలల్
చూడముచ్చట గొల్పు సుందరముగ
మౌక్తికాభరణాలు ప్రభు! నీదు గళమున
వనమాలతో గూడి పరిఢవిల్లె
ధగధగమెరిసెను తనువున గట్టిన
పీతాంబరంబది వేణులోల!
కటి ఆభరణములు కాంతులు జిమ్మెను
కాలి అందియలును ఘల్లుమనెను.

తే॥ నీదు అద్భుతంబౌ శోభ ముదము గొలిపి
వెల్లివిరిసెను దిశలందు వేదవినుత!
భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.



తా॥ ప్రభూ! నీవు గోపికలతో గలిసి రాసకేళి నెరపితివి. అపుడు నీ దివ్యమంగళ రూపము కడురమ్యముగా నుండెను. దానినే రీతివర్ణించగలను తండ్రీ! నీవు శిరోజములయందు ధరించిన నెమలిపింఛము ఎంతో మనోహరముగా నుండెను. నీవు ధరించిన మకరకుండలములు ఎన్నో రంగులతో మెరయుచూ కనువిందు చేసెను. నీ కంఠమున ముత్యాల హారములు, వనమాల నీ మెడలో కాంతులీనుచుండెను. వేణులోల! నీవట్టు పీతాంబరము ధగధగలాడుచు తనువున అలంకారమై యుండెను. నీ నడుమున ధరించిన నగలు కాంతిపుంజములను వెదజల్లెను. నీ కాలి అందెలు ఘల్లుఘల్లుమని వీనుల విందు జేయుచుండెను. ఓ వేదవినుత! నీ అద్భుత శోభ ఆనందము కలిగించుచు, నలుదిశల విరజిమ్ముచుండెను. నారాయణ భట్టతిరి శ్రీమన్నారాయణీయమును నేను తెనిగించుచున్నాను. ఓ గురువాయూరప్పా! దీనినాలకింపుము తండ్రీ!

33/2

సీ॥ నీ రాసకేళిలో నెలతల సింగార
మద్భుతంబా తీరు అనుపమంబు
అందాల రవికలా అతివలు దాల్చిరి
వర్తులా కృతిలోన వరలినారు
మణికుండలంబులు పలుమార్లు చలియించి
చెక్కిళ్ళపై కాంతి చిమ్ముచుండె
వనితలిద్దరి మధ్య వనమాలి నర్తించె
వెన్నులిద్దరి మధ్య వెలది చేరె

తే॥ నీవు ఒక్కడివే ప్రభూ! నిలచి చూడ
జూపితివి లీల మనసులు చూరగొనుచు
భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.



తా॥ ప్రభూ! నీతో రాసకేళీ సమయమున గోపకాంతల అలంకరణ తీరు ఎంతో రమణీయముగానుండెను. వారు చాల అందమైన కంచుకములను (రవికలను) ధరించి యుండిరి. గోపికలు వర్తులాకారము వలె నిలబడి నర్తించుచుండిరి. వారు ధరించిన మణికుండలములు అటునిటు చలించుచు చెక్కిళ్ళపై చిత్రవిచిత్రమైన కాంతులను వెదజల్లుచుండెను. బాగుగా అలంకరించుకొనియున్న ఇరువురు గోపికల మధ్య ఒక నందనందనుడు కనిపించెను. ఇద్దరు వెన్నుల (కృష్ణుల) మధ్య ఒక గోపిక కనుపించెను. ఇది ఎంత విచిత్రము. గమనించి చూచిన ఉన్నది ఒకే కృష్ణుడు కదా! ఆ గోపికల మనసులు చూరగొనుటకు స్వామి అత్యద్భుతమైన లీల ప్రదర్శించెను. నారాయణభట్టతిరి భాగవతమును తెలుగు పద్యరూపంలో చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! దీనినాలకించుము తండ్రీ!



33/3

చం॥
సురముని నారదుండు తను జూచె ముదంబున వాసుదేవ! నీ
సురుచిర రాసకేళి, అది చూడగ బిల్చిరి దేవతాళినిన్
మురియుచు, దేవతాంగనలు మోదముతో తిలకించి నారటన్
స్థిరపడి నింగిపై సురులు శ్రీహరివేడుక, వాహనాలపై
గురు అనిలాలయేశ! విన గోరెద నీకథ పద్యమందునన్

తా॥ ఓ వాసుదేవా! నీరాసకేళీ విలాసమును చూచిన దేవముని నారదుడు ఆనందం పట్టలేక దేవతాసమూహమునకు దానిని చూడమని సుదూరమునుండి పిలిచి చెప్పెను. చక్కగా అలంకరించిన వాహనములను (విమానములను) ఎక్కి విలాసముగా దేవతాస్త్రీలు, దేవతలు గగనవీధిలో స్థిరపడి శ్రీహరి జరుపుచున్న ఆ వేడుకను తిలకించిరి. ఓ గురువాయూరప్పా! దివ్యమైన నీ గాధను తెలుగు పద్య రూపంలో ఆలకింప ప్రార్ధించుచున్నాను తండ్రీ!



33/4

సీ॥ ప్రభూ! మనోహరముగా వాయించెదవు నీవు
మురళిని, పులకించు తరుణి జగతి
మధురగీతంబులన్ పాడుచుందురు వారు,
పాదఘట్టనలతోబాటు నీవు
చేతులతో కూడ వేతువు తాళంబు
ఘణఘణ మ్రోగంగ కంకణములు,
ఒకరి భుజాలపై నొకరు చేతులు వేసి
ఒయ్యార మొలకంగ ఉవిదలంత
ఆటపాటల తోటి ఆనందపరవశ
లైనాట్యమాడిరి అతిశయముగ

తే॥ నడుముపై తమ వస్త్రముల్ నాట్యమాడ
గోపికలు రాసకేళి నిన్ గూడిరయ్య!
వారి జన్మలు ధన్యముల్ వాసుదేవ!
వినుము గురువాయుపుర విభో! విష్ణుగాథ.

తా॥ ఓ ప్రభూ! నీవు మనోహరముగా మురళిని వాయించుచున్నపుడు గోపికలు మధురమైన గీతములను ఆలపింతురు. ఆ గానతాళములకు అనుగుణముగ నీ మెత్తని పాదములతో నీవు తాళము వేయుచుందువు. అట్లు తాళమువేయుచున్నప్పుడు నీచేతి కంకణములు ఘుణఘుణమని ధ్వనించుచుండును. ప్రతిసారి ఆ గోపికలు ఒకరి భుజాలపై మరొకరు విలాసముగా చేతులు వేసుకొనుచుండిరి. ఒయ్యారమొలుకునట్లు ఆ గోపికలు ఆటపాటలతో ఆనందపరవశలై అతిశయించి నాట్యమాడసాగిరి. ఆ గోపికలు ధరించిన వస్త్రములు వారి నడుములపై అటునిటు కదలాడుచుండెను. నిజముగా అట్టి సుమధురమైన నీ రాసకేళీవైభవమును ఓ వాసుదేవా! సేవించిన వారి జన్మధన్యము. ఓ గురువాయూరప్పా! ఇటువంటి ఈ విష్ణుగాధ నాలకింపుము తండ్రీ!



33/5

**తే॥ సఖియలప్పుడు శ్రద్ధగా షడ్జమమున**
**పాడుచుండగ నాట్యములాడు వారి**
**హారములు రమ్యముగ కదలాడుచుండె**
**భూషణంబులునున్ పడిపోవుచుండె**
**అట్టి నృత్యంబు తిలకించి అమరులంత**
**పుష్పవర్షంబు కురిపించి, పొగడి, వారు**
**అయిరి అనిమేషులానందమతిశయించ,**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాధ.**

తా॥ ఓ వాసుదేవ! అప్పుడు గోపికలు శ్రద్ధగా తారాస్థాయిలో పాడుచుండగా నృత్యములను కొనసాగుచుండెను. అప్పుడు అంగవిన్యాసముల వలన రమ్యమైన వారి హారములు, మణి భూషణములు పడిపోవుచుండెను. అట్టి నృత్యములకు దేవతలు వారి పరివారముతో సహా వచ్చి చూచి ఆనందపారవశ్యమున పుష్పవర్షము కురిపించి కీర్తించినారు, నిజముగా అనిమేషులే (రెప్పలు మూయనివారు) అయినారు. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!



33/6

ఉ॥

**స్వామి! లతాంగియొౌ పదతి బాగుగ దస్సెను నృత్యమెక్కుడై**
**ఆమె చెమర్చి ఆయె తను అర్థనిమీలిత నేత్ర నీభుజం**
**బామెకు బాసటయ్యె, నిక అంగనయొక్కతె చందనంబులన్**
**పామిన నీభుజంబొక నెపంబున కౌగిలిచేర్చిముద్దిడెన్**
**ఈమెకు మేనిపుల్కలయె హేగురువాయుపురాధినాయకా!**

తా॥ స్వామీ! తీగవంటి మృదువైన శరీరముగల ఒక గోపిక బాగుగా నృత్యము చేసి అలసిపోయి చెమటపట్టి అర్ధనిమీలిత నేత్రయై నీ భుజము ఆమెకు ఆలంబనముగా చేసికొని నిలిచిపోయెను. ఇక ఇంకొక గోపిక చందనలేపనము వలన సువాసన వెదజల్లు నీ భుజమును ఏదో ఒక నెపముతో కౌగలించుకొని ముద్దాడెను. అట్లు చేయగా ఈ గోపిక తనువంతా పులకరించి పోయెను. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!



33/7

**తే॥ కదలు కుండలంబులుగల కలికి తనదు**
**చెక్కిలిని నీదు చెక్కిలి చేర్చి కొనుచు**
**తమ్ములమగొన్న అధరామృతంబు జుర్రె,**
**రమకు నెలవైన నీదు యురమ్ముపైన**
**సోలి నృత్యంబు జేయుచు వాలెనొకతె**
**హర్షమున తాము ఉన్మాదులైరి స్త్రీలు**
**పలు మహానంద దశలను బడసినారు**
**వినుము గురువాయుపుర విభో! విష్ణుగాధ.**

తా॥ ఓ గురువాయూరప్పా! పుణ్యవతియైన మరొక గోపిక కదలుచున్న కుండలములు గల తన చెక్కిలిని నీ చెక్కిలిపై చేర్చి, తాంబూల చర్వితమైన నీయొక్క అధరామృతమును జుర్రుకొనెను. లక్ష్మీదేవికి విహారభూమియైన నీవక్షస్థలముపై సోలిపోయి వేరొక గోపిక నృత్యము నలిపెను. ఆ నృత్యము మనోహరముగానుండెను. గోపికలు హర్షోన్మాదములచే అనేక విధములైన మహానంద దశలను పొందిరి. ఓ ప్రభూ! అట్టి నీ దివ్య గాధనాలకింపుము తండ్రీ!

33/8

తే॥ **పాట ఆగెను క్రమముగా, వాద్య గోష్ఠి**
**సద్దుమణిగెను, గోపికల్ హద్దులేని**
**గొప్ప ఆనందమున తాము కూడినిన్ను**
**ఆడుచుండిరి, ఓ ప్రభూ! అతివలంత**
**ఆ సమాధి స్థితిని దేహధ్యాసలేక**
**నిలిచిపోయిరి, అది చూచి నింగినున్న**
**తారలును నిల్చిపోసాగె స్థిరతరముగ**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ**

తా॥ ఓ ప్రభూ! రాసక్రీడయందు క్రమముగా పాట ఆగిపోయెను. వాద్య గోష్ఠికూడ సద్దుమణిగెను. గోపికలు మాత్రము బ్రహ్మానందమునందు నిమగ్నమై ఆడుచుండిరి. ఆ సమయమున ఆ అతివలందరును సమాధి స్థితిలో ఏ మాత్రము దేహధ్యాస లేక నిలిచిపోయిరి. చివరకు ఆ దృశ్యమును చూచుచున్న నక్షత్రములుకూడ ఆనందమున మునిగిపోయినవా



అనునట్లు ఆకాశమున చలనరహితములై స్థిరతరముగ నుండెను. ఓ గురువాయూరప్పా! నీ రాసక్రీడ యొక్క వైభవమును నేను ఎంతని వర్ణించను. అయినా నీ గాథను వివరిస్తున్నాను, ఆలకింపుము తండ్రీ!

33/9

సీ॥ **భువనంబులన్నియు మునిగె బ్రహ్మానంద**
**మున, ఓలలాడెను మురళిలోల!**
**రాసోత్సవంబాగె రాసకేళిన్ తాము**
**అలిసిపోయిరి గోప అతివలంత**
**చెమటలో మేనులు చిత్తడి ఆయెను**
**అందమినుమడించె అద్భుతముగ**
**నీయోగ బల్మిచే నిలిచిరసంఖ్యాక**
**కృష్ణులు సతికొక్క కృష్ణుడట్లు**
**నినుజూచి ముగ్ధలై నెలతలర్పించిరి**
**సర్వస్వమున్ నీకు, స్వామి! వారు**



తే॥ **పొందిరేకాకృతి, మరలిపోవ రాక**
**వారశక్యలై యుండిరి, వాస్తవముగ**
**ఎంతభాగ్యశాలురు వారు హేముకుంద!**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ మురళీలోలా! సమస్త ప్రపంచమును పరమానందమున ఓలలాడినది. అటువంటి నీ అద్భుతమైన రాసోత్సవము పూర్తియయ్యెను. రాసకేళిలో పూర్తిగా అలసిపోయిన గోపికల శరీరములపై గల స్వేదబిందువులు అందమును అధికము చేయుచుండెను. నీవు నీ యోగశక్తిచేత అనేక కృష్ణరూపములను ధరించి గోపికలందరితో తలకొక కృష్ణుడై రాసక్రీడను జరిపితివి. నీ అలౌకిక సౌందర్యమునకు ముగ్ధలై గోపికలు తమను తాము సమర్పించుకొనిరి. స్వామీ! వారు నీతో ఏకాకృతి పొందిరి. ఇట్టి స్థితిలో వారు గృహోన్ముఖులగుటకు అశక్తలై యుండిరి. ఓ ముకుందా! యదార్థముగా వారు ఎంత భాగ్యశాలినులో గదా! ఓ గురువాయూరప్పా! నన్ననుగ్రహించి ఈ విష్ణుగాథను ఆలకింపుము తండ్రీ!



33/10

చం॥

**నినుపతిగా తలంచుకొని నిష్ఠతొ జేసిరి గోపికల్ వ్రతం**
**బును, వనమందు నీవు పరిపూర్ణ సుఖంబు నొసంగ వారికిన్**
**వనితకు ఒక్క కృష్ణునిగమాయగ ఆ యమునానదీతటం**
**బున విహరించి నావు ముదమొంద సువాసన నిండుతావులన్**
**వినుగురువాయుపట్టణపు విష్ణునిగాథను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! ఆ గోపికలు నిన్ను పతిగా భావించి కాత్యాయనీ దేవి వ్రతమును ఆచరించిరి. నీవు ఆ వనమందు (బృందావనమందు) వారికి పరిపూర్ణ సుఖమునొసంగుటకు వేర్వేరు కృష్ణరూపములలో మాయను ప్రదర్శించి వారి అభిలాషను తీర్చి ఆ యమునానదీ తీరంలోని ఇసుక తిన్నెలలో వారితో విహరించితివి. ఇంకను పరిమళ భరితములైన ప్రదేశములలో ఆనందమునొసంగితివి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథనాలకింపుము తండ్రీ!

33/11

సీ॥ ఈరీతి గోపికలెన్నియో రాత్రులు
ఆనంద రసస్ఫూర్తి మునిగినారు
యోగీశ్వరులకును ఉన్నతగమ్యమౌ
బ్రహ్మానుభూతిని బడసినారు
బ్రహ్మాది దేవతల్ పరమశివుడు వారి
భాగ్యమ్ము శ్లాఘించి పలికినారు
సుందరుడవు భక్త సులభుడవో కృష్ణ!
నయము చేకూర్చుము నాదు వ్యాధి

తే॥ దివ్యసౌందర్య నిధివయ్య దేవదేవ!
భట్టతిరి నాడు చెప్పిన భాగవతము
తెలుగు పద్యంబు జేస్తిని తేనెలూర
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ



తా॥ సౌందర్యమునకు నిధివైన ఓ ప్రభూ! నీవు ఈ విధముగా గోపికలకు అనేక రాత్రులు ఆనందమును కలిగించితివి. అంతేగాక యోగులకు గమ్యమైన బ్రహ్మానందాను భూతిని గూడ వారికి కలిగించితివి. అందువలన బ్రహ్మాది దేవతలు మరియు పరమశివుడు కూడ ఆ గోపకాంతల భాగ్యమును ఎంతయో శ్లాఘించిరి. భక్తసులభుడవైన ఓ సుందర రూపా! శ్రీకృష్ణా! అటువంటి దయార్ద్ర హృదయుడవైన నీవు నన్ను కనికరించి నా వ్యాధిని నిర్మూలింపరాదా? నారాయణ భట్టతిరులు రచించిన భాగవతమును నేను తెలుగు పద్యములోనికి మార్చుచేశాను. ఓ గురువాయూరప్పా! దీనిని విని నన్ను చరితార్థుని చేయుము తండ్రీ!



# 34. సుదర్శనుడను గంధర్వుని శాప విమోచనము

### వృషభాసుర సంహారము

**చ॥**

**వనితలు రాసకేళి తము స్వర్గ సుఖంబుల నోలలాడుచున్**
**నిను మురిపించి రవ్విధిని, నీవును గోపులు అంబికావనం**
**బున నొకనాడు శంకరుని పూజల పిమ్మట నిద్రజేయగా**
**ఘనమగు పన్నగంబొకటి గ్రక్కున మ్రింగగజొచ్చెనందునిన్**
**విను గురువాయు పట్టణపు విష్ణునిగాథను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! ఈ విధముగా గోపికలు రాసోత్సవమున నిన్ను పొంది స్వర్గ సుఖముల తేలియాడిరి. నిన్ను మురిపించి తమరి జీవితములు ధన్యము చేసుకొనిరి. ఒకనాడు నీవు గోపులందరితో కలసి అంబికా వనమున నున్న శివుని మందిరమునకు పోయి అచ్చట శివారాధన చేసి ఆరాత్రివేళ సుఖముగా నిద్రించిరి. అప్పుడు ఒక



భయంకరమైన కొండచిలువ నీతండ్రియైన నందగోపుని మ్రింగజొచ్చెను. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధను ఆలకింపుము ప్రభూ!

34/2

**ఉ॥**

**గోపులు మందుకట్టెలతొ కొట్టిరి కేకలు పెట్టి సర్పమున్**
**ఆపదు మ్రింగుటన్ వదలదాయెను నందుని నీకు మ్రొక్కుచున్**
**ఆపద నాదుకొమ్మనిరి ఆర్తుల గాచుట నీవ్రతంబయెన్**
**నీపదమెత్తి తాకితివి నీరజనాభ! త్వదీయ స్పర్శచే**
**శాపము తీరిమ్రొక్కె మనసా గురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ పద్మనాభా! అప్పుడు గోపాలురందరు మండుచున్న కట్టెలతో కేకలు వేస్తూ ఆ కొండచిలువను కొట్టసాగిరి. అయినా అది నందుని మ్రింగుట మానలేదు. అప్పుడు గోపకులందరు నందుని రక్షించమని నిన్ను వేడుకొనిరి. ఆర్తత్రాణపరాయణుడవైన నీవు వెంటనే ఆ కొండచిలువకు నీ పాదమెత్తి ఆనించితివి. వెంటనే

నీపాద స్పర్శచేత ఆ కొండచిలువ తన మునుపటి రూపమైన విద్యాధరునిగ మారి తన శాప నివారణ చేసిన నీకు మ్రొక్కెను. ఓ గురువాయూరప్పా! నీ కథనాలకించి నన్ను ధన్యుని చేయుము తండ్రీ!

34/3

సీ॥ **"ఓ సుదర్శనపాణి! నేసుదర్శనుడను**
**విద్యాధరుండను, విఱ్ఱవీగి**
**అవమాన పరచితిన్ అంగీరస మునినిన్**
**శాపంబునొంది అజగరమైతి**
**నీపాద స్పర్శకై నేవేచియుంటిని**
**అంబికావనమున ఆర్తరక్ష!"**
**నిజరూపమును దాల్చి నిన్ను స్తుతించుచు**
**విద్యాధరుండును వెడలిపోయె**

తే॥ **సంతసించి గోపాలురు చనిరి మరలి**
**గోకులంబును జేరిరి కూడి నిన్ను**
**భట్టతిరికృతి తెలుగులో పద్యమాయె**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ**



తా॥ "సుదర్శన చక్రధరుడవైన స్వామీ! నేను సుదర్శనుడను పేరుగల విద్యాధరుడను. ఒకప్పుడు నేను గర్విష్టినై అంగీరసుడను మహర్షిని అవమాన పరచితిని. ఆ ముని కోపించి నన్ను అంబికావనమున కొండచిలువవై పడియుండమని శపించెను. దయచూపమని నేను వేడుకొనగా ఆయన కరుణించి శ్రీకృష్ణుని పాదస్పర్శవలన నీ నిజరూపము నీకు వచ్చునని నన్ను అనుగ్రహించెను. నేడు నీ పాదస్పర్శ వలన నా నిజరూపము నాకు వచ్చినది, కృతజ్ఞుడను" అని ఆతడు నిన్ను స్తుతించి తన లోకమునకు పోయెను. తరువాత గోపాలకులందరు సంతోషించి నీతో కలిసి గోకులమునకు బోయిరి.

నారాయణభట్టతిరి రచించిన భాగవతమును నేను తెలుగు పద్యరూపంలో చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! దీనినాలకింపుము తండ్రీ!



34/4

తే॥ **కూడియొకనాడు అన్నతో గోపికలతొ**
**యమున తటి విహరించావు అచటికొచ్చి**
**శంఖచూడుడన్ గంధర్వ శతుడొకండు**
**గోపికల గొనిపోయెను అపహరించి**
**వాని వెంటాడ భీతిల్లి పారిపోయె**
**దునిమి వాని శిరోరత్నమును హరించి**
**అన్నకిచ్చావు ఓ ప్రభూ! అతని మణిని**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! ఒకనాడు నీవు అన్న బలరామునితోను కొందరు గోపికలతోను యమునానదీ తీరమును విహరించుచుంటివి. అప్పుడు కుబేరుని సేవకుడైన శంఖచూడుడను అహంకారియైన గంధర్వుడు ఆ గోపికలనపహరించి ఎత్తుకొని పారిపోసాగెను. వెంటనే నీవు వానిని వెంబడించితివి. వాడు స్త్రీలను వదలివేసెను. నీవు వానిని సంహరించి వాని తలలో



ఉన్న శిరోరత్నమును లాగుకొని అన్న బలరామునికి ఇచ్చితివి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథనాలకింపుము తండ్రీ!

34/5

చం॥

**వనముల గోప బాలకుల బాసటగా తిరుగాడినావు ఆ**
**మనసిజుకంటె మోహనుడవౌ ప్రభు! వేణువునూది దేవతా**
**వనితలకున్ యొసంగెదవు పారవశంబును, సుందరాంగుడౌ**
**నినుగని గోపికాంగనలు నీయెడ బొందిరి కామవాంఛలన్**
**విను గురువాయు పట్టణపు విష్ణుని గాథను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! నీవు నీ స్నేహితులైన గోపబాలకులతో కలిసి వనములందు తిరుగాడితివి. నీవు మన్మథునికంటే మనోహరుడవయితివి. నీ మురళీ వాదనము మధురాతి మధురము. దానిచే నీవు ఏకముగా దేవతా స్త్రీలకును ఆనందము కలిగించి పారవశ్యమునొందించుచుంటివి. అత్యంత

సుందరాకారుడవైన నిన్ను జూచి గోపికా రమణులు విరహతాపముతో నీపట్ల కామవాంఛలు కలిగియుండిరి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!

34/6

**కం॥ తాన్ కూడె 'అరిష్టాసురు'**
**దా కంసుని భృత్యుడొచ్చె నట వృషభంబై**
**ఆకపటి గొంతు ఉఋమై**
**భీకరమో గురు అనిలపు వేల్పవు దేవా!**

తా॥ ఓ గురువాయూరప్పా! ''అరిష్టాసురుడు'' అనుపేరుగల ఒక రాక్షసుడు అక్కడికి ఒకనాడొచ్చాడు. వాడు కంసుని భృత్యుడు వాడు ఒక ఎద్దు రూపములో నీ ముందు నిలిచాడు. ఆ రాక్షసుని చూపు భయంకరముగా నున్నది. ఆ దుర్మార్గుని గొంతు ఉఋమువలె కర్ణ కఠోరముగా నుండెను.



34/7

**ఆ.వె॥ లోకభీకరంపు ఆకారమున "ఎద్దు"**
**గోగణముల జేరి గొలిపె బెదురు**
**పరమవేదరూప! గురువాయుపురవిభో!**
**చేరె నీదు దరికి చివరికతడు.**

తా॥ గొప్ప వేద స్వరూపుడవైన ఓ గురువాయూరప్పా! ఆ వృషభాసురుని ఆకారములోక భయంకరముగా నుండెను. అట్టి అరిష్టాసురుడు గోవులమందలో ప్రవేశించి వాటిని బెదరగొట్టెను. తరువాత వాడు నెమ్మదిగా నీ దగ్గరకు చేరుకొనెను.

34/8

**కం॥ తనవాడి ఎత్తుకొమ్మల**
**నిను పొడవన్ వచ్చెనతడు నీకభిముఖుడై**
**దునిమితివి పట్టి వానిని**
**కొనియాడన్ సురులు, అనిల గురుపురదేవా!**



తా॥ ఓ గురువాయూరప్పా! వాడిగలవి మరియు ఎత్తైన కొమ్మలతో ఆ భీకర దనుజుడు నిన్ను పొడుచుటకై నీకభిముఖుడై పరుగెత్తుకొని వచ్చుచుండెను. అప్పుడు నీవు ఆ దుష్టరాక్షసుని పట్టుకొని సంహరించితివి. అట్లు దేవతలని సంతోషపెట్టి కీర్తింప జేసికొంటివి.

34/9

**ఉ॥**
**లీలలు వింత గొల్పు ప్రభూ! లేదు మరేదియు సాటివాటికిన్**
**కూలిచి ఎద్దు రూపుగల కూళుని ధర్మమునీవు నిల్పగా**
**వేల తెరంగులన్ సురులు ప్రీతినుతించిరి, ఆ సురేంద్రుడున్**
**పోలికలేని శాంతిగనె ఓ గురువాయు పురాధినాయకా!**

తా॥ ఓ గురువాయూరప్పా! నీ లీలలు విచిత్రములు ప్రభూ! వాటికి సాటి లేనేలేదు. నీవు వృషభాసురుని సంహరించి ఆ దుర్మార్గునిచే పీడించబడు భూమండలంలో ధర్మసంస్థాపన జేశావు. అందువలన దేవేంద్రుడు ఎంతో మనశ్శాంతిని పొందాడు. దేవతలందరు నిన్ను ఎన్నో విధముల శ్లాఘించినారు.



34/10

**తే॥ నీవు ఆ 'అరిష్టాసురు' నిహతు జేయ**
**బాలగోపులు తముకాచు పశులతోటి**
**పలుకుచుండిరి హాస్యము ఒలుకునట్లు**
**"ఎద్దులార! పరుగిడి మీరిటకు రండు**
**వృషభమును జంపు కృష్ణుడు పీచమణచు"**
**అట్టి గోపులతో ఇంటికరిగినావు**
**నాదు వ్యాధిని తొలగించి నయము నిమ్ము**
**వినుము గురువాయు పురవిభో! విష్ణుగాధ.**

తా॥ ఓ ప్రభూ! నీవు అరిష్టాసురుని సంహరించగా చూచిన గోపబాలకులు నవ్వుచు వ్యంగోక్తులు పలుకుచు తాము కాచు వృషభములతో ఇట్లనుచుండిరి. "ఓ ఎద్దులారా! మీరు తొందరగా పరుగిడుడు లేనిచో ఈ కృష్ణుడు వృషభములను చంపు మొనగాడు మిమ్ము వదలడు" ఈ విధముగా పలుకుచున్న గోపబాలురతో కలిసి నీవు ఇల్లు చేరుకొంటివి. ఓ గురువాయూరప్పా! నీవు నా వ్యాధిని తొలగించి నన్ను రక్షింపుము. ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!

## 35. కేశి, వ్యోమాసురుల వధ

**తే॥ "కేశి" దనుజుడు కంసునికే ప్రియుండు**
**కంసుడిచ్చిన పనులను కడు సులువుగ**
**చేయగలవాడు, అదిగాక ఆ యసురుడు**
**"సింధుజ"ను బెండ్లియాడిన శ్రీరమణుడు**
**సింధుజ యగు అశ్వమ్మును చేరదీయు**
**నని తలంచెను అందుచే అశ్వమాయె**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యగతిని**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ**

తా॥ ఓ ప్రభూ! కేశియనుపేరుగల ఒక రాక్షసుడు భోజరాజైన కంసునికి చాల ప్రియమైనవాడు. కంసుడు తనకు నిర్దేశించిన పనులన్నీ అతడు చక్కగా నిర్వహిస్తాడు. అందుకే ఆ కేశి అంటే కంసునికి ఇష్టం. ఆ రాక్షసుడు పాలసముద్రంలో పుట్టిన లక్ష్మీదేవి నీకు ప్రియమైనదగుటచే పాలసముద్రం లోనే పుట్టిన తెల్లని గుఱ్ఱము కూడ నీకు ప్రియమైన



దైయుంటుందనుకొని తను తెల్లని అశ్వరూపమును ధరించెను. నారాయణ భట్ట తిరి కావ్యమైన భాగవతమును నేను తెలుగు పద్యరూపంలో వినిపించుచున్నాను. ఓ గురువాయూరప్పా! దీని నాలకింపుము తండ్రీ!

35/2

చం॥
**దనుజుడు అశ్వమై సలిపె దారుణమౌ సకిలింపు దానిచే**
**పనివడిలోక మంతటను బంపెను భీకర శబ్దఘోషలన్**
**తను అసురుండు గోకులపు తంటగ మారెను, నీదు దృష్టియున్**
**చెనకొని వానిపై బడెను, చేరెను వాడును నీదు ముంగిటన్**
**విను గురువాయు పట్టణపు విష్ణుని గాథను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! ఆ దుష్టుడు అశ్వ రూపమును దాల్చి, తన భయంకరమైన సకిలింపులచే లోకమంతటను భయపెట్టుచుండెను. అట్లే అతడు గోకులమునకు పెద్ద పీడగా మారెను. ఇంతలో నీ



దృష్టి అతనిపై పడెను. అది గమనించి వాడు నీ ముందునకు వచ్చెను. (గంధర్వము= గుఱ్ఱము). ఓ గురువాయూరప్పా! రమ్యమైన ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!

**ఆ.వె॥ "తార్క్ష్య" రూపికేశి తానును భృగునిలా**
**"తార్క్ష్య" వాహనుడిని తన్నబోయె**
**కూళుడెంత శఠుడు!! గురువాయుపురవిభో!**
**భృగుని చర్య తాను వినెనొ ఏమొ!!**

తా॥ ఓ ప్రభూ! 'తార్క్ష్య' రూపమున (గుఱ్ఱము రూపంలో) నున్న కేశి తనుకూడా భృగుమహర్షిలా (పూర్వం త్రిమూర్తులలో అతి శాంతచిత్తుడెవరో పరీక్షించుటకు భృగుమహర్షి వైకుంఠమునకు వచ్చి విష్ణుమూర్తిని తన నలక్ష్యం చేశాడని కాలితో వక్షఃస్థలమున తన్నెను) 'తార్క్ష్య' వాహనుడైన (గరుత్మంతుడు వాహనమైన) విష్ణుమూర్తిని తన్నబోయెను. ఓ



గురువాయూరప్పా! ఆ దుర్మార్గుడు ఎంత మూర్ఖ శిఖామణి!! వాడు కూడా భృగుమహర్షి చేసిన పనిని గూర్చి విన్నాడేమో!! మరి

35/4

ఉ॥
**కాలితొ నిన్ను తన్నుటకు గట్టిగ యత్నము చేసెకేశియున్**
**వీలుగ నీవు తప్పుకొని వేగముగా విసిరేయదవ్వునన్**
**వాలి పడంగ మూర్ఛిలెను వాడును తేరుచు క్రోధమెక్కుడై**
**తూలుచు దూకెపర్వులిడుతున్, గురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ గురువాయూరప్పా! నీవు కేశి అను ఆ రాక్షసుని కాలితన్నును తప్పించుకొని అతనిని ఒడిసి పట్టుకొని చాలదూరము విసిరివేయగా, వాడు ఎక్కడో వాలిపడ్డాడు. ఆ దెబ్బకు వాడు మూర్ఛపోయాడు. క్షణకాలం తరువాత తేరుకొని వాడుకూడ అతి కోపముతో నిన్ను మ్రింగేసేటట్లు తూలిపోతూ పరుగెత్తుకొని వచ్చి నీపై దూకాడు.

35/5

కం॥ దనుజుని దండించుటకై
తన నోటన్ నీదు బాహు దండమునుంచన్
చనిపోయె ఊపిరాడక
"నిను చేరెన్" గురు అనిలుని నిలయా వినుమా!

తా॥ ఓ గురువాయూరప్పా! నీవు వాహనమైన (గుఱ్ఱమైన) ఆ రాక్షసుని దండించుటకై అతని నోటిలో నీ బాహు దండమును జొనిపి శ్వాస ఆడకుండ చేయగా ఆ కేశి చనిపోయెను. అశ్వరూపుడైన వాడు నీలో ఐక్యమై ముక్తిని పొందెను. ఓ ప్రభూ నీ గాధను ఆలకింపుము తండ్రీ!



35/6

ఆ.వె॥ యజ్ఞమందు పశువునాలంబనము జేయ
సురులు వరములీయు గురుపురీశ!
అట్టి నూత్న'కేశి' అశ్వమేధంబున
అనిరి కేశవుడని నిను స్తుతించి.

తా॥ ఓ గురువాయూరప్పా! యజ్ఞము చేయుచున్నపుడు ఒక పశువును ఆలంబనము చేసెదరు (వధింతురు). అది దేవతలని సంతోషపెట్టి వరము లిచ్చునట్లు చేయును. కేశిని వధించి నీవు చేసిన ఈ క్రొత్త అశ్వమేధం తరువాత దేవతలు నిన్ను స్తుతించుచు కేశవుడు (కేశిని చంపినవాడు) అని కీర్తించిరి.



35/7

సీ॥ నారాయణా! తను నారదుండొకనాడు
కంసుని కడజేరి కథను దెలిపె
అతనికి తెలిసెను హరికృష్ణుడై తనన్
అంతంబు సేయంగ నవతరించె
వసుదేవుడింతటి పనిజేసెనని నేర్చి
వానిని జంపెదననెను ఖలుడు
వారించి కంసుని నారదుండును మంచి
మాటలు బోధించి మరలిపోయె

తే॥ నారదుడు నిన్ను దర్శించి పరమభక్తి
కేశవుడవని ముదముతో కీరితించె
భట్టతిరికృతి తెలుగులో పద్యమాయె
వినుము గురువాయు పురవిభో! విష్ణుగాధ



తా॥ ఓ శ్రీమన్నారాయణా! నారద మహర్షి ఒకనాడు కంసుని దగ్గరకు వచ్చి నీవు వసుదేవుని పుత్రుడవని జరిగిన కథనంతయు తెలిపెను. అందువలన కంసునకు వసుదేవునిపై పట్టరాని కోపము వచ్చి వానిని వధియించెదననెను. అప్పుడు నారదుడు అతనిని వారించి మంచి మాటలను బోధించెను. నారాయణుడే శ్రీకృష్ణునిగా అవతరించెనని చెప్పి కంసుని నీపై ప్రేరేపించి వానిని చంపించుటయే నారదునికి కావలసినది. ఆ తరువాత నారదుడు నీ దగ్గరకు వచ్చి నీవు కేశవుడవని కీర్తించెను. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి రచించిన భాగవతమును నేను తెలుగు పద్యంగా చెబుతున్నాను. దీని నాలకింపుము తండ్రీ!

35/8

తే॥ గోప బాలురందరితోటి కూడి నీవు
ఆడుచుండ 'నిలాయ' మన్ ఆట యొకటి
వచ్చె వ్యోమాసురుండను వాడు యటకు
మయుని పుత్రుడు యెరుగడు మంచినతడు
సురుల ద్వేషించు మాయావి, చేరెనటకు
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ఓ గురువాయూరప్పా! ఒకనాడు నీవు గోపబాలకులతో కలిసి అడవిలో నిలాయమను ఆటను (దొంగాట) ఆడుకొనుచుంటివి. అప్పుడు మయుడు అనే రాక్షసుని కొడుకైన వ్యోమాసురుడనువాడు నీ దగ్గరకు వచ్చెను. వాడు దేవతలను ద్వేషించును. పరమ మాయావి.



35/9

సీ॥ గోపాలురందరు కూడిరి దొంగలై
పాలకుడవు నీవు వారికంత
అసురుండు వ్యోముడు ఆయెను ఒకదొంగ
బాలురతో తాను కలిసిపోయె
బాలురతోపాటు పశువుల నన్నిటిన్
కొనిపోయిదాచెను గుహనతండు
బయటకు రాకుండ బండొక దానిని
అడ్డుగా బెట్టెనా అసురదంత

తే॥ వాని యత్నంబు గ్రహియించి వదలకుండ
సంహరించావు దనుజుని సద్దు లేక
భట్టతిరికృతి తెలుగులో పద్యమాయె
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.



తా॥ ఓ ప్రభూ! అద్భుతమైన ఆ ఆటలో గోపాలురందరూ దొంగల వలె నటించిరి. నీవు పాలకుడవై వ్యవహరించితివి. మీరు ఆ ఆటను కొనసాగించుచుండగా వ్యోమాసురుడు ఆ బాలురలో కలిసిపోయెను. అతడు దొంగగా మారి గోపబాలురను గోవులను ఎత్తుకొని పారిపోయి ఒక గుహలో దాచెను. తరువాత ఎవ్వరూ బయటకు రాకుండా బండరాతిని అడ్డము పెట్టెను. వ్యోమాసురుని దుష్టప్రయత్నమును గుర్తించిన నీవు వానిని విడువకుండ వెంటాడి సంహరించితివి. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి రచించిన భాగవతమును నేను తెలుగు పద్యంలో చెబుతున్నాను. దీనినాలకించి నన్ను ధన్యుని చేయుము ప్రభూ!



35/10

చం॥
అనుపమ లీలద్రుంచితివి అద్భుత క్రీడల గోకులంబునన్
దనుజుల, మోదమిచ్చితివి ధన్యుల జేస్తివి గొల్లలందరిన్
నను కృపజూడరాదు!! ప్రభు! నన్నికగావుము వ్యాధి మాన్పుచున్
విను గురువాయుపట్టణపు విష్ణుని గాథను నందనందనా!

తా॥ ఓ నందనందనా! నీవు ఇటువంటి అద్భుతమైన క్రీడలతో కూడ రాక్షసులను నిర్ద్వంద్వంగా నిర్మూలించి, ఆగోకులంలో ఆనందం నిత్యనూతనముగా నిరవధికంగా వెల్లివిరియునట్లు అడుగడుగునా జేసితివి. పరమాత్మ రూపుడవైన ఓ ప్రభూ! నన్ను కనికరించి నా వ్యాధిని నిర్మూలించి నన్ను రక్షింపుము. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!

## 36. అక్రూరుని ఆగమనము

**ఉ॥**

**పన్నగశాయి! నారదుని మాటలు కంసుడు ఆలకించుచున్**
**అన్నిటి మూలకారణము ఆ వసుదేవుడనంచు భీతిలెన్**
**నిన్నటు బిల్వనంపె తను నీ వరభక్తుని గాందినీసుతున్**
**మన్ననతోటి తెచ్చుటకు యాగము జూడగ అన్నదమ్ములన్**
**ఎన్నికజేసి తోడుకొని హే గురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ శేషశాయీ! నారదమహర్షి కంసుని దగ్గరకు పోయి గోకులమందున్న నీవు వసుదేవుని పుత్రుడవని చెప్పెను. అందువలన కంసుడు భయపడిపోయెను. అతడు వెంటనే గాందినీపుత్రుడును నీ ప్రియ భక్తుడునుయైన అక్రూరుని పిలిచి సగౌరవముగా యాగమును (ధనుర్యాగమును) జూచుటకు నిన్ను బలరాముని ప్రత్యేకంగా తెమ్మని గోకులమునకు పంపెను. ఓ గురువాయూరప్పా! ఈ కథనాలకింపుము తండ్రీ!





**చం॥**

**తను పరమాత్మవౌ నిను ముదంబున జూచెడి కౌతుకంబునన్**
**మనమున తల్చెగాని భయభ్రాంతుడు కంసుని నీడజూచినన్**
**గొని తను కంసునాజ్ఞ తన కోరిక తీరెనటంచు తృప్తితో**
**మునిగెను అంతులేనిదగు మొదమునందున గాందినీయుడున్**
**విను గురువాయుపట్టణపు విష్ణునిగాధను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! ఆ గాందినీయుడైన అక్రూరుడు నీకు పరమభక్తుడు. పరమాత్మవైన నిన్ను సందర్శించుకొనవలెనను కోరిక చాలకాలము నుండి ఉన్నప్పటికీ కంసుని నీడజూచినా భయ భ్రాంతుడవుతాడు కావున తన కోరిక తీర్చుకొనలేకపోయెను. ప్రస్తుతము కంసుని యొక్క ఆజ్ఞవలననే నిన్ను చూచుటకు వచ్చుచున్నందు వలన అక్రూరుడు అంతులేని ఆనందమున మునిగెను. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!





**ఉ॥**

**గోకులమందు నిన్ను గనుకోరిక గల్గిన గాందినీయుడున్**
**ఆ కల సత్యమౌట తనకబ్బిన భాగ్యమనంచు తల్చెతా**
**నాకడ యేమి విఘ్నమగునాయని చింతిలుచుండె భీతితో**
**తాన్ కనుదేనిపైన తన ధ్యాసను నిల్పడు నిన్నుజూడగా**
**ధ్యానముచేయుచుండె గదయా! గురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ గురువాయూరప్పా! అదృష్టవంతుడగు అక్రూరుడు రథమెక్కి గోకులమునకు బయలుదేరి తన చిరకాల వాంఛ తీరబోతుండటం తన అదృష్టమని తలంచు చుండెను. ఐనను ఏమి విఘ్నము జరుగునోయని దిగులుతో భయమును కూడ పొందెను నిన్ను ధ్యానించుచు త్రోవలో కనిపించు దేనిపైనను తన ధ్యాసను నిలుపలేకుండెను. ఓ ప్రభూ! నీ కథను ఆలకింపుము తండ్రీ!





**తే॥ వేదములు తాము వర్ణించు వేల్పు ఇతడు**
**వేదముల చేత పొందెడి వేద్యుడితడు**
**ఇట్టి అచ్యుతు, శ్రీకృష్ణునెపుడు చూతు?**
**పరమపురుషుని తాకెడి భాగ్యమగునె?**
**వాని కౌగిలించెడి కోర్కె బడయ గలనె?**
**నన్ను పలుకరించునొ లేదొ! వెన్నుడనచు**
**దారిలోన అక్రూరుడు తలచుచుండె**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! దారిలో అక్రూరుడు ఈ విధముగా తలపోయసాగెను. "వేదములందు వర్ణింపబడు వాడును, వేదములచేత పొందబడువాడును, అగు ఈ అచ్యుతుడగు శ్రీకృష్ణుని ఎప్పుడు చూచెదను? ఆ పరమపురుషుని తాకెడి భాగ్యమెప్పుడు కలుగును? ఆతనినెప్పుడు ఆలింగనము చేసికొందును? ఆయన నన్ను చూడగానే పలుకరించునో లేదో?"
ఓ గురువాయూరప్పా ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!

36/5

తే॥ నీదు చరణాల స్పర్శ బునీతమైన
వనము బృందావనంబని వినుటచేత
బ్రహ్మ శంకరులిడుదురు వందనములు
అట్టి మహిమాన్విత వనిని అరయగానె
మురిసి అక్రూరుడును మేను మరచిపోయె
వివిధ భావాల నొందెను వివశుడాయె
భట్టతిరికృతి జెప్పెద పద్యమందు
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ఓ ప్రభూ! నీ పాదస్పర్శచేత పావనమైన ఆ బృందావనమును దర్శించగానె అక్రూరుడు బ్రహ్మ శంకరులు కూడ ఆ వనమునకు నమస్కరింతురని వినుటచేత ఆ మహిమాన్వితమైన వనమునకు భక్తితో నమస్కరించెను.ఆ వనమున ప్రవేశించుచు అక్రూరుడు ఆనందంతో మైమరచిపోయి వివిధ భావనలను పొందసాగెను. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి భాగవతమును నేను తెలుగు



పద్యరూపంలో వినిపిస్తూ ఉన్నాను. దీనినాలకింపుము తండ్రీ!

36/6

చం॥
కని నువు సంచరించి మమకారము జూపిన ఆప్రదేశముల్
వనముల ధూళిలోనబడి భక్తిని బొర్లెను తన్మయంబునన్
నిను గొలిచేటి భక్తులు పునీతులు, వారలశ్రేష్ఠుడైనవా
నిని గురువాయుపట్టణపు నేతకు ఇష్టుడుగా తలంచెదన్

తా॥ ఓ గురువాయూరప్పా! అక్రూరుడు గోకులమున నీవు సంచరించిన ప్రదేశములను వనములను జూచుచు భక్తి భావమున ప్రణమిల్లెను నీపాద చిహ్నములు గల ధూళిలో పొర్లాడెను. అప్పటి అతని భక్తి పారవశ్యములు వర్ణనాతీతములు.ఆ కాలమున నీకున్న వేల భక్తులలో పుణ్యాత్ములు శ్రేష్ఠులు యెందరో ఉండిరి. వారిలో అక్రూరుడు అగ్రగణ్యుడు అందుచేత నీకు అతను అత్యంతాప్తుడు.



36/7

ఆ.వె॥ సంధ్యవేళ గోపసతులు నీ లీలలు
పాడుచుండ వినుచు పరవశించి
గోపులిండ్లు దాటి గురువాయు పుర విభో!
చేరె నందు నిల్లు చివరి కతడు.

తా॥ ఓ గురువాయూరప్పా! సాయంకాల సమయమున గోకులమునందలి గోపికలు తమ భవంతులందు కర్ణపేయముగా నీ లీలలు గానము చేయుచుండిరి. అట్టి గోపభవనములను జూచుచు, ఆనంద సాగరమున ఓలలాడుచు, ప్రయాణించుచు అక్రూరుడు చివరకు నీవు నివసించు నందుని భవనమునకు చేరుకొనెను.



36/8

తే॥ నిన్ను అక్రూరుడటగాంచె కన్నులార!
అన్న బలభద్రుతో గూడి, అపుడు నీవు
పాలు పితుకుచుంటివి మురిపాలు ఒలక
ఆ అనన్యభక్తుడునీకు అతిప్రియముగ
స్వాగతించుచున్నట్లుగా మదిని తలచె
పరమ సంతోషమున తాను పరవశించి
వాని ఎదుటనే నిలిచావు కనులు చెదర
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ఓ గురువాయూరప్పా! అక్కడ నిన్ను అక్రూరుడు తన కన్నులార చూచెను. అప్పుడు నీవు నీ అన్న బలరామునితో కలిసి గోవులకు పాలు పితుకుచుంటివి. నీకు అనన్యభక్తుడైన అక్రూరుడు తను నీకు ప్రియముగా స్వాగతము చెబుతున్న వానిగా తన మనస్సులో ఊహించుకొని ఆనంద పరవశుడయ్యెను. అతనిట్లు ఊహించుచుండగానే కల నిజమైనట్లు నీవాతని ఎదుట నిలబడి యుంటివి. నీవు ఈ విష్ణుగాథనాలకించి నన్ను ధన్యుని చేయుము ప్రభూ!

36/9

ఉ॥

**తానము లాడి సంధ్యయని తాము ధరించిరి శుభ్రవస్త్రముల్
తాను సునీల చేలములు దాల్చెను రాముడు భూషణంబులన్
బూని ధరించె, పచ్చనివి వోమధుసూదన! నీవు కట్టగా
కానగ వచ్చిరిర్వురును 'కమ్మగ' నవ్వుచు, గాండినీయునిన్
మానక బ్రోచు దేవ! వినుమా గురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ దేవా! నీవును బలరాముడును సంధ్యానమయమున స్నానములను చేసి చాలపరిశుద్ధమైన వస్త్రములను ధరించిరి. నీ అన్న బలరాముడు నీలవర్ణ వస్త్రములను ధరించి బహుకొద్ది ఆభరణములను ధరించెను. మధుసూదనా! నీవు పీతాంబరములను కొద్దిపాటి నగలను ధరించితివి. ఇద్దరును అతి మనోహరముగా కనిపించిరి. ఆ అక్రూరుని చక్కటి చిరునవ్వుతో సంరక్షించు ఓ అక్రూర వరదా! గురువాయూరప్పా! ఈ కథనాలకింపుము తండ్రీ!



36/10

కం॥ **స్యందనముడిగ్గి నీకున్
వందనములు జేయ కుశల ప్రశ్నల నతనిన్
పొందుగ అడుగుచు కౌగిలి
నందించితివయ్య! గురువు అనిలపురీశా!**

తా॥ ఓ గురువాయూరప్పా! అక్రూరుడు నందభవనమునకు దూరమునందే రధమును దిగి నిన్ను సమీపించి నమస్కరించెను. నీవు ఆ పరమభక్తుని లేవనెత్తి ఆనందముతో ఆలింగనము చేసికొనినావు.ఆ తరువాత క్షేమ సమాచారములనడిగి అతని చేయిపట్టుకొని బలరామునితో పాటు ఇంటిలోనికి తీసికొనిపోయావు.

36/11

చం॥

**అనుపమమైన రీతి నువు ఆదరమిచ్చితివయ్య! గాందినీ
యునకును, నందుడున్ అటుల ఒద్దికతో తను సత్కరించె, కం
సుని పెనుయాగమున్ తెలిపె సూక్ష్మముగానది "రాజు" ఆజ్ఞనెన్,
వెనుక మరిన్ని ముచ్చటలు వింటివి రామునితోటి, నీవునున్
విను గురువాయుపట్టణపు విష్ణుని గాథను నందనందనా!**



తా॥ ఓ నందనందనా! నీవు అక్రూరుని మిక్కిలి ఆదరముతో సత్కరించితివి. నందగోపుడు కూడ అదే విధముగా వినయముతో అక్రూరిని సన్మానించెను. అప్పుడా అక్రూరుడు కంసుడు చేయుచున్న గొప్ప ధనుర్యాగముగురించి సూక్ష్మముగా తెలిపెను రాజాజ్ఞ శిరోధార్యము గావున నీవును గోకులమున ఆ వార్తనందరికీ తెలిపితివి. ఆ వెనుక అక్రూరుడు చెప్పగా అన్న బలరాముని కూడి ఎన్నియో ముచ్చట్లును వింటివి. ఓ గురువాయూరప్పా! నన్నుకూడా కటాక్షించి నేను తెలిపే విష్ణుగాధనాలకింపుము తండ్రీ!

36/12

సీ॥ అక్రూరుతో నీవు ఆ రాత్రి ముచ్చట్లు
నాడుతు అవ్విధి గడిపినావు,
గోకులంబుననున్న గోపికలందరు
తలచిరి అన్యధా తలొక రీతి,
'చంద్రభాగ'నియెడి చానతో నున్నావొ!!
'చంద్ర'తో నున్నావొ సంబరముగ!!
'మిత్రవింద' తొ రేయి మెలకువ నున్నావొ!!
రాధతో కులికావొ రాత్రినంత!!



తే॥ **"ధూర్తుడింత జాగాయెను" దూరిరంత
భక్తులేమన్ననూ నీకు బాధలేదు
నాదు వ్యాధిని తొలగించి నయము నిమ్ము
వినుము గురువాయు పురవిభో! విష్ణుగాధ.**

తా॥ ఓ ప్రభూ! నీవు అక్రూరునితో రాత్రి అంతయు ముచ్చట్లతో కాలము గడుపుచుండగా అక్కడ గోపికలంతా గోకులంలో తలా ఒక విధముగా తలపోయసాగిరి. నీవు చంద్రఅను గోపిక ఇంటనున్నావో!! లేక చంద్రభాగ అను దాని ఇంటనున్నావో!! లేక రాధ అనే వయ్యారి ఇంట్లో ఉన్నావో!! మిత్రవిందతో రాత్రంతా మెలకువగా ఉన్నావేమో!! తెలియక గోపికలు ఈ ధూర్తుడు ఎందుకింత ఆలశ్యం చేస్తున్నాడు? అని మితిమీరిన ప్రేమతో నిన్ను నిందించసాగిరి. ఈ విధంగా రకరకములైన భక్తులను రకరకములుగా అనుగ్రహించు గురువాయూరప్పా! నావ్యాధిని తొలగించి నన్ను రక్షింపుము. ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!

# 37. మధురానగరయాత్ర

**చం॥**

**విని మధురాపురంబునకు వెన్నుడు పోవుచునున్నవార్త గో**
**వనితలు అంతులేనిదగు బాధను జెందిరి యొక్కచోట జ**
**వ్వనులును జేరి 'ఎట్లు ఇది ప్రాప్తితె' నంచని గుండె బ్రద్దలై**
**మనసుల బాధ చెప్పుకొని బావురు మంచని ఏడ్చిరందరున్**
**విను గురువాయుపట్టణపు విష్ణుని గాథను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! నీవు మధురానగరమునకు వెళ్ళుచున్న వార్తను, విని గోపికలు చాల బాధపడిరి. వారంతా ఒకచోట గుమిగూడి "ఇది ఎట్లు జరిగింది?" అని ఒకరితో ఒకరు తమ మనసులలోని వేదన నంతయు చెప్పుకొని బావురుమని రోదించిరి. ఓ గురువాయూరప్పా! కమనీయమైన ఈ విష్ణుగాథనాలకింపుము తండ్రీ!



37/2

**ఉ॥**

**వెన్నుడు దక్క దిక్కెవరు? వేదనజెందెడి మమ్ము ప్రేమగా**
**మన్నన జూపు కృష్ణునిటు మమ్ములకాదని రాజధానికిన్**
**తన్నటుగాందినీసుతుడు తాకొనిపోయెను అయ్యయో! సఖీ!**
**ఎన్నడు జూడమీ దురిత మెందుకు ఈ బ్రతుకేడ్చిరెల్లరున్**
**సన్నుతి కొల్తునయ్య మనసా గురువాయుపురాధినాయకా!**

తా॥ ఓగురువాయూరప్పా! ఆ గోపబాలికలు ఈ విధముగా దుఃఖించసాగిరి. "కృష్ణుడు తప్ప మనకు దిక్కెవ్వరు? ఇతని కోసం దుఃఖించెడి మమ్ము ఎంతో ప్రేమతో మన్నించే వానిని మమ్ము కాదని మధురానగరమునకు ఈ అక్రూరుడు ఎట్లు గొని పోవును? అయ్యయ్యో! ఓ చెలియా! ఈ అన్యాయం ఎక్కడా చూడమే!! ఇక ఈ బ్రతుకెందుకు?" అటువంటి నిన్ను ప్రార్థించుచు మనసారా ఈ కథనాలకింపమని అభ్యర్థించుచున్నాను.



37/3

**తే॥ రేయి తుది జామునందున బోయినావు**
**స్వామి! అన్నతో తండ్రితో సఖులతోటి**
**కలిసి మధురాపురిని జేర, కాని నీకు**
**గోపికల బాధ తెలియును గోపికలకు**
**బాధ ఉపశమింపగ జేయ పంపినావు**
**నీదు మిత్రుని తెలుపంగ నీ హృదయము**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! రాత్రి చిట్టచివరి జామునందు నీవు నీ అన్న బలరామునితోను, తండ్రి మరియు స్నేహితులతో కలిసి మధురానగరమునకు బయలుదేరినావు. కాని నీకు నీ సఖియలైన గోపికల వేదన తెలియును. కావున వారి ఆవేదన ఉపశమింప జేయుటకు నీ మిత్రుని ఒకనిని నీ హృదయమును గోపికలకు తెలుపుటకు వారి వద్దకు పంపితివి.



నారాయణభట్టతిరి భాగవతమును నేను తెలుగు పద్యరూపంలో చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథ నాలకింపుము తండ్రీ!

37/4

**కం॥ "త్వరలో మీ జత గూడెద**
**మురిపించెద సుఖజలధిని ఓర్చుడు" అని నీ**
**సరియగు మిత్రుడు దెలిపెను**
**గురు అనిలుని పురపునాథ! గోపెమ్మలతో**

తా॥ "గోపకాంతలారా! నేను త్వరలోనే మీ దగ్గరకు వచ్చెదను. మీకు నాతో సమాగమము తప్పక జరుగును. మిమ్ములను తిరిగి శీఘ్రముగా ఆనందాబ్ధిని ఓలలాడింతును" అని నీ మిత్రుని ద్వారా తెలిపి, గోపెమ్మలను ఓదార్చితివి. ఓ గురువాయూరప్పా! ఈ కథనాలకింపుము తండ్రీ!

37/5

ఆ.వె॥ దుఃఖమాపలేక తోయజాక్షులు ఏడ్చి
కనుమరుగు వరకును దీనలైరి
వారి వీడుకోలు గురువాయుపురవిభో!
అందుకొనుచు బోతివన్నతోటి

తా॥ ఓ గురువాయూరప్పా! నీవు మధురకు బయలు దేరుచున్నప్పుడు గోపికలు దుఃఖము ఆపుకొనలేక బిగ్గరగా రోదించిరి. వారు నిన్ను ప్రార్థించుచు చాలసేపు వరకు నీవు కనుమరుగయ్యేదాక నీవైపే చూచుచుండిరి. నీవు వారి వీడ్కోలు నందుకొనుచు ప్రేమ పూర్వకంగా వారివైపే చూస్తూ రథముపై అన్న బలరామునితో (అక్రూరునితోనూ) బోతివి.

37/6

సీ॥ నీవెంట నందాది నీవారలందరు
వచ్చుచుండిరి తాము బండ్లపైన
గోపీ మనస్సులు కూడ నీవెంబడి
పోవుచుండినవయ్యా అవిరళముగ



బృందావనములోని వృక్షాలు మృగములున్
వెలవెలబోయెనీ వెనుక నిలిచి
బృందావనముదాటి వెళ్ళగా చేరిరి
యమునా తటంబును యదుకులేశ!

తే॥ భక్తులైన నారాయణ భట్టతిరులు
సంస్కృతించ భాగవతపు సారమెల్ల
తెలుగు పద్యంబు జేస్తిని దేవదేవ!
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ఓ ప్రభూ! నీ వెంట నందగోపుడు మొదలైన గోపాలురు చాల బండ్లపై వచ్చుచుండిరి. గోపికల మనస్సులు కూడ నిన్నే అనుసరించుచుండెను. నీవు మధురకు పోవుచుండగా బృందావనములోని మృగములు, ఆ వనమందలి వృక్షములు సైతము ఎంతో వెల వెలబోయినవి. ఈ విధముగా బృందావనమును దాటి వెళ్ళి నీవు యమునా నదీ తీరమును చేరితివి.



నారాయణ భట్టతిరులు సంస్కృతములో సంక్షిప్తముగా భాగవతమును రచించిరి. నా పురాకృత అదృష్టముచే నేను దానిని తెలుగు పద్యములలోనికి అనువదించుచున్నాను. ఓ గురువాయూరప్పా! దీనిని విని నన్ననుగ్రహింపుము తండ్రీ!

37/7

తే॥ సంధ్య వార్చువేళాయెను సలుపగోరి
గాందినీయుడు యమునలో కాలుపెట్టె
కాంచెనా నదీ జలముల కమలనాభ!
నిన్నదే సమయంబున కన్నులార
చూచె రథముపై అన్నతో చోద్యమందె
సర్వవ్యాపివి నీవను సత్యమెరిగి
తానవాక్కయ్యె భక్తిలో తనను మరచె
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ఓ ప్రభూ! ఆ అక్రూరుడు సంధ్యావందనాది కార్యములను ఆచరించుటకై యమునానదిలో మునుగగా అక్కడ నదీ జలములందు నీవు



కనిపించితివి. పిమ్మట అదే సమయమున రథము మీద కూడ నీవు కనిపించితివి. అందువలన అతడు ఆశ్చర్యముచే వివశుడయ్యెను. సర్వవ్యాపివైన నీవు ఈ రెండు చోట్ల కనిపించుటలో ఆశ్చర్యమేమున్నది? అక్రూరుడు భక్తి పారవశ్యంలో తనను తాను మరచిపోయాడు. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!

37/8

కం॥ జలమున మునిగెను భక్తుడు
సలిలంబున శంఖపద్మ చక్రాయుధుడౌ
అలశేషశాయి విష్ణుని
తిలకించెన్ గురుపురాధి దేవా! వినుమా

తా॥ పరమపురుషా! గురువాయూరప్పా! అక్రూరుడు తిరిగి యమునానది యొక్క నీటిలో మునుగగా అతనికి సురసేవితుడైన శ్రీమన్నారాయణుడు, శంఖ చక్ర పద్మధరుడై ఆదిశేషునిపై పవ్వళించి యున్నట్లు నిన్ను చూచెను. ఓ దేవా! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!

37/9

కం॥ పరమానందంబున, ఆ
వరభక్తుడు నిను నుతించి మరిమరి చూడన్
పరికించలేక పోయెను
గురు అనిలపురీశ! నిన్ను కోరి భజించెన్

తా॥ ఓ గురువాయూరప్పా! అప్పుడు ఆ అక్రూరుడు పరమానందమున మునిగి నిన్ను అనేక విధములుగా స్తుతించెను. తరువాత మరల మరల పరికించి చూడగా నీవు కనుపించక పోతివి. పులకించి అతడు తిరిగి నిన్ను కీర్తించెను. (నీ వద్దకు వచ్చెను)

37/10

తే॥ "చల్లగా యమునా నదీ జలములుండె
నేమొ అక్రూర! పులకలు ఏల కలిగె?"
అనుచు పలుకరించితివిగా అతని నీవు
హర్షపులకాంకితుండుగా అయిన అతను



మారు మాటాడ లేకుండె మాట వినుచు,
నాదు వ్యాధిని తొలగించి నయము నిమ్ము
భట్టతిరి కృతి వినిపింతు పద్యమందు
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ "యమునానది జలములు చాల చల్లగా నున్నవా? నీ శరీరము పులకరించినది అక్రూరా!" అని నీవు పలుకగా అక్రూరుడు ఆనందాతిశయముతో ఏమియు మాట్లాడలేకపోయెను. అట్టి అక్రూరునితో కలిసి రథముపై చేరిన శ్రీకృష్ణుడైన గురువాయూరప్పా! నా వ్యాధిని నిర్మూలించి నన్ను రక్షింపుము. భట్టతిరి కృతిని తెలుగుపద్యంగా ఆలకింపుము తండ్రీ!



# 38. మధురాపురిలో శ్రీకృష్ణుని లీలా విలాసములు

సీ॥ మధ్యాహ్న వేళకు మధురానగరికిని
చేరుకొంటిరి ప్రభూ! సేమముగనె
నగర శివారున అగుపించె ఉద్యాన
వనము సేదను దీర చనిరి మీరు
భుజియించి పిమ్మట 'పురి' జూచుతలపుతో
మిత్రులతో పాటు వెడలినావు
నీగూర్చి విని జనుల్ నిన్నొక పరిగాంచ
కౌతూహలంబున కదలినారు

తే॥ వారి పుణ్యఫలము నిన్ను పట్టిలాగి
నట్లు మధురానగరి జూడ నరిగినావు
భట్టతిరి కృతి తెలిపెద పద్యమందు
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.



తా॥ ఓ ప్రభూ! నీవు మధ్యాహ్నవేళకు మధురాపురమునకు చేరుకొని ఆ నగరము వెలుపల గల ఒక ఉద్యానవనమున విశ్రాంతి తీసికొంటివి. అక్కడ భోజనము చేసిన పిమ్మట నగరమును చూడవలెనను తలంపుతో నీ స్నేహితులతో గూడి బయలుదేరితివి. ఆ నగరములోని పౌరులు చాలకాలమునుండి నీగురించి వినుచున్నందున వారు నీ దర్శనమునకై కుతూహలపడుచుండిరి. వారు చేసికొన్న పుణ్యఫలములు సంకెలల వలె నిన్ను లాగుచున్నట్లు నీవు మధురాపురి రాజమార్గమున ప్రవేశించితివి. నారాయణభట్టతిరి సంస్కృతములో రచించిన భాగవతమును నేను తెలుగు పద్య కావ్యంగా చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! దీని నాలకించి నన్ననుగ్రహించుము తండ్రీ!

38/2

సీ॥ అరుణిమలొలుకు నీ సురుచిర పదపద్మ
అనురాగబద్ధలా అతివలెల్ల
నీలోత్పలంబులు నీలాల కన్నులు
నీమేని కాంతిలా నీలమాయె
వారి వాంఛలు కూడ హరిచూపులవలెనె
చంచలంబులు ప్రభూ! చపలములును
మేలిమి హారాల మెరయు వక్షః స్థలి
వలె మనోహారిణులా లలనలు
వారి నిర్మలకాంతి దరహాస చందాన
మధురంబు శ్రీకృష్ణ! సుధలు జిమ్ము
నీ శిరోజంబుల నెమలిపింఛమువోలె
వారి కేశములు సుందరములయ్య!

తే॥ మధురలో నిన్ను దర్శించ వచ్చినట్టి
స్త్రీల శోభను వర్ణించి చెప్పలేము
భట్టతిరి కృతి తెలిపెద పద్యమందు
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.



తా॥ ఓ ప్రభూ! నీవు మధురానగరమున సంచరించుచున్నప్పుడు అచటి స్త్రీలు నిన్ను దర్శించుటకై వచ్చిరి. వారి శోభ వర్ణనాతీతముగా నున్నది. ఎఱ్ఱని కాంతులను విరజిమ్ము నీ పాదపద్మములపై ఆ అతివలు ఎనలేని అనురాగమును పొందిరి. నల్ల కలువల వంటి నీ కన్నులకాంతి నీలమేఘము యొక్క కాంతివలె నున్నది. వారి కోరికలు గూడ హరి చూపుల వలె అతి చంచలములై యున్నవి. మనస్సులను హరించునవిలా యుండెను. ఓ శ్రీకృష్ణా! నీ దరహాసము వలె వారియొక్క నిర్మలమైన కాంతి మధురమగు సుధలను విరజిమ్మునట్లుండెను. నీ శిరోజముల నలంకరించిన నెమలి ఫించమువలె వారి కేశములు కూడ చాల అందముగా నున్నవి. ఓ గురువాయూరప్పా! భట్టతిరి భాగవతమును తెలుగు పద్యకావ్యంగా వ్రాస్తున్న నన్ను దయజూచి చరితార్థుని చేసి దీనినాలకింపుము ప్రభూ!



38/3

సీ॥ నీ దయా దృష్టిచే నెలతలు మధురలో
అమిత ముదంబును అందుకొనిరి
తహతహలాడుచు తరుణులు నినుజూచి
పరమ సంతోషంబు బడసినారు
మార్గమధ్యంబున మర్యాదలేనట్టి
కంసుని రజకుని గాంచినావు
చలువ వస్త్రంబులు చాకలి నడుగగా
పోపొండు అని తిట్టె పాపి మిమ్ము

తే॥ వాని శిరసుపై చేతితో బాదినావు
చచ్చి నీవల్ల పొందెను సద్గతులను
భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.



తా॥ ఓ ప్రభూ! నీ కటాక్ష వీక్షణములచే మధురానగరమున స్త్రీలకు అమితానందమును కలిగించితివి. వారు నిన్ను జూచుటకు వివశలై తహతహలాడి పరమానంద భరితలైరి. ఆ యతివలంతా ఆ విధముగా నీ కరుణను బొందిరి. మార్గమందు నీవు ఒక రజకుని గాంచితివి. వాడు కంసుని వస్త్రములను చలువ చేయువాడు. వానిని నీవు ఒక జత వస్త్రముల నడిగితివి. వాడు దురుసుగా పోరాపో! నీకు ఈ బట్టలు కావాలా అని నిందించాడు. అంతట నీవు వానిని నీ చేతితో అతని శిరస్సుపై కొట్టితివి. వెంటనే వాడు నీ చేతిలో మరణించి ముక్తిని పొందెను. ఓ గురువాయూరప్పా! భట్టతిరి భాగవతమును తెలుగు పద్యములో ఆలకింపుము తండ్రీ!

38/4

తే॥ **సద్గుణుండైన ఒక్కడు సాలెవాడు**
**ముదముతో నీకు వలువలు ముట్టజెప్పె**
**పరమపద ప్రాప్తినిచ్చావు వానికీవు**
**జీవి పుణ్యఫలపు తీరు ఎవరికెరుక?**
**పూలమాలలు ఇచ్చిన పుణ్యుడొకడు**
**నిన్ను స్తుతియించి పొందెను నిధులు సిరులు**
**తాను లక్ష్మీపతే! భక్త తత్పరుండు**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ లక్ష్మీపతీ! బుద్ధిమంతుడైన ఒక సాలెవాడు నీకు సంతోషముతో తగిన వస్త్రములను సమర్పించెను. నీవు అతనికి పరమపదమును అనుగ్రహించితివి. జీవుల పుణ్యఫలములెట్లుండునో ఎవరికి తెలియును? ఒక మాలలు అమ్మువాడు భక్తితో నీకు పూమాలలు పుష్పగుచ్ఛములను సమర్పించి నీ కరుణను పొందెను. నిన్ను స్తుతించిన అతనికి నీవు అతని



కోరిక మేరకు సిరిసంపదలను, నీపైన అనన్య భక్తిని ప్రసాదించితివి. ఓ గురువాయూరప్పా! భట్టతిరి కావ్యమును తెలుగు పద్యరూపంలో విని నన్నునుగ్రహింపుము తండ్రీ!

38/5

చం॥
**వనరుహలోచనా పడతి భక్తినొసంగెను 'అంగరాగముల్'**
**గొనకొని, నామధేయమది 'కుబ్జ'ట నీ అనురాగ లబ్ధిచే**
**మనసునొసంగె నీకు నువు భామిని కమృత హస్తమిచ్చి ఆ**
**తనువున వంకరల్ సవరి తన్విని సుందరి జేస్తివో ప్రభూ!**
**విను గురువాయుపట్టణపు విష్ణుని గాథను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! మార్గమధ్యమున తామరలవంటి కన్నులుగల ఒక స్త్రీ నీకు పరమ భక్తితో అంగరాగములను సమర్పించినది. ఆమెపేరు 'కుబ్జ'ట. నీవు ఆ కుబ్జకునీపై గొప్ప అనురాగము కలుగునట్లు చేసితివి. నీవును నీ అమృత హస్తముతో



ఆమెను పట్టుకొని లేవనెత్తి ఆమె శరీరములోని వంకరలన్ని సవరించి ఆ యువతిని అద్భుతమైన సుందరిగా చేశావు. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథనాలకించి నన్ను అనుగ్రహింపుము ప్రభూ!

38/6

ఉ॥
**కొందరు నీకు భక్తిమది గొల్చుచు ఇచ్చిరి పెక్కుకాన్కలన్**
**అందిన భాగ్యమేమొ నువు ఆ చిరుకాన్కలు స్వీకరించుచున్**
**డెందములోన స్థానమిడి దీర్చితి వింకను వారి భాగ్యముల్**
**చెందను నేను అట్టి వరశ్రేష్ఠుల కోవను, రోగపీడితున్**
**ఇందుకె జాలి చూపి విను హేగురువాయుపురాధి నాయకా!**

తా॥ ఓ గురువాయూరప్పా! నీ దివ్య మహిమ తెలిసిన నీ భక్తులు కొందరు మార్గ మధ్యమున తమతమ శక్త్యనుసారము ఎన్నో కానుకలనిచ్చిరి. తాంబూలమో, పండో, పుష్పమో వారి వారి భాగ్యము కొలది వారీయగా అది ఎంత చిరు కానుకైనా వారి భక్తి ననుసరించి నీవు స్వీకరించి వారి జన్మలను



ధన్యము అవునట్లు వారికి నీ మనస్సులో స్థానము కల్పించితివి. నేను అటువంటి అదృష్టవంతుల కోవలో చెందియుండను. అందుకే ఇలా వ్యాధిగ్రస్తుడనై బాధపడుతున్నాను. ఇందుకే నన్ను కనికరించి నేను తెలిపే నీ గాథను ఆలకించుము తండ్రీ!

38/7

సీ॥ **నిన్ను ఆహ్వానించు నెలత "కుబ్జ"కు "సఖీ!**
**మరియొకపరి నేను వత్తు" ననగ**
**నీ నిరీక్షణలోన తాను వేచెను;నీవు**
**నగర ద్వారముకేసి సాగినావు**
**ఆ పురివాసులు అమిత ముదంబున**
**కోలాహలము సల్పికొలిచినారు**
**జనని దేవకి యొక్క స్తన్యముప్పొంగిన**
**విధిని నీకీర్తియు వెల్లివిరిసె**

తే॥ భక్తుడైన నారాయణ భట్టతిరులు
సంస్కృతించె భాగవతపు సారమెల్ల
తెలుగు పద్యంబుజేస్తిని దేవదేవ!
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ఓ దేవదేవా! తన ఇంటికి రమ్మని కోరిన కుబ్జతో “నేను నీవద్దకు ఒకనాడు తప్పక వచ్చెదను” అని నీవు ఆమెను అనునయించితివి. పిదప ఆమె నీకొరకు ఎంతో నిరీక్షించుచుండగా వెడలిపోతివి. క్రమముగా నీవు నగరద్వారమును దాటిలోనికి చేరితివి. నీరాకకై ఎదురు చూచుచున్నవారి ఆనంద కోలాహలములు ఆ నగరమును ప్రతిధ్వనింపచేసెను. నీ నగర ప్రవేశమునకు ముందే నీ రాకకై సంతోషముతో పులకిత గాత్రయై యున్న నీ మాతృమూర్తి దేవకీ దేవి యందు స్తన్యము పొంగారినట్లు నీ కీర్తి నగరమంతయు వ్యాపించినది. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి



సంస్కృతములో రచించిన భాగవతమును నేను తెలుగు పద్య కావ్యంగా జేయుచున్నాను. దీనిని విని నన్ను చరితార్థుని జేయుము తండ్రీ!

38/8

తే॥ లావు కోలాహలముతోటి రాచనగరు
జేర రాజభటులు నీ శరీర శోభ
తేజమును జూచి స్తబ్ధులై దేవదేవ!
నిన్ ధనుశ్శాల బోకుండ నిలుపరైరి
జేరి పుష్పార్చితౌ వింటినారి దొడిగి
లాగినావయ్య! గట్టిగా సాగ ధనుసు
ఫెళ్ళుమని పెద్ద ధ్వనితోటి విరిగిపోయె
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ఓ దేవదేవా! మహాకోలాహలముతో నున్న మధురానగర మందలి రాచనగరును నీవు ప్రవేశించితివి. అచ్చటనున్న రాజభటులు నీ శరీర



సౌందర్యమును నీ తేజస్సును జూచి ఆశ్చర్యపడి త్రోవ నొసగుచుండిరి. ఇట్లు నీవు ధనుశ్శాలను జేరి పుష్పములచే అర్చింపబడియున్న ధనుస్సును పట్టుకొనదలచితివి. పిదప భటులు నిన్ను వారించుచున్నంతలోనే నీవు దానిని గైకొని అల్లెత్రాటిని గట్టిగా లాగితివి. ఆ ధనుస్సు ఫెళ్ళుమని పెద్ద ధ్వనితో విరిగిపోయినది. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథనాలకింపుము తండ్రీ!

38/9

సీ॥ ధనువు విరుగుటచే ధ్వనికల్గె కంసుని
వధకుతూర్యధ్వని పలికినట్లు
సురులెల్ల పులకించి జొక్కిరి ముదమున
కంసుని వెన్నులో కలిగె వణుకు
రక్షక భటులు నిన్ శిక్షింపజూడగా
విరిగిన వింటిచే తరిమినావు
వారి ఆక్రందనల్ పెరిగెను, కంసుని
వణుకు రెట్టింపయ్యె భయము చేత



తే॥ దుష్ట శిక్షణ మొదలయ్యె తోయజాక్ష!
కష్టములు దీరు సుఖియించ శిష్టులెల్ల
భట్టతిరికృతి తెలుగులో పద్యమాయె
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ఓ పద్మనయనా! నీవు చేసిన ఆ ధనుర్భంగము వలన కలిగిన గొప్ప ధ్వని మరునాడు జరుగబోవు కంస వధ అను మహోత్సవమునకు ‘నాందీ’ సూచకముగా చేయు ‘ఢంకా’ ధ్వనిలా ఉన్నది. అందువలన దేవతలు హర్షముతో పులకించిరి. దానిచే కంసుని వెన్నులో వణుకు పుట్టెను. ఇంతలో రక్షక భటులు నిన్ను అడ్డుకొనిరి. విరిగిపోయిన ఆ ధనుస్సు రెండు ఖండములతో వారిని చావబాదితివి. ఆ రక్షక భటుల హాహాకారములు మిన్నుముట్టినవి. వాటిచే కంసునియొక్క చావు భయమురెట్టింపు అయ్యెను. ఇకపై దుష్టశిక్షణ జరిగి శిష్ట రక్షణ ఆరంభమగును. ఓ గురువాయూరప్పా! భట్టతిరి కృతిని తెలుగు పద్యరూపంలో విని నన్నునుగ్రహింపుము తండ్రీ!

38/10

సీ॥ అందుచే సజ్జనుల్ అతిప్రేమ నినుజూడ
వీక్షించిరి రిపులు భీతిచేత
పడమటి సంధ్యాయె, బసచేరితివి నీవు
మధుర శోభలు గాంచి మధు విరోధి
శ్రీదామునిన్ గూడి చెప్పినీ విరహంబు
"రాధ"కై తపియించి రగిలినావు
కృష్ణావతారపు క్రీడయే దుష్టుల
నిగ్రహించుట కదా!! నిగమవినుత!

తే॥ నిగ్రహించుచు అందుకే నిదురబోయి
నావు, రక్షించి తగ్గించు నాదు వ్యాధి
భట్టతిరి కృతి తెలిపెద పద్యమందు
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాధ.



తా॥ వేదములచే కీర్తింపబడెడి ఓ మధుసూదనా! అందుచేత సజ్జనులు నిన్ను ప్రేమతో జూడగా దుర్జనులు భయముతో వీక్షించిరి. సాయంత్రముదాక మధురానగరమంతా తిరిగి ఆ నగర శోభలు తిలకించి చివరికి మీ బసయైన నగరోద్యానవనమును చేరితివి. అచ్చట నీ ప్రియమిత్రుడైన శ్రీదామునితో రాధ విరహములో నీవనుభవించుచున్న బాధను తెలియజేసితివి. నీ ఆ కృష్ణావతార పరమార్థమే దుష్ట శిక్షణ కదా! అందుచే జరుగబోవు కంసవధను తలచి నిన్ను నీవు నిగ్రహించుకొని నిదురించితివి. అట్టి ఓ గురువాయూరప్పా! నన్ను కనికరించి నా వ్యాధిని నిర్మూలింపుము. నారాయణ భట్టతిరి కావ్యమైన భాగవతమును నేను తెలుగు పద్యములుగా చెబుతున్నాను. నీవాలకించి నన్ననుగ్రహింపుము తండ్రీ!



## 39. కంసవధ

సీ॥ మరునాడు ప్రొద్దున మల్లయుద్ధంబని
మ్రోగు నగారాల మ్రోత తెలిపె
రాజులు మంచెల పైజేర, నందుడు
భవనంబు ఒకదానిపైకి నెక్కె
ఎత్తైన పీఠంబునెక్కెను కంసుండు
దిక్కు, భయముచేత తెలియకుండె
బలరాముడున్ నీవు బాలురతో కూడి
చేరుకొంటిరి రంగద్వారమందు

తే॥ 'కువలయాపీడ' మనుపేరు గొనిన యట్టి
మదకరీంద్రంబు అడ్డమై ఎదుట నిలిచె
భట్టతిరి కృతి తెలుగులో పద్యమందు
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాధ.



తా॥ ఓ ప్రభూ! కంసుని ఆజ్ఞ మేరకు మరునాడు ప్రాతః కాలమున మల్లయుద్ధ ప్రారంభసూచకముగా 'నగారా' మ్రోగుచుండెను. రాజులందరును మంచెలపైనెక్కి కూర్చుని యుండిరి. నందుడు ఒక భవనముపైకెక్కి కూర్చుని యుండెను. కంసుడు ఎత్తైన పీఠమునెక్కి ఆసీనుడై యుండెను. అప్పుడు నీవూ బలరాముడు అలంకృతులై తోడి గోపబాలురతో గూడి రంగద్వారమునకు చేరుకొంటిరి. అక్కడ 'కువలయా పీడము' అను ఒక మదగజము మీకు అడ్డముగా నిలిచియుండెను. నారాయణభట్టతిరి భాగవతమును నేను తెలుగు పద్యములలో చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! దీని నాలకింపుము తండ్రీ!

39/2

ఉ॥

**మావటి వానితోటి నువు 'ప్రక్కకు తోలుము పాపి! ఆ కరిన్**
**ఈవెటువంటి ధూర్తుడవు ఎందుకు చూడ" వనంచు తిట్టగా**
**మావటి ఏన్గు నీ పయికి పంపెను నీవును ఒక్క దెబ్బతో**
**చేవను జూపి కూల్చితివి, 'చిందును' వేయుచు 'దాని కాయుచున్'**
**ఈవును కాళ్ళదూరితివి, హేగురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ గురువాయూరప్పా! నీవు మావటి వానితో "ఓరి పాపిష్టివాడా! నీవు ఎంత ధూర్తుడవు? వెంటనే ఏనుగును ప్రక్కకు తోలుము. ఎందుకు చూసుకోవు?" అని నిందించితివి. ఆ మావటివాడు దానికి కోపముతో నీపైకి పురికొలిపెను. అదివేగముగా వచ్చి నిన్ను పట్టుకొన బోయెను. నీవు విలాసముగా తప్పుకొని దానికుంభస్థలముపై బలంగా ఒక్కదెబ్బ చేతితో చరిచావు తరువాత నీవు దాని కాళ్ళసందున దూరి దాన్ని తప్పించుకొని చిరునవ్వుతో బయటకు వచ్చితివి.



39/3

తే॥ **కరికి చేరువగా యుండి దొరకవాయె**
**మునులకే చిక్కినట్లుండి కానరావు**
**కరిని భూమిపై పడవేసి మరల మరల**
**దమ్ముపోయిన దాని దంతముల పెరికి**
**మూల్గుచుండగ దంతపు మూలలందు**
**మనెడి ముత్యాలు రాధకు పంపినావు**
**నీదు మిత్రునితోడుగా నెనరు జూప**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! నీవు మునీంద్రులకు సైతము అందినట్లే ఉండి అందవు. ఇక ఆ ఏనుగుకు దొరుకుతావా? దాన్ని ముప్పు తిప్పలు పెట్టి నేలపై పడవేసి చాలమారులు దానిని నీరసింపజేసి అది బ్రతికి యుండగానే దాని దంతములను వాటి మూలములనుండి పెరికి వేసినావు. అంతేగాక ఆ దంతముల మూలములందున్న మంచి



ముత్యములను (ముత్యములు అట్లా పెరికితే ఉంటాయని ప్రతీతి) పెరికి నీ మిత్రుని ద్వారా రాధకు బహుమతిగా పంపితివి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!

39/4

సీ॥ **కువలయా పీడమున్ నువు జంపి దంతముల్**
**పెరికి భుజములపై వేసికొనుచు**
**బలరాముతో గూడి మల్లరంగము జేర**
**నీ అందమును జూచి నిఖిలజనులు**
**తండ్రి నందుడు నీదు ధన్యుండు ఒకరనె**
**ధన్య యశోదని తల్లులనిరి**
**గోపికల్ ధన్యలు కోమలాంగులు పల్క,**
**తేల్చి రందరు ఇట్లు దీటుగాను**

తే॥ **"నగరి మథుర వాసులము ఈ జగములందు**
**వినుడు, ధన్యాతి ధన్యుల" మనిరి వారు**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**



తా॥ ఓ ప్రభూ! నీవు కువలయా పీడమును సంహరించి దాని దంతములను భుజములపై పెట్టుకొని బలరామునితో కలిసి మల్లరంగమున ప్రవేశించితివి. అప్పుడు జనులు నీయొక్క సుందరాంగములను జూచి మిక్కిలి సంతోషించిరి. వారిలో కొందరు, నిను కన్నతండ్రి నందుడు ధన్యుడనిరి; మరికొందరు ఆహా! ఈతని తల్లి యశోదా దేవి ఎంతధన్యురాలు ఇటువంటి అందగాని తల్లి అయినది అన్నారు. కొందరు కన్యామణులు ఆహా! ఈ గోపికలెంత ధన్యలు ఈ నల్లనయ్య చెలిమిని సంపాదించిరి అన్నారు. ఇదేదీకాదు మధురాపురి నివాసులమైన మనము నిజముగా ముల్లోకములలోను ధన్యాతి ధన్యులము. అని ఆ నగరవాసులు తేల్చి చెప్పారు. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి భాగవతమును తెలుగు పద్యముగా ఆలకింపుము తండ్రీ!

39/5

**చం॥**

**ఘనుడవు ఆదిదేవుడవు కారణ జన్ముడవైన నీవు మా**
**జనులలో ఒక్కడై మెలగి జ్ఞానము నిస్తివి పుణ్యకోటికిన్**
**మనముల పాపపంకిలము మాపుచు లీలలు జూపినావయా**
**నిను స్మరియించి యెల్లపుడు నిన్ కొనియాడిరి ధన్యులందరున్**
**విను గురువాయుపట్టణపు విష్ణునిగాథను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! నీవు మధురానగరము రాగానే కొందరు నిన్ను సంతోషపరచి నీ కృపను పొందారు. కొందరు నిన్ను కించపరచి శిక్షించబడ్డారు. నీవు పరమాత్మవు, సచ్చిదానందస్వరూపుడవు, ఆది దేవుడవు, కారణ జన్ముడవు. నీవు సామాన్య గొల్లపిల్లవానివలె పెరిగి మాలో ఒకడివై తిరిగి మా మా పూర్వజన్మ సుకృతం కొద్దీ జ్ఞానము, సిరిసంపదలు, ప్రేమ ఇచ్చావు. మా పాప పంకిలం రూపుమాపావు. యశోదలాంటివారు నీవెన్ని లీలలు



చూపినా అల్లరి కృష్ణుడే అనుకున్నారు. అక్రూరుని లాంటివారు సదా నిన్ను స్మరించి ధన్యులయ్యారు. ఓ గురువాయూరప్పా! నాలాంటి అతి సామాన్యుని అనంతమైన నీ కరుణజూపి నాద్వారా నీ గాథను వింటున్నావు. నా జీవితానికింతకన్నా ఏమి కావాలి తండ్రీ!

39/6

**సీ॥ కంసుని ఆనచే ఘనుడు చాణూరుండు**
**నీపైన బడె కదు నేర్పుజూపి**
**ముష్టికుదెదురేగి ముష్టియుద్ధమునందు**
**బలభద్రు పైబడె బలము జూపి**
**ఘోరయుద్ధంబది జరిగెను మీమధ్య**
**మల్లయుద్ధపు పెక్కు ప్రక్రియలతొ**
**చాల విచిత్రంబు చాణూర మల్లుండు**
**సాధించెనానాడు చచ్చికూడ**



**తే॥ బంధనము నీది విడలేదు బడుగు తాను**
**బంధనము లెల్ల వీడుచు బడసె ముక్తి**
**భట్టతిరి కృతి తెలిపెద పద్యమందు**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! కంసునియొక్క ఆజ్ఞననుసరించి వెంటనే మల్ల వీరుడైన చాణూరుడు నీపైనను, ముష్టికుడు నీ అన్న బలరాముని పైనను విఱుచుకొనిపడిరి. అప్పుడు మీ మధ్య అతిభయంకరమైన ముష్టియుద్ధము జరిగినది. క్రిందపడవేయుట, లాగుట మొదలైన మల్లయుద్ధ ప్రక్రియలెన్నియో చేసితిరి. చాల విచిత్రమైన విషయమేమంటే చాణూరమల్లుడు చచ్చికూడ అసాధ్యమైనది సాధించాడు. నీ బంధనం విడిపించుకోలేకపోయాడు. ( నీకుస్తీ పట్టు వదల్చుకోలేకపోయాడు) కాని బంధనాలన్నీ విడిపించుకొన్నాడు.(ముక్తిని సాధించాడు). ఓ గురువాయూరప్పా! భట్టతిరి కృతిని తెలుగు పద్యంగా ఆలకింపుము తండ్రీ!



39/7

**సీ॥ కోమలాంగులు వీరు క్రూరమల్లులు వారు**
**ఇదియేటి యుద్ధంబు? ఇంకమనము**
**చూడజాలము ఇది శుద్ధ అన్యాయంబు**
**అని వెళ్ళసాగిరి జనులు మరలి**
**ఇంతలో చాణూరు నెత్తి నేలకు కొట్టి**
**మృతుని గావించావు అతి సులువుగ**
**పిండి పిండిగకొట్టి పిడికిళ్ళ ముష్టికున్**
**బలరాముడటు జంపె ప్రతిఘటించి**

**తే॥ వారు చచ్చుట జూచిన మల్లులంత**
**పారిపోయిరి మతిబోయి ప్రాణభీతి**
**భట్టతిరి కృతి తెలిపెద పద్యమందు**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! మధురానగర ప్రజలు ఈ విధముగా అనుకొనసాగిరి. "ఈ కుమారులు సుకుమారులు.

ఈ మల్లులు కఠోరులు. పైగా మల్లయుద్ధమున విశారదులు. ఏ విధముగా సరితూగని వీరి మధ్య ఈ పోటీ చాల అన్యాయము దీనిని చూడజాలము" పిమ్మట వారు మరలిపోవుటకు సిద్ధపడు చుండగా చాణూర మల్లుని నీవు అతి సులువుగా లేవనెత్తి గిరగిరా త్రిప్పి నేలకు కొట్టి మృతుని గావించితివి. బలరాముడు ముష్టికుని పిండిపిండి గావించే పిడి గుద్దులతో సంహరించాడు. ఆ మల్లులట్టు మరణించుట జూచి భీతిల్లి తక్కిన మల్లులు పారిపోయారు. ఓ గురువాయూరప్పా! భట్టతిరికృతి భాగవతమును తెలుగు పద్యముగా ఆలకింపుము తండ్రీ!

39/8

**సీ॥ దుర్మతి కంసుండు తూర్యవాద్యంబులన్**
**ఆపించి కోపియై ఆనతిచ్చె**
**వసుదేవు జంపగా, పనిచినిన్ గొనిపోయి**
**"దూరాన" చంపగా తరిమె భటుల**



**కుపితుడవైతివి కూళుని విని నీవు**
**గిరిపైన వాలేటి గరుడుని వలె**
**ఖడ్గంబు బూనిన కంసునిపై దూకి**
**ఒక్కమాటున వాని ఒడిసిపట్టి**

**తే॥ వీలు లేకుండినను వాని నిలువరించి**
**వానిపై దూకినావయ్య వాసుదేవ!**
**భట్టతిరికృతి తెలిపెద పద్యమందు**
**వినుము గురువాయు పురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! కువలయాపీడ వధ, చాణూర ముష్టిక సంహారము జరిగిన తరువాత దుష్టబుద్ధియైన కంసునకు ఏమి చేయవలెనో తోచలేదు. ఆ దురాత్ముడు తూర్యవాద్యములను నివారించి పూజ్యులైన వసుదేవుని, ఉగ్రసేనుని చంపుటకై పూనుకొనెను. అట్లే ఎటు జూచినా కనిపించు నిన్ను దూరముగా తీసికొనిపోయి చంపివేయమని తన



భటులకానతిచ్చెను. అపుడు నీవు కోపించి ఆ దురాత్మునిపైకి పర్వత శిఖరముపై వాలు గరుత్మంతునివలె కంసుని మంచెపై లంఘించి తనచేత కరవాలమును త్రిప్పుచున్న కంసుని దగ్గరకు వెళ్ళి వీలు చూసుకొని వానిపై హఠాత్తుగా లంఘించితివి. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి భాగవతమును తెలుగు పద్యరూపంలో ఆలకింపుము తండ్రీ!

39/9

**సీ॥ కంసుని కీళ్ళను గరపుచు నుగ్గుగా**
**నేలపై వానిని కూలత్రోసి**
**ఆతని మేనిపై అతి వేగముగ దూకి**
**వాని జంపితివయ్య వాసుదేవ!**
**సతతంబు కంసుండు స్మరియించుచున్ నిన్ను**
**గడిపెను కడదాక కడు భయమున**
**కాలనేమియె పుట్టి కంసుడై నీచేత**
**సాయుజ్యమును పొందె చచ్చి అతడు**



**తే॥ సంతసించిరి సురులెల్ల స్వర్గమందు**
**పుష్పవృష్టిని కురిపించి రుర్విపైన**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె**
**వినుము గురువాయు పురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ వాసుదేవా! నీవు కంసుని కీళ్ళను అన్నిటిని నుగ్గునుగ్గు చేసి, అతనిని భూమిపై పడవేసితివి. తరువాత నీవుఅతని శరీరముపై దుమికితివి. అప్పుడు దేవతలు సంతోషముతో పుష్పవర్షమును కురిపించిరి. నేనేమని చెప్పను స్వామీ! ఆ కంసుడు ఎల్లప్పుడు తన ప్రాణభీతిచే నిన్నే స్మరించుచు నీచేత మరణించినందున దుర్లభంబైన సాయుద్యమును పొందెను. ఓదేవా! రాక్షసుడైన కాలనేమి నీచేత సంహరించబడి ఈ జన్మంబున నీమామయై మరల నీచేత హతుడై ముక్తిని పొందెను. ఓ గురువాయూరప్పా! భట్టతిరికృతియైన భాగవతమును పద్యముగా ఆలకింపుము తండ్రీ!

39/10

సీ॥ కంసుని సోదరుల్ కడతేర నీచేత
మధురంత శాంతితో పరిఢవిల్లె
దేవకీవసుదేవులో విభో! ఉప్పొంగి
పోయిరి, యాదవుల్ పొంగిరంత
ఉగ్రసేనుని నీవు యుర్వీపతిని జేసి
రక్షకుడైతివి రాజ్యమునకు
ఉద్ధవుడును నీకు ఉత్తమమిత్రుడై
భక్తితో కొలిచెను మధురలోన

తే॥ నాదు వ్యాధిని తొలగించి నయమునిమ్ము
భక్తుడైన నారాయణ భట్టతిరుల
భాగవతమును జెప్పెద పద్యమందు
వినుము గురువాయుపురనాథ! విష్ణుగాథ.



తా॥ ఓ ప్రభూ! కంసుని ఎనమండుగురు సోదరులు నీచేత మరణించిరి. ఆ విధముగా మధురానగరమున శాంతి నెలకొల్పితివి. తరువాత నీ తల్లిదండ్రులైన దేవకీ వసుదేవుల దగ్గరకుపోయి వారికి నమస్కరించితివి. యాదవులందరికీ సంతోషమును కలిగించితివి. కంసుని తండ్రియైన ఉగ్రసేనుని రాజుగా చేసి నీవు రక్షకునిగా ప్రజలకు సౌఖ్యమును కల్పించితివి. బృహస్పతియొక్క శిష్యుడైన ఉద్ధవుని నీ స్నేహితునిగా స్వీకరించి నీకు పరమభక్తుడైన అతనిని కరుణించితివి. అట్టి నీవు కృపజూపి నా వ్యాధిని నిర్మూలించి నన్నను‌గ్రహింపుము. నారాయణ, భట్టతిరులు రచించిన భాగవతమును నేను తెలుగు పద్య కృతిగా వినిపించుచున్నాను. ఓ గురువాయూరప్పా! దీని నాలకించి నన్ను చరితార్థుని చేయుము తండ్రీ!



## 40. ఉద్ధవుని దౌత్యము

సీ॥ సర్వజ్ఞుడవు కాని సాందీపనికి నీవు
శిష్యుండవైతివి శిక్షకొరకు
అరువది నాలుగు గురుతర విద్యలన్
దిట్టవైనా వన్నిదినములందు
మృతుడైన గురుపుత్రు బ్రతికించినావయ్య
యమలోకమందుండనతని తెచ్చి
పంచజనాసురున్ పరిమార్చి ఆతని
పాంచజన్యంబును బడసినావు

తే॥ దాని పూరించుచున్ నీవు వెను దిరుగుచు
మధుర జేరావు జనులెల్ల పరవశించ
భట్టతిరి కృతి తెలిపెద పద్యమందు
వినుము గురువాయు పురవిభో! విష్ణుగాథ.



తా॥ ఓ ప్రభూ! నీవు సర్వజ్ఞుడవు. కాని, లోక మర్యాదననుసరించి సాందీపని మహర్షికి శిష్యునిగా నీ అన్నతో కలిసి విద్యనభ్యసించుటకు చేరితివి. అచ్చట అరవై నాలుగు కళలను అన్నియేదినములలో నేర్చితివి. విద్యానంతరము గురుదక్షిణగా చనిపోయిన తనపుత్రుని కోరిన గురువు కోరిక మేరకు యమలోకమునుండి యముని నాజ్ఞాపించి గురుపుత్రునికి మరల బ్రతుకు నిప్పించితివి. పంచజనుడను రాక్షసుడు మదించి యుండగా వానిని సంహరించి అతనివద్దనున్న పాంచజన్యము అను శంఖమును గైకొంటివి. దానిని పూరించుచు మధురానగరము తిరిగి చేరుకొంటివి. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి భాగవతమును తెలుగు పద్యకృతిగా విని నన్ను అనుగ్రహింపుము తండ్రీ!

40/2

**చ॥**

**నిను స్మరియించుచున్ తనరు నిత్యము గోపికలెల్ల ప్రేమలో**
**మనముల వేదనన్ వివశమానినులైరి దయామయుండవై**
**గొనకొని ఉద్ధవున్ వెదలి గోపికలందరి ప్రేమ తత్త్వమున్**
**అనుపమ భక్తి భావనల ఆర్ద్రత నేర్వగ పంపినావయా**
**వినుగురువాయుపట్టణపు విష్ణుని గాథను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! గోకులమునందు గోపికలు నిత్యమూ నిన్ను స్మరింపుచు ప్రేమ భావముచే మనస్సులు కలత చెంది వివశులైన అంగనలైరి. నీవు దయాసాగరుడవైనందున నీ ప్రియమిత్రుడైన ఉద్ధవుని గోకులమునకు పోయి సమస్తలోకములందునను కనిపించనిదైన గోపికల యొక్క ప్రేమ తత్త్వమును వారి అనన్యభక్తి భావనలయొక్క ఆర్ద్రతను తెలుసుకొనమని పురమాయించి పంపితివి. ఓ గురువాయూరప్పా ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!



40/3

**తే॥ సంధ్యవేళకు రేపల్లె చనెను అతడు**
**అచట నందయశోదల నరసి నీదు**
**విషయముల చెవికింపుగా వెల్లడించె**
**లలనలున్ వేకువనె వాని రథము గాంచి**
**మరల అక్రూరుడొచ్చెనో!! భయమునంది**
**సత్యమెరుగుచు ఉద్ధవున్ జతకలిసిరి**
**భట్టతిరి కృతి తెలిపెద పద్యగతిని**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాధ.**

తా॥ ఓ గురువాయూరప్పా! ఉద్ధవుడు సాయంకాలము వరకు పయనించి నీ మహిమను తెలుపుచున్న గోకులమునకు చేరెను. అచ్చట యశోదను నందుని కలిసి నీ సమాచారమును తెలుపుచు వారికి ఆనందమును కలిగించెను. ప్రాతఃకాలమున గోపాంగనలు ఉద్ధవుని రథమును జూచి మరల అక్రూరుడు వచ్చెనేమోనని శంకించి భయపడిరి. కాని నిజముగా నీ అనుచరుడు వచ్చెనని తెలుసుకొని ఆనంద పరవశులైరి. తరువాత అతని వద్దకు వచ్చిరి. భట్టతిరి భాగవతమును తెనిగించుచున్నాను. దివ్యమైన ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!



40/4

**ఉ॥**

**నీవలె వేషమున్ నగలు నీరజనాభ! ధరించె ఉద్ధవుం**
**డావనితల్ ప్రియంబలర ఆర్తిని జూపుచు నీదులీలల్న**
**భావనలన్ స్మరింపుచును మాటలు సైతము రాకయుండనీ**
**సేవకుదూరటన్ గొలుప చెప్పిరి గద్గద నిస్వనంబులన్**
**ఆవలవారి వేదనల నన్నిటినోగురువాయునాయకా!**

తా॥ ఓ పద్మనాభా! ఉద్ధవుడు నీవలెనే వేషమును భూషణములను ధరించియుండెను. అతనిని జూచినీవు గోకులమున చేసిన నీ లీలలను వారు ఆలోచనలలో స్మరించుచు ప్రేమగా ఆర్తిని జూపుచు ఎంతో సేపటిదాకా మాట్లాడలేకపోయిరి. ఐనను ఉద్ధవుడు మంచితనముతో వారిని సముదాయించగా ఊరడిల్లి స్వపరభేదం మరచి ఆపైన తమ ఆవేదనలన్నింటిని గద్గద స్వరంతో తెలుపుకొనిరి. ఓ గురువాయూరప్పా! వాటి నాలకింపుము ప్రభూ!



40/5

**సీ॥ తన తల్లిదండ్రుల ఆనంద పరచంగ**
**శ్రీకృష్ణుదంపెనా? చెప్పవయ్య!**
**మధురానగరిలోన మదవతులందరిన్**
**సుఖపెట్టుచుండెనా? సొక్కుదీర**
**హా! నాథ! శ్రీకృష్ణ! ఆదుకో మమ్మింక**
**ప్రియతమా! సైప మీ విరహబాధ**
**అమృతంబు వంటి నీ ఆలింగనము నిమ్ము**
**చుంబింపు మొకసారి చోరశ్రేష్ఠ!**

**తే॥ కపట మొలుకు నీ మాటలు ఎపుడు గాని**
**మరువజాలము ఓ ప్రియా! కరుణగొనుము**
**భట్టతిరికృతి తెలుగులో పద్యమాయె**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాధ.**

తా॥ ఓ మహాశయా ఉద్ధవా! నిర్దయుడైన శ్రీకృష్ణుడు తన తల్లిదండ్రులైన యశోదా నందులను సంతోషపెట్టుటకు నిన్ను ఇచటకు పంపించెనా

చెప్పవయ్యా! మధురానగరములోని మదవతులకు సుఖమునిచ్చుచున్నాడా? హా! నాధా! శ్రీకృష్ణా! నీవు ఎట్లైనను మమ్ము రక్షింపుము. ప్రియతమా! అమృతమువంటి నీయొక్క ఆలింగనమును ముద్దులను ప్రసాదింపుము. ఓ మాయలమారి దొంగా! నీకొంటె చేష్టలను చిలిపి మాటలను మరువజాలకున్నాము. ఓ ప్రియా! మాపై దయజూపుము" ఈ విధముగా ఆక్రోసించు ఆ గోపీవల్లభా! గురువాయూరప్పా! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!

40/6

సీ॥ **త్రిభువన మన్మధా! శుభకరా! శ్రీకృష్ణ!**
**కరుణా సముద్రుడా! పరమపురుష!**
**రాసలీలప్పుడు రమ్యమౌ కదలిక**
**లెల్ల నీ రూపునకిచ్చె సొంపు**
**చూడముచ్చట గొల్పె విడిన కేశపు శిఖ**
**మెరిసెడి ముత్యాలు కురిసె చెమట**



**అపుడు నీ అందాలు అత్యద్భుతము ప్రియా!**
**అక్కున జేర్చుము ఒక్కసారి**

తే॥ **ప్రేమ పరవశలై వారు వెక్కి ఏడ్చి**
**నిన్ను స్మరియించిరా గోపకన్నెలంత**
**భట్టతిరి కృతి తెలిపెద పద్యమందు**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాధ.**

తా॥ "ఓ త్రిభువన మన్మధా! శుభకరా! శ్రీకృష్ణా! కరుణాసాగరా! పరమపురుషా! రాసలీలా సమయమున చక్కని కదలికలతో నీ స్వరూపము మధురముగా నుండెను. చెదరిన నీ కేశపాశములు చూడముచ్చట గొలుపుచుండెను. నీ తనువుపై ఏర్పడిన స్వేదబిందువులు ఆణిముత్యముల వలె మెఱయుచుండెను. అప్పటి నీ అందచందములు అత్యద్భుతములు. అట్టి నీ సుందర శరీరమును ఒక్క మాఱు అక్కున చేర్చుకొననిమ్ము" ఈ విధముగా



ప్రేమ పరవశలైన గోపికలు నీ కొఱకు విలపించుచు నిన్ను స్మరించిరి. ఓ గురువాయూరప్పా! భట్టతిరి కృతిని తెలుగు పద్యరూపంలో ఆలకించి నన్నునుగ్రహింపుము తండ్రీ!

40/7

చం॥

**వనితలు తప్పుచున్ వశము బాధను తెల్పగ ఉద్ధవుండు ఆ**
**వనితలకెల్ల తత్త్వమును బాగుగ బోధనజేసి నీ మతిన్**
**వినిచి, యధాస్థితిన్ నిలిపె;వేదన తీరిన గోపభామినుల్**
**నిను స్మరియించుచున్ బడయ నెమ్మది ఉద్ధవుడుండె స్వస్థతన్**
**వినుగురువాయుపట్టణపు విష్ణునిగాధను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! ఈ విధముగా వివశలై యున్న గోపికలను ఉద్ధవుడు తత్త్వ జ్ఞానముతో నీ సందేశమును వినిపించుచు వారిని యధాస్థితికి తెచ్చి నిలబెట్టెను. అట్లే నిన్ను ఎల్లప్పుడు తలచుకొనుచు తన్మయులై యున్న గోపికలతో నీకు సంబంధించిన సరసమైన వృత్తాంతముల నెరింగించుచు ఉద్ధవుడు హాయిగా



కొన్ని దినములచ్చటనే యుండెను. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!

40/8

సీ॥ **నిరతంబు పనులలో నీ లీలల స్మరించి**
**పాడుచుండిరి గోపభామలెల్ల**
**మాటలాడెడి వేళ మరిమరీ నీగూర్చి**
**ముచ్చటించిరి గోపముదితలెల్ల**
**స్వప్నంబులోనైన పలవరించుచు నీదు**
**చేష్టలన్ తలచిరా చెలియలెల్ల**
**గోకులంబంతయు నీ కథలతొ నిండి**
**పోయెను పులకించ పొలతులెల్ల**

తే॥ **ఉద్ధవుడు కృష్ణభక్తిలో ఉండిపోయె**
**అక్కజముతోటి నిండెను అతని మనసు**
**భట్టతిరికృతి తెలిపెద పద్యమందు**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాధ.**

తా॥ ఓ ప్రభూ! గోకులమందున్న స్త్రీలు తమ ఇంటి పనులు చేసికొనుచు నిరంతరము నీ లీలలనే గానము చేయుచుండిరి. ఒకరితో ఒకరు మాటలాడుకొనునప్పుడు నీ విషయములనే ప్రస్తావించుకొనుచుండిరి. స్వప్నములలో కూడ నీ సంగతులనే కలవరించు చుండిరి. వారి చేష్టలన్నియు దాదాపు నీ లీలలతోనే నిండిపోయెడివి. ఈ విధముగా గోకులమందు సమస్తము శ్రీకష్ణమయముగుట గమనించి ఉద్ధవుడు ఆశ్చర్యపరవశుడైపోయెను, అతని మనసు నీ భక్తితో నిండిపోయెను. ఓ గురువాయూరప్పా! భట్టతిరి కృతిని తెలుగు పద్యగాధగా విని నన్ను చరితార్థుని చేయుము తండ్రీ!



40/9

ఉ॥

**రాధకు ఇష్టమియ్యదియె రాధ ఇదే విధి మాటలాడునా**
**రాధను బోలి నీవును పరాకును మౌనము దాల్తువేల? ఈ**
**మాధవుచిత్తమీవెరిగి మాటలు మానకు ఉద్ధవా! సఖా!**
**బాధను చెప్పె కృష్ణుడిటుభామరో! పొందుము స్వాంతనంబు, ఓ**
**మాధవ! నాదుబాధ వినుమా గురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ గోపభామవైన రాధాదేవీ! నీగూర్చి శ్రీకృష్ణుడు నాతో ఇట్లనెను. "ఉద్ధవా! నా ప్రియమిత్రమా! ఇది నారాధకు చాల ఇష్టము. నా ప్రియురాలైన రాధ ఈ విధముగా మాట్లాడుతుంది. నా రాధవలె నీవును పరాకుగా మౌనముగా ఉండెదవేల? ఈ కృష్ణుని మనస్సు నీవెరుగవా?" కనుక నువ్వు స్వాంతన మొందుము. ఈ విధముగా కృష్ణుని విరహ బాధను రాధాదేవికి చెప్పి ఆమెను సంతోషపరచెను. ఓ మాధవా! నా ఆవేదనకూడ ఆలకింపరాదా? గురువాయూరప్పా! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!



40/10

తే॥ **నేను త్వరలోనె గోకులమునకు వత్తు,**
**పనుల యొత్తిడివల్ల ఓ భామలార!**
**మీ దరికి నేను రాలేను, విరహమందు**
**స్మరణమెందగు తరుగును బాధకూడ**
**త్వరగ బ్రహ్మానుభవ ప్రాప్తి దక్కుమీకు**
**నా వియోగ సంయోగంబులవు సమముగ"**
**పూని సందేశమును ఉద్ధవుండు జెప్పె**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాధ**

తా॥ ఇది శ్రీకృష్ణుని సందేశము. "నేను త్వరలోనే గోకులమునకు వచ్చెదను. పనుల ఒత్తిడివల్ల ఇప్పుడు రాలేకపోతున్నాను. కాని ఈ వియోగంలోని విరహములో కూడ ఎంతో సుఖం ఉంది సుమా! మనము మన ప్రియులను స్మరించుకొనినప్పుడు బాధ తగ్గిపోతుంది. అతి త్వరలోనే మీకు తప్పక బ్రహ్మానంద ప్రాప్తి కలుగుతుంది. అప్పుడు నా సంయోగ వియోగములు రెండును సమానముగా



నుండును" ఈ విధముగా చెప్పి ఉద్ధవుడు గోపిక బాధనుపశమింప జేసెను. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!

40/11

సీ॥ **గోపాంగనలకున్న గొప్ప భక్తిని భువిన్**
**కనివిని ఎఱుగము కమలనాభ!**
**ఏ శాస్త్ర జ్ఞానంబు ఏతపఃఫలమిచ్చు**
**ఇంతటి లబ్ధిని ఎవరికైన**
**ఎంతగా మ్రొక్కినా ఇంతుల, సరిపోదు**
**యోచించె నా రీతి ఉద్ధవుండు**
**మధుర చేరిన వాని భక్తి విహ్వలతను**
**కని తన్మయుడవైతి వనఘ! నీవు**

తే॥ **నాదు వ్యాధిని అణగించి నయము నిమ్ము**
**భక్తుడైన నారాయణ భట్టతిరుల**
**భాగవతమును చెప్పెద పద్యమందు**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాధ**

తా॥ ఓ కమలనాభా! "గోపికలలో గల భక్తి తత్పరత ప్రపంచమున కనివిని యెఱుగనట్టిది. ఇది శాస్త్ర జ్ఞానమువలన గాని తపఃఫలముగా గాని లభించునది కాదు. పరమ భక్తురాండ్రైన ఈ గోపికలకు ఎంత ప్రణమిల్లి నను తక్కువే అగును" అని ఉద్ధవుడు. మరి మరీ అనుకొనుచు మధురకు చేరుకొనెను. ఆ ఉద్ధవుని భక్తి తత్పరతను జూచి ఓ అనఘా! నీవు కూడ తన్మయుడవైతివి. ఓ గురువాయూరప్పా! నీవు నా వ్యాధిని రూపుమాపి నన్ననుగ్రహింపుము. నారాయణభట్టతిరి సంస్కృతములో రచించిన భాగవతమును నేను తెలుగు పద్య కావ్యంగా చెబుతున్నాను. దీని నాలకించి నన్ను ధన్యుని చేయుము తండ్రీ!



## 41. జరాసంధాదులతో యుద్ధము- ముచికుందుని అనుగ్రహించుట

**తే॥ "వత్తు మీ ఇంటి కొకనాడు" మాటనీయ**
**కుబ్జ వేచి యుండెను నిన్ను కొలిచి మదిని**
**నీదు రాకయే ఉత్సవమదియె భాగ్య**
**మనుచు 'వాసవసజ్జిక' అయ్యెనామె**
**ఎదురు తెన్నులు చూచెను తుదకు నీవు**
**ఉద్ధవుని తోటి బోతివా ఉవిదజూడ**
**భట్టతిరి కృతి తెలిపెద పద్యమందు**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ**

తా॥ ఓ ప్రభూ! "మీ ఇంటికి నేను ఒకనాడు తప్పక వచ్చెదను'' అని కుబ్జకు నీవు మాట ఇచ్చి యున్నందున ఆమె నిన్ను ఆరాధిస్తూ నీ రాక కొరకు అదే ఉత్సవము, అదే గొప్ప భాగ్యమనునట్లు వేచి యుండెను. నీ కొరకు ఆమె నిత్యమూ 'వాసవ సజ్జిక'



(శృంగార నాయిక) వలె అయ్యెడిది. నీకోసం ఎదురు తెన్నులు చూచి నీవే తన సర్వస్వమనుకొన్నది. ఆమె గృహమునకు నీవు, ఉద్ధవునితో గూడి చేరితివి. నారాయణ భట్టతిరి భాగవతమును తెలుగు పద్యంగా చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! దీని నాలకించి నన్ను ధన్యుని చేయుము తండ్రీ!

41/2

**చం॥**
**గొనకొని నీవు బోవగనె కుబ్జ ముదంబున కోర్కె తీరెనం**
**చని నిను స్వాగతించి మనసంతయు సంబరహేల దేలగా**
**ఘనముగ ఆదరించె నిను కల్కికి సంతసమిచ్చినావయా**
**వినుగురువాయుపట్టణపు విష్ణుని గాథను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! నీవు కుబ్జ ఇంటికి పూనుకొని వెళ్ళుట వలన ఆమె యొక్క చిరకాలవాంఛ నెరవేరినది. అందుకని ఆమె నిన్ను చూడగానే తన హృదయం ఆనందముతో ఉప్పొంగినది. సంబరములో హేలగా తేలిపోవుచున్న ఆమె నీకు



ఘనమైన ఆదర సత్కారములనొసంగెను. అట్టి నందరికి నీవును సంతోషమిచ్చితివి. ఓ గురువాయూరప్పా! రమ్యమ్మైన ఈ విష్ణుగాథనాలకింపుము తండ్రీ!

41/3

**ఉ॥**
**ఏ వరమైన కోరుమని ఇంతిని నీవడు గంగ మూర్ఖతన్**
**ఆవిడ కోరె యొక్క పరి అద్భుత సౌఖ్యము సంగమంబునన్**
**పావనమైన 'ముక్తి' నిను భామిని కోరదు కోరుమన్ననున్**
**ఏ విధి నీదు 'మాయ' తరియింపగ సాధ్యము? నందనందనా!**
**మావశమౌనె దేవ! వినుమా గురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ నందనందనా! ఏదైననొక వరము కోరుకొనుమని నీవా కుబ్జను అడిగితివి. అందుకు మూర్ఖురాలైన ఆమె మఱల నీతో ఒకమారు శారీరక సుఖము కావలెనని అర్థించినది. కోరుకోమంటే పుణ్యప్రదమైన సాయుజ్యముక్తిని గాని కనీసం సామీప్యముక్తినైనా పరమాత్మని కోరుకోవచ్చుకదా! నీమాయవల్ల

ఆడించబడే మానవులం ప్రభూ! దానిని దాటుట సాధ్యమా? మావల్ల అయ్యేపనియేనా? దేవా! గురువాయూరప్పా! నన్ననుగ్రహించి ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!

41/4

తే॥ **కుబ్జ కోరిక దీర్చగ కూడి రతిని**
**పుత్రునొక్కని ఇచ్చావు పొలతికీవు**
**అతడె 'ఉపశ్లోకు'డనబడె ఆతడున్ను**
**నారదుని శిష్యుడై నేర్చె నాణ్యమైన**
**విద్య 'సాత్వత తంత్రమ్ము' వినుతికెక్కె**
**గొప్ప విజ్ఞాన ఖనియని చెప్పబడెను**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాధ.**

తా॥ ఓ ప్రభూ! నీవు ఆ కుబ్జకు ఆమె కోరిక తీర్చి భౌతిక సుఖమును ప్రసాదించితివి. ఆ విధముగా నీవామెకు



ఒక పుత్రుని ప్రసాదించితివి. అతనిపేరు ఉపశ్లోకుడు. అతడు నారదమహర్షి శిష్యుడై 'పాంచరాత్ర'మను పేరుగల సాత్వత తంత్రమును పొందెను. అతడు గొప్ప విజ్ఞాన ఖనియై పేరుపొందెను. నారాయణ భట్టతిరి కృతియైన భాగవతమును తెలుగు పద్యముగా చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! దీనినాలకించి నన్ననుగ్రహింపుము తండ్రీ!

41/5

సీ॥ **అన్న, ఉద్ధవులతో అక్రూరువద్దకు**
**పోతివి ఆతండు పులకరించ**
**ఎన్నియో తెరగుల మన్నన నీకిచ్చి**
**నిన్ను స్తుతించెను నీరజాక్ష!**
**అతనిని వీడ్కొని హస్తినకంపావు**
**మరణించుటంజేసి పాండురాజు**
**వనముల బ్రతుకీడ్చి పాండవుల్ హస్తిన**
**కొచ్చుట వింటివి ఉపశమించ**



తే॥ **కుటిల ధృతరాష్ట్ర ప్రేమను గూర్చి వినుచు**
**సర్వ మక్రూరుడున్ చెప్పె సవివరముగ**
**భట్టతిరికృతి తెలిపెద పద్యమందు**
**వినుముగురువాయుపుర విభో! విష్ణుగాధ.**

తా॥ ఓ పద్మాక్షా! ఆ తరువాత నీవు ఉద్ధవునితోను, అన్న బలరామునితోను కలిసి అక్రూరుని యొక్క మందిరమునకు బోతివి. అప్పుడు అక్రూరుడు చాలసంతోషించి అనేక విధములుగా నిన్నుగౌరవించెను. అనేక రీతుల నిన్ను స్తుతించెను. తరువాత నీవు అక్రూరుని వీడ్కొని హస్తినాపురమునకు పంపితివి. పాండురాజు మరణానంతరము వనములలో బ్రతుకు గడిపి తిరిగి వచ్చిన పాండవుల వృత్తాంతము తెలిసికొంటివి. ధృతరాష్ట్రుని కుటిలత్వము సర్వము అక్రూరుడు తెలిసికొని సమాచారమంతయు నీకెరింగించెను. ఓ గురువాయూరప్పా! భట్టతిరి కృతియైన భాగవతమును తెలుగు పద్యములలో విని నన్ననుగ్రహింపుము తండ్రీ!



41/6

సీ॥ **అల్లుడౌ కంసుండు ఆ జరాసంధుని**
**కత్యంత ఆప్తుండు అందుచేత**
**కంసుని చావుకి కసితోటి ఆతండు**
**మధుర ముట్టడి జేసె పగను బూని**
**అతని దిర్వదిమూడు అక్షౌహిణులసేన**
**బలరాముతో గూడి వానిపైన**
**స్వర్గలోకమునుండి వచ్చిన రధముల**
**తోడుగా నీవరి తోటి పోర**

తే॥ **ఆ జరాసంధు సైన్యంబు అంతమయ్యె**
**దిక్కుతోచక తను వెనుదిరిగిపోయె**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యమాయె**
**వినుము గురువాయు పురవిభో! విష్ణుగాధ.**

తా॥ ఓ ప్రభూ! కంసుడు జరాసంధుని యొక్క ప్రియమైన అల్లుడు తన అల్లుని చంపినాడన్న కసితో జరాసంధుడు పగబట్టి ఇరువది మూడు అక్షౌహిణుల సేనతో మధురపై దండెత్తాడు. ఆ నగరాన్ని ముట్టడించాడు. అప్పుడు స్వర్గమునుంచి రధములసేన చేదోడు వాదోడుగా రాగా బలరామునితో గూడి నీవు జరాసంధునితో యుద్ధముచేసి ఆ జరాసంధుని సైన్యమునంతయు తుదముట్టించితివి. నారాయణ భట్టతిరి భాగవతమును నేను తెలుగు పద్యములలో చెబుతున్నాను. ఓగురువాయూరప్పా! ఈ విష్ణుగాధ నాలకించి నన్ను కటాక్షింపుము తండ్రీ!



41/7

**సీ॥ ప్రభు! జరాసంధుని బలముల నిర్జించి**
**బలభద్రుడాతని బట్టి తెచ్చె**
**చేజిక్కు శత్రువున్ త్యజియించితివి నీవు**
**వానిజంపట నీకు పనియెకాదు**
**వానికి తొత్తులౌ వసుధేశులను జంపి**
**భూభారమును బాపపూనినావు**
**దిగ్గజంబులుగల దేశాధినాధులన్**
**ఒకచోట చంపుటే ఉత్తమంబు**

**తే॥ ఆ జరాసంధు మించిన అరి ఎవండు?**
**వానినిర్జించుటొక పని కానెకాదు**
**భట్టతిరి కృతి తెలిపెద పద్యమందు**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాధ.**



తా॥ ఓ ప్రభూ! జరాసంధుడు బలాఢ్యులలోకెల్ల బలాఢ్యుడు. అంతటివానిని బలరాముడు తన సైన్య సహకారముతో బంధించెను. అతడట్లు చేజిక్కినను నీవతనిని సంహరింపక విడిచిపుచ్చితివి. అతడు మరల అనేకమంది దుష్టరాజన్యులతో కలిసి నీపై దండెత్తుననియు ఆ విధముగా మరింత మంది సంహరింపబడి భూభారము తగ్గునని నీపథకము అయి ఉంటుంది. వాస్తవముగా ఆ కాలములో మదించిన దిగ్గజములను పొందిన అనేకమంది రాజులను సామ, దాన, భేద, దండోపాయములతో జరాసంధుడు తన చెప్పుచేతలలో ఉంచుకొనెను. వారందరినీ ఒక్కొక్కరిపై దండెత్తి సంహరించుటకంటె ఇట్లు జరాసంధునిద్వారా రప్పించి మూకుమ్మడిగా చంపుటయే నీ లక్ష్యము. నిజమునకు జరాసంధుని మించిన బలశాలి ఎవ్వడు? వాడు నీచేజిక్కిన నీకు చంపుటెంతపని? ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి భాగవతమును తెలుగు పద్యంగా చెప్పే మహద్భాగ్యాన్నిస్తున్న నీకు నా పాదాభివందనములు తండ్రీ!



41/8

**తే॥ తోటి రాజుల ప్రేరణన్ తోయజాక్ష!**
**తాన్ జరాసంధుడవ్విధి దండయాత్ర**
**పదియు నేడు మారులు జేసె వదలకుండ**
**మూడు వందల తొంబది కూడ నొకటి**
**అన్ని అక్షౌహిణుల సేన అంతమయ్యె**
**వినుము గురువాయు పురవిభో! విష్ణుగాధ.**

తా॥ ఓ ప్రభూ! జరాసంధుడు ఒకసారి ఓడిపోయినప్పటికీ తోటిరాజుల ప్రేరణతో నీతో యుద్ధము చేయదలచి తరువాత పదునారు పర్యాయములు నీతో యుద్ధమునకు దిగెను. విష్ణుదేవుడవైన ఓ గురువాయూరప్పా! ఈ పదునేడు మార్లు యుద్ధములలో నీవు ఆజరాసంధునియొక్క మూడు వందల తొంబదియొక్కటి (391) అక్షౌహిణుల సైన్యమును పూర్తిగా నాశనమొనర్చితివి. ఈ కథనాలకింపుము తండ్రీ!

41/9

చం॥

**మరియొక యుద్ధయత్నమును మానక దుష్టుడు చేయుమాటనీ**
**వెరుగుటెగాక ఆ యవన ఏలిక నీపయి ఎత్తివచ్చుటన్**
**సరియగు వార్త నీవు విని సాగరద్వీపము విశ్వకర్మచే**
**నెరపుచు యోగబల్మి అట నీ ప్రజలందరి నిల్పినావయా**
**గురు అనిలాలయేశ! వినగోరెద నీకథహే జగద్విభో!**

తా॥ ఓ జగద్విభో! మఱల పదునెనిమిదవ పర్యాయము జరాసంధుడు నీతో యుద్ధము చేయుటకు సిద్ధపడుచుండెను. అదే గాక ఆ సమయమున యవనరాజైన కాలయవనుడు నీపై దండెత్తబోతున్నాడను వార్తను కూడ నీవు వింటివి. అప్పుడు దేవశిల్పియైన విశ్వకర్మను రావించి సాగరమునందు ద్వారకాపురిని ద్వీపముగా నిర్మింపజేసితివి. పిదప మధురానగరములోని ప్రజలనందరిని నీయోగబలముచేత ద్వారకకు



చేర్చితివి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథ నాలకింపుము తండ్రీ!

41/10

సీ॥ **పద్మమాలను దాల్చు వనమాలి! నీవు ఆ**
**యవనరాజునకు భయము నటించి**
**నీవల్ల ఆతని చావులేనందున**
**పారిపోయిన రీతి పరుగు తీయ,**
**వచ్చెను వెన్నంటి పర్వత గుహలోకి**
**నిద్రించు ముచికుందు నీవనుకొని**
**కాలితో తన్నెను కాలయవనుడంత**
**కాలి భస్మంబాయె కనులు తెరున**

తే॥ **తమరి భక్తుడౌ వాన్కి నీదర్శనంబు**
**నొసగి గుహలోనె బ్రోచావు ఓ మహాత్మ!**
**భట్టతిరి కృతి తెలిపెద పద్యమందు**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**



తా॥ ఓ వనమాలీ! పద్మమాలను ధరించు నీవు యవనరాజునకు భయపడ్డట్లుగా నటించుచు, నడుచుచు పట్టణమునుండి బయటకు వచ్చి తరువాత పరుగెత్త సాగితివి. నీ చేతిలో వానికి మృత్యువు లేనందున నీవెంట బడ్డ వానిని ఒక పర్వత గుహలోనికి తరుమునట్లు చేసితివి. అప్పుడు కాలయవనుడు ఆ గుహలో నిద్రించుచున్న ముచికుందుని జూచెను. అతడే నీవని భ్రమించి కాలయవనుడు ముచికుందుని తన కాలితో తన్నెను. అతడు కనులు తెరచి కాలయముని చూడగనే వాడు భస్మమై పోయెను. తరువాత నీ భక్తుడైన ఆ ముచికుంద మహారాజునకు నీవు నీ దివ్య మంగళరూపమును చూపి ఆ గుహలోనే దర్శనమొసగితివి. ఓ గురువాయూరప్పా! భట్టతిరి భాగవతమును తెనిగించుచున్న నన్నునుగ్రహింపుము తండ్రీ!



41/11

సీ॥ **"ఇక్ష్వాకు వంశపు ఏలికనో ప్రభూ!**
**క్షుద్రభోగములపై కోర్కెలేదు**
**నీ అనుగ్రహమును నే కోరెదను" అని**
**స్తుతియించె భక్తితో అతడు నిన్ను**
**భక్తినిచ్చెద అది ముక్తికంటెను మేలు**
**దొరకును ముక్తియు తుదకు నీకు**
**హింసాదురంతముల్ ఇక దూరమౌనని**
**తపము చేయమనంచు దారి చెప్పి**

తే॥ **లోక సంగ్రహణార్థమాలోచనొకటి**
**చెప్పి వానిని బ్రోచావు సేమమరయ**
**భట్టతిరి కృతి తెలిపెద పద్యమందు**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! ముచుకుందుడు "స్వామీ! నేను ఇక్ష్వాకు వంశమునకు చెందిన రాజును. రాజ్యసుఖము లన్నిటిపై నాకు విరక్తి కలిగినది. నీ అనుగ్రహం ఒక్కటి చాలు నాకు" అని స్తుతించెను. అతడు ఇతరములైన వరములయందు ఏమాత్రమూ ఆసక్తి చూపించలేదు. కావున సర్వపాప నిర్మూలకమైన నీభక్తిని అతనికి ప్రసాదించితివి. ఆ భక్తి ముక్తితో సమానమైనది. దానివలన ఇంకను త్వరగా అతనిని ముక్తి కలుగునట్లు అనుగ్రహించితివి. హింసా దోషములను దూరము చేయుటకు అతనిని తపస్సు చేయమని లోక సంగ్రహము కొరకు చెప్పితివి. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి భాగవతమును తెలుగు పద్యములలో చెబుతున్న నన్ను అనుగ్రహింపుము తండ్రీ!



41/12

**తే॥ అంత మధురానగరి బోయి అచటనున్న**
**కాలయవను సైన్యమునంత కాలరాసి**
**ద్వారకాపురి వచ్చెడి దారిలోన**
**ఆ జరాసంధుడును నీకు అడ్డు తగిలె**
**వాని గర్వము పెంపొంద వానిచేత**
**ఓడినట్లు నటించుచు ఉరికినావు**
**నాదు వ్యాధిని తొలగించి నయము నిమ్ము**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! తరువాత నీవు మధురానగరమునకు బోయి అచటనున్న కాలయవనుని సేనల నన్నింటినీ తుదముట్టించితివి. ద్వారకకు తిరిగి వచ్చువేళ జరాసంధుడు నీకు అడ్డుతగిలెను. వాని గర్వమును పెంపొందింపచేసి పాపమును పెంచుటకు అతనికి చివరి సారిగా విజయము కలుగునట్లు చేసితివి. దానికోసం నీవు పరుగిడి పారిపోయి సముద్రం మధ్య నున్న ద్వారకకు చేరితివి. ఓ గురువాయూరప్పా! నన్ను కనికరించి నా వ్యాధిని తొలగించుము. ఈ విష్ణుగాధనాలకించి నన్ను ధన్యుని చేయుము తండ్రీ!



## 42. శ్రీకృష్ణునకు రుక్మిణీ సందేశము

**చం॥**
**పనివడి విశ్వకర్మనటు పట్టణమొక్కటి సాగరంబునన్**
**అనుపమ శోభతో నిలుప అచ్యుత! జేసితివయ్య దేవతల్**
**గొనకొని సంపదల్ వెలయ గూర్చిరి ఆ నగరంబులోన నీ**
**తనువును బోలు సాగరము దానిని జుట్టెను రక్షణంబుగా**
**విను గురువాయుపట్టణపు విష్ణునిగాథను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! దేవ శిల్పియైన విశ్వకర్మను పురమాయించి నీవద్దకు రప్పించి సముద్ర మధ్యమునందు ఒక పట్టణమున నిర్మింపజేసితివి. దేవతలు దానిలో నానావిధములైన సంపదలు విలసిల్ల జేసిరి. సముద్ర మధ్యమునందు ఆ పట్టణము నీ దివ్యమైన నీలికాంతులతో మెరిసే సాగరద్వీపమై గొప్ప రక్షణతో విలసిల్లినది. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధనాలించి నన్ను ధన్యుని చేయుము తండ్రీ!



42/2

ఆ.వె॥ రేవతుని సుతైన రేవతిన్ పెండ్లాడె
అన్న రాముడు విని ఆ విరించి
జరిపి ఉత్సవంబు గురువాయుపురవిభో!
విందు యాదవులును పొందినారు

తా॥ ఓ గురువాయూరప్పా! 'ఆనర్త' దేశాధిపతియైన రేవతుని కూతురైన రేవతిని బ్రహ్మదేవుని ఆజ్ఞననుసరించి నీ అన్నగారైన బలరాముడు పెండ్లాడెను. అప్పుడు నీనుంచి యాదవులు గొప్ప ఉత్సవము జరుపుకొని విందును పొందిరి.

42/3

**చం॥**
**తనయ విదర్భ రాజునకు తానగు రుక్మిణి నిన్ వరించుచున్**
**మునిగెను ప్రేమలో, పరమ మూర్ఖుడు ఆమెకు అన్నరుక్మియున్**
**గొనకొని చేది రాజునకు కూర్పగ చెల్లిని నిశ్చయించె తాన్**
**తనదగు మాటకాదనిన తాళని దుష్టుడు నీదు ద్వేషియున్**
**విను గురువాయుపట్టణపు విష్ణుని గాథను నందనందనా!**

తా॥ ఓ ప్రభూ! విదర్భరాజు కూతురైన రుక్మిణికి నీపై మిక్కిలి మక్కువ కలిగి నీ ప్రేమలో నిమగ్నమై యుండెను. ఆమె అన్నయైన రుక్మి అజ్ఞాని యగుటచే నిన్ను ద్వేషించుచు తన చెల్లెలైన రుక్మిణిని తనమిత్రుడును చేది దేశాధిపతియైన శిశుపాలుని కిచ్చి వివాహమును జరిపించవలెనను తలంపుతో నుండెను. అతను మొండి పట్టుదలతో తన మాటను కాదనిన సహించలేని వాడైయుండెను. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథనాలకింపుము తండ్రీ!

42/4

**ఉ॥**

**అన్నకు నీవు శత్రువని అంతము జేయును ప్రేమనంచు ఆ**
**అన్నుల మిన్నయైన సతి ఆయమ రుక్మిణి బాధనొందుచున్**
**అన్నియు జెప్పి బ్రాహ్మణుని అంపగ నీకడ నిశ్చయించె తాన్**
**ఎన్నికజేసి, బ్రోవుమని హే గురువాయుపురాధినాయకా!**



తా॥ ఓ గురువాయూరప్పా! చాలా కాలమునుండి నిన్నే ప్రేమించుచున్న రుక్మిణి తన అన్న రుక్మి నిన్ను ద్వేషించు పరమశత్రువని గ్రహించి అతని ఆలోచనలను గ్రహించి, అతని వలన తన కోరిక భగ్నమైపోతుందని తన ఆవేదన నీకు తెలుపుటకు ఒక బ్రాహ్మణుని ఎన్నుకొని నీవద్దకు తనను రక్షించమను అభ్యర్థనతో పంపుటకు నిశ్చయించుకొనెను.

42/5

**కం॥ చనుదెంచె ద్వారకాపురి**
**ఘనుడావిప్రుండు, ఒరులు కనరా నగరిన్**
**గొని పూజ సంతసించెను**
**వినుగురు అనిలాలయేశ! విప్రుడు నీచే**

తా॥ ఓ గురువాయూరప్పా! ఆ బ్రాహ్మణుడు త్వరగా ద్వారకాపురి వచ్చెను. ఆ ద్వారకాపురి పరులకు (ముఖ్యముగా దురాశాపరులు) చూడలేరు. అట్టి పట్టణమును చేరి సంసార దుఃఖ నివారకుడవైన నీచేత పూజలందుకొని చాలసంతోషించెను.



42/6

**తే॥ బ్రాహ్మణుండిట్లు చెప్పెను "పరమపురుష!**
**కుండినాధీశు గారాల కూతురైన**
**బాల రుక్మిణి మనసార వలచె నిన్ను**
**పడతి నినుజేర నెరుగక బంపెనన్ను**
**ధైర్యమును గోలుపోయెను, తనను నీవు**
**కావుమో ప్రభూ! వెంటనే కరుణబూని"**
**భట్టతిరి కృతి జెప్పెద పద్యగతిని**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఆ బ్రాహ్మణుడు నీతో "ఓ పరమపురుషా! కుండిన పట్టణమున ఆ రాకుమారియైన రుక్మిణీదేవి కలదు. ఆమె నిన్ను ప్రేమించి తపనజెందుచున్నది. నిన్ను చేరుట ఎట్లను చింతతో ఆమె తన ధైర్యమును కోల్పోయినది. అందువలననే నన్నిక్కడకు పంపినది. ఓ ప్రభూ! నీవామెను కరుణింపుము" అని పలికెను. ఓ గురువాయూరప్పా! భట్టతిరి భాగవతమును తెనిగించుచున్న నన్నునుగ్రహించి ఈ కథ నాలకింపుము తండ్రీ!



42/7

**చం॥**

**"విని సుగుణాల ప్రోవనుచు పేర్మిని నామనసెన్నడో ప్రభూ!**
**తను ఇకజిక్కెనీకు, అది ధైర్యము బాసెను చేది నాథుడున్**
**నను వరియించ సిద్ధపడె నన్ కరుణింపుము ఏదియొ విధిన్**
**అని తను రుక్మిణీ రమణి అంపె నివేదన" చెప్పె విప్రుడున్**
**విను గురువాయు పట్టణపు విష్ణుని గాథను నందనందనా!**

తా॥ "ఓ ప్రభూ! నీవు సుగుణాల రాశివని విని ఎప్పటినుండియో నీయందు నా మనస్సు నీకు వశమైపోయినది. ఇప్పుడు చేదిరాజైన శిశుపాలుడు నన్ను వివాహమాడుటకు ప్రయత్నించుచున్నాడు. ఓ దయాసాగరా! నన్నెట్లైనను కరుణించి ఏదో విధమున రక్షింపుము" అని ఆ రుక్మిణి నా ద్వారా నీకు నివేదన పంపుచున్నది అని ఆ బ్రాహ్మణుడు నీతో చెప్పెను. నందనందనుడివైన ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథ నాలకింపుము తండ్రీ!

42/8

ఉ॥

**"నన్నిక నీవు కావు మధినాయక! నాకిక దిక్కు నీవెగా**
**నన్ను ఉపేక్ష చేయుటిక న్యాయము కాదు అనాధరక్షకా!**
**ఎన్నటికైన నీసతిని ఎవ్విధినిల్చును నాదు ప్రాణముల్"**
**అన్నులమిన్నమాట విని అచ్యుత! నీమదిఆర్తి నొందెబో**
**ఎన్నికజేసి గాథ విను హే గురువాయుపురాధి నాయకా!**

తా॥ "ఓ అధినాయకా! నన్ను నీవు రక్షింపుము. నాకు నీవు తప్ప వేరు దిక్కులేదు. నన్ను ఉపేక్షించుట న్యాయము కాదు. ఒకవేళ నీవే నన్ను నిరాకరించిన ఏ నాటికైన నీదానినే అయిన నేను ప్రాణములతో నిలువను. అనాధరక్షకా! నన్ను కరుణింపుము" ఈ విధముగా రుక్మిణి పలుకులను విని నీహృదయము చాల కలత చెందినది. ఓ అచ్యుతా! గురువాయూరప్పా! ఈ గాధను ఎన్నిక చేసి విని నన్నుచరితార్థుని చేయుము తండ్రీ!



42/9

సీ॥ **"మిత్రమా! నేనును మీ రుక్మిణని మదిన్**
**పరిణయంబాడగ కోరుచుంటి**
**పరితపించుచునుంటి పడతిని మించుచున్**
**నమ్ముము నామాట వమ్ముకాదు**
**కుండినకేతెంచి కోమలిన్ తెత్తును**
**ప్రేమస్వరూపిణిన్ ప్రియముజూపి**
**రాజులందురు మది రగిలి చూచుచునుండ**
**రాక్షసవైవాహలక్షణముగ"**

తే॥ **నీవు పలికితివారీతి నీరజాక్ష!**
**బ్రాహ్మణుని మది ముదముతో పరవశింప**
**భట్టతిరికృతి తెలిపెద పద్యగతిని**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**



తా॥ ఓ గురువాయూరప్పా! అప్పుడు నీవు "మిత్రమా! నేను గూడ ఆ రుక్మిణిని కోరుకొనుచున్నాను. అందుచే ఆమెకంటే ఎక్కువగా నేనునూ పరితపించు చున్నాను. నామాట నమ్ము. కావున నేను కుండిన కేతెంచి ప్రేమ స్వరూపిణియైన ఆ రుక్మిణీదేవిని ప్రేమతో, రాజులందరు రగిలిపోతూ చూచుచుండగా వెంటనే తీసికొనివచ్చి రాక్షస వివాహమాడెదను'. అని పలికి ఆ బ్రాహ్మణుడు సంతోష పరవశుడాయెను. భట్టతిరి భాగవతమును తెలుగు పద్యరూపములో విని నన్ననుగ్రహింపుము తండ్రీ!



42/10

కం॥ **నిను విని విప్రుడు మురిసెను**
**చనిరిరువురు కుండినపురి సతి రుక్మిణికై**
**నను బ్రోచి వ్యాధి మాన్పుము**
**వినుగురు అనిలాలయేశ! విష్ణునిగాథన్**

తా॥ ఓ గురువాయూరప్పా! నీ మాటలను విని ఆ బ్రాహ్మణోత్తముడు చాల సంతోషించెను. పిమ్మట నీ రథముపై ఇరువురును కుండినకు వెళ్ళి ఆ రుక్మిణిని తీసికొనివచ్చుటకు బయలుదేరిరి. ఓ ప్రభూ! అట్లే నన్ను కూడ రక్షించి నా వ్యాధిని తొలగించి అనుగ్రహింపుము. ఈ భాగవతమును ఆలకింపుము తండ్రీ!

## 43. రుక్మిణీ స్వయంవరము

తే॥ **పిదప కుండిన నగరికి వెడలుచుండ**
**సేనతో అన్న అరిగెనీ వెనుక తాను**
**స్వాగతించి భీష్మకుడు నిన్ సత్కరించె**
**నీవు కుండిన జేరుట సవివరముగ**
**బ్రాహ్మణుడు దెల్ప రుక్మిణి పరవశించె**
**భక్తితో గొల్చి అతనికి ప్రణతులిడెను**
**భట్టతిరికృతి తెలిపెడ పద్యమందు**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! నీవు కుండిన నగరమునకు బయలుదేరగా బలరాముడు సైన్యమును వెంటబెట్టుకొని నిన్ననుసరించెను. కుండినాధిపతియైన భీష్మకుడు మిమ్ము స్వాగతించి సత్కరించెను. నీవు కుండిన పురమును చేరుకొంటివను విషయమును బ్రాహ్మణుడు తెలుపగా రుక్మిణీదేవి సంతోష



పరవశయై ఆ బ్రాహ్మణునకు భక్తితో మ్రొక్కెను. ఓ గురువాయూరప్పా! నేను తెనుగులో చెప్పెడి భట్టతిరి భాగవతమును ఆలకించి నన్ను చరితార్థుని చేయుము తండ్రీ!

43/2

చం॥
**నిను భువనైక మోహనుని నీల సరోరుహ దివ్య వర్ణునిన్**
**గని అనుకొంటి రెల్లరును కన్యక రుక్మిణి జోడు ఈతడే**
**మనమున కాని, 'రుక్మి' అనుమాటకు జంకుచు బాధనొందుచున్**
**కనులకు నిద్రరాక తమ కాలము బుచ్చిరి ముచ్చటించుచున్**
**విను గురువాయుపట్టణపు విష్ణునిగాథను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! భువనైక మోహనుని, నీలి పద్మము వంటి నీ దివ్య వర్ణమును జూచి కుండిన నగర పౌరులందరు 'ఇతడు మా కన్య రుక్మిణికి తగినవరుడు' అని అనుకొనిరి. కాని రాకుమారుడైన "రుక్మి" అనే మాటకు జంకి అతని నిర్ణయం కాదను



ధైర్యంలేక బాధపడిరి. వారు ఆ విషయమును గూర్చియే ముచ్చటించుచు రాత్రినంతయు గడిపిరి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!

43/3

కం॥ **నిను మది నిలిపిన రుక్మిణి**
**తన సర్వాభరణములను దాల్చెను ఆపై**
**చనె గౌరిపూజ నెరపగ**
**విను గురు అనిలాలయేశ! వీరుల వెంటన్.**

తా॥ ఓ గురువాయూరప్పా! నీయందే మనస్సు లగ్నమైయున్న రుక్మిణీదేవి మరునాడు ఉదయమున సర్వాభరణ భూషితయై గౌరీదేవిని పూజించుటకు బయలు దేరెను. ఆమె ముందర వీరభటులు సాయుధముగా నడచిరి. ఓ ప్రభూ! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!



43/4

ఉ॥
**గౌరికి పూజ సేయ చనె కన్యక రుక్మిణి ఆలయానికిన్**
**చేరి భవానినిన్ గొలిచె సేమము జేయగ, వాసుదేవ! నిన్**
**కూరిమి భర్తగా తనకు గూర్చగ, భక్తితొ మాటిమాటికిన్**
**సారసనాభ! గొల్తు మనసా గురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ వాసుదేవా! రాకుమారి రుక్మిణీదేవి ముత్తైదువలతో గౌరీదేవి ఆలయమునకు చేరి ఆ దేవిని భక్తితో పూజించెను. పదే పదే ఆ దేవి యొక్క పాదపద్మములకు ప్రణమిల్లి నిన్నే తన భర్తగా చేయమని ప్రార్థించినది. ఓ గురువాయూరప్పా! నీ కథను ఆలకింపుము తండ్రీ!

43/5

ఆ.వె॥ **రాజులంత గూడ రమణిని గాంచంగ**
**నిబ్బరముగ నీవు నిలచినావు**
**తరుణిశోభలీన గురువాయుపురవిభో!**
**బయలు వెడలె చెలులు వరుస దీర.**

తా॥ ఓ గురువాయూరప్పా! ఆ సమయమున రాజులందరు రుక్మిణిని తిలకించుటకు కుతూహలముతో గుమిగూడిరి. నీవు మాత్రము నిబ్బరముగా నుంటివి. అప్పుడు రుక్మిణీదేవి తన శరీర శోభలు దీప్తించగా తన చెలులు వరుసదీరి వెంటరాగా గౌరి ఆలయమునకు బయలుదేరెను.

43/6

కం॥ **లోకముల మోహపరచెడి**
**ఆ కోమలి జూచి నృపులు ఆవేశపడన్**
**నీకును కలిగెను వివశత**
**ఆ కథ గురువాయుపురపు అచ్యుత! వినుమా.**



తా॥ అచ్యుతా! గురువాయూరప్పా! లోకములనన్నింటిని మెహింపజేయగల రూపముతో విలసిల్లిన ఆ రుక్మిణీదేవిని జూచిన రాకుమారులందరు మోహావేశము నొందిరి. ఆమె క్రీగంటి చూపులకు నీవుకూడ పరవశించి పోతివి. ఓ ప్రభూ! నీవా కథను ఆలకింపుము తండ్రీ!

43/7

తే॥ **"చంద్రముఖి! రుక్మిణీ! నీవు చనెద వెచట"**
**కనుచు వెంటనే గట్టిగా ఆమె చేయి**
**పట్టి, రథముపై యెక్కించి పయనమవగ**
**విషయమెరిగిన నృపులెల్ల వెట్టిరంత**
**గొప్ప గగ్గోలు తామొకే గొంతు తోటి,**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ "చంద్రముఖీ! రుక్మిణీ! ఎక్కడికిపోయెదవు" అని యనుచు వెంటనే నీవు ఆమె చెయ్యి పట్టుకొని రథముపై కూర్చుండ ఎక్కించుకొని పోవుచుంటివి. రుక్మిణిని నీవు పరిగ్రహించుచుంటి వను



విషయమును తెలిసినంతనే శత్రురాజులు ముక్త కంఠంతో గగ్గోలు పెట్టిరి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథ నాలకింపుము తండ్రీ!

43/8

ఉ॥

**"ఏమిర గొల్లకాపరిటు ఎక్కడికీమెను గొంచుపోవు"నం**
**చా మహిపాలురందరును అప్పుడు సింగము జుట్టుకుక్కలై**
**తామును జుట్టు ముట్టిరిక ధైర్యము నుంటివి నీవు అచ్యుతా!**
**తామిక యాదవుల్ తరుమ దారిమరల్చుచు పారిరందరున్**
**ఓమహతాత్మ! నీవు వినవో గురువాయుపురాధినాయకా!**

తా॥ "ఈ పశులకాపరి ఎక్కడికీమెను కొనిపోవుచున్నాడు?" అని పలుకుచు రాజులెల్లరును అప్పుడు యుద్ధ సన్నద్ధులై సింహమును చుట్టుముట్టిన శునకములవలె వారు నీ చుట్టూ చేరిరి. నీవు మాత్రము కేసరివలె నిశ్చలుడవై యుంటివి. పిదపవారు యాదవులు చేతిలో పరాజితులై అచ్చోటి నుంచి తరుమబడిరి. ఓ మహాత్మా! గురువాయూరప్పా! ఈ విష్ణుగాథనాలకింపుము తండ్రీ!



43/9

సీ॥ **అంతట రుక్మిణి అన్న రుక్మియు నిన్ను**
**సిద్ధమై తలపడెన్ యుద్ధమందు**
**పరిమార్చనొల్లక బంధించి ఆపైన**
**వాని 'విరూపిగా' వదలినావు**
**ఆతని అహమంత అణగారిపోయెను**
**బలరాము మాటపై వదలినావు**
**లక్ష్మీ స్వరూపిణి లలన రుక్మిణితోటి**
**ద్వారకచేరావు పరమపురుష!**

తే॥ **భట్టతిరికృతి చేగొంటి వాసుదేవ!**
**సంస్కృతము రాని నాబోటి జనులకొరకు**
**తెలుగు పద్యంబులో నేను తెలుపుచుంటి**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ అంతట రుక్మిణీదేవి సోదరుడైన రుక్మి నీతో యుద్ధము చేయుటకై సిద్ధపడెను. నీవు అతనిని చంపక బంధించి విరూపిని చేసితివి. అందువలన అతని అహంకారము పూర్తిగా నశించిపోయెను. అప్పుడు బలరాముడు నీకు నచ్చజెప్పగా రుక్మిని బంధవిముక్తుని జేసితివి. తరువాత మహాలక్ష్మీ స్వరూపిణియైన రుక్మిణితో గూడి నీవు ద్వారకానగరమున ప్రవేశించితివి. ఓ వాసుదేవా! భట్టతిరి భాగవతమును సంస్కృతము రాని నాబోటి వారికోసం తెలుగు పద్యములలో చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! దీని నాలకించి నన్ను చరితార్థుని చేయుము తండ్రీ!



43/10

**తే॥ నవ సమాగమ లజ్జ మనస్సు నందు**
**పెనచి నీపైన గాఢమౌ ప్రేమచేత**
**కోర్కె రుక్మిణికిబ్బడై కూడె నిన్ను**
**చిరుత నవ్వుల రుక్మిణీ తరుణి గూడి**
**చాలకాలంబునుంటివి సౌఖ్యమలర**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! రుక్మిణీదేవి నవసమాగమమునందు సిగ్గుపడుచుండెను. నీపైగల ప్రేమాధిక్యతవలన నీపై ఆమె కోరిక రెట్టింపగు చుండెను. అట్టి చిరునవ్వుల రుక్మిణీదేవితో నీవు చాలకాలము హాయిగా సుఖించితివి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథను ఆలకింపుము తండ్రీ!



43/11

**ఆ.వె॥ ప్రియవచనము లాడి ప్రియముగూర్చెడి నీవు**
**వంకర పలుకాడి పత్ని మనసు**
**పరచినావు కలత గురువాయు పురవిభో!**
**ఒక్కనాడు ఏద్వ ఉదిత తాను.**

తా॥ ఓ గురువాయూరప్పా! ప్రియవచనములాడి ఆ దేవిని ఎల్లప్పుడు సంతోషపెట్టుచుండెడి నీవు ఒకరోజు అమాయకురాలైన ఆ దేవితో వక్రోక్తులు పలికి నీ భార్య మనస్సు గాయపరచితివి. ఆమె దుఃఖించునట్లు జేసితివి. (ఎవరికైనా విపరీతముగా ఆనందింపజేసిన వారి అహంభావము మిన్నంటునని నీ అభిప్రాయమో ఏమో ప్రభూ!)



43/12

తే॥ పిదప రుక్మిణీ దేవికి ప్రియము గూర్చి
ప్రణయ వచనము లాడుచు మనసునందు
కలతబాపి మరింతగా కలుగ సుఖము
ఉంచినావు నీవామెను ఓ ముకుంద!
చేరి నీ గాథగానంబు జేయు మాకు
రోగబాధల నణగించు వేగముగను
భట్టతిరికృతి తెలిగింతు పద్యమందు
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ప్రభూ! ఆ తరువాత నీవు రుక్మిణీదేవిని ప్రణయోక్తులాడుచూ లాలించి మైమరపించితివి. ఆమె దుఃఖమును పోగొట్టి మరింత సుఖమును కలిగించితివి. ఓ ముకుందా! నీ గాథను గానము చేయు మా బోంట్ల వ్యాధులను నిర్మూలించి మమ్ము త్వరగా రక్షింపుము. నారాయణ భట్టతిరి భాగవతమును తెలుగు పద్యంగా విని ఓ గురువాయూరప్పా! నన్ను ధన్యుని జేయుము తండ్రీ!

## 44. స్యమంతకోపాఖ్యానము

తే॥ సూర్యదేవుని గొలిచెడి ఆర్యుడొకడు
పేరు 'స(త్రాజి' తాతడు అరుణుని దయ
గనెను, బడసె స్యమంతక మణినతండు
దాని నిమ్మని గోరావు వాని నీవు
నీకు సాౖత్రాజితికి పెండ్లి నిశ్చయమని
సర్వ మెరుగుదువందుచే సాటివాన్కి
చేయి జాచావు నీలీల చెప్పతరమె?
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ఓ ప్రభూ! స(త్రాజిత్తు సూర్యభగవానుని ఉపాసించి, ఆయన అను(గ్రహముతో స్యమంతకము అను మణిని పొందెను. నీవు ఆ మణిని నీకు ఇమ్మని ఆయనను కోరితివి. నీవు సాౖత్రాజితి అయిన సత్యభామను పెండ్లిలో చేపట్టదలచి అతని గుణము నెరుగుటకు అట్లడిగితివేమో కాని నీకు మణి ఎందులకు? నీ లీలలు అగమ్య గోచరము కదా! ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథనాలకింపుము తం(డ్రీ!



44/2

సీ॥ అల్పబుద్ధనిపించి ఆతడు మణినీయ
వల్లకాదనినాడు వాసుదేవ!
ఆతని తమ్ముండు ఆ మణి ధరియించి
వేటాడ అడవికి వెడలె తాను
మణికాంతులను జూచి మాంసంబనుచు యెంచి
పంచాననంబొండు వాని జంపె
భల్లూకనాధుండు పంచాననంబును
దునిమి మణిని బట్టె తనయ కొఅకు

తే॥ వాని కూతురు అయిన జాంబవతి కిచ్చె
ఆట వస్తువుగా జేసి అతడు దాని
భట్టతిరికృతి తెనిగింతు దేవదేవ!
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ఓ వాసుదేవా! స(త్రాజిత్తు అల్పబుద్ధి కలవాడగుట వలన స్యమంతకమణిని నీకు ఇవ్వనని నిరాకరించెను. అతని తమ్ముడు ప్రసేనుడు ఆ మణిని తన మెడలో ధరించి వేటకై అడవికి పోయెను. అప్పుడు ఆ మణి కాంతిని



జూచి ఒక సింహము దానిని మాంసమని భ్రమించి ప్రసేనుని జంపెను. భల్లూక రాజైన జాంబవంతుడు ఆ సింహమును సంహరించి ఆ మణిని తీసికొనిపోయి (ప్రేమతో తనబిడ్డ అయిన జాంబవతికి ఆటవస్తువుగా ఇచ్చెను. ఓ దేవదేవా! గురువాయూరప్పా! భట్టతిరి చెప్పిన భాగవతమును నేను పద్యకావ్యంగా చెబుతున్నాను. దీనినాలకింపుము తం(డ్రీ!

44/3

సీ॥ దు(ష్పచారంబుతో ధూర్త స(త్రాజిత్తు
ద్వారకా (ప్రజలకు మనసు విఱిచె
మా (ప్రసేనుని జంపి మణిగొనె కృష్ణుడు
తొలినాటి నుండియే దొంగవాడు
అధికుల నిందించ అమృతంబు సరియగు
పామరజనులకు పాడుబుద్ధి
సర్వంబెఱింగియు జనులను గొనిపోయి
అడవి గాలించావు పడవుమాట
ఆ (ప్రసేనుడును పంచాననంబుల మృతి
శవములు దెలిపెను ఆ వనమున



తే॥ జాంబవంతుని గుహయొక్క జాడగాంచి
లోనికేగితివో (ప్రభూ! బూని నీవు
భట్టతిరి కృతి జెప్పెద పద్యమందు
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ఓ ప్రభూ! స(త్రాజిత్తు యొక్క దు(ష్పచారము వలన ద్వారకయందున్న సామాన్య జనులు నీవే (ప్రసేనుని చంపి మణిని అపహరించితివని చెప్పుకొనసాగిరి. పామర జనులకు గొప్పవారి తప్పులెన్నుట అనినచో అమృతతుల్యము కదా! నీవు సర్వజ్ఞుడవైనను నీ పరిజనమును, పౌరులను తీసికొని మణిని వెదకుచు అడవికివెడలితివి. ఒకచోట (ప్రసేనుని కళేబరమును, మరికొంత దూరమున సింహము యొక్క శవమును గాంచితివి. తరువాత భల్లూకరాజైన జాంబవంతుని పాదముద్రలను జూచి వాటిని అనుసరించి పోవుచూ ఒక గుహలోనికి (ప్రవేశించితివి. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి భాగవతమును తెలుగు పద్య కావ్యంగా ఆలకింపుము తం(డ్రీ!

44/4

సీ॥ పరమ భక్తుడు నీకు పరమ వృద్ధుండైన
జాంబవంతుడు నీదు జాడెరుగక
రామభక్తుండైన అమలు నన్నెవ్వడు
ఎదిరించగలడంచు మదిని తలచె
ముష్టిప్రహారముల్ పుష్టిగా కురిపించె
జయమురామా! నీకు జయమననుచు
యుద్ధంబు కాదది ఉన్నతంబైనట్టి
పూజయేనీకయ్యె మురవిదూరి!

తే॥ అది పరోక్షంబుగా నీకు ఆయె పూజ
భాగవతకథ తెలిపిరి భట్టతిరులు
తెలుగు పద్యంబు జేస్తిని దేవదేవ!
వినుము గురువాయు పురవిభో! విష్ణుగాథ.



తా॥ ఓ దేవదేవా! పరమభక్తుడును, మిక్కిలి వృద్ధుడు అయిన జాంబవంతుడు కృష్ణుని రూపమున నున్న నిన్ను శ్రీహరిగా గుర్తింపలేక పోయెను. పైగా "శ్రీరామభక్తుడనైన నన్ను ఎవ్వడెదుర్కొనగలడ"ని తలపోయుచు నీతో ముష్టి యుద్ధమునకు దిగెను. జాంబవంతుడు నీపై ముష్టిప్రహారములు చేయుచున్నప్పుడు ప్రతి ప్రహారముతోను "ప్రభూ! శ్రీరామచంద్రా! శ్రీహరీ! నీకు జయమగు గాక, జయమగుగాక!" అనుచు నిన్నే కీర్తించెను. అతడు చేయునది ముష్టిప్రహారములే అయినను అనుక్షణము నిన్నే కీర్తించుచుండుటవలన పరోక్షముగా అతడు నిన్నే అర్చించినట్లయ్యెను. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి కావ్యమైన భాగవతమును తెలుగు పద్యముగా విని నన్ను అనుగ్రహింపుము తండ్రీ!



44/5

చం॥
తన రఘురాముడీవెయని తాను గ్రహించిన జాంబవంతుడున్
తనుమది తాపమొంది దుహితన్ వినయంబుగ ఆదరంబునన్
గొనుమని ఇచ్చె నీకు మణి కూడగ అవ్విధి రెండు కాన్కలై
అనునయమిచ్చి భక్తునికి ఆ మణినిస్తివి యాజమానికిన్
వినుగురువాయుపట్టణపు విష్ణునిగాథను నందనందనా!

తా॥ ప్రభూ! తన ఆరాధ్యదైవమైన శ్రీరామచంద్రుడు నీవే అని అతను తెలిసి కొనిన పిమ్మట ఆ జాంబవంతుడు మనస్సులో ఎంతో బాధపడి తన ముద్దుల కూతురైన జాంబవతీ సమేతంగా నీకు స్యమంతకమణి నొసంగెను. నీవు సుందరీమణిని స్యమంతకమణిని తీసికొని ఆ జాంబవంతుని అనుగ్రహించితివి. ఇంటికి వచ్చిన తరువాత ఆ మణిని దాని యజమానియైన సత్రాజిత్తునకు అప్పగించితివి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథనాలకింపుము తండ్రీ!



44/6

తే॥ పొంది మణిని సత్రాజిత్తు పూర్తి నిజము
తెలిసి నిష్కారణంబుగా పలికి, నింద
వేసినందుకు చింతించె, పిదప తనదు
తనయ సత్యభామను శతధన్వుకిచ్చు
మాట కాదని నీకీయ మదిని తలచె
మణిని కాదని గొనినావు భామ చేయి
భట్టతిరి కృతి తెలిపెద, పద్యమందు
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ప్రభూ! నీనుండి ఆ సత్రాజిత్తు స్యమంతకమణిని పొంది, యథార్థము నెరింగి నిరాధారమైన నింద నీపై వేసినందుకు ఎంతో పశ్చాత్తాపపడెను. అతడంతకు ముందు తన కూతురు సత్యభామను శతధన్వునకిచ్చి పెండ్లి చేయవలెనని అనుకొని నప్పటికిని, నీ ఔన్నత్యము నెరిగిన పిమ్మట ఆమెను స్యమంతకమణిని నీకే ఇచ్చుటకు నిశ్చయించి స్వీకరించమని నిన్నర్థించెను. నీవు మణిని కాదని

భామామణిని గ్రహించితివి. ఓ గురువాయూరప్పా! భట్టతిరి భాగవతమును తెలుగు పద్యకావ్యంగా విని నన్ను అనుగ్రహింపుము తండ్రీ!

44/7

తే॥ **స్వామి! లజ్జా విభూషితౌ సత్యభామ**
**గవయ మురిపింప సుఖముగా గడిపినావు**
**అపుడు లాక్షా గృహంబున అత్త సుతులు**
**దగ్ధమౌ వార్త విని చూడ తరలినావు**
**ఇచట శథధన్వుడాతని హితులు అయిన**
**జంట అక్రూర కృతవర్మ సాయపడగ**
**మణినపహరించె మణి యజమాని దునిమి**
**వినుము గురువాయు పురవిభో! విష్ణుగాథ.**

తా॥ స్వామీ! నీవు లజ్జా భూషితయైన సత్యభామతో సుఖముగా ఉంటివి. ఆ సమయమున పాండవులు లాక్షా గృహమున (లక్క ఇంటిలో) దగ్ధమైనారను వార్తను విని నీవు వెంటనే కురు రాజధానికి బయలు దేరితివి. అప్పుడు అక్రూరుడు మరియు కృతవర్మలతో



కలిసి శతధన్వుడు సత్రాజిత్తును సంహరించి అతని వద్దనున్న స్యమంతకమణి నపహరించెను. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథనాలకింపుము తండ్రీ!

44/8

సీ॥ **తండ్రి మరణవార్త తనయ సత్యాదేవి**
**విని ఏడ్చి నీకడ తాను వచ్చె**
**చక్రంబు జేపట్టి శతధన్వు తెగటార్చి**
**ముదము గొల్పితివీవు ముద్దు సతికి**
**మణిగూర్చి నీపైన భ్రమపడి నీ అన్న**
**మిథిలాపురము జేరె మిన్నకుండి**
**ఎంతటివారైన ఇమిడి నీ మాయలో**
**పామరులౌదురు స్వామి! నిజము**

తే॥ **ఆదిశేషుని అంశ నీ అన్న అచట**
**తను గదా యుద్ధకిటుకు గాంధారి సుతుకు**
**నేర్పి మారణకాండకు నెపము అయ్యె**
**వినుము గురువాయు పురవిభో! విష్ణుగాథ.**



తా॥ స్వామీ! తనతండ్రి! చనిపోయెనని దుఃఖముతో సత్యభామ కురు రాజధానియైన హస్తినాపురమున నున్న నీ కడకు వచ్చెను. అప్పుడు ఆమెవలన విషయములను గ్రహించిన నీవు శతధన్వుని చంపి సత్యభామకు ఆనందము కలిగించితివి. కాని బలరామునకు స్యమంతకమణి విషయమున నీపై అపోహ కలిగినది. అయినను నిన్న ఏమియు అనక అతడు మిథిలానగరమునకు పోయెను. నీపైన కోపముతో కాబోలు ఆయన పాండవుల శత్రువైన దుర్యోధనునకు గదాయుద్ధములోని మెళకువల నన్నింటిని నేర్పించెను. ఎంతటి వారైన నీ మాయలో చిక్కి పామరులైపోతారు. కానిచో ఆదిశేషుని అవతారమైన బలరాముడు దుర్మార్గుని ప్రోత్సహించి గొప్ప యుద్ధానికి కారణమవుతాడా? ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథ నాలకింపుము తండ్రీ!



44/9

తే॥ **నీదు సంకల్ప బల్మిచే నిహతు జేసె**
**దుష్ట సత్రాజితున్ తన తోటివాడు**
**క్రూర శతధన్వుతోటి అక్రూరుడంత**
**నీవు అక్రూర వరదుడ వవుటె గాక**
**వాని ఐశ్వర్యమును బెంచ, మణిని కూడ**
**వాని కొసగితి వనిరెల్ల జనులు తాము**
**భట్టతిరి కృతి తెలిపెద పద్యమందు**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! నీ సంకల్పముననుసరించియే అక్రూరుడు దుష్టుడైన సత్రాజిత్తును శతధన్వుని చేత చంపించెను. అట్లే నీవు ఆ అక్రూరునియొక్క ఐశ్వర్యమును పెంపొందింప చేయుటకే అతని దగ్గరనున్న స్యమంతకమును తీసికొనలేదు అని ప్రజలు అనుకొనసాగిరి. ఓ గురువాయూరప్పా! భట్టతిరి భాగవతమును నేను తెలుగు పద్యములలో చెబుతున్నాను. దీనినాలకింపుము తండ్రీ!

44/10

ఉ॥

**భక్తుడు గాందినీయుడును పావనుడో ప్రభు! కాని దుష్టుడై**
**యుక్తి కుయుక్తులన్ నెరప ఊహకు అందదు కారణంబు ఏ**
**భక్తుడు లేడు ఈ భువిని వానిని మించని గర్వమెక్కుడై**
**ముక్తికి దూరమాయె తను ముష్కరులందరి గూడి అవ్విధిన్,**
**శక్తి నొసంగు గొల్తు మనసా గురువాయు పురాధినాయకా!**

తా॥ ఓ ప్రభూ! అక్రూరుడు నీయొక్క పరమ భక్తుడు పుణ్యాత్ముడు. అతడు కూడ యుక్తి యుక్తులతో దుష్టులకు సహకరించాడు. వానికీ దుర్బుద్ధి ఎలా పుట్టింది? అది ఊహించలేము కాని ఒక కారణం అయి వుండవచ్చును. అక్రూరునికి తను గొప్ప జ్ఞానినని, సాధువునని అపరిమితమైన గర్వము గలదు. ఆ గర్వము వానిని ముక్తి కనర్హుని చేయుచున్నది. అదే అతను దుర్మార్గులతో చేయి కలుపునట్లు చేసినది. అక్రూర వరదుడవైన ఓ గురువాయూరప్పా! నాకు అట్టి వ్యామోహములనుండి తప్పించుకొనే శక్తి నొసగుము తండ్రీ!



44/11

తే॥ **నీకు భయపడి ఆ గాందినీయు డపుడు**
**పారిపోయెను ఆ కృతవర్మతోటి**
**అతని వెనుకకు పిలిపించి అన్న ఎదుట**
**నిందు సభలోన ఆ మణిన్ నీవు వాన్కి,**
**ఇచ్చి వేశావు సత్యయు ఇచ్ఛదెలుప**
**నాదు వ్యాధిని సడలించి నయము నిమ్ము**
**భట్టతిరికృతి తెలిపెద పద్యమందు**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఆ అక్రూరుడు కృతవర్మతో కలిసి భయపడి పారిపోయెను. నీవు వారిని తిరిగి వెనుకకు పిలిపించి నీ అన్న బలరాముని ఎదుట సత్యభామ సమ్మతితో ఆ స్యమంతకమణిని నిండు సభలో అక్రూరునికొసంగితివి. అట్టి ఓ గురువాయూరప్పా! నా వ్యాధిని నిర్మూలించి నన్ను రక్షింపుము. నారాయణభట్టతిరి కావ్యమును తెలుగు పద్యరచనగా విని నన్ననుగ్రహింపుము తండ్రీ!



## 45. శ్రీకృష్ణుడు కాళింది మొదలగు కన్యలను వివాహమాడుట నరకాసురుని వధించుట

సీ॥ **ప్రీతిపాత్రయు ముగ్ధ సతి సత్యభామను**
**మురిపించ పాంచాల తరలినావు**
**పడతి ద్రౌపది పెండ్లి పంచపాండవులతో**
**జరిగిన దచ్చట సంబరముగ**
**ఆ పాండవులతోటి హస్తిన జేరావు**
**కొంతకాలము నీవు కూడియుండ**
**విశ్వకర్మను బిల్చి ప్రీతితో వారికి**
**ఇంద్రప్రస్థంబును ఇచ్చినావు**

తే॥ **వారు సుఖముండ ద్వారక చేరినావు**
**భట్టతిరి చెప్పె సంస్కృత భాగవతము**
**తెలుగు పద్యంబు జేస్తిని దేవదేవ!**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**



తా॥ ఓ ప్రభూ! నీకు మిక్కిలి ప్రీతి పాత్రురాలును అమాయకురాలును అయిన సత్యభామకు ఆనందమిచ్చి సుఖముగా నుంచితివి. ఆమెను వెంటబెట్టుకొని ఒకనాడు ద్రౌపది యొక్క వివాహమునకై పాంచాల దేశమేగితివి. ఆమెను పంచపాండవులు వివాహమాడగా నీ బావలైన వారి నానంద పరచుటకు నీవు కూడ సత్యతో హస్తినాపురమునకు పోయినావు అచట నీవు కొంతకాలము గడిపితివి. ఒకనాడు దేవశిల్పియైన విశ్వకర్మను రావించి వానిచే పాండవుల కొరకు ఇంద్రప్రస్థమను దివ్యమైన నగరమును నిర్మింపజేసి నీవు దానిని పాండవులకొసగితివి. తరువాత సత్యభామతో ద్వారకాపురి చేరుకొంటివి. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి సంస్కృతములో రచించిన భాగవత సారమును నేను తెలుగు పద్య గాధగా చెబుతున్నాను. దీని నాలకింపుము తండ్రీ!

45/2

తే॥ సుందరాంగి సుభద్ర నీ సోదరి ప్రభు!
పేర్మి దుర్యోధనుని తోటి పెండ్లిసేయ
అన్న బలరాముడెంతయో ఆశపడెను
కాని అర్జున పత్నిని తనను సేయ
నిశ్చయించావు, పార్థుని నీవు బిలువ
యతిగ వచ్చి గొంపోయెను అపహరించి
తరలిరందరు ఇంద్రప్రస్థమ్ము జేర
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ప్రభూ! సౌందర్య రాశియైన సుభద్ర బలరామునికి నీకు ప్రియసోదరి. ఆమెనిచ్చి పెండ్లి చేయమని దుర్యోధనుడు బలరాముని అర్థించెను. బలరాముడును సుముఖుడే. కాని నీవు ఆమెను అర్జున పత్నిని చేయదలచితివి. నీ ప్రోద్బలముతో అర్జునుడు యతివేషమున వచ్చి సుభద్ర నాకర్షించి ఆమెను అపహరించి ఇంద్రప్రస్తమునకు



గొనిపోయెను. తదుపరి నీవు బలరామునికి నచ్చజెప్పి ఇంద్రప్రస్థమునకు బోయి వధూవరుల నాశీర్వదించి అక్కడ కొన్నాళ్ళు గడిపితివి. ఓ గురువాయూరప్పా ఈ భాగవతమునాలకింపుము తండ్రీ!

45/3

సీ॥ ఇంద్రప్రస్థంబున ఇచ్చకాలాడుచు
గడిపావు కొన్నాళ్ళు కాలమీవు
కాళింది తటమున కాళింది యను కన్య
జేపట్టి నగరంబు జేర్చినావు
ఖాండవ దహనంబు గావించ క్రీడితో
అగ్నిదేవుండిచ్చె అస్త్రములను
ద్వారకజేరావు తదుపరి మేనత్త
నరయ అవంతికి తరలి, ఆమె
పుత్రి నిన్నాశించె మిత్రవిందను కన్య
ఆమె అన్నలు మెచ్చరనుచు నేర్చి
చానన్ స్వయంవర సభనుండి ఎత్తుక
పోయావు రాజులు ఉలికి పడగ



తే॥ పడతి నర్థాంగి అవగజేపట్టినావు
భట్టతిరి కృతి సంస్కృత భాగవతము
తెలుగు పద్యంబు జేస్తిని దేవదేవ!
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ

తా॥ ఓ ప్రభూ! నీవు ఇంద్రప్రస్థమున పాండవులతో సరస సల్లాపములాడుచు కాలము గడిపితివి. ఇట్లుండగా ఒకనాడు నీవు కాళిందీనది (యమునానది) తీరమున 'కాళింది' యను సుందరిని జూచి ఆమెను బెండ్లాడి నగరమునకు తెచ్చితివి. తరువాత అగ్నిదేవుడు తన వ్యాధి నివారణకు గంధర్వ రక్షితమైన ఖాండవ వనమును దహించుటకు నిన్ను అభ్యర్థించగా అర్జునునితో ఆ కార్యము నెరవేర్చి అగ్నిదేవునిచే అర్జునునికి ఎన్నియో దివ్యాస్త్రముల నిప్పించితివి. తరువాత ద్వారక చేరుకొంటివి. అవంతీ దేశమునందు నీ మేనత్తయగు రాజాధి దేవి యొక్క కుమార్తె అయిన మిత్రవింద నీపై ఎనలేని అనురాగమును



కలిగియున్నదని తెలుసుకొంటివి. కాని ఆమె సోదరులైన విందానువిందులకు అది ఇష్టములేదు. ఆమె ఆనాడు రుక్మిణి వలె నిస్సహాయ స్థితిలో నుండెను. స్వయంవర సభలో రాజులందరి సమక్షమున నీవు మిత్రవిందను నీవెంట గొనిపోయి ద్వారకలో వివాహమాడితివి. ఓ గురువాయూరప్పా! భట్టతిరి భాగవతమును పద్యకావ్యంగా ఆలకింపుము తండ్రీ!

45/4

సీ॥ కోసలాధీశుని కూతురు సత్యకు
నాగ్నజితని వేరు నామముండె
ఏడేసి ఎద్దులు ఎల్లరన్ బాధించ
వాని బంధించెడి పందెమొకటి
బెట్టిగెల్చిన వాన్కి పిల్ల నిచ్చెదనంచు
రాజు చాటింపించె రాజ్యమందు
ఏడు రూపములతో ఎద్దులన్ బంధించి
నాడు పెండ్లాడావు నాగ్నజితిని
నీ మేనమరదలు నెలత భద్రను నామె
వలచి నిన్ నిలిపెను మనసునందు

తే॥ ఆమె సోదరుల్ సంతర్ధనాదులామె
పెండ్లి నీతోటి జరిపిరి పేర్మితోటి
భట్టతిరి కృతి తెలిపెద పద్యగతిని
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ

తా॥ ఓ ప్రభూ! నగ్నజిత్తు అను మహారాజు కోసలదేశమును పాలించుచుండెను. అతని కుమార్తె నాగ్నాజితి. ఆమెకు 'సత్య' అను మరియొక పేరుకూడ కలదు. ఆ దేశ రాజధానియైన అయోధ్య యందలి ప్రజలను ఏడు వృషభములు బాధించుచుండెను. అప్పుడు నగ్నజిత్తు మహారాజు ఆ పొగరుబోతు కోడెలను బంధించిన వానికి తన కుమార్తె నిచ్చి వివాహము చేయుదునని ప్రకటించెను. అంతట నీవు అయోధ్యకు వెళ్ళి ఏడు వేర్వేరు రూపములను దాల్చి ఆ ఏడు వృషభములను ఒకేసారి బంధించితివి. నాగ్నజితిని వైభవముతో పరిణయమాడితివి. స్వామీ! నీ మేనత్తయైన శ్రుతకీర్తి



యొక్క కుమార్తెయగు భద్ర నీపై అనురాగవతియై యుండెను. ఆమె సోదరుడు సంతర్ధన ప్రతర్ధనులు మొదలైనవారు ఆమెను నీకు సమర్పింపగా నీవామెను పరిణయమాడితివి. ఓ గురువాయూరప్పా! భట్టతిరి భాగవతమును నేను తెలుగు పద్యములలో చెప్పుచున్నాను. దీనినాలకింపుము తండ్రీ!

45/5

సీ॥ మద్రదేశాధీశు మాలిమి కూతురు
లక్ష్మణ అష్టమ లలన ఆయె
ఆమె తండ్రియు మత్స్యయంత్రమ్ము భేదించు
పందెంబు బెట్టెను పడతి గెలువ
అర్జునుదాదిగా అందరు యత్నించి
విఫలంబు జెందిరి భేదనమున
నీవుదానిని గొట్టి నీ భార్యగా బొంది
అష్టభార్యల స్వామివైతివయ్య!



తే॥ అంత సురపతి యొకసారి చెంత జేరి
నరకదైత్యుని పాపాల వరుస దెలిపె
భట్టతిరి కృతి తెలిపెద పద్యమువలె
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ఓ ప్రభూ! మద్రదేశాధిపతియగు బృహత్సేనుని కుమార్తెయగు లక్ష్మణ నీ అష్టమ భార్య అయ్యెను. ఆ రాజుకూడ నీటియందలి ప్రతిబింబమును జూచుచు పైనున్న మత్స్యయంత్రమును భేదించిన వానికి తనకుమార్తెనిచ్చి వివాహము చేయుదునని ప్రకటించెను. ఆ వార్తను వినిన అర్జునుడు సైతము ప్రయత్నించి తక్కిన రాజుల వలె విఫలుడాయెను. అంత నీవా మత్స్యయంత్రమును భేదించి లక్ష్మణను పరిణయమాడితివి. ఆ విధముగా నీవు రుక్మిణి మొదలైన అష్ట భార్యలకు నాయకుడవైతివి. ఇదిట్లుండగా ఒకనాడు దేవేంద్రుడు నీకడకు వచ్చి నరకాసురుడు సలుపుచున్న అకృత్యములను



వివరించెను. ఓ గురువాయూరప్ప! భట్టతిరి కృతిని తెలుగు పద్యరూపంలో విని నన్ను చరితార్థుని చేయుము తండ్రీ!

45/6

సీ॥ స్మరణ మాత్రంబున పక్షీంద్రుడేతెంచి
నీచెంత నిలిచెను నీవు భామ
గరుడునిపైనెక్కి అరిగి ప్రాగ్జోతిష
పురమును జేరారు నరకు బోర
తునిమి శత్రువులను దుర్గంబు గూల్చావు
రక్తసిక్తంబయ్యె రాజధాని
ప్రాగ్జోతిషపురము రక్తశోణితమాయె
శోణితపురమని గణుతికెక్క

తే॥ భక్తులైన నారాయణ భట్టతిరులు
సంస్కృతించ భాగవతపు సారమెల్ల
తెలుగు పద్యంబు జేస్తిని దేవదేవ!
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ఓ దేవదేవా! అప్పుడు నీవు స్మరించినంతనే పక్షీంద్రుడైన గరుత్మంతుడు నీ చెంతనిలిచెను. వెంటనే నీవు సత్యభామతో కలిసి గరుత్మంతుని ఎక్కి ఉద్యాన వనమువలె కడు మనోహరముగా నున్న ప్రాగ్జ్యోతిషపురమునకు బయలుదేరితివి. అది నరకాసురునియొక్క రాజధాని. పిదప నీవు శత్రువులను హతమార్చి, వారి దుర్గములను కూల్చివేసితివి. ఆ నగరమంతయు ఆ శత్రువుల రక్తముతో తడిసిపోయినది. ఆ విధముగా నీవు ప్రాగ్జ్యోతిషపురమును 'శోణితపురముగా' చేసితివి. ఓ గురువాయూరప్పా! భక్తుడైన నారాయణ భట్టతిరి సంస్కృతములో రచించిన భాగవతమును నేను తెలుగు పద్యకావ్యంగా చెబుతున్నాను. దీని నాలకించి నన్ను చరితార్థుని చేయుము తండ్రీ!



45/7

**ఉ॥**

**ఐదు శిరస్సులున్న మురదైత్యుడు సాగరమధ్యమందునన్**
**మీదకు దూకె వానిని శమింపక చక్రము వేసి శీర్షముల్**
**ఐదును ఉత్తరించితివి, ఆ నరకుందును ఘీంకరింపుతో**
**వేదన గూర్చు ఏన్గులతొ మీదకు వచ్చెను, వేసి చక్రమున్**
**ఆ దనుజున్ హరించితివయా గురువాయుపురాధి నాయకా!**

తా॥ ఓ గురువాయూరప్పా! ఐదు తలలున్న మురాసురుడు సముద్రజలముల మధ్యనుండిపైకి రాగా అతని ఐదు శిరస్సులను నీవు సుదర్శన చక్రముచే ఖండించివేసితివి. అట్లే ఆ నరకాసురుడు నాలుగు దంతములతో బాధించుటకు భయంకరముగా ఘీంకరించు ఏనుగులతో నీపై యుద్ధము చేయుటకు వచ్చెను. అప్పుడు నీవు చక్రముతో ఆ రాక్షసుని సంహరించితివి.



45/8

**తే॥ అపుడు స్తుతియించె మనసార అవని నిన్ను**
**దనుజు సుతుడైన ఆ భగదత్తునికిని**
**రాజ్యమిచ్చావు ఒక ఏన్గు రాజుకుంచి**
**మిగిలినవి ద్వారకకు తరలించినావు**
**అసురు చెరనున్న ఆ పదియారు వేల**
**రాచకన్నెలు నిను గోర రక్షకొరకు**
**భార్యలుగ గొని తెచ్చావు ద్వారకకును**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాధ.**

తా॥ ఓ ప్రభూ! అప్పుడు భూదేవి నిన్ను ఎంతయో స్తుతించినది. ఆ నరకాసురుని రాజ్యమును అతని పుత్రుడైన భగదత్తునకు ఇచ్చావు. ఒక్క ఏనుగును మాత్రము ఉంచి తక్కిన వాటిని ద్వారకాపురికి తరలించితివి. దుర్మార్గుడైన నరకుడు చెరలో ఉంచిన



పదియారువేల రాజకన్యలను విడిపించి వారందరు నీపైననే ప్రేమానురాగములు చూపగా ఆ కన్యలను అచటనున్న సంపదను నీవెంట ద్వారకకు తరలించితివి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!

45/9

**సీ॥ అమరేంద్రునోడించి అదితి కుండలములు**
**తొల్లి ఆ నరకుండు దొంగిలించె**
**గరుడునిపై నెక్కి తరుణి సత్యతొ గూడి**
**అమరావతికి నీవు అరిగినావు**
**అదితి కుండలములు ఆమెకు నందించ**
**సత్యదిగ్భ్రమ జేసె స్వర్గమంత**
**సురపతి అతిథులై చూచిరి నందన**
**వనమును ఇరవురూ పరవశించి**
**పారిజాతము గాంచి భామ ఆశించగా**
**సురపతి కాదని పోరు సలిపె**
**వానిని ఓడించి పారిజాతమ్మును**
**తరలించినావయ్యా! ద్వారకకును**

తే॥ ధనమదాంధులు ఎంతో కృతఘ్నులనుచు
జగతి నేర్పంగ నీవట్లు జరిపినావు
పారిజాతము నీకేల వాసుదేవ?
వినుము గురువాయు పురవిభో! విష్ణుగాథ.

తా॥ ఓ వాసుదేవా! పూర్వము నరకాసురుడు దేవేంద్రుని జయించి ఆతని తల్లియైన అదితి కుండలములను అపహరించి తనవద్ద ఉంచుకొనెను. నరకుని వధానంతరము నీవాకుండలముల నామెకు తిరిగి ఒప్పగించుటకు గరుత్మంతుని పైనెక్కి అమరావతికి వెళ్ళితివి. సత్యభామ త్రిజగన్మోహనరూపముతో నీవెంట వచ్చినది. దేవకాంతలు కూడ ఆమె సౌందర్యమును జూచి అచ్చెరువొందిరి. దేవేంద్రుడు నీకు ఘనస్వాగతమిచ్చి గౌరవించెను. తరువాత సత్యకోరగా నీవు పారిజాత వృక్షమును ఆమె పెరటిలో నాటుటకు గొనిపోవుచుంటివి. దేవేంద్రుని అభ్యర్థనమేరకు నిష్కారణంగా నరకునితో వైరము



వహించిన నీపై కృతజ్ఞత చూపక పోగా అతను నిన్నడ్డగించెను. క్షణములో అతని నోడించి పారిజాతమును ద్వారకకు తీసికొని పోతివి. ధనమదాంధులు చేసిన మేలు మరచుట సహజమే కదా! ఈ విషయమును లోకమునకు వెల్లడించుటకే పారిజాతాపహరణము చేసితివి గాని నీకు పారిజాతము లెందుకు? ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథ నాలకింపుము తండ్రీ!



45/10

సీ॥ పారిజాతము సత్యభామ ఇంటికి జేర్చి
చూపావు నీప్రేమ సుదతిపైన
అష్ట భార్యల పదియారువేల సతుల
ఒకతెకు యొకడవై యుంటివీవు
పడతికొక్కతెకును పదిమంది బిడ్డల
నిచ్చావు పెంపొంద ఇంతిసుతుల
నారదుడిది చూచి అరిగె నొక్కొక ఇంట
ఒక్కొక్క పనిచేయుచుంటివీవు

తే॥ నీదు లీలలు నేర్వంగ కాదు మాకు
నాదువ్యాధిని నణగించి నయము నిమ్ము
భట్టతిరికృతి చెప్పెదపద్యగతిని
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ఓ ప్రభూ! నీవు స్వర్గలోకమునుండి తీసుకువచ్చిన పారిజాత వృక్షమును సత్యభామ ఉద్యానవనములో



నాటితివి. నరకాసురుని చెఱలోని పదునాఱువేలమంది కన్యలను నీవు చేపట్టితివి. నీవు అనేక రూపములను ధరించి వారి అందరిని సుఖపెట్టుచుంటివి. ఈ సంగతిని వినిన నారదుడు ఇది ఎట్లు సాధ్యమో పరీక్షించుటకు నిన్ను దర్శించవచ్చెను. నీవు నీ భార్య లందరి వద్దా ఒక్కొక్క కృష్ణుడవై వేర్వేరు గృహకృత్యములు నిర్వహించుచు ఒకేసారి నారదుని కండ్లకు కనిపించితివి. నీవు ప్రదర్శించిన ఆ లీలను జూచి నారదుడు ఎంతో ఆశ్చర్యపడి నీ అద్భుతలీల గానము చేసెను. నీవు నీ భార్యలతో ప్రతి స్త్రీకి పదిమంది చొప్పున బిడ్డల ననుగ్రహించితివి. నారదుడు దేవర్షి. ఆయనకే సాధ్యం కానప్పుడు నాబోటి సామాన్యునికి నీలీలలు తెలుసుకోవటం సాధ్యమా? నన్ను కరుణించి నా వ్యాధిని నివారించి నన్ను రక్షించరాదా? ఓ గురువాయూరప్పా! భట్టతిరికృతిని తెలుగు పద్యములలో విని నన్ను అనుగ్రహింపుము తండ్రీ!

## 46. ఉషాపరిణయము, నృగమహారాజునకు శాపవిముక్తి

సీ॥ ప్రభు! నీదు అంశాన ప్రద్యుమ్నుడుదయించె
జనని రుక్మిణి తాను సంతసించ
అతనిని ఆ శంబరాసురుడెత్తుక
పోయెను దునిమె నీపుత్రుడతని
ఆ రతీదేవితో అతడొచ్చె ద్వారక
మామపుత్రిని ఆడె మనువు అతడు
ఆమె సుపుత్రుడే అనిరుద్ధుడనువాడు
అందాలయువకుడు అతను సుమతి
రుక్మి మనుమరాలు రోచనన్ వరియించి
పెండ్లాడెనాతండు పెద్దలెదుట

తే॥ నీదు అన్నయు రుక్మియు జూదమందు
తగవులాడిరి కోపియై తలను నరికె
అన్న రాముండు, జూదమనర్థమయ్య!
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.



తా॥ ఓ ప్రభూ! నీ అంశతో జన్మించి రుక్మిణీ గర్భసంజాతుడైన ప్రద్యుమ్నుడు చాల అందగాడు. శంబరాసురుడను రాక్షసుడు అతనిని అపహరించగా ప్రద్యుమ్నుడాతనిని వధించి రతీదేవిని జేపట్టెను. తరువాత ద్వారకకేతెంచెను. తన మేనమామ రుక్మియొక్క పుత్రిక అయిన రుక్మావతిని అతను ఎత్తుకపోయి పరిణయమాడెను. వారి పుత్రుడు మనోహరుడైన అనిరుద్ధుడు. అతను రుక్మి మనుమరాలైన రోచనను వివాహమాడెను. బంధుగుల సమాగమముతో ఆనందం తాండవించు ఆ వివాహమున నీ అన్న బలరాముడు రుక్మితో జూదమాడి ఆ జూద వివాదములో తగవులాడుకొనిరి. ఆగ్రహోదగ్రుడైన బలరాముడు నీచుడైన రుక్మిని వధించెను. ఓ గురువాయూరప్పా! అందుకే జూదము అనర్థదాయకం అని పెద్దలన్నారు. ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!





చం॥
దనుజుడు బాణుడా బలికి తగ్గసుతుండు పినాకి భక్తుడున్
అనుపమ లీల ఆతనికి హస్తము లొక్క సహస్రముండెబో
తనయ ఉషంచు పిల్వబడె తన్విసుశీలట నీదు పౌత్రునిన్
కనెతను స్వప్నమందు ఇక కన్యక క్రుంగెను కామపీడితై
విను గురువాయుపట్టణపు విష్ణుని గాథను నందనందనా!

తా॥ ఓ నందనందనా! బలిచక్రవర్తికి వరపుత్రుడైన బాణాసురుడు శంకరుని పరమభక్తుడు. పరమశివుడే తన ప్రమద గణములతో బాణుని రక్షగా అతనికి కావలి యుండెను. పరమవీరుడైన ఆతని అందాల పుత్రికయే ఉష. బాణునికి వేయి హస్తములు కలుగుటయే కాక ఒకేసారి ఐదువందల విల్లులనుండి బాణములు వేయగల సమర్థుడు. ఉష సౌశీల్యవతి. ఆమె తన స్వప్నమున ఒకరోజు నీ మనుమడు అనిరుద్ధుని గాంచి కామపీడిత అయ్యెను. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!





తే॥ ఉషకు చిత్రలేఖనియెడి యోగినొకతె
నెచ్చెలిగనుండె తానెంతొ నిపుణురాలు
స్వప్నమును విని రాజుల పటములామె
గీసి చూపెను, ఆ ఉష చూసి తాను
గుర్తుబట్టెను, అనిరుద్ధుకోరె పతిగ
రాత్రి అనిరుద్ధుజేర్చెను లలన జెంత
మరియు గూర్పెను వారి సమాగమంబు
వినుము గురువాయు పురవిభో! విష్ణుగాథ.

తా॥ ఓ ప్రభూ! ఉషయొక్క స్నేహితురాలైన చిత్రలేఖ అనునామె గొప్ప యోగిని. కడు సమర్థురాలైన ఆమె తన నెచ్చెలికి యువకులైన రాజులు మరియు రాకుమారుల చిత్రపటములు గీసి చూపుచుండగా నీ మనుమడైన అనిరుద్ధుని చిత్రపటమును చూచి అది తన కలల రాకుమారునిగా గుర్తించెను. ఆమె కోరిక మేరకు చిత్రలేఖ తన యోగ బలముతో రాత్రివేళ అనిరుద్ధుని ఆ ఉష మందిరమునకు

చేర్చెను. అట్లు వారి సమాగమము జరిగినది. ఓ గురువాయూరప్పా! దివ్యమైన ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!

46/4

ఉ॥

**వారలు దేలగా సురతి బాణుడెరింగెను నీదు పౌత్రునిన్**
**మీరిన క్రోధియై పెనచిబెట్టెచెరన్ గొని నాగపాశమున్**
**నారదుడీ కథన్ దెలుప నందసుతా! పరమాగ్రహంబునన్**
**జేరగ యాదవుల్ అసురు జీల్చగ శోణిత పట్టణంబుపై**
**బోరగ ముట్టడించితివి ఓ గురువాయుపురాధినాయకా!**

తా॥ ప్రభూ! ఉషానిరుద్ధులు ఆ విధముగా సుఖించుచుండగా చివరకు ఈ విషయము బాణాసురునికి తెలిసెను. అతడు కోపించి నీ మనుమని నాగపాశముతో బంధించెను. నారద మహర్షి వలన నీవీ సంగతి తెలిసికొని కుపితుడవైతివి. నందసుతుడవైన ఓ గురువాయూరప్పా! నీవు



యాదవులతో కలిసి బాణుని రాజధానియైన శోణితపురమును వానిని సంహరించుటకై ముట్టడించితివి.

46/5

తే॥ **పూని రక్షించు శోణితపురిని శివుడు**
**భూతగణములన్నియు నిల్వ అతనితోడు**
**గణములను బోర యాదవుల్ రణమునందు**
**సాత్యకిని బాణుడెదిరించె స్వయముతానె**
**పోరె ప్రద్యుమ్నుతోటి కుమారుడట్లె**
**నీవు తలపడినావయ్య నీలకంఠు**
**భట్టతిరి కృతి తెలిపెద పద్యమందు**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! శోణితపురమును సదా రక్షించుచున్న సదా శివుడు తనయొక్క భూతగణములనన్నింటితో కలసి యాదవుల నెదిరించెను. మహా బలపరాక్రమ



శాలి అయిన బాణాసురుడు సాత్యకితోను, కుమారస్వామి ప్రద్యుమ్నునితోను యుద్ధము జేయగా పరమశివుని నీవే స్వయముగా ఎదుర్కొంటివి. నారాయణ భట్టతిరి భాగవతమును నేను తెలుగు పద్యములలో చెబుతున్నాను. ఓ గురువాయూరప్పా! దీనినాలకింపుము తండ్రీ!

46/6

తే॥ **ఈశ్వరుని అస్త్రశస్త్రములెల్ల నీవు**
**విరిచి నారాయణాస్త్రంబు వేసి శివుని**
**వివశుజేశావు, గణములు భీతిపారె**
**స్కందుడోడెను ప్రద్యుమ్ను శస్త్రగతిని**
**బాణదైత్యుని మంత్రి కుంభాండుడంత**
**పచ్చికుండలా అన్నచే విచ్చుకొనియె**
**భట్టతిరికృతి తెలిపెద పద్యమందు**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**



తా॥ ఓప్రభూ! యుద్ధమున నీవు ఈశ్వరునియొక్క శస్త్రాస్త్రములన్నియు ఖండించి నీ నారాయణాస్త్రముచే ఆతనిని మోహపరచితివి. అందుచే శంకరుని భూత గణములన్నియు భీతిల్లి పారిపోయినవి. ప్రద్యుమ్ముని చేతిలో కుమారస్వామి ఓడిపోయెను. బలరాముని చేతిలో బాణుని మంత్రి అయిన కుంభాండుడు పచ్చికుండ విచ్చుకున్నట్లు విచ్చుకొని పోయెను. ఓ గురువాయూరప్పా! భట్టతిరి భాగవతమును తెలుగు పద్యరూపంలో ఆలకింపుము తండ్రీ!

46/7

సీ॥ **అప్పుడు బాణుండు ఐదువందల విల్లు**
**లను బూని నీతోటి అనికి దిగెను**
**ధనసులు బాణాలు ధ్వంసంబు జేశావు**
**బాణుండు ఓడంగ మరలిపోయె**
**శివజ్వరమప్పుడు శిక్షింపనిన్ వచ్చి**
**విష్ణుజ్వరముచేత వీగిపోయె**
**స్తుతియించి నిన్నది మతికెక్కి జ్ఞానమ్ము**
**మన్నింపు కోరుచు మరలిపోయె**

తే॥ హరికి భక్తుల తాకను అంచు బలికె
జ్ఞాన నిధులయ్యు శైవులు సహజముగనె
తము తమోగుణోపేతులై తనరుచుంద్రు
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ఓ ప్రభూ! ఆసమయమున బాణాసురుడు తన ఐదువందల ధనస్సులు పట్టుకొని యుద్ధము చేయుటకు వచ్చెను. కాని అతని ధనుర్బాణములన్నియు ముక్కలైపోగా అతను పరాజితుడయ్యెను. వెంటనే వెనుదిరిగి పోయెను. అప్పుడు శివజ్వరము నీపై బడగా విష్ణుజ్వరము దానికి అమిత తాపము కలిగించెను. అంత శివజ్వరము జ్ఞానమును పొంది నిన్ను స్తుతించి నీ చరితముగానము చేసినవారికి జ్వరబాధలుండవని అనుగ్రహించి మరలిపోయెను. ఓ గురువాయూరప్పా! రుద్రుని అనుచరులందరు సహజముగానే మనస్సునందు గొప్ప జ్ఞాన



సంపన్నులు కాని తమోగుణ ప్రధానులగుటచే భయంకరమైన కర్మలు చేయుచుందురు. ఓ దేవా! ఈ విష్ణుగాథను ఆలకింపుము తండ్రీ!

46/8

సీ॥ తానహంకారియై తలపడె బాణుండు
మరల నీపై అని జరుపవచ్చె
ఖండించి బాహువుల్ గర్వంబు హరియించ
హరుడొచ్చి నిను వేడె అసురు బ్రోవ
దయదల్చి వాని హస్తములు రెండుంచావు
అభయమ్మునిచ్చావు అతనికీవు
అనిరుద్ధుడున్ ఉష అతివైభవంబుగా
పరిణయమాడిరి వాసుదేవ!

తే॥ బాణుడిచ్చెను మితిలేని బహుమతులను
ద్వారకాపురి వచ్చిరి తరలిమీరు
భట్టతిరి కృతి తెనిగింతు పద్య సరళి
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.



తా॥ ఓ వాసుదేవా! అహంకారము వలన బాణాసురుడు మరల యుద్ధమును చేయుటకు అనేకాయుధములతో నీపైకి రాగా అతని బాహువులను ఖండించుచు బాణాసురుని గర్వమును ఖర్వము జేసితివి. అప్పుడు శంకరుడు వెంటనే అక్కడకు వచ్చి నిన్ను స్తుతింపగా ఆయనమాటను మన్నించి శంకరుని భక్తుడైన బాణునకు రెండు బాహువులను మాత్రముంచి మిగిలినవన్నీ ఖండించితివి. అటుపైన బాణునకు అభయము నొసంగితివి. ఆ తరువాత ఉషానిరుద్ధులకు వైభవముగా వివాహము జరిగినది. ఆ తరువాత బాణాసురుడు నీకు అమూల్యమైన కానుకలను సమర్పించెను. నీవు నీవారందరితో కలిసి ద్వారక చేరుకొంటివి. ఓ గురువాయూరప్పా! భట్టతిరి భాగవతమును తెలుగు పద్యములలో చెప్పుచున్న నన్ను విని నన్ననుగ్రహింపుము.



46/9

సీ॥ నీవారి గర్వంబు నిహతి జేతువు ప్రభూ!
ఎవరైన నీకేమి? దేవదేవ!
పలుమార్లు త్రుంచావు పాకారి గర్వంబు
బ్రహ్మనిన్ శరణని పదముబట్టె
వరుణుని మదమెల్ల తరిగించినావయ్య
యమరాజు పంతంబు అంతమయ్యె
అగ్నిదర్పంబెల్ల అణగించితివి నీవు
శంకరున్ గెలిచావు స్వామి! నేడు

తే॥ నీదు కృష్ణావతారము నిరుపమాన
మయ్య! దేవతలందరి కాద్యుడీవు
బాణదైత్యుని కథతెల్పె మాకు నిజము
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ప్రభూ! నీవు అనేక పర్యాయములు దేవేంద్రుని జయించి ఆయనకు గర్వము నణగించితివి. ఆవుదూడలను దొంగిలించినప్పుడు

బృందావనములో బ్రహ్మదేవునే మోహపరచి వానిగర్వము నణగించితివి. నందగోపుని హరించినప్పుడు వరుణునికి గర్వ భంగము జేసితివి. గురుపుత్రుని తీసికొనివచ్చునపుడు యముని గర్వము నణగించితివి. దావానలమును త్రాగినప్పుడు అగ్నిదేవుని గర్వమును రూపుమాపితివి. నేడు లయకారకుడైన శంకరునే జయించి నీకు నీవే సాటి అనిపించుకొన్నావు. ఇట్లు నీ కృష్ణావతారము సమస్త దేవతలకంటె నీవు ఆద్యుడవని నిరూపించినది. ఈ బాణాసురుని కథవల్ల మాకు అందరికీ ఈ సత్యం తెలిసింది. నారాయణ భట్టతిరి భాగవతాన్ని తెలుగు పద్యములలో చెబుతున్న నాకు ఓ గురువాయూరప్పా! నీవేదిక్కు. దీని నాలకించి నన్ను ధన్యుని చేయుము.

46/10

**తే॥ నృగ మహారాజు పొందెను నీదు కరుణ**
**అతడు సూర్యవంశపు రాజు, హరిని గొలుచు**



**విప్రు శాపాన ఊసరవెల్లి ఆయె**
**అతని కరుణించి సుగతిని అందజేసి**
**బ్రాహ్మణుల భక్తి ఔన్నత్య మహిమ జగతి**
**కెరుక చేశావు. నీవారి కెల్లరికిని**
**నాదు వ్యాధిని సదలించి నయము నిమ్ము**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ భక్త సులభుడవైన ఓ గురువాయూరప్పా! సూరవంశమునకు చెందిన నృగమహారాజు ఒక బ్రాహ్మణుని శాపవశమున ఊసరవెల్లిగా మారిపోయాడు. అట్టి మహారాజును కనికరించి ఆయనకు సుగతిని గూర్చితివి. నీ పరివారములకు బ్రాహ్మణ భక్తియొక్క ఔన్నత్యమును ఉపదేశించితివి. అట్టి స్వామీ! నన్నునుగ్రహించి నా వ్యాధిని నివారింపుము. నారాయణ భట్టతిరి భాగవతమును తెలుగు పద్యములలో చెబుతున్న నాపై దయయుంచి ఈ కథనాలకింపుము తండ్రీ!



## 47. పౌండ్రకవధ- బలరాముని ప్రతాపము

**సీ॥ బలరాముడొకనాడు వచ్చె గోకులమున**
**గోపికలను జూచి కుశలమడిగె**
**వారితో విహరించి మత్తిల్లి యుండెను**
**యమునానదిని బిల్చె అతని కడకు**
**రాకుండెనా నది లాగి నాగలితోటి**
**భయపెట్టె యమునను బలముజూపి**
**గోపాంగనలతోటి కూడి యథేచ్ఛగా**
**విహరించుచుండెను విర్రవీగి**

**తే॥ పౌండ్రకుడు వాసుదేవుడు, వానిదూత**
**బంపె నీకడ తన ఒకమాట తెలుప,**
**భట్టతిరికృతి తెలిపెద పద్యమందు**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**



తా॥ ఓ ప్రభూ! ఒకనాడు నీ అన్న బలరాముడు గోకులమునకు పోయెను.వారిని కుశల ప్రశ్నలడిగెను. ఆ గోపికలతో కలిసి విహరించుచు ఆనందముతో కూడిన మత్తులో నుండెను. ఆ మత్తులో ఆయన యమునానదిని తన దగ్గరకు రమ్మని పిలిచెను. ఆ నది రాలేదని కోపించి తన హలాయుధముతో లాగి ఆ నదినే భయపెట్టెను. తరువాత ఆ నదిలో గోపికలతో కలిసి యధేచ్ఛగా విహరించెను. ఇదిట్లుండగా అక్కడ పౌండ్రక వాసుదేవుడు తన సేవకుల యొక్క మాటల వలన వివేకహీనుడై నీ దగ్గరకు తన దూతను పంపించెను. తన మాటగా నీకొక సందేశమును పంపెను. నారాయణ భట్టతిరులు రచించిన సంక్షిప్త సంస్కృత భాగవతమును నేను తెనిగించుచున్నాను. ఓ గురువాయూరప్పా! దీనినాలకించి నన్నునుగ్రహింపుము తండ్రీ!

47/2

**ఉ॥**

**“నేను ధరాతలిన్ నిలుప నీరజనాభుని అంశబుట్టితిన్**
**పూని ధరించి నావట అపూర్వములైన మదీయ అస్త్రముల్**
**కాన త్యజించి అన్నిటిని కాళ్ళకు మ్రొక్కుము” దూతమాటకున్**
**‘వీనికిదేమి పిచ్చి’ యని బిగ్గరగా సభనున్న అందరున్**
**వానిని దూరిరయ్య గురువాయుపురీశ! వచింతునీకథన్**

తా॥ పౌండ్రక వాసుదేవుడు పంపిన దూత నీతో ఇట్లు చెప్పెను. “నేను ఈ భూమిపై అవతరించిన శ్రీమన్నారాయణుడను. నీవు నా లక్షణములయిన అస్త్రములు శంఖ చక్ర గదాదులను ధరించి చున్నావట. వెంటనే వానిని త్యజించి నన్ను క్షమాభిక్ష వేడుము. నన్ను శరణు గోరుము” నీ సభలోని వారు వీనికి వెర్రి అనుకొని వానిని నిందించిరి. ఓ గురువాయూరప్పా! నీ కథను ఆలకింపుము తండ్రీ!



47/3

**తే॥ పౌండ్రకుని దూత వినిపించి మరలిపోయె**
**యాదవులసేనతో నీవు అతని కడకు**
**వెళ్ళి తిలకించితివి వాని వెఱ్ఱితనము**
**కాల్చుకొని ఒంటిపైన ఆ ఖలుడు దాల్చె**
**నీదు శ్రీవత్స చిహ్నము, అదియుగాక**
**కృత్రిమపు కౌస్తుభ మణిని గాత్రమందు**
**పీత వస్త్రము కుండలాల్ అతను దాల్చె**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! పౌండ్రక వాసుదేవుని దూత తన స్వామి సందేశమును వినిపించి వెడలిపోయెను. నీవు కొందరు యాదవ సైనికులతో పౌండ్రక వాసుదేవుని దగ్గరకు వెళ్ళితివి. ఆతడు తన శరీరమును లోహముతో కాల్చుకొని శ్రీవత్స చిహ్నమును, పీతాంబరమును కూడ ధరించియుండెను. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!



47/4

**చం॥**

**తనుగొని ఉక్కు చక్రమును దానిని వేసెను నిన్ను జంపగా**
**ఘనమగు అగ్నికీలలతొ ఖండనజేసె సుదర్శనంబు ఆ**
**జనపతి మస్తకంబతని సైన్యమునంతయు బూది జేసెనా**
**తని హితుడైన కాశిపతి దారుణలీల గతించెనా అనిన్**
**విను గురువాయుపట్టణపు విష్ణుని గాథను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! పౌండ్రక వాసుదేవుడు ఉక్కుతో చేసిన తన చక్రమును నీపైన నిన్ను సంహరించుటకై విసిరెను. అప్పుడు నీవు గొప్ప అగ్ని శిఖలను వెలిగ్రక్కుతున్న సుదర్శన చక్రమును వానిపై ప్రయోగించి అతని శిరస్సును ఖండించితివి. అప్పుడాతని సైన్యము నంతయు నీవు అంతము జేసితివి. అంతేగాక అతని ప్రియస్నేహితుడైన కాశీరాజు దారుణముగా తల ఖండింపబడి మరణించెను. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధ నాలకింపుము తండ్రీ!



47/5

**తే॥ జడుడు పౌండ్రకుడో ప్రభూ! సాటివారు**
**వానిపొగడంగ నిజముగా వాసుదేవు**
**డతనె అనుకొని ధృఢముగా తన మనసున**
**నీతొ తాదాత్మ్యమందెను నిరతమతడు**
**దాన సాయుజ్యముక్తిని గనెనుతుదిని**
**ఎవరి సుకృతంబు లెట్లుండు ఎవరికెరుక?**
**భట్టతిరి కృతి తెలిపెద పద్యగతిని**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! అజ్ఞానియైన ఆ పౌండ్రకుడు తోడివారు తమ పొగడ్తలతో అతనిని ఆ మాటలే నిజమని భ్రమపడునట్లు జేసిరి. అది తనే వాసుదేవుడను నిశ్చయముతో నీతో తాదాత్మ్యమునందునట్లు జేసెను. సదా నీపైననే ధ్యాస ఉండుటచేత అతడు చివరకు నీ సాయుజ్యముక్తిని పొందెను. ఓగురువాయూరప్పా! ఎవరి సుకృతము లెట్లు ఫలించునో ఎవరికి తెలియును? నారాయణ భట్టతిరి భాగవతమును

తెలుగు పద్యములలో చెప్పుట కూడ నేనేదో జన్మలో చేసిన సుకృతమే కదా! తండ్రీ!

47/6

సీ॥ ప్రభు! కాశికాపురి పతి కొడుకొక్కండు
అతను సుదక్షిణుడనెడివాడు
అతను ముక్కంటికి అభిచార హోమంబు
చేసెను తండ్రికై చింతనొంది
ఒక 'కృత్య' పుట్టెనా హోమంబులో శివ
గణముల కూడంగ గట్టె నతడు
కృత్యతో గణములన్ కృతకృత్యుడై యొక్క
తాటిపై నడిపించె మేటి అతడు

తే॥ వాటి నన్నింటి బంపె నీపైన అతడు
భట్టతిరి నాడు చేసిన భాగవతము
తెలుగు పద్యంబుగా నేడు తెలుపుచుంటి
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.



తా॥ ఓ ప్రభూ! కాశీరాజునకు 'సుదక్షిణుడు' అను కుమారుడు గలడు. అతడు తన తండ్రి మరణమునకు చాల చింతించి, శంకరుని ఆరాధించి 'అభిచారహోమమను' చేసెను. ఆ హోమము నుండి 'కృత్య' పుట్టెను. బాణాసురుడు నీతో యుద్ధము చేసినపుడు శంకరుడు నీచేత మోహితుడవగా భీతిల్లి పారిపోయిన శివ గణములన్నింటికీ ఆ సుదక్షిణుడు ధైర్యమిచ్చి అన్నింటినీ కృత్యకు తోడగునట్లు చేసి ఒక త్రాటిపై నడిపించెను. వాటినన్నింటినీ నీపైన ప్రయోగించెను. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి భాగవతమును తెలుగు పద్యములలో విని నన్ననుగ్రహింపుము తండ్రీ!



47/7

చం॥
కనుగొన తాళవృక్షములు కాళ్ళ వి కృత్యకు సర్వమున్ దహిం
చెను తన అగ్నికీలలతొ చిందరవందర పారిరెల్ల నీ
జనములు కావుమంచు నిను జాలిగ వేడిరి, ఆపి జూదమున్
పెనచి సుదర్శనంబపుడు వేస్తివి అయ్యది 'కృత్య' జంపగా
విను గురువాయుపట్టణపు విష్ణుని గాధను నందనందనా!

తా॥ ఓ నందనందనా! ఆ కృత్య యొక్క కాళ్ళు చూడటానికి తాటిచెట్లలా ఉన్నాయి. ఆ'కృత్య' సమస్తమును దహించి వేయుచుండెను. భయంకరమైన ఆ ఆకారమును జూచి ద్వారకావాసులంతా కకావికలై పారిపోసాగిరి. నీవారందరు నీదగ్గరకు వచ్చి జాలిగా మొఱబెట్టుకొనిరి, రక్షించమనిరి. ఆ సమయమున నీవు జూదము నాడుచుంటివి. ఓ గురువాయూరప్పా! నీవు ఏ మాత్రము తొణకక నీ సుదర్శన చక్రమును ఆ 'కృత్య'ను



సంహరించుటకు ప్రయోగించితివి. తండ్రీ! రమ్యమైన నీకథ నావింపుము.

47/8

తే॥ 'ధగధగ' మను కాంతులతో సుదర్శనంబు
మీద పడుచుండగా 'కృత్య' భీతిచెంది
పైకి హాహా యనే పొలికేక బెట్టి
పారి, కినుక సుదక్షిణుపైకి దూకి
వాని దహియించి కాశికాపట్టణమును
కూడ దగ్ధంబు జేసెను కుదురు చెడగ
భట్టతిరికృతి జేసితి పద్యమందు
వినుము గురువాయు పురవిభో! విష్ణుగాథ.

తా॥ ఓ ప్రభూ! ధగధగమనే ప్రచండ కాంతులతో సుదర్శన చక్రము ఆ 'కృత్య' పై బడినది. భీతిల్లిన 'కృత్య' హాహాకారములు చేస్తూ పారిపోయింది. చక్రము

దానిని వదలక వెంబడించింది. కోపం పట్టలేని 'కృత్య' సుదక్షిణునిపై తిరగబడి వానిపై దూకి దహించి వేసింది. ఆ సుదర్శన చక్రము ఆ 'కృత్య'తో పాటు కాశీనగరమునంతా దగ్ధం చేసింది. ఆ నగరం ఉనికే పోయింది. ఓ గురువాయూరప్పా! భట్టతిరి కృతి భాగవతమును పద్యరూపంలో ఆలకింపుము తండ్రీ!

47/9

**తే॥ వెనుక రావణ వధ యైన పిదప నిన్ను**
**ద్వివిదుడను వానరుండిట్లు సవినయముగ**
**కోరె నీచేత మృత్యువు వరము గాను**
**"అనుజుచే చత్తువ"ని నాడు అంటివీవు**
**అతడె నరకుని మంత్రిగా ఆయె నేడు**
**ద్వారకావాసులందరిన్ బాధపెట్టె**
**కొట్టి అరచేత రాముదై కూల్చినావు**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**



తా॥ ఓ గురువాయూరప్పా! నీ రామావతారములో ఆనాడు రావణ వధానంతరం ద్వివిదుడను వానరుని నీవు సత్కరించి ఏమి కావలెనో కోరుకోమంటే నీచేత మృత్యువు కావలెనని కోరుకున్నాడు. నీ అంశచేత ఆ కోరిక తన తరువాత అవతారములో నెరవేరుతుందని చెప్పావు. అతడే నరకాసురుని మంత్రియై నీ అన్న అయిన నీ అంశ చేతనే చనిపోయాడు. దానికోసం ద్వారకావాసులను బాధించు దుర్మార్గుడయ్యాడు. బలరాముడతనిని తన అరచేతితో ఒక్క చఱుపు చఱిచి ఆ దెబ్బతో వానిని సంహరించాడు. స్వామీ నీ కథను ఆలకింపుము తండ్రీ!



47/10

**సీ॥ నీ బిడ్డ సాంబుడు నీ అన్న శిష్యుడౌ**
**ఆ సుయోధను పుత్రినపహరించె**
**కట్టేసి సాంబుని కౌరవుల్ బంధించ**
**హస్తిన శాంతికై అన్నబోయె**
**కౌరవుల్ మూర్ఖులై కాదన నీ అన్న**
**కోపించి హస్తినన్ గూల్చుననియె**
**భయపడి కౌరవుల్ వదలిరి సాంబునిన్**
**వారినేమనవాయె భవిత తెలిసి**

**తే॥ బంపవాయె యాదవులను వారిపైకి**
**తాపములను తగ్గింపుము దాల్చికరుణ**
**నాదు వ్యాధిని తొలగించి నయము నిమ్ము**
**వినుము గురువాయుపుర విభో! విష్ణుగాథ.**



తా॥ ఓ ప్రభూ! ఆనాడు నీ పుత్రుడైన సాంబుడు దుర్యోధనుని పుత్రికయైన లక్ష్మణను అపహరించగా కౌరవులు సాంబుని బంధించిరి. ఆ సంగతిని వినిన బలరాముడు కౌరవులను శాంతింప జేయుటకు స్వయముగా హస్తినాపురమునకు జేరుకొనెను. ఐనను కౌరవులు మూర్ఖముగా మాట్లాడుచుండగా బలరాముడు హస్తినాపురమును ఎత్తినదిలో ముంచబోయెను. కౌరవులు భయపడి సాంబుని వదిలిపెట్టిరి. భవిష్యత్తులో కౌరవులను పాండవులే వధింతురని నీకు తెలిసియే కాబోలు వారిపై నీ సైన్యమును ప్రయోగించి నీ శౌర్యమును చూపలేదు. ఓ గురువాయూరప్పా! నన్ను కరుణించి నా వ్యాధిని నిర్మూలింపరాదా! నాతాపత్రయములను హరించరాదా! నాద్వారా నీకథను ఆలకించి నన్ననుగ్రహింపుము తండ్రీ!

## 48. సమంతపంచక యాత్ర

**తే॥ ఒక్క సూర్యగ్రహణమున ఓ మహాత్మ!**
**ద్వారకాపురి స్త్రీలతో తరలి నీవు**
**ఆ 'సమంత పంచక' మనునట్టి గొప్ప**
**పుణ్యతీర్థము జేరావు, పురము రక్ష**
**ఒప్పగించావు కృతవర్మకప్పుడీవు**
**కూడ అనిరుద్ధుడతనికి తోడువోలె**
**భట్టతిరికృతి చెప్పెద పద్యగతిని**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాధ.**

తా॥ ఓ మహాత్మా! ఒకనాటి సూర్యగ్రహణము నాడు నీవు ద్వారకా నగరమున ఉన్న స్త్రీలు మొదలగు వారితో కలిసి 'సమంత పంచకము' అను పుణ్యతీర్థమునకు బోతివి ఆ సమయమున పట్టణ రక్షగా బాధ్యతను కృతవర్మకు ఒప్పగించి అతనికి తోడుగా నీ మనుమడు అనిరుద్ధుని ఉంచావు. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి



భాగవతమును తెలుగు పద్యము రూపములో విని నన్ను అనుగ్రహింపుము, తండ్రీ!

48/2

**చం॥**
**మునుగగ పుణ్య తీర్థమున మోదక మాయె పవిత్రమింకనున్**
**జనుల హితంబుకై నదుల స్నానము జేతురు దివ్యులత్తరిన్**
**గొనకొని బ్రాహ్మణోత్తములకున్ పలుదానము లిచ్చితీవటన్**
**నిను కురుపాండవుల్ కలిసి నెయ్యములన్ పునరుద్ధరించగా**
**విను గురువాయుపట్టణపు విష్ణుని గాధను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! ఆ సమంత పంచక తీర్థములో నీవు మునిగి స్నానము చేయుటవలన ఆ తీర్థము ఇంకను పరమ పవిత్రమయ్యెను. నీవంటి దివ్య పురుషులు తమ స్వార్థమునకు గాక తక్కిన ప్రజలు అట్లు పునీతమైన తీర్థములలో స్నానము చేసి తరించుటకే తాము పవిత్ర తీర్థములలో స్నానమాడుదురు. అచ్చట నీవు బ్రాహ్మణోత్తములకు అనేక విధములైన దానములను జేసితివి. అక్కడనే



నీతో కౌరవులు, పాండవులు మరియు నీ పూర్వ మిత్రులు కలిసిరి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధ నాలకింపుము తండ్రీ!

48/3

**కం॥ తను భక్తురాలు ద్రౌపది**
**ఘనముగ నీ అష్టసతుల గాధలు వినుచున్**
**మనసార సంతసించెను**
**విను గురు అనిలాలయేశ! విష్ణుని కథలన్**

తా॥ ఓ గురువాయూరప్పా! ద్రౌపదీ దేవి నీపై అనన్యమైన భక్తిగల పాండవపత్ని. ఆమె నీ పట్ట మహిషులతో కలిసి మాట్లాడుచున్నప్పుడు వారు తమ తమ వివాహ వృత్తాంతములను కథలుగా ఆమెకు వివరించిరి. ఆ ఎనిమిది కథలను విని ద్రౌపది మనసార ఆనందించినది. తక్కిన స్త్రీలు గూడ ఆ సంగతులను విని ఆనందించిరి. నీవు కూడ ఈ విష్ణుగాధలను ఆలకింపుము తండ్రీ!



48/4

**తే॥ గోకులంబంత అచటకు కూడి వచ్చె**
**నందుడాది గోపకులకు అందరికిని**
**గౌరవంబిచ్చి నావంత కలిసి నీవు**
**విరహ బాధచే కాబోలు గోరమణులు**
**దర్భ పుల్లల వలె చిక్కి తనరి నారు**
**సరస వచనాలు పలికావు మురియవారు**
**భట్టతిరి కృతి తెలిపెద పద్యగతిని**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాధ.**

తా॥ ఓ ప్రభూ! అప్పుడు సమంత పంచక తీర్థమునకు నందుడు మొదలైన గోపాలురు గోపికలతో అక్కడికి వచ్చారు. నీవు వారిని జూచి వారి దగ్గరకు పోయి వారిని గౌరవించితివి. చాలకాలమునుండి నీ విరహ బాధననుభవించుచున్నందు వలన జిక్కి దర్భ పుల్లలవలె యున్న గోపికలను నీ సరస వచనములతో పలుకరించి సంతోషపరచితివి. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి కావ్యమును తెలుగు పద్యములలో విని నన్ను అనుగ్రహింపుము.

48/5

**ఆ.వె॥ కనుల పండుగాయె కద! నీదు కలయిక**
**వర్ణనలకు కాదు వారి ప్రేమ**
**గొప్ప సంతసంబు గురువాయుపురవిభో!**
**గరపినావు వారి కౌగలించి.**

తా॥ ఓ గురువాయూరప్పా! చాలకాలము తరువాత నిన్ను దర్శించుటచే గోపికల యొక్క ఆనందము వర్ణించుట అసాధ్యము. నీ కలయిక కన్నులపండుగే కదా! అత్యంత ప్రేమానురాగములతో నున్న గోపికలను ఆలింగనము చేసికొని వారిని పరమానంద పరవశులను చేసినావు.

48/6

**ఉ॥**
**శత్రువులెక్కుడై కలియజాలను రాధిక! కాలమంతయున్**
**ఆత్రుత, యుద్ధవ్యూహముల నందితి వేదన, జాగు ఆయెనే**
**మాత్రము కల్లకాదని అమాంతము కౌగిలిలో బిగింతువే**
**చిత్రము!! మారుపల్కదయె చిన్నది హే గురువాయునాయకా!**



తా॥ ఓ గురువాయూరప్పా! నీవు రాధతో ఇట్లంటివి "రాధికా! నాకు శత్రువులు ఎక్కువై మాటి మాటికి సంభవించు యుద్ధముల వలన నేను ఇంత కాలము వరకు నీవద్దకు రాలేకపోయితిని. నేనూ చాల బాధపడ్డాను. ఈ మాటలు ఎంత మాత్రము అబద్ధం కావు" ఆ విధముగా పలుకుచు రాధను ఒక్కసారిగా నీ హృదయానికి హత్తుకొంటివి. ఆశ్చర్యంగా ఆమె నీ కౌగిలిలో సుఖానుభూతి నొందుచు మారు పలుక జాలక పోయెను.

48/7

**తే॥ వారి విరహ బాధను రూపుమాపదలచి**
**తత్త్వ బోధను జేశావు తరుణులకును**
**"ఆత్మరూపుడనైయుంటినరయనేను**
**అందరి యెదలో, విరహంబు అనెడి మాట**
**యుండదీమాట మరువక యుండుడింక"**
**అనుచు బోధించితివి నీవు అద్భుతముగ**
**భట్టతిరికృతి తెలుగులో పద్యమాయె**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**



తా॥ ప్రభూ! నీవు అప్పుడు గోపికలందరికీ విరహ బాధను దూరము చేసి వారికి తత్త్వ జ్ఞానమును ఉపదేశించితివి. ''నేను అందరిలోను ఆత్మస్వరూపుడనై యుందును. కనుక మీకు నావలన విరహము అనెడి మాటయే యుండదు. ఈ విషయము మీ అందరి మనస్సులందు స్థిరముగా ఉండుగాక!" అని నీవు వారికి బోధించితివి. ఓ గురువాయూరప్పా! భట్టతిరి భాగవతమును తెలుగు పద్యరచనగా ఆలకించి నన్ననుగ్రహింపుము తండ్రీ!

48/8

**చం॥**
**అరయక నిన్ను గోపికలు అంతములేని వియోగ బాధనొం**
**దిరి, తను ఉద్ధవుండపుడు తెల్పెను నీదగు ఊరడింపులన్**
**తరిగె వియోగ బాధయును తాపము పోయెను నేటి బోధచే**
**సరియగు తీరునన్ కలిగె సంతసమయ్యది తన్మయంబునన్**
**గురు అనిలాలయేశ! వినగోరెద నీ కథ పద్యమందునన్.**



తా॥ ఓ గురువాయూరప్పా! పూర్వము గోపికలు నీయెడబాటు వలన అంతులేని వియోగబాధకు లోనైయుండిరి. అప్పుడు ఉద్ధవుడు నీచే పంపబడి వారికి నీ ప్రేమతత్త్వమునుపదేశించి ఊరట గొలిపెను. ఆనందము మిశ్రితమై వారి విరహ బాధ కొంత తొలగినది. ప్రస్తుతము నీ ఉపదేశము వలన నీ చింతనయే పరమానంద దాయకమను సత్యము తెలిసి సరియైన మార్గమును గ్రహించగలిగిరి. వారు తన్మయత్వములోని సంతోషమునమభవించిరి. ఓ ప్రభూ! నీ దివ్యగాధనాలకింపుము తండ్రీ!

48/9

**తే॥ దేవ! నీతండ్రి ఆ పుణ్యతీర్థమునకు**
**వచ్చిన ఋషులన్ అడిగెను పాపక్షయము**
**జేయు పుణ్య కార్యంబేదొ చెప్పమనుచు**
**వారు "పరమాత్మవౌ నీదు వద్దనుంట**
**కంటె పుణ్యమేమని నవ్వి అంటిరపుడు**
**ఐన నా వసుదేవుడు మునులచేత**
**సత్రయాగము నిష్ఠగా జరుపజేసె**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ దేవా! అప్పుడు నీ తండ్రియైన వసుదేవుడు ఆ పుణ్యతీర్థమునకు వచ్చిన మహర్షులను కలిసి పాప క్షయమునకై చేయవలసిన పుణ్యకార్యముల గురించి చెప్పమనిరి. ఆ ఋషులు నవ్వుచూ పరమాత్మవగు నీవు దగ్గర ఉండగా ఇంకా వేరు పుణ్యకర్మలతో పని ఏమున్నదని ప్రశ్నించిరి. అయిననూ వసుదేవుడు ఆ మహర్షుల చేత యజ్ఞమును చేయించదలచి



సత్రయాగమును నిష్ఠతో జరిపించెను. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథనాలకింపుము తండ్రీ!

48/10

**చం॥**
**జనకుడు మూడు మాసములు జన్నము జేసెను నీవు యాదవుల్**
**ఘనముగ బంధుమిత్రులతొ కాలముబుచ్చిరి గోపులందరిన్**
**కనిరి సమానులైన గతి గౌరవమిచ్చిరి, సంతసంబునన్**
**మునుగుచు నీ సమాగమము మోక్షముగా తలపోసి రందరున్**
**విను గురువాయు పట్టణపు విష్ణుని గాథను నందనందనా!**

తా॥ ఓ ప్రభూ! నీ జనకుడైన వసుదేవుడు చేయించుచున్న సత్రయాగము మూడు నెలల వరకు కొనసాగినది. దానివలన నీ మిత్రులందరును చాల సంతోషముతో కాలము నీతో గడిపిరి. అప్పుడు యాదవులు గోపాలురను తమతో సమానులుగా సన్మానించిరి.



అందువలన మూడు నెలలు నీ సమాగమ సంతోషములను గోపికలు మునుపటి వలెనె అనుభవించి అదే మోక్షప్రాప్తి అన్నంత దివ్యానందము ననుభవించిరి. ఓ గురు వాయూరప్పా! ఈ విష్ణుగాథనాలకింపుము తండ్రీ!

48/11

**తే॥ సత్రయాగము పూర్తియై జనస్రవంతి**
**తరలిపోయిరి తమతమ తావులకును**
**కలిసి రాధను ప్రేమగా కౌగిలించి**
**విరహబాధను తొలగించి వీడుకోలు**
**నిచ్చి ద్వారక జేరావు; ఇంకనైన**
**నాదు వ్యాధి నిర్మూలించి నయమునిమ్ము**
**భట్టతిరి కృతి తెలిపెద పద్యగతిని**
**వినుము గురువాయు పురవిభో! విష్ణుగాథ.**



తా॥ ఓ ప్రభూ! సత్రయాగము పూర్తి అయిన తరువాత అందరు తమ తమ ఇండ్లకు తిరిగిపోవుచుండిరి. ఆ సమయమున నీవు రాధాదేవిని దగ్గరకు తీసికొని కౌగలించుకొని ఆమె విరహబాధను రూపుమాపితివి. ఆ తరువాత సంతోషముతో వీడ్కోలు పలికి ద్వారకా నగరమునకు వెళ్ళితివి. ఓ గురువాయూరప్పా! ఇకనైనా నా వ్యాధిని నిర్మూలింపరాదా? నారాయణ భట్టతిరి రచించిన శ్రీమన్నారాయణీయమును తెలుగు పద్యములలో చెప్పదలచిన నన్ను అనుగ్రహింపుము తండ్రీ!

## 49. యుధిష్ఠిరుని
## రాజసూయ యాగము- శిశుపాల వధ

**తే॥ మగధపతి జరాసంధుడు మదముజేత**
**పట్టి బంధించి చెరలోన బెట్టె నృపులు**
**నొవ్వ రెండొందలెనిమిది నూర్లుమంది**
**నీకు సందేశమును బంపి నిన్నుగావ**
**మనుచు వేడిరి దూతచే ఆ నృపతులు**
**మగధనాధుని వధియించి వారిబ్రోవ**
**భట్టతిరి కృతి తెలిపెద పద్యగతిని**
**వినుము గురువాయు పురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ దేవా! మగధరాజైన జరాసంధుడు ఇరువది వేల ఎనిమిది వందల మంది రాజులను జయించి, వారి నందరిని తన కారాగారమున నిర్బంధించెను. జరాసంధుని కారాగారములో అనేక బాధల ననుభవించుచున్న ఆ రాజులు జరాసంధుని



వధింపమని కోరుచు దిక్కులేని వారికి దిక్కైన నీ దగ్గరకు ఒక దూతను పంపించిరి. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి రచించిన సంక్షిప్త భాగవతమును తెలుగు పద్యములలో విని నన్నునుగ్రహింపుము తండ్రీ!

49/2

**సీ॥ దూత మాటలు విని హతు జరాసుతు జేయ**
**నిశ్చయించితివంత నీవు వెడల**
**రాజసూయము ధర్మరాజు చేయగనెంచె**
**నని దెల్పె నారదమౌని నీకు**
**ఎచటికి బోవలె యోచన ఉద్ధవు**
**డందించె బొమ్మనె యాగమునకు**
**శత్రుసంహారంబు జరుపును యాగంబు**
**పనులు రెండౌనని తాను తెలిపె**



**తే॥ ఇంద్రప్రస్థము బోతివి యెంచి నీవు**
**సపరివారంబుగా కూడి సవనమునకు**
**భట్టతిరికృతి తెలిపెద పద్యగతిని**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ దేవా! దూతయొక్క మాటలను విని జరాసంధుని వధించెదనని బయలుదేరితివి. ఆ సమయముననే నారద మహర్షి వచ్చి 'ధర్మరాజు రాజసూయ యాగమును చేయుచున్నాడు' అని తెలిపెను. అప్పుడు ఎక్కడకు ముందుగా బోవలెను? ఆలోచించుచున్న నీకు ఉద్ధవుడు రాజసూయమున శత్రువులపై విజయము తప్పక జరుగును కావున ఒకే ప్రయత్నమున రెండు పనులు సమకూరునని తెలిపెను అందుచేత నీవు అష్ట భార్యలతోను బంధువులతోను రాజసూయ యాగమును చూచుటకు ధర్మరాజు నివసించు ఇంద్రప్రస్థమునకు ప్రయాణమైతివి. ఓ గురువాయూరప్పా! భట్టతిరి కావ్యమును తెలుగు పద్యములలో విని నన్నునుగ్రహింపుము తండ్రీ!



49/3

**చం॥**
**గొనకొని అష్ట భార్యలును కూడగ పాండవ రాజధానికిన్**
**చని అటు రాజసూయమున సాయము జేయగబోతివో ప్రభూ!**
**ఘనులగు భీమపార్థులును కయ్యమునన్ నృపులెల్ల ఓడగా**
**పనిచిరి, ఆ జరాసుతుని వద్దకు మువ్వుర బంపె జ్యేష్టుడున్**
**విను గురువాయు పట్టణపు విష్ణుని గాథను నందనందనా!**

తా॥ ఓ నందనందనా! నీవు నీ పట్టపురాణులందరితో గూడి ఇంద్రప్రస్థమునకు వెళ్ళితివి నీ అనుగ్రహము వలన ధర్మరాజు గొప్ప బలశాలురైన తన తమ్ములు భీమార్జునుల ద్వారా అనేకమంది రాజులను గెలిచి గొప్ప సిరిసంపదలను తెచ్చిరి. రాజుసూయమున పాండవులకు సహకరించుటకు వచ్చిన నీతో కలిసి భీమార్జునులు జరాసంధుని వద్దకు వానితో పోరునకై బయలుదేరిరి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథనాలకింపుము తండ్రీ!

49/4

ఉ॥

**మువ్వురు విప్రరూపముల బోతిరి మాగధురాజధానికిన్**
**అవ్విధిబోయి రాజుకడ యాచన జేసిరి పోరయొక్కనిన్**
**క్రొవ్విడి నట్టి రాజనె వృకోదరుడే సరి వాని బోరెదన్**
**ఎవ్వని కౌను మృత్యువది ఈవు తలంపక నీదు చేతిలో**
**దవ్వున నుండి కంటిరి కదా! గురువాయుపురీశ! ద్వంద్వమున్.**

తా॥ ఓ గురువాయూరప్పా! మీరు ముగ్గురును బ్రాహ్మణుల వేషములతో మగధనాధుడైన జరాసంధుని రాజధానియైన గిరివ్రజ పురమునకు వెడలిరి. అట్లు పోయి ఆ జరాసంధుని యుద్ధము కావలెనని యాచించిరి. మదగర్వముతోనున్న ఆ జరాసంధుడు మారువేషములలో నున్న మిమ్ము గుర్తించక తనకు సమానమైన కండబలముగల భీమసేనునే ద్వంద్వ యుద్ధమునకు ఎన్నుకొనెను. అది అంతయు నీ లీల. నీ చేతిలో మరణించు అదృష్టము ఆ దుర్మార్గునకు



లేదు. అందుచే నీవు అర్జునునితో కలిసి వారి ద్వంద్వ యుద్ధమును తిలకించితివి.

49/5

సీ॥ **ఎడతెరిపేలేక ఇరువురు బోరిరి**
**అధికుడై తోచె మగధకు నృపతి**
**కొమ్మనొక్కటి జీల్చి కుడి ఎడమలు మార్చి**
**విసిరేసి చూపావు భీమునికిని**
**మాగధునటుజేసి పడవేసె భీముందు**
**ఆ జరాసుతుకథ అంతమయ్యె**
**రాజుల బ్రోచి కారాగార ముక్తులన్**
**గరిపావు రాజ్యముల్ తిరిగి ఇచ్చి**

తే॥ **వారు నీభక్తులై నిన్ను ప్రస్తుతించి**
**ధర్మరాజు సామంతులై తనరినారు**
**భట్టతిరి కృతి తెలిపెద పద్యగతిని**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**



తా॥ ఓ ప్రభూ! భీమజరాసంధుల మధ్య ఎడతెరపి లేక యుద్ధము సాగినది. ఆ ద్వంద్వ యుద్ధమున జరాసంధునిదే పైచేయిగా కనబడుచుండెను. అప్పుడు నీవు ఒక కొమ్మను జీల్చి, చీలిన భాగములను కుడిది ఎడమవైపునకును, ఎడమది కుడివైపునకును విసిరి సంజ్ఞ చేసితివి. ఆ సైగను అర్థము చేసినకొనిన భీముడు జరాసంధు చీల్చి అట్లేచేసి వానిని సంహరించెను. తరువాత కారాగారమున నున్న రాజులనందరను నీ దయచే బంధవిముక్తులను చేసితివి. వారు ఆనందించి నీ యెడల పరమ భక్తులైరి. నీవు వారినట్లు అనుగ్రహించితివి. తమ ప్రాణములపై ఆశ వదలుకొన్న వారికి తిరిగి వారి రాజ్యములనొసంగి పాలించుకొమ్మని అనుగ్రహించితివి. వారు ధర్మజునకు సామంతులైరి. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి భాగవతమును పద్యీకరించు నన్ను అనుగ్రహింపుము తండ్రీ!



49/6

ఆ.వె॥ **మొదలుపెట్టె జన్నమును ధర్మరాజంత**
**చేరి రాజులైరి సేవకాళి**
**విప్రవరుల కాళ్ళు వినుగురు అనిలేశ!**
**కడుగ నీవు, వాని ఖ్యాతి పెరిగె.**

తా॥ ఓ గురువాయూరప్పా! అప్పుడు ధర్మరాజు రాజసూయ యాగము చేయుటకు ఆరంభించెను. ఆ యాగమున రాజు లందరు సేవకులవలె పనులు చేయుచుండిరి. నీవును యాగమునకు వచ్చిన బ్రాహ్మణులకు పాదములను కడుగుచుండగా ఆ ధర్మజుని ఖ్యాతి పెరిగెను. వానిదెంత అదృష్టము!!

49/7

**ఉ॥**
**ఎంపిక సర్వశ్రేష్ఠునికి ఎవ్విధియౌ? సహదేవుడెంచె నిన్**
**ఇంపుగ అగ్రపూజ పరమేశ్వరుకీ దగు ధర్మసూనుడున్**
**తెంపున ఔను ఔననెను తెచ్చిన అర్ఘ్యమునీకు ఈయగా**
**సొంపుగ దేవతల్ నరులు చూచి ముదంబున మెచ్చిరో ప్రభూ!**
**లంపటముల్ హరించి వినరా గురువాయుపురాధి నాయకా!**

తా॥ ఓ గురువాయూరప్పా! ఆ యాగమునందు సర్వశ్రేష్ఠుడైన వానికి అగ్రతాంబూలమిచ్చి పూజించవలెను. అదేవిధంగా సహదేవుడు సర్వాత్మకుడవైన నిన్నుపూజించి అర్ఘ్యమీయవలెనని నిశ్చయించెను. ధర్మరాజు సర్వభూతాత్మకుడవైన నిన్ను పూజించవలెనని, అతని నిర్ణయమునకు ధైర్యముగా ఔను ఔనని తన నిర్ణయమును తెలిపెను.



అట్లేనిన్ను పూజించి అర్ఘ్యమిచ్చెను. అప్పుడు దేవతలు, మానవులు కూడ ఆ నిర్ణయమును సమర్ధించి ఆనందించిరి. ఓ ప్రభూ! నాకున్న ఈ బంధనములను విడిపించరాదా?

49/8

**తే॥ చేది రాజైన శిశుపాలుడిది కనంగ**
**ఆగ్రహోదగ్రుడై లేచి అనెను ఇట్లు**
**"పశులమేపు యాదవునికి పదవి ఏల?**
**వయసు లేదు, మహర్షియా?వసుధపతియ?**
**ఎట్లు పూజార్హుడీతండు? ఇతనిపూజ**
**సలుపు వారెంత మూర్ఖులు!!" పలికె కత్తి**
**దూసి, పాండవులతని నెదురు కొనంగ,**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**



తా॥ అప్పుడు చేదిరాజైన శిశుపాలుడు కోపముతో లేచి "ఈ కృష్ణుడు పశువులను మేపుకొను యాదవుడు. ఇతను ఏ పదవికీ అర్హుడు కాదు. వయస్సులో చాల చిన్నవాడు. మహర్షియా కాదు. మహీపతియా కాదు. ఇతడు ఇక ఎట్లు పూజార్హుడు. ఇంతమంది మహామహులుండగా ఈ కృష్ణుని పూజించువారు ఎంత మూర్ఖులు!! అనిదుర్భాషలాడి కత్తిదూసి సింహాసనముపైనుండి లేచెను. పాండవులతనిని ఎదుర్కొనిరి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథనాలకింపుము తండ్రీ!



49/9

**సీ॥ వాసుదేవా! నీదు వారలౌ పాండవు**
**లందరిన్ వారించి అపుడు నీవు**
**రాక్షసాంతక సుదర్శన చక్రమును వేసి**
**ఖండించితివి దూరు ఖలుని శిరసు**
**గత జన్మలందున కడుద్వేష భావాన**
**నైన నిన్నేవారు అనవరతము**
**స్మరియించినందున దురితంబు నశియించి**
**నీదయబొందిరి తుదిని వారు**

**తే॥ యోగులకు దుర్లభంబైన యోగమదియె**
**పరమ ముక్తిని ఆ శిశుపాలుడందె**
**భట్టతిరి కృతి తెలిపెద పద్యసరళి**
**వినుము గురువాయు పురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ వాసుదేవా! నీవు నీవారలైన పాండవులను వారించి అంతట రాక్షసులను సంహరించునటువంటి నీ సుదర్శన చక్రమును ప్రయోగించి ఆ శిశుపాలుని శిరస్సును ఖండించితివి. గత జన్మలలో ఈ శిశుపాలుడే హిరణ్యకశిపునిగాను, రావణాసురునిగాను జన్మించి నీపై ద్వేషభావముతో అను క్షణము నిన్నే స్మరించుచు నీచే హతులైరి. అట్లు నేడు పాపవిహితుడై పరమ ముక్తిగనెను. యోగులకు కూడ దుర్లభమైన ఆ పరమముక్తి కేవలము నిన్ను సదా స్మరించు వారికే కలుగును. ఓ గురువాయూరప్పా! మా కంతటి భాగ్యము లేకున్నను నీ అనుగ్రహము చాలును. నారాయణ భట్టతిరి సంస్కృత భాగవతమును పద్యరూపమున విని నన్ను రక్షింపుము తండ్రీ!



49/10

**తే॥ రాజసూయము పూర్తయ్యె ప్రజలు మెచ్చి**
**జయ జయ ధ్వానములు మీకు సలిపినారు**
**జ్ఞాతి దుర్యోధనుండిది హితవుగాక**
**పాండవుల నసూయతొ ద్వేషభావములతొ**
**చూచె, మయసభనొకనాడు జొచ్చి అతడు**
**భ్రమకు లోనై సభన్ పరాభవము బొందె**
**భట్టతిరికృతి తెలిపెద పద్య సరళి**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ**

తా॥ ఓప్రభూ! చాలా శ్రేష్ఠమైన రాజసూయ యాగము నీవు నెరవేర్చినందున జనులు నీకు పాండవులకు జయజయధ్వానములను జేసిరి. అందరు వెనుదిరిగిరి. కాని దుర్మార్గుడైన మరియు పాండవుల జ్ఞాతియైన దుర్యోధనుడు ధర్మరాజు యొక్క సంపదలను జూచి అసూయాద్వేషములతో రగిలిపోయెను. మయసభను చూచిన అతడు



జలములేని తావున జలమున్నదని అట్లే జలము ఉన్నతావున జలములేనట్లు బోయి, పడి పరాభవము చెందెను. మచ్చర మధికముగా కలిగిన ఆ దుర్యోధనుడు రగిలిపోయెను. ఓ గురువాయూరప్పా! భట్టతిరి కావ్యమును తెలుగు పద్యములలో ఆలకింపుము తండ్రీ!

49/11

**తే॥ పడె సుయోధనుండారీతి భంగపాటు**
**నాడు ద్రౌపది భీముడు నవ్విరయ్య!**
**నీవు క్రీగంట అది చూచినావు స్వామి!**
**బీజమును నాడె దృఢముగా వేసినావు**
**భూమి భారంబు తగ్గించి పుడమి బ్రోవ**
**నాదువ్యాధిని తొలగించి నయము నిమ్ము**
**ఓ జనార్ధనా! పరమాత్మ! బ్రోవుమయ్య**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాధ.**



తా॥ ఓ ప్రభూ! దుర్యోధనుడు ఆ విధముగా భంగపడగా అది చూచి ద్రౌపది, భీముడు నవ్విరి. నీవు క్రీగంటితో దీనినంతయు గమనించితివి. స్వామీ! ఆరోజే ఒక మహాయుద్ధమునకు బీజమును నాటితివి. దుర్మార్గులను తుదముట్టించి భూభారమును తగ్గించుట కవతరించిన నీవు ఎందుకు సంతోషించవు? ఓ జగన్నాధా! పరమాత్మా! మరి నన్నెందుకు అనుగ్రహించవు? నావ్యాధిని నిర్మూలించి నాకెందుకు నయమునీయవు? రక్షింపవు? నారాయణభట్టతిరి కృతిని తెలుగు పద్యములలో విని ఓ గురువాయూరప్పా! నన్ను కరుణింపుము తండ్రీ!

## 50. సాల్వాదులవధ-భారతయుద్ధము

సీ॥ ప్రభు! నీవు రుక్మిణిన్ పరిణయమావేళ
సాల్వుని యాదవుల్ చావమోద
అవమాన జ్వలితుడై హరుని మెప్పించంగ
'సౌభ' విమానమున్ సాల్వుడొందె
ఇంద్రప్రస్థమునకున్ ఈవు యాగముజూడ
బోవంగ ద్వారకన్ ముట్టడించె
దినములిరువదేడు కొనసాగె ముట్టడి
ప్రద్యుమ్నుడెదిరించి పసను జూపె

తే॥ సాల్వ మంత్రి 'ద్యుమంతుని' సంహరించె
గొప్ప మాయావి సాల్వుడున్ గుమిలిపోయె
భట్టతిరి కృతి తెలిపెద పద్యసరళి
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాధ.



తా॥ ఓ ప్రభూ! రుక్మిణీదేవితో నీ వివాహ సమయమున యాదవ సైన్యము సాల్వరాజుని చిత్తుగా ఓడించి పరాభవించెను. మండిపడిన సాల్వుడు పరమశివుని గూర్చి తపముచేసి మెప్పించి వరముగా సౌబమను విమానమును పొందెను. అతను గొప్ప మాయావి. నీవు రాజసూయమును జూచుటకు ఇంద్రప్రస్థమునకు పోయినప్పుడు సాల్వుడు ద్వారకానగరమును ముట్టడించెను. ఇరవది ఏడు దినముల వరకు జరిగిన ఆ యుద్ధములో ప్రద్యుమ్నుడు తన భటులందరితో వానిని ఎదుర్కొని మహాబలవంతుడైన 'ద్యుమంతుడు' అను అతని మంత్రిని సంహరించెను. దానికి ఆ మాయావి చాల దుఃఖించెను. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి సంస్కృత భాగవతమును తెలుగు పద్యములలో చెబుతున్న నన్ను విని అనుగ్రహింపుము తండ్రీ!



50/2

సీ॥ సాల్వుని సైన్యంబు చాలనశించెను
ఇంతలో అన్నయున్ ఈవు కలిసి
చీల్చి సాల్వునిసేన చెండాడి రిర్వురున్
గద బూని సాల్వుండు ఎదురు తిరిగె
తన ప్రహారములకు ధనసు నీ చెయిజారె
మాయనీపై జూపెవాడు అంత
వసుదేవు గల్పించి మాయచే తెగటార్చి
భ్రమలోన పడవేసె పాపి నిన్ను

తే॥ వ్యాసుడంగీకరించడీ వాదమునకు
పరమజ్ఞానివి కట్టునా మాయ నిన్ను?
భట్టతిరి కృతి తెలిపెద పద్యగతిని
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాధ.



తా॥ ప్రభూ! సాల్వరాజుయొక్క సైన్యము చాలవరకు అంతమయ్యెను. ఇంతలో రాజసూయమునుండి తిరిగి వచ్చిన నీవు, బలరాముడు జరిగినది తెలుసుకొని సాల్వుని సైన్యమును చీల్చి చెండాడిరి. ఆ సాల్వుని గదా ప్రహారములకు నీ చేతిలోని శార్ఙ్గ ధనస్సు జారి క్రిందపడెను. నీముందే ఆ సాల్వుడు తనమాయచే ఒక "వసుదేవుని" గల్పించి అతనిని సంహరించెను. ఒక్క క్షణ కాలము పాటు నీవుకూడ అతని మాయను గుర్తింపలేక పోతివి, అని కొందరు చెబుతున్నారు కాని గురువాయూరప్పా! అది సరికాదు. వ్యాసుడు కూడ దీనినే సమర్థించెను. నీవు మాయాతీతుడవు. నిన్నే మాయ కట్టగలదు తండ్రీ!

50/3

సీ॥ సాల్వుని 'సౌభమ్ము' స్వామి! నీ గదచేత
పొడిజేసి కలిపావు పూని జలధి
చక్రంబుతో వాని సంహరించితివి నీ
సాయమౌ మిత్రులు చకితులవగ
దంతవక్త్రుడును గదను దాల్చిపై బడి,
కౌమోదకితొ కొట్ట కతిచెమట్టి
శిశుపాలుని వలెనే చేరెను ఆతండు
నీముక్తి ధామమ్ము నిగమవంద్య!

తే॥ మార్గమేదైన నిను నిల్పె మనసునందు
ముక్తి నిత్తువు మాకైన మునులకైన
నీదు అవతార లక్ష్యమే అది కదయ్య
వినుముగురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ఓ ప్రభూ! సాల్వునియొక్క సౌబమను విమానమును నీగదచేత పిండి పిండిగా చూర్ణముచేసి నీవు దానిని సముద్రమున పడునట్లు కొట్టితివి. వెంటనే నీ



చక్రముతో సాల్వుని చంపివేసితివి. అతని మరణమును జూచి అతని మిత్రుడు దంతవక్త్రుడు తన గద చేత నిన్ను ఎదుర్కొనెను. వానిని నీకౌమోదకమను గదతో గొట్టి సంహరించితివి. అతడు కూడ శిశుపాలుని వలెనే నీలో ఐక్యమై విష్ణుధామమును పొందెను. ఓ గురువాయూరప్పా! నిన్ను పొందు మార్గములనేకములు. ఏ విధముగానైనా సదా నిన్నే తలంచుచు నీ ధ్యాసలో వుండే వారలకు తప్పక ముక్తినిస్తావు. మాకైన మునులకైన ఒక్కటే గతి. నీ భక్తులకు ముక్తి నివ్వటమే కదా! నీ అవతార లక్ష్యం. అదే విధంగా నన్నుకూడ అనుగ్రహించి నీ దివ్యగాధనాలకింపుము తండ్రీ!

50/4

సీ॥ ద్రౌపదిన్ పణముగా ధర్మసూనుడు పెట్టి
మాయజూదంబున మట్టిగఅచె
దుశ్శాసనుడు బల్మితో తెచ్చి సభలోన
తరుణి వస్త్రములూడ్చ తలచె ఖలుడు



అక్షయంబుగ నీవు ఆమె వస్త్రములిచ్చి
మానంబుగాచావు మానవతికి
వనవాస కాలాన మౌని దుర్వాసుండు
శిష్యసమేతుడై చేరి అడిగె
అన్నంబు, ద్రౌపది అక్షయపాత్రను
కడిగి ఆనాటికి తుడిచిపెట్ట
ప్రత్యక్షమై నీవు పాత్రలో అన్నంపు
మెతుకును తృప్తిగా మ్రింగినావు

తే॥ తృప్తి నీకాయె మునులెల్ల త్రేన్చినారు
దారి మళ్ళిరి వద్దని తమకు 'తిండి'
ఆర్తరక్షకుడీవెగా అడవినైన
వినుము గురువాయుపుర విభో! విష్ణుగాథ.

తా॥ ప్రభూ! నీవు ద్వారకా నగరమును చేరితివి. అక్కడ హస్తినాపురమున ధర్మరాజు కౌరవులతో కపట జూదమున ద్రౌపదిని కూడ పణముగా బెట్టి ఆడి ఓడిపోయెను. పిదప దుశ్శాసనుడు ద్రౌపదిని సభకీడ్చి వస్త్రాపహరణమునకు యత్నించెను. ఆమె



విలపించుచు నిన్ను ప్రార్థించగా ఆమెకు అక్షయముగా వలువలను ప్రసాదించి ఆ మానవతి మానమును కాపాడితివి. పాండవుల వనవాస కాలములో ఒకనాడు దుర్వాస మహాముని శిష్య సమేతుడై భోజనము కావలెనని వచ్చెను. భోజన మీయకున్న ముని శపించును. కాని అప్పటికే ద్రౌపది కూడ భుజించి వారి అక్షయపాత్రను కడిగివేయుట వలన భోజనము లభించు అవకాశము లేదు. అప్పుడు వారు నిన్ను ప్రార్థించగా వారి ఎదుట ప్రత్యక్షమై నీవును ఆహారమడిగితివి. అక్షయ పాత్రలో ఒక్క మెతుకున్నదని చూపి దానినే తృప్తిగా భుజించితివి. నీవు తృప్తుడవైన వెంటనే దుర్వాసునికి ఆయన శిష్యులకు ఇక తినుట మావల్ల కాదన్నట్లు పొట్టలుబ్బిపోయి వారు ఆహారము వలదని వెడలిపోయిరి. ఆర్తరక్షకుడవైన ఓ గురువాయూరప్పా! నీవారిని అడవులలోనైన రక్షించెదవు. కనుక ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!

50/5

సీ॥ రణపు యత్నముల నారంభించి రిర్వురున్
కురు పాండవులు అని కోరుకొనుచు
పార్థుడు నిను కోరె పరమాత్మ! సాయంబు
ఆ సుయోధనుడెంచె యాదవులను
రాయబారంబున రాజీ విఫలమయ్యె
పెద్దల మాటకు విలువపోయె
లక్ష్యపెట్టక నిన్ను రారాజు బంధించ
యత్నించెనో ప్రభూ! అపుడు నీవు

తే॥ మునులు సైతము కనలేని ఘన స్వరూపు
విశ్వరూపంబు చూపించ విరిగె మదము
హస్తినాపురి క్షోభించి అలమటించె
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.



తా॥ ఓ ప్రభూ! అటుపిమ్మట కౌరవ పాండవ లిరువురు యుద్ధ సన్నాహాలను చేయసాగిరి. దుర్యోధనార్జును లిరువురు నీవద్దకు సహాయార్థము వచ్చిరి. అర్జునుడు నిన్ను కోరుకొనగా దుర్యోధనుడు నీయాదవసైన్యమును తనపక్షమున ఉండుటకు కోరుకొనెను. నీవు పాండవదూతగా హస్తినాపురమునకు రాయబారిగా పోతివి. ఆ సభలో భీష్మాది పెద్దల మాటకు విలువలేకపోయింది. నీ నయవచనములను లక్ష్యపెట్టక దుర్యోధనుడు నిన్ను బంధించుటకు యత్నించెను. మహామునులు కూడ దర్శించలేని నీ విశ్వరూపమును ఆ కౌరవ సభలో చూపి నిన్ను ధిక్కరించిన దుర్యోధనాదులకు బుద్ధిచెప్పితివి. నీకు అపకారము తలపెట్టిన ఫలితముగా దుర్యోధనుని హస్తినాపురములోని ప్రజలు క్షోభకు గురియైరి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథను ఆలకింపుము తండ్రీ!



50/6

సీ॥ ఆ కురుక్షేత్రాన అని మొదలాయెను
పార్థసారథివయ్య! స్వామి! నీవు
స్వజనులనేరీతి జంపను? అని క్రీడి
వ్యామోహపడె నీవు అంటివిట్లు
"మిత్రమా! ఏమిది? మీవారు నవ్వరే!!
విను కీర్తి నిలుచును తనువు కాదు
ఆత్మనెరుగుమీవు అద్వితీయంబది
చావుపుట్టుక లేక శాశ్వతంబు
చంపేది ఎవ్వండు? చచ్చేది ఎవ్వండు?
భయభ్రాంతులిక వీడి మనసు నిలుపు
ధర్మయుద్ధముచేసి త్యజియించు ఫలితమున్
మంచి చెడ్డలు నాకు వదులుమయ్య!"

తే॥ పేర్మి గీతామృతంబిచ్చి విశ్వరూప
దర్శనము జూప, వచ్చె యదార్ధ స్థితికి
భట్టతిరికృతి తెలిపెద పద్యసరళి
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.



తా॥ ఓ స్వామీ! నీవు కురుక్షేత్ర సంగ్రామమున పార్థసారథిగా నుంటివి. మహావీరుడైన అర్జునుడు రణరంగమున తన బంధువులను సోదరులను చూచి మనసు ద్రవించి యుద్ధవిముఖుడయ్యెను. అప్పుడు నీవు అర్జునునకు కర్తవ్యమిట్లు బోధించితివి. ''మిత్రమా! ఏమిటిది? మీవారు నిన్ను జూచినవ్వుకోరా! ఈ మానవ శరీరము శాశ్వతమా? శరీరాలలో వుండే ఆత్మ అద్వితీయమైనది, శాశ్వతమైనది, చావుపుట్టుకలు లేనిది. నేను చంపజాలనంటున్నావు కానీ అసలు చంపేదెవరు? చచ్చేదెవరు? ఈ భయభ్రాంతులను విడిచి ధర్మయుద్ధము చేసి మంచి చెడ్డల ఫలితమును నాకు వదలి నీ కర్తవ్యము నీవు నెరవేర్చుము" ఈ విధముగా పార్థునికి శ్రీమత్భగవద్గీతను బోధించి వానికి నీ విశ్వరూప సందర్శనమిచ్చి కిరీటిని యధాస్థితికి తెచ్చితిని. ఓ గురువాయూరప్పా! నారాయణభట్టతిరి కావ్యమును తెలుగు పద్యరూపంలో ఆలకించి నన్నునుగ్రహింపుము తండ్రీ!

50/7

సీ॥ భీష్ముడు తను పదివేలమందిని జంపె
ప్రతిరోజు నెరపె నీపనినతండు
భూభారమౌ నృపుల్ ఉసురులు బాసిరి
అర్జునుడెంతయో అలిసిపోయె
కోపమ్మునాపించి కుప్పించి దుమికావు
చంపంగ భీష్ముని చక్రమెత్తి
మన్నింపుమని క్రీడి ప్రతిన మానొద్దని
ప్రార్థించె తాను నీపాదమంటి

తే॥ అంజలి ఘటించి భీష్ముడు ఆర్తివేడె
ముక్తి నిమ్మని పరమాత్మ! మొరలు వినవు
శాంతమొందావు మనసులో సంతసించి
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాధ.



తా॥ ఓ ప్రభూ! నీ పరమభక్తుడైన భీష్ముడు ప్రతిదినము పదివేలమందిని సంహరించుచుండెను. ఈ విధముగా అతడు నీవు చేయదలచిన పనిని చేయసాగెను. అర్జునుడు భీష్మునితో యుద్ధమును చేయుచు అలిసిపోయెను. అప్పుడు నీవు కోపమునభినయించుచు చక్రమును ధరించి ఆయుధమును పట్టుకోనన్న నీ ప్రతిజ్ఞను అతిక్రమించితివి. ఈ భీష్ముని జంపి నిన్ను రక్షింతునని పార్ధునకు చెప్పి భీష్మునివైపు పరుగెత్తితివి. భీష్ముడు అంజలి ఘటించి స్వామీ! నన్ను కరుణించి సంహరింపుమని వేడుకొనెను. నీ వెనుకనే రథమును దిగిన క్రీడి తనను మన్నించి నీ చక్రమునుపసంహరించమని ప్రార్థించెను. అప్పుడు నీవు సంతోషముతో అట్లు చేసితివి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!



50/8

సీ॥ ద్రోణు నేతృత్వంబుతో కురుసేనకు
భగదత్తుడున్ జేరె పార్థు బోర
నారాయణాస్త్రమున్ నాడు నీవక్షంబు
భరియించి పార్థుని శిరముగాచె
సైంధవున్ క్రీడిచే చంపించినావయ్య
చక్రంబు అడ్డేసి సవితునికిని
కర్ణునాగాస్త్రంబు గరిపావు వ్యర్థంబు
కుంభినిన్ రథమును క్రుంగజేసి

తే॥ సవ్యసాచి కిరీటంబు జారిపోయె
కాని, ప్రాణాలు నిలిచెను తనువునందు
ఎన్నివిధముల గాచావు హితుల నీవు!!
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాధ.



తా॥ ఓ ప్రభూ! కౌరవపాండవ యుద్ధమున ద్రోణాచార్యుడు సర్వసైన్యాధిపతిగానుండెను. అప్పుడు భగదత్తుడు కౌరవుల పక్షమున పోరుచు గజముపైనెక్కి అర్జునునిపై నారాయణాస్త్రమును ప్రయోగించెను. ఆ అస్త్రమును నీవు నీవక్షస్థలముచే నిరోధించితివి. అట్లే సింధురాజైన సైంధవుని (జయద్రధుని), నీ చక్రముచే సూర్యుని అడ్డి (కృత్రిమముగా సూర్యాస్తమయము సృష్టించి) అర్జుననిచే చంపించితివి. కర్ణుడు పార్ధునిపై అమోఘమైన నాగాస్త్రమును ప్రయోగించినపుడు నీపాదముతో అర్జునుని రథమును భూమిలోనికి క్రుంగించితివి. దాని ఫలితముగా నాగాస్త్రము అర్జునుని కిరీటమును పోగొట్టెను. అతని తల తెగకుండ కాపాడబడెను. ఇట్లు పాండవులను ఎన్నియోమార్లు ఎన్నియోవిధములుగా కాపాడితివి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!

50/9

సీ॥ **"అని" మొదలప్పుడే అన్నయ్య రాముండు**
**తను తీర్థయాత్రకై తరలిపోయె**
**తను పురాణాలతో మునులకు సూతుండు**
**నైమిశారణ్యాన నయముగూర్పు**
**మన్నించలేదని మడియించె సూతుని,**
**అతని పుత్రునికిచ్చె 'అన్న' పదవి**
**వల్వలున్ వధియించి బలభద్రుడున్ జేసె**
**యాగరక్షణ తాను యాత్రముగియ**
**భీమసుయోధనుల్ సమరాననుండగా**
**వారించబోయెను వారినతడు**

తే॥ **వారు వినరైరి ఆయన పలుకునైన**
**తిరిగిపోయెను ద్వారక దేవదేవ!**
**భట్టతిరి కృతి తెలిపె పద్యగతిని**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**



తా॥ ఓ ప్రభూ! కురుక్షేత్ర యుద్ధము ప్రారంభం కాగానే బలరాముడు తను ఎటువైపూ ఉండనని తీర్థయాత్రలకు బయలుదేరినాడు. అతడు నైమిశారణ్యము జేరి అక్కడ సూతమహర్షిచే పురాణ ప్రవచనములను వినుచున్న మునులను దర్శించెను. తనను చూచికూడ సూతుడు మర్యాదగా లేచి నమస్కరించలేదని పట్టరాని కోపముతో అతనిని చంపెను. తరువాత అతని పుత్రునికి సూతుని పదవి ఇచ్చి ముందుకు సాగిపోయెను. ఇంకొకచోట వల్వలుడు అను రాక్షసుడు ప్రతిపర్వదినమున యజ్ఞములను నాశనము చేయుచుండగా వానిని సంహరించి యజ్ఞములు కొనసాగునట్లు చేసెను. అట్లు ప్రతితీర్థమును సేవించి బలరాముడు కురుక్షేత్రము చేరుసరికి భారతయుద్ధమున చివరి ఘట్టము జరుగుచుండెను. భీముడు దుర్యోధనుడు గదాయుద్ధము చేయుచుండిరి. తుది ప్రయత్నముగా బలరాముడు వారిని వారించుటకు యత్నించెను.



వారు అతని మాటను మన్నించక యుద్ధమును కొనసాగించిరి. విరక్తుడైన బలరాముడు ద్వారకకు మరలిపోయెను. ఓ గురువాయూరప్పా! రమ్యమైన భాగవతమును భట్టతిరి సంస్కృతములో చెప్పగా నేను తెలుగు పద్యములలో చెబుతున్నాను. దీనినాలకింపుము తండ్రీ!

50/10

సీ॥ **ద్రౌపది తనయులన్ తాము నిద్రించంగ**
**ద్రౌణి ఖడ్గముబూని తలలు నరికె**
**వాని బ్రహ్మాస్త్రమున్ పార్థుండు గతిమార్చి**
**అతని శిరోరత్నమపహరించె**
**అంత 'అపాండవ' మగుగాక యని ద్రౌణి**
**బ్రహ్మాస్త్రమును వేసె మరలతాను**
**ఉత్తర గర్భమున్ బూని ప్రవేశించి**
**కాపాడనెంచావు కరుణజేత**
**అంగుష్టమాత్రుడవైతివి శ్రీకృష్ణ!**
**తరుణి గర్భమునందు జేరినావు.**



తే॥ **పిదప చక్రంబు నడ్డము వేసినావు**
**ఆమె శిశువును గాచావు స్వామి! నీవు**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యగతిని**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ శ్రీకృష్ణా! ద్రౌపదియొక్క ఐదుగురు పుత్రులను నిద్రించు సమయమున అశ్వత్థామ (ద్రౌణి) పాండవులనుకొని సంహరించెను. పిదప అతడు బ్రహ్మాస్త్రమును వేసి అందరిని తుదముట్టించ చూచెను. కాని పార్థుడు ఆ బ్రహ్మాస్త్రమును త్రిప్పి కొట్టి అశ్వత్థామనుండి అతని శిరోరత్నమును అపహరించెను. అంతట అశ్వత్థామ 'అపాండవ' మగుగాక అని మరల బ్రహ్మాస్త్రమును ప్రయోగించెను. అది ఉత్తరయొక్క గర్భమున ప్రవేశించెను. అప్పుడు నీవు చక్రమును చేబూని అంగుష్టమాత్రడవై ఆమె గర్భమున ప్రవేశించితివి. తరువాత నీ చక్రమును అడ్డమువేసి ఆ

బ్రహ్మాస్త్రమునుండి శిశువును రక్షించితివి. ఓ గురువాయూరప్పా! భట్టతిరి భాగవతమును తెలుగు పద్యములలో చెబుతున్న నన్ను అనుగ్రహించి ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!

50/11

సీ॥ స్వచ్ఛంద మరణంబు శాంతనవుడు తొల్లి
తండ్రిచే వరముగా తానుబొందె
అంపశయ్యనుజేరి అతడు ధర్మజునకు
ధర్మబోధలచేత ధన్యుజేసె
విష్ణుసహస్రమున్ వివరించె, నీవును
శ్రద్ధగా వింటివి జ్ఞాని బోధ
మోక్షమిస్తివి వానికి; ముమ్మారు అశ్వమే
ధమును జేయించావు ధర్మజునితొ

తే॥ కోరికలు తీర్చి ద్వారకజేరినావు
నాదు వ్యాధిని తొలగించి నయము నిమ్ము
భట్టతిరికృతి తెలిపెద పద్యసరళి
వినుముగురువాయుపురవిభో! విష్ణుగాథ.



తా॥ ఓ ప్రభూ! భీష్ముడు తనతండ్రినుంచి పూర్వము, తలచుకొనినప్పుడు మాత్రమే మరణము సంభవించునట్లు (స్వచ్ఛంద మరణము) వరముగా పొందెను. నేడు తన ఒంటినిండా అంబులతో అంపశయ్యపై నుండెను. అట్టి సమయమున కూడా ఆ మహామహుడు ధర్మరాజునకు ఎన్నియో ధర్మసూక్ష్మములను బోధించి ధన్యుని జేసెను. నీవుకూడా శ్రద్ధగా వినుచుండగా విష్ణుసహస్రనామముల నెరింగించెను. ఆ భీష్మాచార్యునకు నీవు మోక్షము నొసగితివి. ఆ తరువాత ధర్మరాజు యొక్క పరిపాలనలో మూడు గొప్ప అశ్వమేధయాగములను చేయించితివి. పాండవుల కోరికల నన్నింటిని నెరవేర్చితివి. అటు పిమ్మట నీవు ద్వారకా నగరమును చేరుకొంటివి. ఓ గురువాయూరప్పా! నా వ్యాధిని నివారించి నాకు స్వస్థత నిమ్ము. నారాయణ భట్టతిరి సంస్కృత భాగవతమును తెలుగు పద్యములలో వినిపించుచున్న నన్ననుగ్రహించి నీ గాధను ఆలకింపుము తండ్రీ!



## 51.కుచేలోపాఖ్యానము

**చం॥**

**మును గురుఆశ్రమంబున ప్రపూర్ణత విద్య గ్రహించువేళ నీ**
**అనుగు హితుండు మిత్రుడును ఐన కుచేలుడు విప్రశ్రేష్ఠుడున్**
**మనమున నిన్ను నిల్పుకొనె భార్య సుతాదుల బాధ్యతుండియున్**
**దినములనెల్ల తాన్ గడిపె ధీరత గూడిన శాంతచిత్తుడై**
**విను గురువాయుపట్టణపు విష్ణుని గాధను నందనందనా!**

తా॥ ఓ ప్రభూ! నీవు పూర్వము సాందీప మహర్షి ఆశ్రమమున విద్యాభ్యాసమును చేయుచున్నప్పుడు కుచేలుడు అను విప్రవరేణ్యుడు నీకు హితుడు, మిత్రుడుగా నుండెను. నీ సహాధ్యాయియైన అతడు నీకు పరమభక్తుడు. అతనికి వివాహమై భార్యవలన బహు సంతానమును బడసెను. అంత సంసార దుఃఖమునందును అతడు దినములను లెక్కించు గడుపుతూ ధీరశాంత చిత్తుడై నీ దాసుడైయుండెను. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధ నాలకింపుము తండ్రీ!



51/2

**ఉ॥**

**ఆతని భార్యయున్ అతని కన్నిట తాననుకూల చిత్తయై**
**ప్రీతిగ వాని గొల్చు తను వీడదు ఆసలు మానసావనిన్**
**ఆతని కోరె "నాధ! విను అచ్యుతువేడుదు కొంతసాయమున్**
**ఊతమునిచ్చి గాచు" అనె ఓ గురువాయుపురాధి నాయకా!**

తా॥ ఓ గురువాయూరప్పా! ఆ కుచేలుని భార్య అన్ని విషయములందును అతనికి చాల అనుకూలవతి. కాని ఆమె మనస్సు మాత్రము ఆమె వశమున లేక ఐహిక సుఖములపైన వ్యామోహముతో నుండెను. అందువలన ఒకనాడు ఆమె తన భర్తతో "లక్ష్మీపతియైన శ్రీకృష్ణుడు మీ చిన్ననాటి మిత్రుడు కదా! ఆయనను కొంచెము సాయమడిగిన మనకు కొంతసాయముచేసి మనకి ఉపశమనమీయును కదా!" అని పలికెను.

51/3

చం॥

**ధనమునుసుంతయున్ అతడు తాకడు, కోరడు, చేయిజాచడున్**
**ధనమిడు గర్వమున్, మదము తప్పక చేరును యెంచడెన్నడున్**
**తన సతిముద్దుబిడ్డలును తాము తపించుట చూడలేక, చా**
**లని యొక బట్టలో అటుకులన్ గొని కానుక నిన్నుజూడబో**
**యెను గురువాయునాయకుని ఈకథ జెప్పెద నీకు కేశవా!**

తా॥ ఓ గురువాయూరప్పా! ఆ కుచేలుడు ధనమునందు ఏమాత్రము అభిరుచి లేని వాడగుటచే దానిని కోరడు, తాకడు, దానికోసము చేయిజాచడు. ధనము వలన మనిషికి గర్వము కలిగి మదము ఆవరించునని తెలియుట చేత ఆయన ఎన్నడు ధనమునపేక్షించలేదు. కాని నేడు ఆకలి, లేములచేత భార్యాబిడ్డలు బాధపడుతుంటే చూడలేక ధనము కొరకు గాక ఒకసారి నిన్ను చూచుటకు ద్వారకాపురికి బయలుదేరెను. వట్టి చేతులతో రాలేక తన అంగవస్త్రములో కొన్ని అటుకులను మూటకట్టుకొని నీకిచ్చుటకు తీసికొనిపోయెను. నీ కథను ఆలకింపుము తండ్రీ!



51/4

తే॥ **స్వామి! ద్వారక గన్నుల పంటవోలె**
**ముదము నాశ్చర్యముల గొల్ప ముందు సాగి**
**మిత్రవింద భవంతి నీ మిత్రుడంత**
**జూచి వైకుంఠమా!! యని చోద్యపడెను**
**ఇంతలో నీవు ఆతని చెంతజేరి**
**స్వాగతంబీయ మనసార సంతసించె**
**వర్ణనాతీతమో ప్రభూ! వాని స్థితియు**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ స్వామీ! ఆ కుచేలుడు ధన్యుడై ద్వారకా నగరమును సంతోషంతో కన్నులపండుగ వలె తిలకించుచు ముందుకు పోయి అప్పుడు నీ దేవేరియైన 'మిత్రవింద' యొక్క భవంతిని చేరెను. ఆ భవనమును చూచి కుచేలుడు వైకుంఠమునే చూచినంత ఆనందమును పొందెను, ఆశ్చర్యపడెను. ఇంతలో నీవు అతనిని సమీపించి ఆదరపూర్వకముగా ఆహ్వానించితివి. అప్పుడు ఆ కుచేలుని ఆనందము వర్ణనాతీతము. ఓ గురువాయూరప్పా! నీ కథను ఆలకింపుము తండ్రీ!



51/5

సీ॥ **స్వామి! కుచేలుని సర్వోపచారాల**
**పూజించితివి భక్తిపూర్వకముగ**
**సతి చేతనున్న వింజామరన్ చేదాల్చి**
**వినయపూర్వకముగా వీచితీవు**
**చిననాటి విషయాలు చిలిపి కార్యములన్ని**
**హితవుగా చెప్పావు ఇట్లునీవు**
**"సఖ! మన గురుపత్ని సాధ్వి, కట్టెలు గొట్ట**
**వనికి పంపించంగ వర్షమాయె**

తే॥ **తడిసిపోతిమి జడివాన తట్టుకొనుచు**
**గుర్తువచ్చెనా? ఆ రేయి 'గోల' నీకు"**
**ఆ కుచేలుడు రాల్చెను అశ్రువులను**
**వినుము గురువాయు పురవిభో! విష్ణుగాథ.**



తా॥ స్వామీ! నీవు కుచేలుని సకలోపచారములతో పూజించితివి. అంతట నీ ధర్మపత్ని ఆ మహాత్మునికి వింజామరలతో వీచుచుండెను. అప్పుడు ఆమెచేతిలోనున్న వింజామరను దీసికొని నీవే విసురుచు మీ చిన్ననాటి సంగతులను చిలిపి పనులను ఆప్యాయముగా చెప్పితివి. "ఓ మిత్రమా! సాందీపని మహర్షి యొక్క భార్య మనలను కన్నతల్లివలె ఆదరించెడిది. ఆమె ఒకనాడు మనిద్దరినీ కట్టెలకొఱకు అడవికి పంపినది. అది వర్షాకాలము కాకున్నను గొప్ప వాన కురిసినది. మనము ఎట్లో దానిని తట్టుకొని నిలిచితిమి. ఇద్దరము తడిసి ఒక చెట్టుక్రింద చేరితిమి. ఆ రాత్రి జరిగిన 'గోల' గుర్తుకు వచ్చిందా" అని నవ్వితివి. ఆ కుచేలుడు విచారంగా అశ్రువులు రాల్చెను. (నిజమునకు జరిగిన సంగతేమంటే ఆనాడు గురుపత్ని ఇచ్చిన అటుకులను కృష్ణునకు బెట్టక తనొక్కడే తిని, కృష్ణుడు నీవేమి తింటున్నావంటే ఏమీలేదు చలికి దంతములు కొట్టుకుంటున్నాయి అని అబద్ధం చెప్పాడు.

పరమాత్మునికి అబద్ధం చెప్పిన దాని ఫలితంగా నేడు గర్భదారిద్ర్యం అనుభవించాడు. నేడు అతనే దిక్కయ్యాడు. అది గుర్తుకు వచ్చి కుచేలునికి అశ్రువులు ఆగలేదు) ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథనాలకింపుము తండ్రీ!

51/6

**తే॥ ఆ కుచేలుని రొంటిలో అటుకులన్ని**
**ఇచ్చుటెట్లని సిగ్గుతో చచ్చుచుండె**
**చొరవ జూపుచు పిడికెడు ఆరగించి**
**రెండవది తినబోవగ లేచివచ్చి**
**భామ రుక్మిణి వారించి "వద్దు స్వామి!**
**ఇపుడు తిన్నది చాలును" హితవు జెప్పె**
**భట్టతిరికృతి తెలిపెద పద్యగతిని**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**



తా॥ ఓ ప్రభూ! ఆ కుచేలుడు తాను రొంటిలో దాచిన అటుకులను నీకెట్లు ఈయునా అని సందేహించుచుండెను, సిగ్గుపడుచుండెను. అప్పుడు నీవు ఆయన దగ్గరనుంచి చొరవగా పిడికెడు అటుకులను తీసికొని తింటివి. తరువాత రెండవ గుప్పెడు తీసికొని తినబోగా ముందుకు వచ్చి రుక్మిణీదేవి నిన్ను వారించి" నాథా! చాలు చాలు ఇప్పటికి తిన్నది చాలు" అని వారించెను. (అట్లు వారించనిచో శ్రీకృష్ణుని సిరి అయిన లక్ష్మీదేవి ఆ కుచేలుని వద్దనే ఉండిపోవలసి వచ్చేది) ఓ గురువాయూరప్పా! భట్టతిరి కావ్యమును తెలుగు పద్యకృతిగా ఆలకింపుము తండ్రీ!



51/7

**తే॥ నీదు భక్తులపై స్వామి! నీవు జూపు**
**ప్రేమ, శ్రద్ధాదరమ్ములు, విలువ, దయయు**
**అవి అపారము; ఒకరేయి ఆ నగరిని**
**గడిపి హాయిగా మరునాడు అడిగె సెలవు,**
**ధనము మాటయే పలుకక తరలెనతడు**
**"పొందు నిష్కాముడే నీదు పూర్తి కరుణ"**
**చాల చిత్రము కద!! ప్రభూ! లీలలన్ని**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! నీవు నీ భక్తులపై చూపు శ్రద్ధాసక్తులు, ప్రేమానురాగములు, అభిమాన అనుగ్రహములు అపారమైనవి. ఆ ద్వారకాపురిలో శ్రీకృష్ణుని సన్నిధిలో పరమ సంతోషముతో హాయిగా గడిపి ఆ కుచేలుడు నిష్కాముడై ధనము మాటయే మరచి, తన ఇంటికి బయలుదేరెను. ఓ గురువాయూరప్పా! నీ



అనుగ్రహము చాల విచిత్రముగా నుండును కదా! నీ లీలలు అనిర్వచనీయములు. నీ కథను ఆలకించి నన్ననుగ్రహింపుము తండ్రీ! (ఎట్టి అంతరములు లేని నిర్మలమైత్రి, నాపై కూడ చూపరాదా స్వామీ!)

51/8

**సీ॥ "నేను శ్రీకృష్ణుని యెనసి అర్థించినన్**
**మెండు సంపదలిచ్చి యుండువాడు**
**ఇపుడేమి చెబుదు నా ఇల్లాలికిన్ నేను"**
**చింతించు కాసేపు చింతనొంది**
**నీ ప్రియవచనముల్ నీ విలాసంబులన్**
**నీ చిరునవ్వును నీదు లీల**
**తలచి ఆనందించి పులకించుచుండెను**
**ఎట్టకేలకు తన ఇల్లు చేరె**

**తే॥ ఆ కుచేలుడు కాంచెను అద్భుతమగు**
**దివ్యమణిమయ సదనంబు దీప్తినీయ**
**భట్టతిరి కృతి తెలిపెద పద్యగతిని**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ నేను శ్రీకృష్ణుని అర్థించినచో అతడు పెక్కు సంపదలొసగి యుండెడివాడు. ఇప్పుడు నేను ఇంటికి పోయి నా భార్యతో ఏమని చెప్పుదును? అని ఆలోచించి కుచేలుడు కాసేపు చింతించును. తరువాత నీ ప్రియవచనములను, నీ విలాసమును, నీ చిరునవ్వును, నీ లీలలను పదే పదే తలచుకొనుచు ఆనందపరవశుడగు చుండెను. చివరికతను తన ఇల్లు చేరుకొనెను. అచ్చట ఒక అద్భుత భవనమును గాంచెను. అది మణుల కాంతులచే దేదీప్య మానముగా ప్రకాశించుచుండెను. ఓ గురవాయూరప్పా! నారాయణభట్టతిరి రచించిన సంస్కృత భాగవతమును నేను తెలుగు పద్యములలో చెబుతున్నాను. దీనినాలకించి నన్ను ధన్యుని చేయుము తండ్రీ!



51/9

తే॥ తప్పినాదనా? త్రోవను తలచెనతడు
క్షణము భ్రమపడి నమ్మడు కనులనైన
కనకమయమైన ఇల్లాలి గాంచెనతడు
పెక్కు పరిచారికల్ తనన్ ప్రీతి గొలువ
అద్భుతంబైన ఆ దృశ్యమరసియతడు
నీదు కరుణా ప్రభావమున్ మదినెరింగె
భట్టతిరి కృతి తెలిపెద పద్యగతిని
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ "నేను త్రోవ తప్పలేదు కద! అని కుచేలుడు క్షణకాలము పాటు భ్రమకు లోనయ్యెను. తిన్నగా ఇంటిలోనికి ప్రవేశించుచుండగా ఆయనకు ఎట్ట ఎదుట తన భార్య సమస్త బంగారు ఆభరణములతో కనిపించెను. ఆమె చుట్టూ చాలమంది పరిచారికలు ప్రీతిగా సేవించుచు కుచేలునకు కనిపించిరి. ప్రభూ!



ఈ దృశ్యములను అన్నింటిని చూచిన తరువాత కుచేలునకు అద్భుతమైన నీ కరుణా ప్రభావము బోధపడెను. ఓ గురువాయూరప్పా! భట్టతిరి కావ్యమును తెలుగు పద్యములలో ఆలకింపుము తండ్రీ!

51/10

తే॥ రత్నమందిరములు, సర్వ లాంఛనములు
ఆ కుచేలుని భక్తిని ఆవగింజ
యంతనైనను తగ్గించవాయె స్వామి!
నీదు ముక్తిని పొందెను తుదినతండు
భక్తజన రక్షణయె నీకు పరమప్రీతి
నాదు వ్యాధిని మాన్పవే నయమునిచ్చి
భట్టతిరికృతి తెలిపెద పద్యగతిని
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.



తా॥ ఆ కుచేలుడు రత్నమందిరమున సమస్త సౌఖ్యములను అనుభవించుచున్నను ఆ మహాత్మునకు నీయందుగల అపారమైన భక్తిమాత్రము చెక్కుచెదరలేదు. అందువలననే అతడు చివరకు నీయొక్క ముక్తిని పొందెను. ఓ గురువాయూరప్పా! నీ భక్తజన రక్షణయే నీకు ప్రీతిదాయకము. వారి కోరికలు తీర్చుటయే నీకు ఆనందము. మరి నా వ్యాధిని నిర్మూలించి నన్ను ఎందుకు రక్షించవు? నారాయణ భట్టతిరి సంస్కృత భాగవతమును తెలుగు పద్యములలో చెబుతున్న నన్ననుగ్రహించి ఆలకింపుము తండ్రీ!

## 52. అర్జున గర్వ భంగము

సీ॥ ఆర్గురు పుత్రులు అల కంసు జేతిలో
మడియంగ దేవకీమాత ఏడ్చె
గురుపుత్రురప్పించి వరుణ లోకమునుండి
బ్రతికించినావన్న వార్తతెలిసి
దేవకి నిను వేడె తెప్పించి అన్నలన్
చూపించి కలిగించ తాపహరణ
సుతలంబునకు బోయి సొంపార 'బలి' కొల్వ
అన్నలనిమ్మని అడిగినావు
'బలి' వారినందించ మాతవద్దకు దెచ్చి
మురియంగ జేశావు తీరకోర్కె
బ్రహ్మశాపంబున బడసిరి జన్మలు
ముని మరీచికి బిడ్డలైన వారు

తే॥ తొలుత ప్రహ్లాదునకు వారు తోడబుట్లు
మరల బిడ్డలై దేవకిన్ జేరినారు
వారి రప్పించి కోరిక తీరిచితివి
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.



తా॥ ఓ ప్రభూ! నీతల్లి దేవకీదేవి ఒకనాడు "నీవు నీ గురుపుత్రుని (వరుణలోకమునకు పోయి) చనిపోయినా తిరిగి బ్రతికించి అవనికి తెచ్చితివని వింటిని, అటులనే కంసునిచే చంపబడిన నీ అన్నలను ఆరుగురిని నాకు చూపించవా కృష్ణా" అని కోరినది. అప్పుడు నీవు సుతలమునకు పోయితివి. అచట బలిచక్రవర్తి నిన్ను పూజించి, తన లోకమున నున్న నీ అన్నలను సంతోషముతో నీకు ఒప్పగించెను. ఆ ఆరుగురిని తెచ్చి నీ తల్లికి చూపించితివి. వారు పూర్వజన్మలో మరీచి మహర్షి యొక్క పుత్రులు. బ్రహ్మశాపమున వారు హిరణ్యకశిపుని పుత్రులుగా జన్మించిరి. తరువాత జన్మలో వారు దేవకీదేవి మొదటి ఆరుగురు బిడ్డలుగా పుట్టి కంసునిచే వధింపబడిరి. వారందరిని చూచి దేవకి పరమానందము చెందినది. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధనాలకింపుము తండ్రీ!



52/2

ఉ॥ దేవ! కలండు తొల్లి 'శ్రుత దేవుడు'
నాబడు భూసురుండు తాన్
కోవిదుడున్ సదా తలచి కొల్చెడి భక్తుడు
నీకు అప్తుదున్
ఆవిధి క్షత్రియుండు 'బహుళాశ్వుడు'
ఆ మిధిలాధినాధుడున్
నీవొక నాడు ఇర్వురకు నీదయజూప
మునీశ్వరుల్ జతై
ఓ వరదా! గురూ అనిల ఊరి మహోదయ!
పోయినావయా.

తా॥ దేవా! మిధిలానగరమున శ్రుతదేవుడను ఒక బ్రాహ్మణుడు కలడు. అతడు నిన్ను ఎల్లప్పుడు పరిపూర్ణ భక్తితో కొలిచే పండితుడు. అదే విధముగా 'బహుళాశ్వుడు' అను మిధిలాపురి రాజు కూడ ఆ నగరమందు నీ పరమభక్తుడు. అందువలన నీవు



ఆ ఇరువురిని ఒకే పర్యాయము అనుగ్రహింప దలచితివి. నీవు అందుకొరకు మహర్షులతో కలిసి మిధిలానగరమునకు వెళ్ళితివి. ఓ గురువాయూరప్పా! అట్లు నీవు వారికి నీకృప నందించబోతివి.

52/3

చం॥ గొనకొని రెండు రూపములు గూడగ బోతివి చూడ
నిర్వురిన్
తను 'బహుళాశ్వుడి'చ్చెను హితంబున కాన్కలు
సత్కరించుచున్
మును తన యాయవారమున బొందిన భిక్షను
పెట్టె బాపడున్
అనుపమ ముక్తినిచ్చితివి ఆ వర భక్తుల
కొక్కరీతిగా
విను గురువాయుపట్టణపు విష్ణునిగాధను
నందనందనా!

తా॥ నందనందనా! నీవు రెండు రూపములను పూనికతో ధరించి ఆ ఇద్దరి ఇండ్లకును బోతివి. మహారాజైన బహుళాశ్వుడు నీకు ఘనసత్కారమునిచ్చి పెక్కు కానుకల నొసగెను. కాని బీదబ్రాహ్మణుడైన శ్రుతదేవుడు మాత్రము ఆనాడు తను యాచించగా వచ్చిన బిక్షతో నిన్ను తృప్తి పరచెను. బుద్ధిమంతులైన ఆ ఇరువురికి నీవు ఒకేసారి సాటిలేని మోక్షమొసగితివి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!

52/4

**సీ॥ ద్వారకలోన భూసురుడొక్కడున్ నిన్ను**
**వేడెను దేవ! నా బిడ్డలెల్ల**
**పుట్టిన వెంటనే గిట్టుచుండిరటంచు**
**రోదించె నీ కడ లోకపాల!**
**విధి నిర్ణయంబును విశ్వరక్షకుడైన**
**మీరలేదన్నావు ఊరడించి**



**నీవశక్తుడవంచు నేనెంచనో ప్రభూ!**
**సర్వరక్షకుడైన స్వామి వీవు**
**సర్వసమర్థుండ సవ్యసాచినియంచు**
**గర్వించి నిను 'జతకట్టె' క్రీడి**

**తే॥ పరమపదము జూపించుటన్ వాని పొగరు**
**బాపి తత్త్వ జ్ఞానమ్మును వానికీయ**
**చేసియుందువు అటుల ఓ శ్రీనివాస!**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాధ.**

తా॥ ప్రభూ! ద్వారకలో నివసించు ఒక బ్రాహ్మణుడు తన సంతానము పుట్టిన వెంటనే గిట్టుచుండుట వలన కడు దుఃఖించి విశ్వరక్షకుడవైన నిన్ను ఆశ్రయించెను. "విధి వ్రాతనెవరు తప్పించగలరని" నీవు అతనిని ఊరడించితివి. అది నీ అశక్తత అని అనుకొనరాదు. ఏలనన నీవు సర్వజ్ఞుడవు. ఆ సమయమున అర్జునుడు "నేను సర్వసమర్థుడను" అని భావించి



గర్వించి యుండెను. అంతేకాక అతడు నిన్ను ఒక మానవమాత్రునిగా తలచుచుండెను. అతని గర్వమును తొలగించుటకు మరియు అతనికి నీ పరమపద దర్శనము నొసంగుటకు నీవా విధముగా చేసియుందువు. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!

52/5

**సీ॥ బిడ్డలెన్మిది మంది విప్రుండు గోల్పోయె**
**నవమ సంతును నీవు కావవాయె,**
**ప్రజలిది ఏమని పలుమాటలాడిరి**
**భగవానునికి ఏల మౌనమనిరి,**
**ద్వారక అతిథిగా తానుండె పార్థుండు**
**విప్రుని వేదన వినెనతండు**
**"పుట్టబోవు దశమపుత్రుని రక్షింతు**
**కాకున్న అగ్నిలో దూకగలను"**



**తే॥ ఘోరప్రతినను జేసెను కుంతిసుతుడు**
**విప్రు జేతిలో తన చేయివేసి తెలిపె**
**భట్టతిరి కృతి తెలిపెద పద్యగతిని**
**వినుము గురువాయుపుర విభో! విష్ణుగాధ.**

తా॥ ప్రభూ! ఆ విప్రునికి కలిగిన ఎనిమిదిమంది పుత్రులు ఇదివరకే చనిపోయిరి. తొమ్మిదవ బిడ్డను నీవు ఉపేక్షించి, రక్షించవైతివి. ప్రజలు హాహాకారములు చేయసాగిరి. అర్జునుడు ఆ సమయమున ద్వారకలో నీ అతిథిగా ఉండెను. అప్పుడు బ్రాహ్మణుని తొమ్మిదవ బిడ్డను నీవు కాపాడకుండుట జూచి విప్రుడేడ్వ దొడంగెను. అది చూచి క్రీడి "నీ పుట్టబోవు పుత్రుని నేను బ్రతికింపలేకున్న అగ్ని ప్రవేశమును చేసి మరణించెదనని" ఘోర ప్రతిజ్ఞను చేసెను. ఆ విప్రునికి బాసచేసెను. నారాయణభట్టతిరి భాగవతమును తెలుగు పద్యములలో విని ఓగురువాయూరప్పా! నన్ను అనుగ్రహింపుము.

52/6

సీ॥ అభిమాన ధనుడైన అర్జునుడీ 'బాస'
మాట చెప్పడు నీకు ప్రతిన గూర్చి
విప్రుని ఇంటికి విజయుడు వేంచేసి
యమునడ్డు యత్నంబు నంతజేసె
దివ్యాస్త్రములచేత దిగ్బంధమును జేసె,
ప్రసవమయ్యెను బిడ్డమాయమయ్యె
తనయోగ విద్యచే చని దిక్కులకు క్రీడి
వ్యర్థ ప్రయత్నంబు పనిచె తాను

తే॥ సిద్ధమయ్యెను అగ్నిని జేర క్రీడి
ప్రతిన నిలుపగ యత్నించు వాని నీవు
ఆపి వారించితివి ప్రభూ! అతనినంత
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.



తా॥ ఓ ప్రభూ! అభిమానధనుడైన అర్జునుడు తన ప్రతిజ్ఞ గురించి నీకు చెప్పలేదు. విప్రుని ఇంటికి పోయి అతని భార్య పదియవ సంతానమును ప్రసవించు సమయమున ఆ ప్రసూతి గృహమును తన దివ్య శస్త్రాస్త్రములతో దిక్బంధనము చేసి పురుగుకూడ రాకుండా చేసి యముని ఆయన భటులను రానీకుండ ప్రయత్నించెను. కాని ప్రసవానంతరము బిడ్డ మాయమయ్యెను. అర్జునుడు తనయోగ విద్యతో దిక్కులన్నియు గాలించెను. విప్రసుతుని జాడలేదు. అతని ప్రయత్నములన్నియు వ్యర్థమయ్యెను. క్రీడి తన ప్రతిజ్ఞ ననుసరించి అగ్నిప్రవేశము జేయ నిశ్చయించెను. దానికై సిద్ధపడెను.
అప్పుడు నీవు చిరునవ్వుతో అర్జునుని వారించితివి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథను ఆలకింపుము తండ్రీ!



52/7

సీ॥ అర్జునుతో గూడి అతివేగమున బోవు
హయముల పూన్చిన యట్టి రథము
పైనెక్కి బోతిరి పశ్చిమ దిశవైపు
అచట "లోకాలోక" అచలముండె
దాటంగ దానిని కటిక చీకటి యుండె
చీల్చె నీచక్రంబు చీకటులను
చక్రంబు కాంతిలో సవ్యసాచికి కండ్లు
కానరాకుండెను కనులు చెదరె

తే॥ కాన సంద్రములను దాటి కాంతిజిమ్ము
గుణములకు అతీతంబైన గొపనెలవు
పరమపదమును జూపావు పార్థునకును
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.



తా॥ స్వామీ! అప్పుడు నీవు అర్జునితో కలిసి చాల వేగము కల గుఱ్ఱములను పూన్చిన రథమునెక్కి పశ్చిమదిక్కునకు వెడలితివి. లోకాలోక పర్వతములను దాటగా కటిక చీకటి యుండెను. ఆ చీకట్లను నీచక్రముయొక్క కాంతి చీల్చివేయగా ముందుకు పోయి సముద్రములకు ఆవల రజస్తమోగుణములకతీతముగా దేదీప్య మానముగా నున్న నీ పరమపదమును 'చూడు చూడు' అని చూపించితివి. ఓ గురువాయూరప్పా! కమనీయమైన ఈవిష్ణుగాథనాలకింపుము తండ్రీ!

52/8

సీ|| **పరమాత్మ! నీవు ఆ పరమపదంబున**
**పరమపురుషు దరి కరిగినావు**
**దివ్య భూషణముల, దివ్యాయుధములతో**
**పన్నగేంద్రునిపైన పవ్వళించె**
**పీతాంబరుడు స్వామి నూతన జలదంపు**
**శ్యామవర్ణుడు అదే చక్కదనము**
**ఆతని ఉరముపై అతిశయించెను 'రమ'**
**ఆ త్రిమూర్తులకు తానధిపతియగు**
**ఆగమ వేద్యుండు జగములనాథుండు**
**క్షేమరూపుననున్న సేమకరుడు**

తే|| **అతడు నీ స్వరూపమె కాని అర్జునితో**
**కలిసి నీవును స్వామికి కరములొగ్గి**
**వందనము జేసినావయ్య వాసుదేవ!**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**



తా|| పరమాత్ముడవైన ఓ వాసుదేవా! ఆ పరమపదమున దివ్య భూషణములతో, దివ్యాయుధములతో శేషతల్పముపైనున్న పరమపురుషుడు కనిపించెను. అతడు పీతాంబరధారియై యుండెను. నూతన నీలమేఘశ్యాముడై శోభిల్లుచుండెను. లక్ష్మీదేవి ఆ పురుషోత్తముని వక్షస్థలమున విరాజిల్లి యున్నది. ఆ స్వామి త్రిమూర్తులకు అధిపతి, లోకోత్తముడు, వేదగోచరుడు. క్షేమరూపముననున్న ఆ పరమపురుష మూర్తి నీ స్వరూపమే యైనను నీవు మానవుని వలె అర్జునునితోపాటు ఆ స్వామికి నమస్కరించితివి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథనాలకించి నన్ను కటాక్షింపుము తండ్రీ!



52/9

సీ|| **"ఇరువురూ నాయందు నరుడు నారాయణు**
**డను రీతినున్నారు కాని నేనె,**
**దైవత్వమొకరిలో తెలియనౌ స్పష్టమై**
**అరయ జీవిగనుంటి నరుని లోన**
**అట్టి మిమ్ములజూచు గట్టి తలంపుతో**
**తెచ్చిదాచితి నేను ద్విజుని సుతుల**
**మీరు ఆ శిశువుల మీతోటి కొనిపొండు"**
**వైకుంఠపతియట్లు పలికె తమకు**

తే|| **విప్రసుతులను తెచ్చిరి మీరు అపుడు**
**నీదు మహిమను గుర్తించె నిలిచి క్రీడి**
**పిలిచి ఇచ్చివేసితివంత విప్ర సుతుల**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా|| "మీ ఇరువురునూ నాయందు నరనారాయణులుగా వేర్వేరుగా కనిపించినను వారు నారూపములే. మీయందు ఒకరిలో దైవత్వము స్పష్టముగా వ్యక్తమై యున్నది. వేరొకరిలో అది నిక్షిప్తమై నరరూపమున



ఉన్నది. అట్టి మిమ్ము చూడవలెనని నేనే ఈ బ్రాహ్మణ పుత్రులను తెప్పించితిని. ఇక మీరు ఈ శిశువులను వెంటనే తీసికొనిపొండు అని చెప్పి ఆ వైకుంఠపతి ఇచ్చిన బ్రాహ్మణ పుత్రులను నీవు తీసికొని వచ్చితివి. అప్పుడా అర్జునుడు నీ మహిమను పలు విధములుగా కీర్తించెను. తరువాత నీవు బ్రాహ్మణునకు అతని పుత్రులను ఇచ్చివేసితివి. ఓ గురువాయూరప్పా! ఈ విష్ణుగాథనాలకించుము తండ్రీ!

52/10

ఉ|| **నీ పదపద్మసేవగొని నిత్యము గొల్చెడి**
**భక్తకోటికిన్**
**ఆ పరమంబునిచ్చెదవు అచ్యుత! భూసతి**
**భారమెక్కుడై**
**తాపము జెంద నీవు అవతారము నెత్తితి**
**వయ్య! ఏమి ఆ**
**ఓపిక!! వృష్ణివంశమున ఉన్నతి నిస్తివి**
**స్త్రీ మనోహరా!**
**ఏ పనియైన లీల కద!! హేగురువాయు**
**పురాధినాయకా!**

తా॥ ఓ అచ్యుతా! నీపాదపద్మములను సేవించు భక్తులకు మోక్షము నిచ్చుటకు సిద్ధమయ్యెదవు. భూభారమెక్కువై వ్యాకుల పడగా ఆ భూదేవికి ఆ భారమును తగ్గించుటకు నీవు అవతరించితివి. పరబ్రహ్మ స్వరూపుడవు. నీకు ఎంత ఓపిక ప్రభూ! వృష్ణివంశమున జన్మించి ఆ వంశోన్నతి కొరకు పాటు పడితివి. స్త్రీ మనోహరా! జరిపిన ఓ సర్వేశ్వరా! నీవు ఏమి చేసినా ఒక దివ్యలీల. యజ్ఞేశ్వరా! మానవ రూపముతో యాదవునిగా ఈ లోకమున సంచరించిన గురువాయూరప్పా! నీ అవతారమే అద్భుతము.

52/11

**తే॥ భక్తితో నిను నారదమౌని చూడ**
**ద్వారకాపురి పలుమార్లు వచ్చుచుండె**
**తత్త్వజ్ఞానమ్ము నేర్పె నీ తండ్రి కతడు**
**ఉద్ధవుడు నీకు భక్తుడు ఉన్నతుండు**



**తత్త్వజ్ఞానమ్ము నీదయన్ తానుపొందె**
**బదరికాశ్రమంబుననే నివాసముండి**
**నేటికిని ఉద్ధరించును నీ జనులను**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ గురువాయూరప్పా! నారదుడు నీపై గొప్ప భక్తితో ద్వారకకు తరచుగా వచ్చిపోవుచుండెను. పుణ్యపురుషుడైన నీతండ్రి వసుదేవుడు ఒకనాడు నారదునివలన తత్త్వజ్ఞానమును పొందెను. నీ భక్తులలో శ్రేష్ఠుడును, గొప్ప జ్ఞానియునైన ఉద్ధవుడు నీ వలన తత్త్వజ్ఞానమును పొందెను. ఆ ఉద్ధవుడు లోకమును ఉద్ధరించుటకు నేటికి కూడ బదరికాశ్రమముననే ఉన్నాడు. అటువంటి నీ కథను ఆలకింపుము తండ్రీ!



52/12

**సీ॥ నిన్ను మెచ్చినవారు, నీకు జంకెడి వారు,**
**నీ చెలిమిగాండ్లును, నీదు హితులు,**
**ద్వేషించువారును, ధిక్కరించెడివారు,**
**ప్రేమానురాగాల పిలుచువారు,**
**నీ అనుగ్రహమును నీదయబొందుచు**
**ముక్తిధామము గాంచు యోగవరులు,**
**సులువుగా నిడుములు నిలిచిదాటిన వారు,**
**పలువిధముల ముక్తి బడయు వారు,**
**అన్ని జీవులయందు నిన్ను గాంచెడివారు,**
**నీభక్తి బోధించు శుభకరులును,**

**తే॥ వీరినందరి గరుణించు విశ్వమందు**
**జయము కృష్ణావతారా! విజయము నీకు**
**నాదు వ్యాధిని తొలగించి నయము నిమ్ము**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**



తా॥ ఓ ప్రభూ! నీ కృష్ణావతార సమయమున అప్పుడు నీతో జీవించినవారిలో నిన్ను సుహృద్భావముతో చూచినవారు, నీకు భయపడిన (భయపెట్టిన) వారు, నీతో చెలిమి చేసినవారు, నీహితులు, నిన్ను ద్వేషించిన వారు, నిన్ను ఎదిరించినవారు, నిన్ను ప్రేమానురాగములతో పిలిచినవారు, నీదయ అనుగ్రహము రెంటినీ బొంది చివరకు ముక్తిని పొందిరి. వారు సులువుగా కష్టములను నిర్గమించి ఎన్నోవిధములైన ముక్తిని పొందిరి దేవా! విశ్వమునందలి ఆర్తులను ఆదుకొనుచు నీ భక్తిని ప్రసాదింపుము. ఓ కృష్ణావతారా! నీకు జయమగు గాక!! ఓ గురువాయూరప్పా! నాపైదయయుంచి నన్ను రక్షింపుము. నా వ్యాధిని నిర్మూలింపుము. అత్యద్భుతమైన నీ దివ్యగాధను నారాయణభట్టతిరి సంస్కృత శ్లోకములకు నా అనువాద తెలుగు పద్యముల నాలకింపుము తండ్రీ!

## 53. వృకాసురవధ-భృగు పరీక్షణము

**తే॥ సిరి అహంకారమిచ్చును చెరచు భక్తి**
**కనుక ఐశ్వర్యమీయవు నిను భజింప**
**మా అహంకారమును ద్రుంచి మమ్ము నీవు**
**మది ప్రశాంతినొసంగుచు మా అభీష్ట**
**ములను దీర్తువు ఇత్తువు ముదము సుఖము**
**శీఘ్రమే ప్రశాంతులకు నీ సేవ వలన**
**సత్ఫలితమగు కీడేది జరుగబోదు**
**వినుము గురువాయుపురవిభో విష్ణుగాథ.**

తా॥ ఓ గురువాయూరప్పా! లక్ష్మీపతీ! నీ భక్తులపై కరుణించి సిరులిచ్చినచో వారు మదించి, నీ విముఖులయ్యెదరని కాబోలు వారికి వెంటనే ఐశ్వర్యముల నొసంగవు. అహంకార పూరితులను ప్రశాంత చిత్తులను గావించి తరువాత నీవు వారి అభీష్టముల నొసంగెదవు. ప్రశాంత చిత్తముతో సేవించు వారికి మాత్రము శీఘ్రఫలితములను అనుగ్రహించుచుందువు.



నీభక్తులకు ఎన్నడు పతనము సంభవింపదు. నీ దివ్యగాథ నాలకింపుము తండ్రీ!

53/2

**చం॥ వనజభవున్ మహేశ్వరుని ప్రార్థన జేసిన**
**సత్వరంబుగా**
**గొనకొని దర్శనంబు నిడి కోర్కెలు దీర్తురు,**
**ఆగ్రహింతురున్**
**కనుక స్వభావ సిద్ధముగ కామిత ప్రాప్తికి**
**గొల్తురెల్లరున్**
**వెనుక నశించి భ్రష్టులయి వీడుదురా వృకు**
**వోలె ప్రాణముల్**
**విను గురువాయుపట్టణపు విష్ణుని గాథను**
**నందనందనా!**

తా॥ ఓ నందనందనా! బ్రహ్మదేవుడు, శంకరుడు మొదలైన దేవతలు త్వరగా సంతోషించి వరమలిచ్చెదరు. అట్లే త్వరగా కోపించి శాపములనొసంగెదరు. త్వరగా



వరములు లభించునని ముందుచూపులేని వారు తమ తమ స్వభావములననుసరించి వారిని సేవించి వరములు పొందియు భ్రష్టులైపోదురు. దీనికి వృకాసురుని కథయే చక్కని దృష్టాంతము. ఓ గురువాయూరప్పా! ఆ గాథనాలకింపుము, తండ్రీ!

53/3

**ఉ॥**
**వీరుడు దైత్యుడౌ శకుని బిడ్డ వృకుండు దురాశచేత ఆ**
**నారదుదాసి ఇట్లడిగె "నారద! దేవతలందు దెల్పుమా**
**చేరి అభీష్టమౌ వరముశీఘ్రమె ఇచ్చెడి వాడు యెవ్వడో?**
**"కోరిక దీర్చశంకరుడు కోటికి నొక్కడు" చెప్పెకాని నీ**
**పేరును జెప్పడాయె వినవే గురువాయు పురాధినాయకా!**

తా॥ ఓ ప్రభూ! శకుని అనురాక్షసునకు వృకుడు అను పుత్రుడుండెను. ఆ మదించిన వృకాసురుడు (భస్మాసురుడు) ఒకనాడు నారదుని సమీపించి "ఓ



మునీశ్వరా! దేవతలందరిలోను అతి శీఘ్రముగా వరముల నొసంగువాడెవరు?" అని అడిగెను. ఆ ముని శంకరుడు భోళాశంకరుడు అటువంటి వాడు కోటి కొక్కడుంటాడు. భక్త సులభుడు అని చెప్పెను. అంతేకాని దుష్టులను శిక్షించు నీపేరును మాత్రము చెప్పలేదు. ఓ గురువాయూరప్పా! ఈ కథ నాలకింపుము తండ్రీ!

53/4

**సీ॥ ఆరు దినంబులు ఆ వృకుండు తపంబు**
**నాచరించెనుగాని హరుడు రాడు**
**కినిసి ఏడవనాడు తన తల తెగటార్చి**
**అర్పించె నాతడు హరుని కొఱకు**
**ప్రత్యక్షమై స్వామి వరము కోరుము యనెన్**
**ఆ వృకుండిట్లనె "హర! మహేశ!**
**ఏ తలపైనేను ఈనాడు హస్తంబు**
**ఉంచెదనో వాడు ఉన్నచోట**

**తే॥ భస్మమై పోవలె" తథాస్తు పలికె శివుడు**
**నీ విముఖుడు సుఖించునా? నీరజాక్ష**
**మంచి బుద్ధి ఎట్లబ్బును? వాసుదేవ!**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ వాసుదేవా! ఆ వృకాసురుడు ఘోర తపము నాచరించ దలచి ఆరుదినములు కఠోర తపము నాచరించెను. శంకరుడు ప్రత్యక్షము కాలేదు. ఆగ్రహించిన వృకుడు ఏడవనాడు తన శిరస్సును ఖండించుకొని శంకరునికి సమర్పించబోగా హరుడు ప్రత్యక్షమై అభీష్టము నొసంగెదననెను. ఆ వృకాసురుడు "ఈశ్వరా! నేను ఏ తలపై ఈ నా హస్తాన్ని ఉంచుతానో వాడు వెంటనే భస్మమైపోవలెను" అని క్షుద్రమైన కోరిక కోరెను. ఓ గురువాయూరప్పా! నీ విముఖులైన వారికి మంచి బుద్ధికలుగుతుంతా? వాడు సుఖించునా? ఈ కథ నాలకింపుము తండ్రీ!



53/5

**సీ॥ బంధమ్ము విడిపించు వానిపై సింగంబు**
**దూకు విధంబున దుష్టవృకుడు**
**శివుని శిరస్సుపై చేయుంచి వరబల్మి**
**చూచెదనని కోరె, శూలి పారె**
**దిక్కులన్నియు జూచె ద్రిమ్మరిగా మారె**
**లేదు యొక్కండును తోడు రాడు**
**వైకుంఠ మార్గాన వచ్చుచుండె శివుండు**
**దనుజుండు వెంబడి తరుముచుండె**

**తే॥ నీవు వటుని వేషంబున నిలిచినావు**
**దైత్యుముంగిట ఆగెను దానవుండు**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యగతిని**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! తనను కట్లు విడిపించిన వానిపై దుమికి సంహరించు సింహమువలె ఆ వృకాసురుడు తనకు వరమిచ్చిన శివుని శిరస్సుపైననే తన చేతినుంచి తనవరముయొక్క శక్తిని పరీక్షించుకుంటానన్నాడు.



ఆ మూర్ఖుడి భయముచే శంకరుడు నలుదిశలకు పారిపోయి ఎందరినో ఆశ్రయించాడు. ఒక్కడూ ఆ స్వామి నాదుకోలేదు. చివరికి వైకుంఠము చేరబోతుంటే నీవు ఒక బాలవటుని వలె ఆ భస్మాసురుని అడ్డగించి, చిరునవ్వుతో వానినాపివేశావు. ఓ గురువాయూరప్పా! భట్టతిరి భాగవతమును తెలుగులో ఆలకింపుము తండ్రీ!

53/6

**సీ॥ "శకుని సునందనా! నీకు మేలగు గాక!**
**ఎంత అమాయకుడీవు వృకుడ!**
**ఈ పిశాచి శివుండు ఈతని మాటలు**
**నమ్మి చెడెదవేల? నవ్విపోరె?**
**నామాట నమ్మకు నడినెత్తిపై చేయి**
**ఈ రీతి పెట్టుకో ఏమి అగును?"**
**నీ మాటలకు లొంగి నీవలె నెత్తిపై**
**చేయుంచి భస్మంబు ఆయె వృకుడు**



**తే॥ శంకరుడు కూడ నీదు ఆశ్రయము బొందె**
**ఇతర దేవతలిచ్చెడి ఈప్సితములు**
**హాని దెచ్చును వృకువోలె అంతమగును**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ శకుని నందనా! నీకు మేలు కలుగు గాక! నీవు ఎంత అమాయకుడివి. పిశాచములతో తిరిగే ఈ శివుడు (పరమేశ్వర నింద క్షమింపరానిదైనను ఆ వృకుని తనవైపు త్రిప్పు కొనుటకే నీవు అట్లంటివి) వరములీయగల సమర్థుడా? అలా అయితే నీకు భయపడి పారిపోతాడా? ఎందుకీ శ్రమ? కావాలంటే ఇలా నీతలపై నీవూ చేయి పెట్టుకో ఏమీకాదు. అని నీనెత్తిపైనీ చేయి నుంచుకొని చూపించావు. నీ మాటల్లో ఉన్న సమ్మోహనశక్తికి వశుడై ఆ వృకాసురుడు కూడ తనతలపై తనే చేతినుంచుకొని తక్షణమే భస్మమై పోయెను. శంకరుడు కూడా నీవల్ల రక్షింపబడినాడు. ఇక ఇతర దేవతల గురించి ఏం చెప్పను? ఓ గురువాయూరప్పా! ఆ వృకాసురునికి వలె వారి వరాలు హానికరములే. ఈ కథనాలకింపుము తండ్రీ!

53/7

**సీ॥ ముని జనులొకనాడు చని సరస్వతినదీ**
**తీరాన జేరిరి తేల్చుకొనగ**
**ఆ త్రిమూర్తులలోన అతి సాత్వికుండైన**
**ఆతండు ఎవ్వరో అంతు తేల్చ**
**భృగుమహర్షిని యెంచి పంపిరి దానికై**
**ముల్లోకములకేగె మునివరుండు**
**చులకన భావన చూడంగ పరమేష్ఠి**
**మునిని నిందించెను ముందుగానె**
**సైపక చులకన జంపబోయె శివుండు**
**ఉమ పూని వారించ నూరకుండె**

**తే॥ కట్టలేరు కోపంబని కడకు మౌని**
**చేరె వైకుంఠపురమును అరయ నిన్ను**
**భట్టతిరి కృతి తెలిపెద పద్యగతిని**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**



తా॥ ప్రభూ! మహర్షులందరు కలిసి సరస్వతీ నదీతీరంలో సమావేశమై త్రిమూర్తులలో మిక్కిలి సాత్వికుడెవ్వరను సందేహమును తీర్చుకొనుటకు భృగు మహర్షిని నియోగించిరి. ఆ మునీశ్వరుడు బ్రహ్మలోకమునకు బోయి బ్రహ్మకు అనాదరము జూపించెను. బ్రహ్మ కోపించి ఎట్లో ఓర్చుకొనెను. భృగువు కైలాసము జేరి శివునిపై చులకన భావము చూపించగా శివుడు కోపించి త్రిశూలముతో మునిని సంహరించబోయెను. ఉమ ఆయనను వారించగా ఎట్లో సహించెను. చివరకు ఆ మహర్షి నీవద్దకు వచ్చెను. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి సంస్కృతములో సంక్షిప్తముగా భాగవతమును రచించెను. నేను దానిని తెలుగు పద్యములలో చెప్పుచున్నాను. దీనినాలకింపుము తండ్రీ!



53/8

**చం॥**
**అనవుడు పద్మలోచనుడవైన ప్రభూ! రమ అంకపీఠికన్**
**చెనకొని నిద్రనున్న నిను ఛీ!యని వక్షము పైనతన్నె ఆ**
**మునిజన నాథుడా భృగువు, ముందు క్షమార్పణ చెప్పి మౌనికిన్**
**"మునివర! నీదు పాదముల ముద్రలు శోభనొసంగు" అంటివే**
**విను గురువాయుపట్టణపు విష్ణునిగాథను నందనందనా!**

తా॥ అప్పుడు పద్మలోచనుడవైన నీవు రమాదేవి యొక్క ఒడిలో తలనిడుకొని నిద్రించుచుంటివి. అది చూచి సహించలేక ఆ భృగుమహర్షి ఛీకొట్టి తన కాలితో నీ వక్షస్థలముపై తన్నెను. నీవు నిద్రనుండి లేచి ఏమాత్రమూ కోపింపక "మునీశ్వరా! నా తప్పులన్నీ మన్నింపుము. నీపాద చిహ్నము నా వక్ష సీమకు అలంకారముగా నుండును" అని ప్రశాంతముగా ఆదరముతో పలికితివి? ఓ నందనందనా! నీ అంత శాంతమూర్తి వేరుండునా!! గురువాయూరప్పా! ఈ విష్ణుకథనాలకింపుము తండ్రీ!



53/9

**ఉ॥**
**కావున ఆనదీ తటిని గాథపు నమ్మిక గల్గి ఆ ఋషుల్**
**నీవె త్రిమూర్తులందు గణనీయత గల్గిన సాత్వికుండవౌ**
**ఆవిధి నిశ్చయించుకొని అందిరి ముక్తిని ఆ తపోనిధుల్**
**నీవు ఎరుంగవే చ్యుతిని నిర్మల సత్త్వ స్వరూపివో ప్రభూ!**
**సేవలు చేసికొల్చెదము శ్రీగురువాయుపురాధినాయకా!**

తా॥ ఓ గురువాయూరప్పా! అందువలన ఆ సరస్వతీ నదీతీరమున ఉన్న మహామునులు నీవే సత్త్వగుణ ప్రధానుడవైన దేవదేవుడవని నిశ్చయించుకొని దృఢమైన భక్తితో నిన్ను పూజించి చివరకు ముక్తిని పొందిరి. అచ్యుతా! నీవు ఏవిధమైన 'చ్యుతి' లేనివాడవు. పరిశుద్ధమైన సత్త్వ స్వరూపుడవు. అట్టి నిన్ను మేము సేవలు చేయుచు కొలిచెదము.

53/10

తే॥ సృష్టి ప్రారంభమున నిన్ను శ్రీపతియని
అధిప! వేదాలు అన్ని వందిమాగధుల వోలె
పొగడినవి పరమాత్మ! ఓ పుణ్యపురుష!
సచ్చిదానందరసరూప! సాధులైన
గోపికలకు భాగ్యంబును గూర్చినావు
ఇపుడు తాపత్రయంబుల రూపుమాపి
నాదు వ్యాధిని తొలగించి నయము నిమ్ము
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ఓ పరమాత్మా! పుణ్యపురుషా! అధిపా! శ్రీమన్నారాయణా! సృష్టిప్రారంభమున వేదములన్నియూ నిన్ను వందిమాగధులవలె స్తుతించినవి. నీవు సచ్చిదానంద స్వరూపుడవు.



అమాయకులైన గోప స్త్రీలకు గొప్ప భాగ్యము కలిగించితివి. అట్టి నీవు నా తాపత్రయములను రూపుమాపుము. ఓ గురువాయూరప్పా! నా వ్యాధిని నిర్మూలించి నన్ను రక్షింపుము. నిన్ను సదా భజించెదను. నీ ఈ స్తుతికావ్యమును నీ అనుగ్రహంతో పద్యీకరించగలిగాను. దీనిని నీవాలకింపుము తండ్రీ! దయతో దీనిని స్వీకరింపుము.



## 54. విష్ణు మహత్త్వము

**తే॥ వృకుడు, అంబరీషుండును, భృగుమహర్షి**
**మోహినీదేవి కథలెల్ల మోదమలర**
**తెలిపె నీ మహాత్మ్యము సాటి తెలియలేము**
**చాల ఉత్కృష్టమైనది జలజనాభ!**
**నీవభిన్న పరబ్రహ్మమవుటె గాక**
**వ్యక్తమవ్యక్త రూపములన్ని నీవె**
**నలువ, రుద్రేంద్రులందరు తెలియ, నీవె**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! వృకాసురుడు, భృగుమహర్షి, అంబరీషుడు, మోహిని మొదలైనవారి కథలవల్ల ఒక్క విషయం విస్పష్టమవుతున్నది. దేవతలందరికంటే నీ



మహాత్మ్యము చాల ఉత్కృష్టమైనది. నీవు పరిపూర్ణ పరబ్రహ్మ స్వరూపుడవు. వ్యక్తావ్యక్త స్వరూపములన్నియు నీ అంశమాత్రములే. బ్రహ్మ, శంకరుడు, మహేంద్రుడు, కనిపించుచున్న విశ్వమంతయూ నీ సాకార స్వరూపమే. కనుక నీవే దిక్కు మాకందరికీ. అందుచేత ఓగురువాయూరప్పా! ఈ విష్ణుగాథ నాలకించి నన్ను రక్షింపుము తండ్రీ!

54/2

**తే॥ బ్రహ్మ, విష్ణువు, శివుడు, ఈశ్వరుడు మరియు**
**ఆ సదాశివుడనబడు ఐదుగురిలో**
**ఆ సదాశివరూపమే అందరెరిగి**
**నట్టి 'పరమాత్మ' వైకుంఠుడదియు నీవె**
**బ్రహ్మ, శివ, విష్ణు లోకాల వారుకూడ**
**నీ స్వరూపాలె ఓ ప్రభూ! నీవె వారు**
**భట్టతిరికృతి తెలుగులో పద్యగతిని**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! బ్రహ్మ, విష్ణువు, శివుడు, ఈశ్వరుడు, సదాశివుడు అను ఐదుమూర్తులలో సదాశివ రూపమే పరమాత్మయొక్క రూపము. అది నీవే. ఆ రూపముతో వైకుంఠమున నుంటివి. సత్యలోకమే బ్రహ్మ విష్ణు శివులుండు నెలవు. అందువారు వేర్వేరు చోట్ల ఉంటారు. నిజమునకు వేర్వేరు బాధ్యతలను నిర్వర్తించుచున్న ఆ ముగ్గురునూ నీవే. వారినే త్రిమూర్తులనుచున్నాము. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి భాగవతమును తెలుగు పద్యములుగా ఆలకింపుము తండ్రీ!

54/3

**చ॥**

**కనిన త్రిమూర్తులందు సిరి కాంతుడు సత్త్వ గణాఢ్యుడట్లె ఆ**
**వనజభవుండు నవ్విధి స్వభావముచేత రజోగుణాఢ్యుడౌ**
**తను గిరిజావిభుండును ప్రధానముగాను తమోగుణాఢ్యుడౌ**
**గొనకొని బ్రహ్మశంకరులు కొద్దిగ సత్త్వ గుణంబు పూనగా**
**విను గురువాయుపట్టణపు విష్ణుని గాథను నందనందనా!**



తా॥ ఓ ప్రభూ! ఆ త్రిమూర్తులయందునూ సత్త్వగుణ ప్రధానమైన రూపమును విష్ణువని (ఈస్వామికి అందుచే జగద్రక్షణ బాధ్యతయున్నది), రజోగుణ ప్రధానమైన రూపము బ్రహ్మ. (ఈ స్వామికి మిగతా రెండు గుణములు స్వల్ప ప్రమాణంలో ఉంటాయి) ఈయన అందుచే సృష్టికర్త. తమోగుణ ప్రధానమైన రూపమే రుద్రుడు (ఈస్వామి లయకారకుడు, మిగిలిన రెండు గుణములు స్వల్పంగా ఉంటాయి) ఈయనే సత్త్వగుణంతో విలసిల్లే సమయంలో శంకరుడు అని పిలువబడతాడు. అందుచేత వీరు పరమాత్ముడైన సదాశివుని అంశారూపములు. ఓ గురువాయూరప్పా! నీవు పరమాత్మవు కనక ఈ కథనాలకింపుము.



54/4

**తే॥ ఆ త్రిమూర్తులకంటెను ఆద్యుడైన**
**పరముడైన ఈశ్వరరూపె అరయనీది**
**సర్వదేవతారూపముల్ స్వామి! నీవె**
**కోరి నిను శివుడందురు కొలుచువేళ**
**అది శివుని స్వరూపము నీది దేవ!**
**అట్లు చెబుటకు ఆధారమదియు గలదు**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యగతిని**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ పరమేశ్వరా! త్రిమూర్తులకంటే పరమమైన రూపమును ఈశ్వరుడు అని పిలుస్తారు. ఈయనకంటే సర్వశ్రేష్ఠమైన రూపమే సదాశివరూపము. దానినే పరమాత్మ అంటారు. సమస్త దేవతలకు అధినాథుడు. ఉపాసన చేయు సమయమందు ఆ పరమాత్మ రూపాన్నే శివుడంటారు. అది మరెవరో కాదు, నీవే. ఇట్లనుటకు చాలా ప్రమాణములున్నవి. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి భాగవతమును తెలుగు పద్యకృతిగా విని నన్ననుగ్రహింపుము తండ్రీ!



54/5

**తే॥ ఆదిశంకర గురులకు లేదు ఎపుడు**
**దేవతెవరిపై భక్తి ప్రత్యేకముగను**
**ఐన నాయన దేవతలందు నిన్ను**
**మిన్నగానెంచి తలచిరి సన్నుతించి**
**వారి రచనలన్ స్తుతియించి పరమపురుష!**
**నీవె పరమాత్మవని పొందె నీదుముక్తి**
**భట్టతిరి కృతి తెలిపెద పద్యసరళి**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ ఓ ప్రభూ! పరమగురువులైన ఆదిశంకరాచార్యుల వారికి, ఏ దేవుని యందునూ ప్రత్యేకమైన అభిమానము (తమ శిష్యుల కొరకు ఆయన వేర్వేరు దేవతలను స్తుతించిరి) లేదు. ఐనను ఆ ఆచార్యుడు సర్వదేవతలయందు నీవే శ్రేష్ఠుడవని చాల పర్యాయములు పేర్కొనిరి. వారు విష్ణు సహస్రనామాది గ్రంథములకు భవత్పరముగానే వ్యాఖ్యానము రచించిరి. చివరకు నిన్నే ఎన్నో విధములుగా స్తుతించుచు ముక్తిని పొందిరి. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి కావ్యమును తెలుగు పద్యములలో విని నన్నునుగ్రహింపుము తండ్రీ!



54/6

**సీ॥ తాము "ప్రపంచ సారమ"ను గ్రంథంబున**
**ఆదిశంకరుడిట్లు ఆర్తి బలికె**
**"ఎల్ల దేవతలకు ఈవె స్వామివి ప్రభూ!**
**నీలోత్పల శ్యామ! నిజము నిజము**
**ఆ త్రిమూర్తులకంటె అధికుండవీవెగా**
**పరమేశ్వరుని రూపమరయ నీదె"**
**ఓంకారమునకు తామొప్పుగా వ్యాఖ్యను**
**వ్రాసి, "నిరాకారమయుడ" వనిరి**

**తే॥ నీదు సాకార రూపమే పిదప గొలిచె**
**కాని, అన్యదేవతలను కనరు మదిని**
**భట్టతిరి కృతి తెలుగులో పద్యగతిని**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ**



తా॥ శ్రీ ఆదిశంకరాచార్యులు తాము రచించిన 'ప్రపంచసారము' అను మంత్రశాస్త్ర గ్రంథములో ప్రారంభములోనే ఇష్టదేవతా ప్రార్థనచేయుచు ఇట్లనిరి "ప్రభూ! నీవు సమస్త దేవతలకు స్వామివి, నీలోత్పల శ్యామసుందరుడవు, త్రిమూర్తులకంటే అతీతుడైన పరమేశ్వర స్వరూపుడవు''. ఓంకారమునకు వ్యాఖ్యను వ్రాయుచు నిన్ను నిరాకారరూపునిగా ధ్యానించి, తరువాత నీసాకార స్వరూపమును మాత్రమే ధ్యానించిరి. అంతేగాని అన్యదేవతలను ధ్యానింపలేదు. ఓ గురువాయూరప్పా! నారాయణ భట్టతిరి భాగవతమును తెలుగు పద్యములలో అనువదించుచున్న నేను తెలుపు నీ గాథనాల కింపుము తండ్రీ!



54/7

**తే॥ మును "పురాణ సంగ్రహ"మను పొత్తమందు**
**తాము చెప్పిరి నీ మహాత్మ్యమును కవులు**
**స్పష్టమౌనట్లుగా ప్రభూ! 'సత్యలోక**
**మున త్రిమూర్తులు నివసింతురనుచు, కాని**
**దానిపై భాగమే నీ నిధానమైన**
**యట్టి వైకుంఠపురమని' అనిరి; కనుక**
**కాదు శివలోకమది స్వామి! ఇది నిజంబు**
**వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.**

తా॥ పూర్వము ''పురాణ సంగ్రహము'' అనునట్టి గ్రంథమున సమస్త పురాణముల సారమును వివరించు ప్రయత్నమున నీయొక్క మహాత్మ్యమే స్పష్టముగా విపులీకరించబడినది. ఓ వైకుంఠపతీ! ఆ గ్రంథమున త్రిమూర్తులు నివసించు సత్యలోకములోని మూడు భాగములకంటే పై భాగముననున్న నీవైకుంఠమును గురించి మాత్రమే చెప్పబడినది. ప్రభూ! అది శివలోకముకాదు అని వ్రాయబడినది. ఓ గురువాయూరప్పా! ఇది సత్యము. నీవు కృపతో నీ గాథను ఆలకింపుము తండ్రీ!

54/8

తే॥ బ్రహ్మకల్పంబునందున బ్రహ్మకీవు
నీదు 'పరతత్త్వరూపంబు' ఇదియనంచు
నీదు రూపంబు వర్ణించ, నేడు దాని
శ్రీమహాభాగవతమున చెప్పినారు,
తాము శ్రీమాధవాచార్య స్వామికూడ
తమ "పురాణసారము"ను గ్రంధమ్మునందు
రూపమట్టిదే హరిహర రూపమనిరి
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ఓ గురువాయూరప్పా! సృష్ట్యాదియందు అనగా బ్రహ్మకల్పంబునందు నీ పరతత్త్వ రూపమును గూర్చి నీవే బ్రహ్మదేవునికి వివరించితివి. ఆ రూపమే శ్రీమహాభాగవతము నందలి ద్వితీయ స్కందమున వర్ణింపబడినది. గొప్ప శివోపాసకులైన శ్రీమాధవాచార్యస్వామి తమయొక్క "పురాణసారము" అను గ్రంధమున ఈ పరతత్త్వరూపమునే హరిహరాది నామములతో పేర్కొనిరి. ప్రభూ! నీ ఈ విష్ణుగాధను ఆలకింపుము తండ్రీ!



54/9

తే॥ తమ స్వభావములను బట్టి ఈ మనుజులు
గొనుచు దృఢభక్తి శంకరున్ కొలిచినారు
సత్ఫలితముల పొందిరా సత్పురుషులు
ఇట్టి శివభక్తులను ప్రోత్సహించ మున్ను
వేదవ్యాసుడు చెప్పెను, విశద పరచి
పలు పురాణాలు, నుతియించె నీలకంఠు
అర్ధవాది తక్కువ జేసెనయ్య నిన్ను,
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.

తా॥ ప్రభూ! కొందరు తమతమ స్వభావములను అనుసరించి శంకరుని సేవించుచున్నారు. ఆ శంకరునిపైన గల దృఢమైన భక్తి యొక్క ప్రభావమున వారు సత్ఫలితములను పొందుచున్నారు. అట్టి శివభక్తులను ప్రోత్సహించుటకు వేదవ్యాసుడు స్కందపురాణములయందు శంకరుని ఔన్నత్యమును ప్రకటించెను. అంతియేకాక నిన్ను తక్కువజేయుచు కొన్ని సందర్భములలో వ్రాసినాడు. అదియంతయు అర్ధవాదమే. ఓ గురువాయూరప్పా! నీగాధనాలకింపుము తండ్రీ!



54/10

సీ॥ అర్ధవాదంబుండునది ముప్విధంబులై
తమతమ భావాల తగినయట్లు,
'భూతార్థకీర్తి'యే మొదటిది, 'అపవాద'
మనునది రెండవదయ్య వెనుక
దాని 'విరుద్ధవాదము' యని అందురు
అభిరుచి తగ్గట్లు అదియు నుండు
స్కందపురాణంబులందు ఆ వ్యాసుండు
నీవు 'తామసి' వని నిందజేసె
అది విరుద్ధమె కాక అర్ధవాదము సుమ్మి!
వస్తుతః కాదయ్య వ్యాసుడట్లు

తే॥ వారిరచనలు విస్తృత పరచుటేమొ!!
ఏది ఏమైన నీనింద హితవుకాదు
భట్టతిరి కృతి తెలుగులో పద్యగతిని
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ



తా॥ ఓ గురువాయూరప్పా! అర్ధవాదము మూడు విధములుగా నుండును. మొదటిది "భూతార్ధకీర్తి" అనగా జరిగిన దానిని కీర్తించుట. రెండవది "అపవాదము" అనగా లేకున్నను ఉన్నట్లుగా కీర్తించుట. మూడవది "విరుద్ధ వాదము" అనగా ఉన్నప్పటికీ తద్విరుద్ధముగా పలుకుట. ఈ మూడు పద్ధతులను వర్ణించు విషయమున వారివారి అభిరుచికి తగ్గట్లు చదువరులకు అభిరుచి కలిగించుటయే కనిపించును. అందువలన స్కందపురాణము వంటి వాటిలో నీయొక్క తామస స్వరూపమును వర్ణించుట జరిగినది. నిన్ను తక్కువజేసి వర్ణించిరి. వారు చెప్పిన ఉపదేశములు అన్నియు విరుద్ధవాద రూపములైన అర్ధవాదములు. వస్తుతః వేదవ్యాసుడటువంటివాడు కాడు. అది ఆయన అభిప్రాయమై యుండదు. ఆయన రచనలను విస్తృత పరచుటకు అట్లు చేసిరేమో!! ఏది ఏమైనను నీ నింద తగని పని. నారాయణ భట్టతిరి కావ్యమైన 'శ్రీమన్నారాయణీయము' సంక్షిప్త సంస్కృత

భాగవతము. దానివల్ల ప్రభావితుడనై దానిని ననువదించు సదుద్దేశ్యమున నేను ప్రారంభించితిని. పక్షవాత వ్యాధి పీడితుడను. కుడిచేతిని వ్రాయుటకు ఉపయోగించలేని దౌర్భాగ్యుడను. అనర్థమైన ఎడమచేతితో వ్రాయుట నలవరచుకొని నా పూర్వజన్మ సుకృతం వల్ల అబ్బిన పద్యకవితా శక్తిచేత శ్రీమన్నారాయణీయమును తెలుగు పద్యకృతిగావ్రాయుచున్నాను. అశక్తుడనౌటచే దశమస్కందమునకు పరిమితము చేసుకొని ''కృష్ణంవందే జగద్గురుమ్'' అనే పేరుతో శ్రీమన్నారాయణీయములోని దశమస్కంద శ్లోకములను తెలుగు పద్యములలోనికి అనువదించాను. నేటి తెలుగు వ్యవస్థననుసరించి నాబోటి సామాన్యునికి అర్ధమగుటకు తాత్పర్యములు జతకూర్చాను. నేను దీనిని నీనివేదనగా భావిస్తున్నాను. తండ్రీ ఇందులోని తప్పులన్నీ మన్నించి కరుణాంతరంగుడవై నాకు నీదృఢభక్తిని ప్రసాదించుము. నా పాపములను నిర్మూలింపుము. నా బాధలను తొలగింపుము. దీనిని భక్తితో చదివిన వారిని కృపజూడుము.



54/11

సీ॥ అజ్ఞానినిన్ నేను అన్ని యెరుంగను
తెలియక చెప్పిన పలుకులన్ని
మంత్రశాస్త్రంబులో మర్మయుక్తంబుగా
విపులంబుగానవి వివరమాయె
వ్యాసుని కృతులలో భాగవతంబది
సారభూతంబగు జలజనాభ!
వర్ణించిరందులో పరమాత్మవని నిన్ను
నాబాధ తొలగించి నయము నిమ్ము

తే॥ భక్తులైన నారాయణ భట్టతిరులు
సంస్కృతించ భాగవతపు సారమెల్ల
తెలుగు పద్యంబు జేస్తిని దేవదేవ!
వినుము గురువాయుపురవిభో! విష్ణుగాథ.



తా॥ నేను అజ్ఞానిని. అన్నీ తెలిసినవాడిని కాను. ఇది గొప్ప మంత్రశాస్త్రము. మూలములో వివరంగా విపులీకరించబడినప్పటికి నేను తెలియక సరిగ్గా చెప్పలేకపోతిని. వేదవ్యాసుని భాగవత సారము గ్రహించబడినది. ఓ పద్మనాభా! పరమాత్ముడవైన నీకే దీనిని చెప్పుటకు ప్రయత్నించితిని. నాపై దయ చూపి నావ్యాధి నిర్మూలింపమని "శ్రీమన్నారాయణీయమ్"లో నారాయణ భట్టతిరి అడిగినట్లే నేను కూడ నా వ్యాధిని నివారించమని అర్థిస్తున్నాను. ఓ దేవదేవా! గురువాయూరప్పా! సర్వేశ్వరా! పాహిమాం, పాహిమాం. లోకాః సమస్తాస్సుఖినోభవంతు...



**విష్ణు మహోత్మ్యము**

**అను**

**ఈ ఏబది నాలుగవ దశకముతో**

**"కృష్ణం వందే జగద్గురుమ్"**

**అను**

**శ్రీనారాయణభట్టతిరి కృతి**

**శ్రీమన్నారాయణీయము లోని**

**దశమస్కందమునకు**

**సంస్కృతమునుండి తెలుగు అనువాదము**

**పద్యతాత్పర్యముల రచన**

**సర్వమ్ సంపూర్ణము**